# కాకలుతీరిన యోధుడు

## రెండవ భాగము

⊙

రచన:

నికొలాయ్ ఓస్త్రోవ్‌స్కీ

అనువాదం:

మహీధర రామమోహనరావు

విశాలాంధ్ర ప్రచురణాలయం
విజయవాడ.

# ప్రకరణం 1

అర్ధరాత్రి అయింది. ఆఖరుట్రామ్‌కూడా గణగణ లాడుతూ డిపోకు వెళ్ళిపోయింది. చంద్రకాంతి కిటికీలోంచి పక్కమీద పడుతూంది. మిగిలిన గదిఅంతా చీకటి. మూల నున్న టేబిల్‌మీద టేబిల్‌లైటు క్రిందకాంతి పళ్ళెంలో పోసి నట్లు గుండ్రంగా పడుతూంది. ఆ వెలుతురులో నోట్‌బుక్ తెరిచి, దానిమీదికి వంగి రీటా వ్రాస్తూంది. సూదిలా చెక్కిన పెన్సిలు అక్షరపంక్తుల్ని విడిచిపెడుతూ జరిగి పరుగెత్తు తూంది.

మే, 24.

"నా భావాల్ని కాగితంపైన పెట్టడానికి పారోమారు ప్రయత్నిస్తున్నాను. మధ్యని ఎన్నోరోజులు వెళ్ళిపోయేయి. గడచిన పర్యాయం వ్రాసి అప్పుడే ఆరువారాలు జరిగి పోయేయి. కాని, చేయగలదేముంది ?

డైరీ వ్రాయడానికి వ్యవధి ఎక్కడ ? అప్పుడే అర్ధ రాత్రి అయిపోయింది. ఇంకా రాస్తూకూర్చున్నాను. నిద్ర రావటమే లేదు. కామ్రేడ్ సెగాల్ వెళ్ళిపోతున్నాడు. ఆయ నింక సెంట్రల్‌కమిటీలో పనిచేస్తాడు. ఆ వార్త మాఅందరికీ

బాధకలిగించింది. ఆయన మహాగట్టి పిండం. ఆయనతో కలసి పనిచేయడం సూ అందరికీ ఎంత వుపయోగకరం అయిందో ఇంతవరకూ మాకు తెలిసిరాలేదు. ఆయన వెళ్ళిపోతే గతి తార్కిక భౌతికవాద తరగతులు జరగవు. మేము ఎంతవరకు వచ్చేమో ఆయన నిన్న పరీక్షించేరు. అదయ్యేసరికి ఇంచు మించు తెల్లవారింది. అది పూర్తి అయ్యేవరకూ మేము అక్కడే వున్నాం. గుబర్నియా కామ్‌సోమాల్ కమిటీ కార్యదర్శి అకిమ్, ఆపాను ముండావాడు టప్టా ఇద్దరూ వచ్చేరు దానికి. టప్టా గర్వం, సర్వజ్ఞత్వంచూస్తే నాకు మహామంట. పార్టీ చరిత్ర విషయంలో ఒక ఘట్టంమీద చర్చవచ్చినప్పుడు పావెల్ కోర్చాగిన్ ఆతని నోరు మూయించేడు. అదిచూసి సెగాల్ బ్రహ్మానందపడ్డాడు. ఈ రెండు నెలలూ బాగా గడిచేయి. ఫలితాలంత బాగున్నప్పుడు పడ్డకష్టం కనిపించదు. మిలిటరీపరిషూ స్పెషల్ డిపార్టుమెంటుకు జకరయ్‌ను బదిలి చేస్తున్నారట. ఎందుకో?

"సెగాల్ తన శిష్యుణ్ణి నావద్దకు పంపించేడు. "నేను పని మొదలుపెట్టేను. దానిని నువ్వు పూర్తిచెయ్యాలి." అన్నాడాయన. "మధ్య ఆపెయ్యకు. మీయిద్దరి ఒకరినుంచి మరొకరు నేర్చుకోగలది బోలెడంత వుంది. ఈ కుర్రాడు ఇంకా దారిలోపడలేదు. దుందుడుకుతనం ఎక్కువ. ఆవేశంలో పడి కొట్టుకుపోతాడు. ఆతనిని దారిలోపెట్టాలంటే నీకే చేతనవును. రీటా! మరిచిపోకు. ఎప్పుడేనా వ్రాస్తూండు, మాస్కోలోనే వుంటాగనక."

"ఈవేళ సెంట్రల్ కమిటీ సోలోమెన్స్కీ జిల్లాకమిటీకొక కార్యదర్శిని పంపించేరు. ఆతని పేరు జార్కూ. ఆతడిని నే నిదివరకే ఎరుగుదును.

డిమిత్రీడుబావా రేపు కోర్చాగిన్ను తీసుకువస్తాడు. దుబావా అంతపొడుగూ, పొట్టీగాదు. మంచి బలమైనవాడు. 1918 లో కామ్సోమాల్లో చేరేడు. 1920 నాటినుంచీ పార్టీ సభ్యుడు. 'కార్మికప్రతిఘటన' సంఘానికిసంబంధించినవాడనే కారణంతో కామ్సోమాల్ జిల్లాకమిటీనుంచి బహిష్కరించబడిన ముగ్గురిలో ఆతనొకడు. ఆతడిని దారిలోకి తేవడం మహా కష్టం అయింది. ఆతడో అనంతజిజ్ఞాసువు. పాఠం జరుగుతున్నంతసేపూ ప్రశ్నలతో విసిగించేసేవాడు. మాట జరగనిచ్చేవాడుకాదు. పాఠం పక్కదారులుపట్టేది. నా దగ్గరే చదువుతున్న ఓల్గాయురెనేవాకూ ఆతనికీ అసలుపడేదికాదు. మొట్టమొదటిరోజునే ఆతడామెను ఎగాదిగాచూసి వ్యాఖ్యానం ప్రారంభించేడు.— "నీ వేషం ఏంబాగులేదమ్మాయి! అడుగున చర్మంవేసి కుట్టిన పాంట్సు, బుడెన్నీటోపీ, కత్తీ, నీ వేషానికి సరిపడతాయి. నీ ఈ వేషంలో మగా కాకుండా, ఆడదీకాకుండా వున్నావు"—అన్నాడు.

"ఓల్గా ఘుంయ్మంది. తప్పేముంది? నేను కలగచేసుకోవలసివచ్చింది. దుబావా కోర్చాగిన్ స్నేహితుడల్లే వుంది... చాలీపూటకి. ఇక పడకేస్తా."

* * *

సూర్యుని ఎండ వేడికి నేలంతా బీటలు వారిపోతూంది. రైల్వేప్లాట్‌ఫారాలను కలిపే ఓవర్‌బ్రిడ్జిమీది రైలింగులు ముట్టుకుంటే చుర్రుమంటున్నాయి. ఆ ఎండవేడికి నీరసపడి పోయి కాళ్లు ఈడ్చుకుంటూ జనం వంతెనెక్కి దిగుతున్నారు. వారంతా రైలుప్రయాణీకులేకాదు. రైల్వే కాలనీజనం పట్ట ణంలోకి పోయేటందుకు కదే దారి.

మెట్లమీద దిగుతూ పావెల్ రీటానుచూసేడు. ఆమె ముందే స్టేషనుకొచ్చి వంతెనవద్ద నిలబడి వస్తున్నవాళ్ళని చూస్తూంది.

ఆమెదగ్గరవరకూవచ్చి పావెల్ ఆగేడు. ఆతనిని రీటా చూడలేదు. ఆతడు ఆమెవంక పరీక్షగాచూసేడు. చారలబ్లౌజ్ చౌకబారు నీలిరంగుగుడ్డతోకుట్టిన గౌను వేసింది. మెత్తని తోలుజాకెట్టు భుజానవుంది. ఎండలో తిరగడంచేత నల్లబడిన ముఖం, కుబ్బులావున్నజుట్టు, ఆ ఎత్తినతల, ఎండపొడలో చిట్లించినకళ్ళు చూస్తూంటే తన మిత్రురాలూ, ఉపాధ్యాయు రాలూ అయిన ఈమె జిల్లాకామ్సోమాల్‌కమిటీ బ్యూరో సభ్యురాలేగాక ... ఆ ఆలోచనతట్టగానే ఆతడు తన 'పాపపు' ఆలోచనలకు విసుక్కొన్నాడు. ఆమెను పిలిచేడు.

"గంటనుంచి నిలబడ్డా నువ్వుచూడనేలేదు. రా. మన బండి వచ్చింది."

ఇద్దరూ ప్లాట్‌ఫారంమీదికివున్న గేట్‌ద్వారా ప్రవే శించేరు.

కామ్సోమాల్ జిల్లామహాసభకు రీటాను ప్రతినిధి గానూ, ఆమెకు సహాయంగా కోర్చాగిన్‌నూ గతదినం గుబ

ర్నయా కమిటీ నియమించింది. దానికి బయలుదేరేరు. బండి ఎక్కాలి. ఆ రోజుల్లో రైలు ఎక్కడంఅంటే అంతింతల్లో లేదు. అసలు రైళ్ళురావడమే అరుదు. ఒకవేళ వచ్చినా అయిదుగురితో కూడిన ఓకమిటీ దానిని దఖలుపరచుకొనేది. వాళ్ళకా అధికారం ఎవరిచ్చేరో తెలియదు. మొత్తంమీద ఎవర్నీ ప్లాట్ ఫారమ్‌మీదకేనా రానిచ్చేవారుకాదు. వాళ్ళ మనుష్యులు గేట్లలో కాపలావుండేవారు. అదివరకే బండి కిక్కిరిసివుండేది. కొత్త జనం ఎందరో ఎక్కడం సాధ్యం కాదు. కాని, దిగబడేవారు ఎవరు? ఎవరికివారికే తొందర. మళ్ళీబండి ఎప్పుడొస్తుందో ఏమో. అందుచేత వేలకొద్దీ మంది గేట్లలో దూరేవారు. ఆరోజుల్లో, ప్రతిస్టేషనూ భయం కరమైన ముట్టడిలో వున్నట్లుండేది. తరుచుగా కచాకచి, ముష్టాముష్టి యుద్ధాలు జరిగేవి.

ప్లాట్ ఫారంమీదివున్న గుమ్మంవద్ద మూగినజనాన్ని ఒత్తిగించుకొని పావెల్ లోపలదూరడానికి ప్రయత్నించేడు. కాని, లాభంలేకపోయింది. ఆతనికి రైలుస్టేషన్ ఆనుపాను లన్నీ తెలుసు. కనక ఆదారి లాభంలేదనుకొన్నాడు. రీటాను వెంటతీసుకొని 'పార్శిల్ రూమ్' గుండా ప్లాట్ ఫారంమీది కొచ్చేడు. అక్కడా జనమే. అతికష్టంమీద నాలుగోపెట్టె ద్వారందగ్గిరికొచ్చేరు. పెట్టెగుమ్మంలో ఒక 'చెకా' వుద్యోగి నిలబడి ఉక్కకి నీళ్ళుకారిపోతున్నాడు. తోసుకొస్తున్న జనాన్ని ఆపేస్తూన్నాడు. విధీ విరామంలేకుండా ఒకేమాట:

"పెట్టెనిండిపోయింది. మెట్లమీదా. టాప్‌నా ఎక్కొద్దు."

జనానికి మహాకోపంగావుంది. కమిటీవాళ్ళిచ్చినటిక్కెట్లు ఆతని మొఖానపొడిచి చూపిస్తున్నారు. తిడుతున్నారు, కేకలు పెడుతున్నారు, నెట్టుతున్నారు. ప్రతిపెట్టెవద్దా ఇదే స్థితి. ఇంక మామూలుపద్ధతిలో అయితే రైలెక్కడం సాధ్యంకాదని పావెల్ గ్రహించేడు. ఆబండిలో వెళ్ళక తప్పదు. లేదా అసలు మీటింగే ఆపుచేసుకోవలసివస్తుంది.

రీటాను ఒకపక్కకు తీసుకెళ్ళి ఆతడు తానుచేయదలచిన పనిని వివరించేడు: ఏలాగోఓలాగు పెట్టెలోకి వెడతాడు. కిటికీ తెరుస్తాడు. లోపలినుంచి చెయ్యి అందించుతాడు. ఆమె లోపలికి దూరాలి. మరోదారిలేదు.

"నీకోటు ఇల్లాఇవ్వు. అదితొడిగితే అధికార పత్రాలు వేరే అక్కర్లేదు."

కోటుతొడుక్కుని రివాల్వరు జేబులోవేసుకొన్నాడు. మాటామున్లే రీటావద్దవదలి పెట్టెవద్దకువెళ్ళేడు. అక్కడ మూగినజనాన్ని ఒత్తిగించుకొని కమ్మీపట్టుకొన్నాడు.

"ఏయ్ కామ్రేడ్! ఎక్కడికి?"

గుమ్మంలోవున్న ఛెకావుద్యోగిని ఓరకంటచూస్తూ పావెల్ మెట్టుమీద కాలుపెట్టేడు.

"స్పెషల్ డిపార్టుమెంటునుంచి వస్తున్నా. లోపలవున్నవాళ్ళందరిదగ్గరా కమిటీయిచ్చిన టికెట్లున్నాయో, లేదో చూడాలి."

సందేహానికీ, మారుమాటకీ అవకాశంలేనంత బింకంగా వుంది, ఆమాట.

జేబులోంచి పైకితొంగిచూస్తున్న పావెల్ రివాల్వరు మడమచూసి, ఛెకావుద్యోగి నుదుటినున్న చెమట తుడుచుకొన్నాడు.

"లోపల అడుగు పెట్టగలిగితే వెళ్ళు."

మోచేతులతోనూ, భుజాలతోనూ, అవసరమైతే పిడికిళ్ళుపయోగించి పావెల్ ప్రవేశించేడు. క్రిందనున్న జనాన్ని దాటేందుకు పై బెర్తు అంచులు పట్టుకొని, బల్లచివరల మునివేళ్ళమీద నిలబడీ ఆతడు మధ్యకు చేరేడు. కూర్చునే బల్లలమధ్య విపరీతంగా సామాన్లుపడేసి, వానిమీద జనం కూర్చుని వున్నారు. వాళ్ళతిట్లూ, బూతులూ ఆతడు లెక్క-చేయడంలేదు.

"కళ్ళుకనబడ్డంలేదట్రా నీదుంపతెగ!—అంటూ ఒక లావుపాటుయామె ఆతనిని తిట్టడానికి లంకించుకొంది. బెర్తు వంచవదలి కూర్చునే బల్లలమధ్యకు దిగడంలో పావెల్ కాలు ఆమెకి తగిలింది. అసలే వలమైనమనిషి. పైగా, నూనెడబ్బా ఒళ్ళోపెట్టుకూర్చుంది. ఎడా, పెడా సీట్లక్రిందా, మీదా, మధ్యనా ఏవేవో డబ్బాలు, సీసాలు, పెట్టెలు, సంచులు, బుట్టలు, ఒకటేమిటి నానావస్తుసామగ్రీ వుంది. పెట్టెలో వూపిరి తిరగడంలేదు.

పావెల్ తిట్లు లెక్క-చెయ్యడంలేదు.

"ఏదీ టిక్కెట్టు?"

"ఏమిటీ?"—అంటూ ఆమె గంయ్‌మని లేచింది.

ఎదుటి బెర్తుమీదినుంచి ఎవడో తొంగిచూసేడు.

"వాస్కా! పెధవమొహం ఎవడో వచ్చేడు. టిక్కెట్టు కావాలట చూడు. పరలోకానికో టిక్కెట్టిచ్చిపంపు. లే."

పావెల్ నెత్తిమీదనే ఎవడో కదిలేడు. వేటకుక్క కళ్ళల్లాగ ఆతనికళ్ళు క్రౌర్యం వెలాగుస్తున్నాయి.

"ఆవిణ్ణి పలకరించనక్కర్లేదు. ఎందుకిప్పుడు టిక్కెట్లు?"

ఆతని ప్రక్కనే మరో ముగ్గురు. నలుగురూ ఒకరినొకరు ఒత్తుకొని కూర్చున్నారు. వాళ్ళ ముఖాలుచూడగానే ఎవళ్ళో పావెల్‌కు అర్థం అయింది. వాళ్ళు ధాన్యం వర్తకులు. ఎన్ని దౌర్జన్యాలైనా చెయ్యగలరు. ఎక్కడ ధాన్యం వుందన్నా కొనేసి, దాచి, విపరీతమైన ధరలకి మారుబేరం చేస్తుంటారు. పావెల్‌కు వాళ్ళతో పేచీపెట్టుకూర్చోడానికి వ్యవధిలేదు. ముందు రీటాని బండిలోకి ఎక్కించాలి.

కిటికీ పక్కనేబల్లమీద పెద్దకర్రపెట్టెవుంది. ప్రక్కనే రైల్వేయూనిఫారంలో వయసు మళ్ళిన ఆతనొకడు కూర్చుని వున్నాడు.

"ఎవరిదీపెట్టె?"

ముఖం కనపడకుండా పక్కకుతిరిగి పైబెర్తుమీద కూర్చున్న ఒకామె నాతడు చూపించేడు.

"ఆమెది."

కిటికీ తెరవాలి. తెరవాలంటే పెట్టెఅడ్డం. మరోచోట పెట్టేటందుకు చోటులేదు. పావెల్ దానినిఎత్తి దాని యజమానురాలి చేతిలోనేపెట్టేడు.

"ఒక్కనిముషం పట్టుకోవమ్మా! కిటికీ తెరవాలి."

"నా పెట్టె నెందుకు ముట్టుకొన్నావు?"

ఆమె చప్పిడిముక్కూ వికారపుముఖమూ పావెల్ వేపు ఒక్కక్షణం తిరిగిచూసి తన పక్కకూర్చున్నవాడిని ఆదేశించింది.

"మోట్కా! ఏమిటి వీడి వ్యవహారం?"

మోట్కా బూటుకాలితో పావెల్ నడ్డిమీద ఒక్క తన్ను తన్నేడు.

"పోతావా, మరొకటి పుచ్చుకోనా?"

పావెల్ తన్నినా ఏమీ అనలేదు. కిటికీతియ్యడం హడావిడిలో వున్నాడు.

రైల్వేపనివానిని కొంచెం జరగమన్నాడు.

అడ్డంగావున్న ఇంకోడబ్బాతీసి పక్కనపెట్టి కిటికీ దగ్గిర ఖాళీచేసేడు. దిగువనప్లాట్‌ఫారంమీద రీటా నిలవబడి వుంది. ఆతనిముఖం కనబడగానే ఆమె తన సంచీ అందించింది. వెంటనే దానిని ప్రక్కనేకూర్చున్న లావాటియామె బడిలోపడేసి, ఒంగి రీటాచేతులు పట్టుకొన్నాడు. గార్డు చూసేలోపున ఆమె బండిలోకి వచ్చేసింది. ఆమెను చూడగానే పెట్టెలోవున్న దొంగవర్తకులొక్కమొయిని తిట్టడం ప్రారంభించేరు. క్రిందనిలబడ్డానికి చోటులేకపోవడంచేత ఆమె ఆమె పై బెర్తుఅంచుపట్టుకొని, కిందిబల్లఅంచున కాలుపెట్టి నిలబడివుంది. నాలుగుమూలలనుంచీ ఒకటే తిట్లు.

"దొంగ వెధవనిచూడు. తాను వచ్చిందేకాక తన ముండనికూడా తెచ్చేడు."

రీటా పై నే మరోగొంతు.

"మోట్కా! వాడిమొహాన ఒక్కటివతన్ను."

ఆమె తనకర్రపెట్టి పావెల్ నెత్తినపెట్టిపట్టుకొనివుంది. ఆమెతోసహా అందరూ తిడుతున్నారు. ఆమెను తిట్టిస్తున్నానేయని పావెల్ చాల విచారపడ్డాడు. కాని చెయ్యగలది లేదు. వున్నలోనే సర్దుకోవాలి.

"ఏమయ్యా దారిలో మాటతియ్యి. ఈ కామ్రేడ్ కాస్త నిలబడుతుంది."—అని అతడు పైబెర్తులోవున్న మోట్కాను అడిగేడు. కాని, వాడిచ్చిన బూతుసమాధానంతో ఒళ్ళు మండిపోయింది. ఆవేశంతో తలనరాలు ఉబ్బిపోయి పోటు ప్రారంభించింది.

"ఉండు తొత్తుకొడక! నీపని చెప్తా."

—ఆమాట ముగిసేలోపుగానే వాస్కా అతని నెత్తిమీద ఒక్క తన్నుతన్నేడు.

నలుగురూ వానిని హర్షించేరు.

"భేష్! మరొకటి."

పావెల్ ఇంక ఓర్చుకోలేక పోయేడు. అటువంటి సందర్భాలలో అట్టే తటపటాయించకుండా, చెయ్యదలచుకొన్నదేదో చేసిపారేస్తాడు.

"దొంగవ్యాపారాలూ మీరూ లంజ... మీయిష్టం వచ్చినట్లల్లా సాగిపోతుందనుకుంటున్నారేం?"

—అంటూ ఒక్క ఎగురులో పైబెర్తు ఎక్కేసేడు. ఎదురుగానేవున్న మోట్కా ముఖంమీద పిడికిలి బిగించి ఒక్క గుద్దుగుద్దేడు. ఆదెబ్బవిసురుకి వాడుదొర్లి క్రిందనున్నవాళ్ళ నెత్తిన పడ్డాడు.

వెను వెంటనే జేబులోంచి రివాల్వరు తీసేడు.

"మీరంతా దిగుతారా ? కాల్చెయ్యనా ?"

కథ అడ్డంతిరిగింది. రీటా అన్నీ చూస్తూ రివాల్వరు సిద్ధంగా వుంచింది. కోర్చాగిన్‌ను ఎవడైనా ఎదుర్కొన్నాడా వాడు ఖతం అయిపోతాడు. కాని, ఎవ్వడూ సాహసించలేదు. అంతవరకూ అల్లరిచేసినవారంతా బిలబిలలాడుతూ క్రిందికి దిగేరు. పావెల్ రీటాను పైకెక్కించేడు.

"నువ్విక్కడే వుండు. వీళ్ళసంగతి నేనుచూస్తా."

రీటా ఆతనిని ఆపడానికి ప్రయత్నించింది.

"వీళ్ళతో పేచీఏమిటి తెద్దూ."

"నీకు తెలియదు. ఇప్పుడే వస్తా."

ఆతడుమళ్ళీ కిటికీ తెరిచేడు. ప్లాట్‌ఫారమ్‌మీదికి వురికేడు. ఇదివరలో తాను ఛేకాలో పనిచేసినప్పుడు తనపై వుద్యోగిగావున్న లెట్టిష్‌వానితో కొద్దిసేపు మాట్లాడేడు. వెంటనే పెట్టెలనుంచి జనాన్నిదింపేసి కాగితాలు తనిఖీచెయ్యడానికని ఆయన బయలుదేరేడు.

తనిఖీ జరుగుతున్నంతసేపూ ఆ ఆఫీసరు గొణుగుతూనేవున్నాడు.

"పెట్టెలనిండా దొంగవ్యాపారులేనని చెప్తూనేవున్నా. ఒక్కరూ వినిపించుకోరు.

పదిమంది 'ఛేకా' మనుష్యులువచ్చి పెట్టెలన్నీ ఖాళీ చేయించేరు. పావెల్ వాళ్ళకి సాయంనిలబడి కాగితాలు తనిఖీచేయించేడు. ఆతడు ఆశాఖతో సంబంధాలు పూర్తిగా తెంచుకోలేదు. కామ్‌సోమాల్ కార్యదర్శి అయ్యేక గట్టి

పడుచువాళ్ళని ఎందరినో వరి 'ఛెకా'లో పనిచెయ్యడానికని పంపుతూనేవచ్చేడు. తనపని పూర్తిఅయ్యేక ఆతడు పెట్టెలోకి వచ్చేడు. బళ్ళు మళ్ళీనిండేయి. కాని, ఈమారుఎక్కినజనం వేరు : రెడార్మీసైనికులు, ఫ్యాక్టరీలకూ, ఆఫీసులకూ వెళ్ళే జనమూ ఈమారు నిండేరు.

పెట్టెలో ఒకమూల పైబెర్తుమీద రీటా, పావెల్ కూర్చున్నారు. వాళ్ళు కూడా తెస్తున్న కాగితాలకట్టలతో ఆబెర్తుమీదఖాళీయేలేదు. ఎలాగోఇరుక్కుని రీటా పడుకుంది.

"ఎలాగో కష్టపడదాం."

ఎట్టకేలకు రైలుకదిలింది. ప్రక్కనే ప్లాట్‌ఫారంమీద తమపెట్టెలూ, నూనెడబ్బాలూమధ్యకూర్చుని ఆ లావుపాటి యామె అరుస్తూండడం వారి చెవుల పడింది.

''ఒరేయ్ దుంకా! నా నూనెడబ్బా ఏమయిందిరా!''

కాగితాలకట్టలమధ్యకూర్చుని ఇద్దరూ తమతో తెచ్చుకొన్న రొట్టెలూ, పళ్ళూ తింటూ, జరిగినఘట్టం చెప్పుకొని నవ్వుకొన్నారు.

రైలు, శిథిలం అయిపోయినపెట్టెల్ని ఈడ్చుకుంటూ నెమ్మదిగా బయలుదేరింది. క్రమంగా చీకటిపడింది.

రీటా అలసిపోయివుండడంచేత మూటలకు జేరబడగానే ఇట్టే నిద్రపోయింది. పావెల్‌కూడా అలసివున్నాడు. కాని పడుకునేందుకు చోటులేదు. చల్లనిగాలి కిటికీలోంచి రివ్వున విసురుతూ జోకొడుతూంది. బండి ఒకచోట కుదిపినప్పుడు రీటాకు తెలివివచ్చింది. పక్కనే పావెల్ సిగరెట్టు చివర నున్న నిప్పురవ మిలమిలలాడుతూ కనబడుతూంది. ఆమెకు

ఎక్కడ ఇబ్బంది కలుగుతుందోనని ఆతడక్కడే ఆలాగే ఎంతసేపయినా కూర్చుంటాడు. అతని స్వభావం అది.

"కోర్చాగిన్ ! బూర్జువా అలవాట్లు కట్టిపెట్టి, ఇల్లా పడుకో."

ఆమె మాటలుసర్ది, పక్కకుజరిగి, అతనికోసం చోటు చేసింది. పావెల్ ఆమె పక్కనే పడుకొని, కాళ్ళుచాపు కున్నాడు. తిమ్మిరులు ఎక్కిపోయిన కాళ్ళు జిలజిలలాడేయి.

"రేపు బోలెడంత పనుంది. మాట్లాడక పడుకో."— అంటూ ఆమె ఆతనిని పడిపోకుండా పొదివిపట్టుకొంది. ఆమె జుట్టు ఆతని చెక్కిళ్ళమీద గిలిగింతలు పెడుతూంది.

పావెల్‌కు రీటాఅంటే అమితగౌరవం. ఆమె స్నేహి రాలు, కామ్రేడేగాక, రాజకీయ గురువుకూడా. అయినా ఆమెలోని స్త్రీత్వం అతనిని ఆకర్షిస్తూనేవుంది. బ్రిడ్జిక్రింద ఆతడామె శరీరాకర్షణను గమనించేడు. ఇప్పుడామె స్పర్శ పరవశత్వం చెందిస్తూంది. ఆమె నిశ్చింతగా పడుకొనివుంది. కాని, ఆమె ఊపిర్పులాతనికి వెర్రిపుట్టిస్తున్నాయి. తన ముఖా నికి సమీపంలోనే ఆమె పెదవులున్నాయి. ఒక్కమారు ముద్దుపెట్టుకోవా లనిపించింది. కాని, అతికష్టంమీద నిగ్ర హించు కొన్నాడు.

ఆతని కదలికలలో రీటా ఆతనిభావాల్ని గ్రహించి చిరు నవ్వునవ్వింది. పురుషవాంఛలోని సుఖమూ, ప్రేమపాత్రుని మరణంవలని దుఃఖమూకూడ ఆమె ఎరుగును. ఆమె ఇద్దరు బోల్షివిక్కులను వరసగా ప్రేమించింది. కాని, ఇద్దరూ 'వైట్ గార్డ్'ల తుపాకుల కెరఅయిపోయేరు. మొదట బ్రిగేడ్

కమాండరు ఆమెను ఆకర్షించేడు. రెండోమారు ఒక నీలి కళ్ళకుర్రవాడు–సెర్జీ–ఆమె ప్రేమకు పాత్రమయ్యేడు.

త్వరలోనే బండిపూపులో పావెల్‌కు నిద్రపట్టిపోయింది. మరునా డుదయంకాని ఆతనికి తెలివిరానేలేదు.

* * *

ప్రతిరోజూ పనులు తెముల్చుకొనేసరికి బాగా రాత్రి అయిపోతూంది. రీటాకు డైరీ వ్రాసేటందుకు తీరికే వుండడం లేదు. కొంతవ్యవధితర్వాత మళ్ళీ ఒకటీ, అరా మాటలు పుస్తకంలో కనబడసాగేయి.

అగస్టు, 11.

గుబెర్నియా సమావేశం అయిపోయింది. అఖిల యూక్రేనియన్ మహాసభకని అకిమ్, మిఖైలో వగైరాలంతా వెళ్ళిపోయేరు. రిపోర్టులూ వగైరా కాగితంపనిఅంతా నా మీదపడింది. దుబావానూ, పావెల్‌నూ గుబెర్నియా కమిటీలో పనిచేయమని పంపేరు. పెఖోర్‌స్కీ జిల్లాకమిటీ కార్యదర్శిఅయ్యేక డిమిత్రీ పాఠాలకు రావడంలేదు. పావెల్ చదవాలని తాపత్రయపడుతున్నాడు. కాని, ఆతనికి ఖాళీవుంటే నాకుపని! నాకు ఖాళీవున్నప్పుడాతనికిహడావిడి. రైల్వేలలో పని మరీ ముమ్మరంగా వుండటంచేత కామ్‌సోమాల్ కుర్రవాళ్ళని ఏదో పనిచెప్పి తరుచు తీసుకుపోతున్నారు. నన్ను చూడ్డానికి నిన్న జార్కూ వచ్చేడు. తనవద్దవున్నవాళ్ళని తరచు పిలుస్తున్నారనీ, మనుష్యులులేక తనపని మొండిపడుతూందనీ అతడంటాడు.

అగస్టు, 23.

నిన్న నేను వరాండాలోంచి వెళుతూంటే మేనేజరు ఆఫీసుముందు పాంక్రాటొవ్ తోనూ, మరొకరితోనూ కలిసి పావెల్ కనిపించేడు. నేనువచ్చేసరికి పావెల్ మాట వినిపించింది.

"కూర్చున్న ముండాకొడుకుల్ని కాల్చిపారెయ్యాలంటాను. 'నాఆజ్ఞలు కాదనడానికి నువ్వెవర'న్నాడు. రైల్వే వంటచెరుకు కమిటీదట, ఇక్కడ మాప్రసక్తి ఏమీలేదట. ఇక్కడ పోగుబడ్డజనం అంతా అదేమాదిరి బటాచోర్ లు"... ఆవెనక ఒక్కవరసన బూతులు. పాంక్రాటోవ్ నన్నుచూసి పావెల్ ను పొడిచేడు. ఆతడు గిరుక తిరిగిచూచేడు. నన్ను చూడగనే వెర్రిమొగం వేసేడు. ఇంక నావేపుకూడా తిరిగి చూడకుండా వెళ్ళిపోయేడు. మళ్ళీ కొన్నాళ్ళవరకూ ఇటు ముఖంచూపడు. బూతుల్ని సహించనని ఆతడెరుగు...

అగస్టు, 27.

ఈవేళ బ్యూరో సమావేశం అయింది. పరిస్థితులు చాల ఆందోళనకరంగా వున్నాయి. అవన్నీ వివరాలు వ్రాయడం ఇప్పుడు సాధ్యంకాదు. అకిమ్ ప్రాంతీయ మహాసభనుంచి వచ్చినప్పటినుంచీ ఏదో దిగాలుగావున్నాడు. నిన్నటిరోజున ఆహారపదార్థాలు తెస్తున్న మరోరైలును పడగొట్టేరు. ఇంకీడైరీని వ్రాయగలుగుతా ననుకోను. ఇప్పటికే ఉండుండి వ్రాయడం జరుగుతూవుంది. కోర్చాగిన్ ఎప్పుడొస్తాడో మొన్న కనిపించి, తానూ, జార్కూ, మరోముగ్గురూ కలిసి 'కమ్యూన్' ప్రారంభించబోతున్నామంటూ చెప్పేడు.

*　　*　　*

ఒకరోజున రైల్వేవర్కుషాపుల్లో పనిచేస్తుండగా పావెల్‌ను రీటా ఫోన్‌లో పిలిచింది. ఆనాటిసాయంకాలం ఆవిడకు పనేమీలేదు. తాము చదువుతూ మధ్యలో వదిలి పెట్టిన పుస్తకాన్ని పూర్తిచేద్దాం రాగలవా అని అడిగింది.

ఆమె యూనివర్శిటీవీధిలో కాపురంవుంటూంది. కొంచెం చీకటిపడేవేళకి పావెల్ వెళ్ళేడు. వీధిలోనుంచి చూస్తే పైనమేడమీద ఆమెగదిలో దీపంవెలుగు కనిపిస్తూంది. గబగబా మెట్లుఎక్కేసి, తలుపుతోసి లోపలఅడుగుపెట్టేడు.

ఆమె మంచంమీద కాట్రేడ్ని ఎవ్వరినీ కూర్చోనివ్వదు. అల్లాంటిది ఇప్పుడు సైనికదుస్తుల్లోవున్న ఒక పడుచువాడు దానిమీదపడుకునేవున్నాడు. ఒక రివాల్వరు, కిట్‌బాగ్, ఎర్రని నక్షత్రంకుట్టినటోపీ ప్రక్కనేవున్న టేబిల్ మీద కనబడుతున్నాయి. ఆతనిపక్కలో రీటా కూర్చుని కబుర్లుచెప్తూంది. పావెల్‌నుచూడగానే ఆమెముఖం ఉద్దీప్తమయింది.

పడుకునివున్న వ్యక్తికూడా ఆతనిని చూడగనే లేచి కూర్చున్నాడు.

రీటా వారిద్దరికీ పరిచయం చేయబోయింది.

"పావెల్, ఈయన..."

నూతనవ్యక్తి పావెల్‌తో కరచాలనంచేస్తూ తన పేరు తానే చెప్పుకొన్నాడు.

"దావీద్ ఉస్తినోవిచ్..."

రీటా ఎంతో సంతృప్తీ, సంతోషమూ వెల్లివిరిసేలా నవ్వింది.

"తలవని తలంపుగా వచ్చేడు."

పావెల్ ఏవిధమైన ఉత్సాహమూ చూపలేదు. దావీద్‌తో కరచాలనం చేసినా, ఎందుకు వచ్చేనా అన్నట్లు చూసేడు. దావీద్ కోటుచేతిమీద నాలుగు చదరాలు కుట్టి వున్నాయి. కంపెనీ కమాండరుగుర్తు అది. దానిమీదనే పావెల్ చూపు లున్నాయి.

రీటా ఏదో చెప్పబోయింది. కాని మధ్యలోనే పావెల్ అందుకున్నాడు.

"ఈవేళ సాయంకాలం వార్పులవద్ద కలప ఎగుమతి పనివుంది. తీరికవుండదని చెప్పడానికే వచ్చేను. నీకూ చుట్టం వచ్చేరు. ఇంకపోతా. క్రిందమిగిలినవాళ్ళంతా కనిపెట్టుకొని నిలబడ్డారు."

మారుమాటకుకూడా వ్యవధిఇవ్వకుండా ఆతడు వెళ్ళి పోయేడు. గబగబ మెట్లుదిగడం వినిపించింది. తలుపువేసిన చప్పుడు. మరల నిశ్శబ్దం.

దావీద్ ఏమిటిది అన్నట్లు చూసేడు.

"ఏదో గంద్రగోళంలోవున్నాడల్లేవుంది."—అంది రీటా.

దూరాన వంతెనవద్ద ఒకరైలుఇంజను బుసలుకొడుతూ వుంది. దాని ఊపిరితోపాటు మిణుగురులు గాలిలోఎగురుతూ కొంతసేపు మిలమిలలాడి పొగలో అదృశ్యం అవుతున్నాయి.

రేలింగుల్ని ఆనుకొని పావెల్ నిలబడివున్నాడు. ఎదురుగా రైల్వేలైన్‌మీద సిగ్నల్ రంగుదీపాలు కనుసైగలు

తూంటే చూస్తూన్నాడు ఏవేవో ఆలోచనలు కొట్టుమిట్లాడు తున్నాయి.

"రీటాకు మగడున్నాడంటే నాకు బాధఏమిటి! తనకు మగడులేడని ఆమె ఎన్నడన్నా చెప్పిందా? మగడున్నాడు. ఉంటేనేం? ఎందుకా బాధ? ఇదంతా వాంఛారహితమైన శుద్ధప్రేమతప్ప వేరేమీకాదనుకున్నానుగా... ఈ పరిస్థితి ఏలావచ్చింది?"

పావెల్ తననుతానే సవాలక్ష ప్రశ్నలతో సమాధాన పరచుకోచూసేడు.

"ఆతడామె భర్త అవునో, కాదో. దావీద్ ఉస్తినో విచ్ ఆమె అన్నకావచ్చు. పినతండ్రికావచ్చు. అదే నిజం అయితే ఆయనవిషయంలో చాలా అన్యాయం చేసేనన్న మాట. నాకన్న అధముడు వేరేవుండడు. ఆయన అన్నో, మగడో తెలుసుకోవడం పెద్దకష్టమేంకాదు. అన్నో, పిన తండ్రో అవుతాడు. ఆయనతో అంత అసభ్యంగా వ్యవ హరించినందుకు సమాధానం ఏచెప్తాను? లాభంలేదు. ఇంక ఆమెను తరుచుచూడడం తగ్గించాలి."

ఇంజను గీపెట్టడంతో ఆతని ఆలోచనల కంతరాయం కలిగింది.

"చాలునీబాధ పొద్దుపోయింది ఇంటికి చేరుకోవడం మేలు.

*　　　*　　　*

రైల్వేపనివారు నివసించే పేట సోలోమెంకాలో అయి దుగురు యువకులు ఒక చిన్న కమ్యూన్ ప్రారంభించేరు.

జార్కా, పావెల్, క్లావిసెక్ అనే జెక్ యువకుడు, రైల్వే యార్డులలోని కామ్‌సోమాల్ సంస్థ కార్యదర్శి నికోలాయ్ ఓకునేవ్, ఛెకాలో పనిచేస్తున్న స్టెఫాన్ ఆర్ట్యుఖిన్ ఈఅయి దుగురూ కమ్యూనులో సభ్యులు.

ఓగది అద్దెకుతీసుకున్నారు. మూడురోజులపాటు దానిని ఊడ్చి, కడిగి, వెల్ల వేసి శుభ్రంచేసేరు. ఎన్ని నీళ్ళు మోశారో లెక్క లేదు. చుట్టుప్రక్కలవాళ్ళు ఏదన్నా తగులబడ్డంలేదు గదా యనుకొన్నారంటే ఆశ్చర్యంలేదు.

పడుకునేందుకు గడమంచాలు తయారుచేసుకొన్నారు. పార్కులోరాలినఆకు సంచులలో తెచ్చి గోనెగుడ్డసంచులలో కూరి పరుపులు కుట్టుకున్నారు. గోడమీద పెట్రోవ్‌స్కీ పటం ఒకటీ, పెద్దమ్యాపూ వేలగట్టేరు. గది మెరిసిపోతూంది.

కిటికీలమధ్య గోడనిచేరబెట్టి షెల్ఫు, దానినిండా పుస్తకాలు. దేవదారుగుల్లలు తెచ్చి వానిమీద కార్డుబోర్డు ముక్కలుకొట్టి కూర్చుందుకు కుర్చీపీటలుగా తయారుచేసుకొన్నారు. అల్లాంటిదే పెద్దపెట్టె తెచ్చి చిన్న బీరువా చేసుకున్నారు. వేర్‌హౌస్‌లో గుడ్డచిరిగిపోయిన బిలియర్డ్సు బల్ల వొకటుంటే నలుగురూ సాయంపట్టి తెచ్చి గదిమధ్య పెట్టేరు. పగటిపూట దానిని టేబుల్‌గా వుపయోగిస్తారు. రాత్రి క్లావిసెక్ దానిమీద పడుకొంటాడు. అయిదుగురూ తమ సామానులన్నీ తెచ్చేరు. క్లావిసెక్ వాటన్నింటిని లిస్టు వ్రాసేడు. దాని నాతడు గదిలో వ్రేలగడతానన్నాడు. కాని మిగతా వాళ్ళు అభ్యంతరంచెప్పేరు. గదిలోవున్న సామానులన్నీ

సమష్టి ఆస్తియని ప్రకటించేరు. సంపాదనలు, రేషన్లు, అప్పుడూ, అప్పుడూ ఇళ్ళనుంచివచ్చే సరుకులు అన్నింటినీ అంతా సమానంగా అనుభవించాలిసిందే. ఇంక స్వంతఆస్తి అనేదల్లా ఆయుధాలు ఒక్కటే. ఎవరన్నా సమష్టిహక్కును అతిక్రమించినా, మిత్రుల్ని మోసగించినా తక్షణం కమ్యూన్ లోంచి తొలగించాలని ఏకగ్రీవంగా నిర్ణయించేరు. ఆ బహిష్కరణతోపాటు గదిలోంచికూడా తరిమెయ్యాలని ఓకునేవ్రూ, క్లావిసెకూ పట్టుపట్టేరు. అదికూడా ఆమోదించ బడింది.

గృహప్రవేశంరోజున జిల్లా కామ్‌సోమాల్ కార్య కర్తలంతా వచ్చేరు. పొరుగింటివాళ్ళ దగ్గర పెద్దబాయిలర్ ఎరువు తెచ్చేరు. టీపార్టీకోసం వాళ్లు నలుగురూ పోగుచేసు కున్న శర్కరకాస్తా సెలవైపోయింది. టీ తాగేక ఇల్లంతా అదిరిపోయేలాగ పాటకు అందుకున్నారు.

దుఃఖమయంబీ జగమూ
కష్టమయం మన జీవితమూ
కలకాలం కష్టాలుంటాయా ?
ఆగు, అదే అరుణోదయవేళా.

పోగాకుఫ్యాక్టరీనుంచివచ్చిన తాల్యాలగూటినాపాట ప్రారంభించింది. తలమీద కట్టుకున్న ఎర్రజేబురుమాలు ఓ పెడకు జారిపోయింది. కళ్ళుఎగరేస్తూ, నవ్వుతూంది. ఆమె నవ్వుతూంటే ఆ చుట్టుప్రక్కల విచారంఅనేది నిలబడ లేదు. పద్దెనిమిదేళ్ళపడుచుదనపు ఆనందోత్సాహాలలో ఆమె

కళ్ళకీ జగమంతా అరుణారుణోదయావేళా శోభాపరిప్లావితం గానే కనబడుతూంది. ఆమె చేయివిసురుతూ గొంతెత్తింది.

మన కంఠం జగద్రంగమున
ప్రతిధ్వనితం కానీ,
మనజెండా వియదంచలమున
పరిభ్రమితం కానీ
మన కవోష్ణరుధిరరోచి
జగముద్దీప్తం కానీ...

ఆరోజున ఆకూటం విడిపోయేసరికి చాలాపొద్దుపోయింది.

* * *

టెలిఫోను మోగింది. జార్కా రిసీవరు నందుకొన్నాడు.

సెక్రటరీఆఫీసులో కామ్సోమాల్ కార్యకర్తలుచేరి గగ్గోలుచేస్తున్నారు. వాళ్ళని అదిలించేడు.

"ఊరుకోండి. ఏమీా వినిపించడంలేదు."

గొడవ కొంచెం తగ్గింది.

"నువ్వా. అల్లాగే. ఇప్పుడే... ఆ జెండా ఏమిటి?... మామూలుపాటే. వార్ఫులనుంచి వంటచెరుకు మోయడమేనా?... ఏమిటన్నావు?... లేదు. ఎక్కడికీ పంపలేదు... ఇక్కడేవున్నాడు... మాట్లాడాలా?... ఒక్కక్షణం ఆగు..."

జార్కా పావెల్‌ను రమ్మని సంజ్ఞ చేసేడు.

"ఉస్తినోవిచ్ పిలుస్తూంది."

పావెల్ రిసీవరు నందుకొన్నాడు. రీటాగొంతు వినబడింది.

"ఫోన్‌లో లేవనుకొన్నా. ఈవేళసాయంకాలం నాకు ఖాళీయే. రాకూడదూ? మా అన్నయ్య వెళ్ళిపోయేడు. ఫోన్‌మీదుగా వెళుతూ, దార్లో నన్ను చూసిపోదామని దిగేడు. రెండేళ్లుదాటిపోయింది, ఒకరినొకరుచూసుకొని..."

ఆమెఅన్నగారు!

పావెల్ ఇంకేమీ వినలేదు. ఆరోజు సాయంకాలం తానుచేసిన అవకతవకపనీ, వంతెనవద్ద ఆరోజురాత్రి తాను చేసినప్రతిజ్ఞా జ్ఞాపకంవచ్చేయి. ఈవేళ సాయంకాలం ఆమెను చూసి, ఇదేదో కడముట్టించాలి. ప్రేమ ఎంతో బాధా, మనస్తాపమూ కలిగించింది. వీటన్నింటికీ ఇది సమయంకాదు.

ఫోన్‌లో గొంతు పిలుస్తూంది.

"వినబడ్డంలేదూ?"

"వినిపించకేం, వినిపిస్తూంది. అల్లాగే. బ్యూరో మీటింగు పూర్తికాగానే అల్లావస్తా.

* * *

ఓక్ చెక్కలతో చేసిన బరువైన ఆ టేబిల్‌ను రెండు చేతులతోనూ పట్టుకుని పావెల్ ఎదురుగావున్న రీటా కళ్ళల్లోకి చూసేడు.

తన మాటలకు ఆశ్చర్యంతో ఆమె కళ్ళార్పడం కనిపించింది. కాగితంమీద పరుగులు వారుతున్న పెన్సిలు ఒక్కమారుగా నిలబడిపోయింది.

"ఎంచేత?"

"తీరుబడి వుండటంలేదు. నువ్వుమాత్రం ఎరగవూ? ఎంత ఇబ్బందిగావుందో! ఏం చెయ్యను. తప్పదు. మానుకో వలసిందే."

చివరమాటలలో మొదటిబిగువులేదని ఆతనికే అర్థం అయింది. మనస్సులోనే విసుక్కున్నాడు.

"ఎందుకీ నసుగుడు? సరాసరి ఎదుర్కోగలధైర్యం లేదన్నమాట."

మనస్సు దృఢపరుచుకొని పుల్లవిరిచినట్లు మాట్లాడేసేడు:

"అదీగాక, నీతోనే కొన్నాళ్ళనుంచి చెప్పాలనుకొంటున్నాను. నువ్వుచెప్పే సమాధానాలు నాకేమీ అర్థం కావడంలేదు. సెగాల్ ఉన్నప్పుడు చదివిందేదో అంతే. నీదగ్గిరచదువు బుర్రకెక్కడంలేదు. పాఠాలుకాంగనే టోకరేవ్ దగ్గిరికెళ్ళి మళ్ళీచెప్పించుకొంటున్నా. తప్పునాదే ననుకో. ఈ బుర్రసరిగ్గా పనిచెయ్యడంలేదు. మరికాస్త తెలివిగలవాణ్ణి చూసుకోవాలసిందే."

ఆమె ఆతనిముఖంలోకి పరీక్షగాచూస్తూంది. ఆమె చూపులనుంచి తప్పించుకోవడానికై తలతిప్పుకొన్నాడు. ఇంక అనుమానం ఏమీలేకుండా చెప్పేసేడు.

"ఇంకీపాఠాలు సాగించడం శుష్కదండుగ."

ఆతను లేచేడు. కాలితోనెమ్మదిగా కుర్చీ పక్కకు నెట్టేడు. ఆతనిముఖాన కత్తివాటువేస్తే నెత్తురుచుక్కలేదు. తలవొంచుకొని టోపీ నెత్తినపెట్టుకొన్నాడు.

"సరి, సెలవా! నీపని చాలసేపు పాడుచేసేను. క్షమించు. ఈవిషయం ఇదివరకేచెప్పేస్తే బాగుండిపోయేది. చెప్పక పోవడం నాదేలోపం."

రీటా అనాలోచితంగానే కరస్పర్శచేసింది. కాని, నిజానికి ఆతనిమాటల కామె నిస్తబ్ధురాలయిపోయింది.

"పావెల్. నీదేం తప్పుకాదు. నీకు అర్థంఅయ్యేలాగ పాఠం చెప్పలేకపోతే ఆతప్పు నాది కాని..."

పావెల్ ఎంతో బరువుగుండెతో గుమ్మంవేపుగా నడిచేడు. మెట్లక్రింద ఒక్కనిముషం నిలబడ్డాడు. కాని, ఏం చెప్పేటందుకూ వేళదాటిపోయింది.... చెప్పిమాత్రం ఏం లాభం? ఎందుకూ చెప్పడం? ఆవిడ వేళాకోళంచేస్తే తల వ్రేలవేసుకుని రావడమేగా? ఊహు.

* * *

శిథిలమైపోయిన రైలుపెట్టెలూ, ఇంజన్లూ సైడింగు లలో చేరుకున్నాయి. గాలి సుళ్ళుతిరుగుతూ కలపఅడితీల లోని రంపపుపొట్టు తెచ్చి వాటినిండా చల్లుతూంది.

పట్టణంచుట్టూ అడవులు. అడవులనిండా ఆర్లిక్ బందిపోటుమూక. పగటిపూట చుట్టుప్రక్కలనున్న పల్లెల్లోనో, చిట్టడవుల్లోనో దాగుకుంటారు. చీకటిపడగానే రైలుకట్టవెంబడే చేరి, పట్టాలు పీకేస్తున్నారు. ఆపనికాస్తా చేసేసి మళ్ళీ మరుగుల్లోకి చేరుకుంటున్నారు.

ఆ విధ్వంసక్రియల ఫలితంగా ఎన్నో ఇంజన్లు దొర్లిపోయేయి. పెట్టెలు తునాతునకలయేయి. నిద్రలోవాళ్ళు

నిద్రలోనే పెట్టెలమధ్య చిక్కుకుని చచ్చిపోయేరు. ఎంతో ధాన్యం, గోధుమ మట్టిపాలయింది.

ఉన్నట్లుండి ఈ బందిపోటు దొంగలగుంపు ఏదో వూరిమీద పడుతుంది. దిక్కు తెలియకుండా నాలుగు తూటాలు కాలుస్తారు. సోవియట్ కార్యాలయం ఎదుట కాస్సేపు కాల్పులు సాగుతాయి. ఓమూల అక్కడయుద్ధం జరుగుతూండగానే మరికొందరు గుర్రాలమీద వూళ్ళోపడ తారు. కనిపించినవాని నల్లా నరికేస్తారు. కట్టెలు కొట్టినట్లే, అంత నిశ్శంకగానూ మనుష్యుల్ని నరికేస్తారు. తూటాలు కరువుకావడంచేత తుపాకు లుపయోగించడం తగ్గించేరు.

హత్యాకాండ ముగియగానే వాళ్ళు వచ్చినవాళ్ళు వచ్చినట్లే మాయమైపోతారు. వాళ్ళకి అన్నిచోట్లా కళ్ళూ, చెవులూ పనిచేస్తున్నాయి. ఆకళ్ళే గ్రామసోవియటులో ఏంజరుగుతూందోచూస్తాయి. మతబోధకుడి ఇంటికీ, గ్రామం లోని ధనికరైతుల ఇళ్ళకూ అడవులతో సంబంధాలు చాలా వున్నాయి. అక్కడినుంచే తూటాలపెట్టెలు, మాంసం కట్టలు, సారాసీసాలు, వార్తలు అడవులకు చేరుతున్నాయి. క్రమంగా ఆర్లిక్ చెవికంటావెడతాయి.

ఆతనిచేతిలోవున్న వాళ్ళంతా కలిపి రెండుమూడు వందలమందికి మించరు. కాని, వాళ్ళు ఇంతవరకూ పట్టు పడకుండా తప్పించుకుపోతున్నారు. కారణం వేరేవుంది. వాళ్ళంతా రెండోమూడో చిన్నగుంపులుగా విడిపోయి రెండుమూడు జిల్లాలలో ఒకేమారు దోపిళ్ళు నడిపిస్తారు.

వాళ్ళందర్నీ పట్టుకోవడం అసాధ్యంగావుంది. ఆ వెనకటి రాత్రి బందిపోటు ఆరోజున ఏమీఎరుగని రైతులా పొలంలో శాంతంగా పనిచేసుకొంటూంటాడు. ఏ గుర్రాన్నో మేపు కొంటూంటాడు. గస్తీ గుర్రపుసైనికులు రోడ్డువెడుతూంటే ఏమీ ఎరగనట్లు చుట్టకాల్చుకుంటూ గుమ్మంలోనిలబడి చూస్తూంటాడు.

అలగ్జాండరు పుజూరేవ్స్కీ తన రెజిమెంటుతో ఈ దోపిడిమూకల వెంటబడి విధీవిరామం లేకుండా మూడు జిల్లాలలో తరుముతున్నాడు. ఒకటి రెండుమార్లు వాళ్ళుపోబడి దొరికింది. దెబ్బతీసేడు. ఇంక ఆర్లిక్ తన జనాన్ని రెండు జిల్లాలనుంచి ఉపసంహరించుకోక తప్పిందికాదు. ఇప్పుడు వాళ్ళో జిల్లాలో, కొంతభాగంలో మాత్రమే తమ దురంతాలు సాగించగలుగుతున్నారు.

* * *

నగరంలో జీవితం మామూలుగానే జరిగిపోతుంది. అయిదుమార్కెట్లూ జనసమ్మర్దంగా వుంటున్నాయి. వాళ్ళందరియావా ఒక్కటే. సాధ్యమైనంత తక్కువఇచ్చి, వీలయినంత ఎక్కువ లాగెయ్యాలనే అంగుడిలేని అమితలాభపరుల పని మహాజోరుగావుంది. నీతీ న్యాయం ఏ కోశానా ఎరగని కొందరు జనమధ్యంలో కలిసిపోతున్నారు. పేడమీద ఈపు టీగలుచేరినట్లు నగరంలోని దుష్టస్వభావులంతా ప్రజల్ని మోసగించి, దొరికినంతవరకూ నొల్లుకోనేటందుకు బజార్లలో పడ్డారు. వస్తున్న కొద్దిపాటిరైతుళ్ళు ఇల్లాంటివాళ్ళనే మరి

కొందరిని తెచ్చిదిగవిడుస్తున్నాయి. దిగేదిగడంతో వాళ్లు మూటా ముల్లెతో మార్కెట్లలో పడిపోతున్నారు.

రాత్రిపూట బజార్లు నిర్మానుష్యంగా వుంటాయి. చీకట్లో బారులుతీర్చివున్న ఆ కోట్లని చూస్తూంటే భయం కూడా వేస్తుంది.

ఎంతో ధైర్యంవుంటేతప్ప, చీకట్లో ఇక్కడికెవరూ రారు. ఏకొట్టుమూలలో ఎవరుదాగివున్నారో. తరుచుగా ఇక్కడ రాత్రిళ్ళు హత్యలుజరుగుతున్నాయి. పహారావాళ్లు ఒంటరిగా రావడానికి భయపడి, నలుగురిని చేర్చుకొని వచ్చే సరికి అక్కడో శవం, రక్తపుకొల్లూ తప్ప మరేమీకనబడవు. హంతకులు ఎప్పుడో పారిపోయివుంటారు. ఈ గలభాలతో సాధారణంగా మార్కెట్లలో బసచేసేజనం ఎక్కడివాళ్ళక్కడ మాయమైపోయేరు.

మార్కెటుకెదురుగా వీధిలోనే 'ఒరయన్' సినీమాహా లుంది. దీపాలవెలుగులో వీధివీధిఅంతా పట్టపగలులావుంది. హాల్ముంగిట జనం మూగివున్నారు. హాలులోప తెరమీద ఏదో ప్రేమదృశ్యాల్నిచూపిస్తూ ప్రొజక్టరు ఝుమ్మంటూంది. మధ్యమధ్య ఫిలిం తెగిపోతూంది. దీపాలు వెలుగుతున్నాయి. ప్రేక్షకలోకంలోంచి ఒకటేగందరగోళం.

నగరం మధ్యభాగంలోనూ, పేటల్లోనూ జీవితం యధాపూర్వంగా నడిచిపోతూన్నట్లుగానే కనబడుతూంది. పరిపాలనావ్యవస్థకి గుండెకాయ అనదగిన గుబెర్నియాపార్టీ కమిటీ కార్యాలయంకూడా ప్రశాంతంగావుంది. కాని ఈ ప్రశాంతత కేవలం చూపులకి మాత్రమే.

నగరంలో పెద్దకల్లోలానికి సన్నాహాలు సాగుతున్నాయి. పల్లెలనుంచీ, దూరప్రదేశాలనుంచీవచ్చి తుపాకులు చంకల్ని తగిలించుకొని తిరుగుతున్న జనానికి ఏదో కల్లోలం రాబోతూం దని తెలుసు. ధాన్యంవ్యాపారులపేరుతో రైలుబళ్ళటాపుల మీదా, పెట్టెలమెట్లమీదా నిలబడి ఏదోవిధంగా వచ్చిపడ్డ వాళ్ళూ ఎరుగుదురు. వాళ్ళు తమమూటల్ని బజారుకు పట్టు కెళ్ళేదానికి బదులు, తాముఎరిగివున్న చిరునామాలకు తీసుకు పోయి అందిస్తున్నారు.

వీళ్ళంతా ఎరుగుదురు. కాని, కార్మికపేటలకీ తెలి యదు. బోల్షివిక్కులూ ఎరగరు. వారికి తెలియకుండానే తుపాను రేగుతూంది.

నగరంలో ఏంజరుగుతూందో అయిదుగురు బోల్షివిక్కు లకి మాత్రమే తెలుసు.

రెడార్మీ పెట్లూరాసైన్యాల్ని చిందరవందరచేసి పోలెండులోకి తరిమివేసింది. కాని, హతశేషులు కొందరు దేశంలో వుండిపోయేరు. వాళ్లు విదేశీయుల మద్దత్తుతో తిరుగుబాటుకు తయ్యారీలు చేస్తున్నారు. ఆలామిగిలిపోయిన పెట్లూరామూకని చేర్చి ఒక దళం తయారుచేయడానికి సన్నాహాలు జరుగుతున్నాయి.

కుట్రదారుల కేంద్రకమిటీక్రింద షెపెటోవ్కాలో ఒకసంస్థ పనిచేస్తూంది. దాంట్లో నలభయ్యేడుగురు సభ్యు లున్నారు. వాళ్ళల్లో చాలమంది గతంలో విప్లవవిద్రోహ కార్యకలాపాలలో గట్టిగా పనిచేసినవాళ్ళే. అయినా ఇంకేం చేస్తాగులే యని 'ఛెకా' వాళ్ళని వదలివేసింది.

ఫాదర్ వాసిలీ, విన్నిక్ అనే సైన్యోద్యోగి, పెట్లూరా సైన్యంలో వుద్యోగిగా పనిచేసిన కుజ్మెంకోలు ఆ సంస్థకు నాయకులు. సామూతిన్స్కా అనే ఒకడు జిల్లాఎక్జిక్యూటివ్ కమిటీ ఆఫీసులో ఏలాగో దూరేడు. అక్కడనుండి రహస్యాలన్నీ చేరవేస్తున్నాడు. వానికి ఫాదరీ కూతుళ్ళిద్దరూ, విన్నిక్ తండ్రీ, తమ్ముడూ సహాయం.

సరిహద్దులోవున్న స్పెషల్ డిపార్టుమెంటు కార్యాలయంమీద ఒకరాత్రివేళ చేతిబాంబులతో దాడిచేయడమూ ఖైదీల్ని విడిపించడమూను. అవకాశాలుంటే రైలుస్టేషను పట్టుకోవడం—ఇదీ కుట్రదారుల కార్యక్రమం.

ఈలోపున కుట్రదళాలకు ఆఫీసర్లను రహస్యంగా నగరంలోకి చేరుస్తున్నారు. తిరుగుబాటుకు నగరమే కేంద్రంగా వుంటుంది. బందిపోటుదొంగలముఠాలు నగరాన్ని ఆనుకొని వున్న అడవుల్లోకి చేరుకొనివున్నాయి. వీటిద్వారా రుమేనియాలోకీ, పెట్లూరాదగ్గరికీ ఏజంట్లు వస్తూపోతూవున్నారు.

*　　　*　　　*

ఫియోడోర్ జకరయ్ ఆరురోజులనుంచి తన ఆఫీసు వదలి బయటకిరాలేదు. నిద్రాహారాలులేవు. నగరంలో జరుగుతున్న తిరుగుబాటు ప్రయత్నాలనుగురించి తెలిసిన అయిను గురు బోల్షివిక్కులలో అతడొకడు. పెద్దపులిని వెంటాడి, మదుగు సమీపంలో మాటువొడ్డిన వేటగాడల్లే ఆతడు మంచిబిగువులో వున్నాడు.

గంద్రగోళం చెయ్యకూడదు. హడావిడి పనికిరాదు. అరవడానికూడా వ్యవధానం ఇవ్వకుండా పులిని హత మార్చెయ్యాలి. అప్పుడుగాని ప్రశాంతంగా పనిచేసుకోవడం కుదరదు. అంతవరకూ బెదురే. కాని, ఆలోపున పులిని బెదర కొట్టెయ్యకూడదు. ఈమాదిరి జీవన్మరణ ఘట్టాలలో ఓర్పు పట్టుదలామాత్రమే విజయాన్ని సాధించిపెడతాయి.

గడ్డుసమయం సమీపించింది. రేపురాత్రి తిరుగుబాటు నడపాలని కుట్రదారులు నిర్ణయించుకొన్నారు.

కాని, ఆ రహస్యం ఎరగని బోల్షివిక్కులు అయిదు గురూ తామే మొదటదెబ్బతియ్యాలని నిర్ణయించుకొన్నారు. తిరుగుబాటుకు సమయం రేపని వాళ్ళనుకొంటే దెబ్బతీయ డానికి సమయం నేడేనని వీళ్లు నిశ్చయించుకొన్నారు.

ఆరోజు సాయంకాలంవేళ రైల్వేయార్డులోంచి సాయుధ రైలు చడీచప్పుడూ లేకుండా బయటకువచ్చింది. మళ్ళీ తలు పులు యథాపూర్వంగా మూసుకొన్నాయి.

రహస్యభాషలో టెలిగ్రాములు ఉరకలువేసేయి. వెంటనే ఎక్కడివాళ్ళక్కడ హెచ్చరికగా నిలబడ్డారు.

అకీమ్ జార్కుకు టెలిఫోన్ చేసేడు.

"సమావేశం పూర్తయిందా? ఇక్కడ మీటింగొక టుంది. జిల్లాకమిటీ సెక్రటరీని తీసుకొని వెంటనే రా. వంట చెరకుసమస్య మరీగొడవగావుంది. వివరాలు ఇక్కడి కొచ్చేక మాట్లాడుకొందాం."

"ఈ వంటచెరుకుసమస్య మన ప్రాణాలుతీస్తూంద"ని జార్కు విసుక్కున్నాడు.

లిఛ్కో కార్యదర్శు లిద్దరినీ యమస్ప్వేడులో హెడ్ క్వార్టర్సుకి తీసుకెళ్ళి వదిలేశు. ఆఫీసులోకి వెళ్ళేకగాని వంట చెరుకుసుగురించి మాట్లాడేందుకు తమరిని పిలువలేదని వాళ్ళకి తెలియదు.

ఆఫీసుమేనేజరు టేబిల్ మీాద మరతుపాకీ ఒకటి అమర్చి వుంది. స్పెషల్ సైన్యానికి చెందినవాళ్ళిద్దరు దానిసరంజామా అంతా చూస్తున్నారు. టౌన్ పార్టీనుంచీ, కామ్సోమాల్ సంస్థలనుంచీ వచ్చినవాళ్ళు వరాండాలచుట్టూ నిశ్శబ్దంగా నిలబడి కాపలాకాస్తున్నారు. ఆఫీసులో గుబెర్నెయాకమిటీ బ్యూరోసమావేశం అప్పుడే ముగిసింది.

గదిలోంచి వీధిలోకి రెండు ఫీల్డ్ టెలిఫోన్ తీగలువేసి వున్నాయి. వానిమీాదుగా గదిలోంచి లోస్థాయిలో సంభాషణ సాగుతూంది. గదిలో అకిమ్, రీటా, మిఖైలోలున్నారు. యుద్ధరంగంలో రాజకీయసలహాదారుగా పనిచేసినప్పుడు వేసిన యూనిఫారంలోవుంది రీటా. తలని సైనికులటోపీ, ఖాకీ దుస్తులు. చర్మపుకోటు బెల్టునుంచి మాజరు.

జార్కా ఆశ్చర్యంగా అడిగేశు—"ఏమిటిదంతా ?"

"హెచ్చరిక కవాతు. సరాసరి మీా జిల్లాకు వెడుతున్నాం. అయిదో కాల్బల పాఠశాలలో ఈవేళ ప్రాక్టీసుకోసం రాలీజరుగుతూంది. సెల్ మీాటింగులనుంచి కామ్సోమాల్ సభ్యులు సరాసరి అక్కడికే వచ్చేస్తున్నారు. అసలు సంగతేమిటంటే చడీచప్పుడూ లేకుండా అక్కడికి చేరుకోడమే."

పాతమిలిటరీస్కూలు ఆవరణ నిశ్శబ్దంగావుంది. పెద్ద పెద్ద ఓక్ చెట్లక్రింద నీడలు నల్లగా దయ్యాలలా కనబడుతున్నాయి. ఒక పెద్దచెరువునిండా గాంధారితీగా, రెల్లుదుబ్బులతోనిండి నీరుకనబడకుండా మూసుకుపోయివుంది.

మైదానంమధ్యన తెల్లని ఎత్తయిన గోడవెనకాల స్కూలుభవంతివుంది. అందులోనే ఇప్పుడు రెడార్మీకమాండర్ల పాఠశాలవుంది.

అర్ధరాత్రి కావచ్చింది. ఎక్కడా కదలికా, మెదలికా వున్నట్లులేదు. దారినపోయేవాళ్ళెవరయినా చూస్తే పాఠశాలలోవాళ్ళంతా నిద్రపోతున్నారనుకొంటారు. కాని అంతా నిద్రపోతూంటే గేట్ తలుపులు బార్లా ఎందుకు తెరచివుంటాయి? గుమ్మంలో నిలబడ్డ ఆ చీకటిపోగులు రెండూ ఏమిటో? అక్కడచేరినవాళ్ళందరూ ఆ రోజున పాఠశాలలో ఒక్కరూ నిద్రపోవడంలేదని ఎరుగుదురు. ఒకమారు హెచ్చరిక వినపడ్డాక నిద్ర ఎవరికేనా సాధ్యమా? ఎక్కడ ఏంపనిచేస్తున్నవాళ్ళు అక్కడే ఆ పని వదిలిపెట్టి పరుగెత్తివచ్చేరు. సెల్ మీటింగ్లనుంచి, కామ్సోమాల్ సమావేశాలనుంచి సరాసరి వచ్చేశారు. నిశ్శబ్దంగా ఒకళ్లూ, ఇద్దరూ చొప్పున వచ్చేరు. ముగ్గురికిమించిన జట్టులేదు. వచ్చేటప్పుడు పార్టీ కార్డులు, కామ్సోమాల్ కార్డులు తెచ్చికోవలసిందే. అవి లేనివారిని పాఠశాల ఆవరణగుమ్మంలో అడుగుపెట్ట నివ్వలేదు.

మీటింగ్ హాలులో అప్పటికే చాలమంది చేరేరు. కిటికీలకు దట్టమైన కాన్వాసుగుడ్డ తెరలు బిగించేరు. ఈపనికి

రప్పించబడిన జోల్లి విక్కీలు ప్రశాంతంగా చుట్టలు కాల్చుకుంటూ కభుర్లు చెప్పుకుంటున్నారు. మామూలు డ్రిల్లుకు ఇంత రహస్యం ఏమిటని వాళ్ళ ఆశ్చర్యం. ఇది నిజమైన హెచ్చరికే ననేది ఎవ్వరికీ తెలియదు. స్పెషల్ దళాలలో క్రమశిక్షణ పద్ధతులు అలవాటుచేసేటందుకు ఈహడావిడి అంతా చేస్తున్నారని వాళ్ళఊహ. కాని, అదివరలో యుద్ధరంగాల అనుభవం వున్నవాళ్ళుమాత్రం పాఠశాల ఆవరణలో అడుగుపెడుతూనే ఏదోవుందని గ్రహించేసేరు. వట్టినే అయితే అంత జాగ్రత్తలు తీసుకోరు. మిలిటరీ పాఠశాల విద్యార్థులు బయట ప్లాటూన్లుగా నిలబడుతున్నారు. గుసగుసలలో ఆజ్ఞలు జారీఅవుతున్నాయి. మరతుపాకుల్ని నిశ్శబ్దంగా ఆవరణలో జేరవేస్తున్నారు. భవంతిలో ఏకిటికీలోంచీ కూడ ఇంత వెలుతురురేఖ కనబడ్డంలేదు.

"ఏవోపెద్ద ఏర్పాట్లే జరుగుతున్నయ్యే"—అన్నాడు పావెల్, దుబోవ్‌తో. దుబోవ్ కిటికీలో ఎవరో అమ్మాయి ప్రక్కన కూర్చునివున్నాడు. ఆమె నాతడు రెండు రోజుల క్రితం జార్కీఇంటివద్ద చూసిన జ్ఞాపకం.

దుబావా నవ్వుతూ పావెల్ భుజంతట్టేడు.

"ఏం భయంవేస్తోందా? భయంలేదులే. యుద్ధం ఎల్లాచెయ్యాలో మేము నేర్పుతాం. ఈవిణ్ణి ఎరుగుదువా? ఎరగవు. ఈవిడపేరు అన్నా. ఇంటిపేరు తెలియదు. కాని, ఆవిడ వుద్యోగం తెలుసు. ప్రచార కేంద్ర కార్యాలయంలో ఆందోళనశాఖ ఈమెచేతిలో నడుస్తోంది."

ముఖంమీద పడుతున్న ముంగురులు వెనక్కి తోసుకొంటూ అన్నా పావెల్ వంక ఆశ్చర్యంగా చూసింది. కోర్చాగిన్ ఆమెవంక పరీక్షగాచూసేడు. ఒక్కనిముషం ఇద్దరూ ఒకరినొకరు అనిమేషంగా చూసుకొన్నారు. అన్నా కళ్ళు ఆతనిని సవాలు చేస్తున్నట్లున్నాయి. పావెల్ సిగ్గుపడి తలతిప్పుకొన్నాడు. లేనినవ్వు తెచ్చుకొని "మీలో ఆందోళనభాగం ఎవరిది?—అన్నాడు.

ఇంతలో హాలులో ఏదో హడావిడి వినిపించింది. కంపెనీకమాండరు ఒకకుర్చీఎక్కి "మొదటికంపెనీ, పంక్తిలో నిలబడండి. వేగం—" అన్నాడు.

గుబర్నియా కార్యవర్గ అధ్యక్షుడితోనూ, అకిమ్ తోనూకలిసి జకరయ్ హాలులోకి వచ్చేడు. వాళ్ళిద్దరూ అక్కడి కప్పుడప్పుడే వచ్చేరు. హాలంతా ఆమూలనుంచి, ఈమూలకి జనం నిండిపోయేరు.

మరతుపాకీ పీటమీద గుబెర్నియా కార్యవర్గాధ్యక్షుడు ఎక్కినిలబడి, చేయిఎత్తేడు. అంతా నిశ్శబ్దంఅయింది.

"కామ్రేడ్స్! చాల అవసరమైన, ప్రమాదకరమైన పనిమీద మిమ్మల్నందరినీ రప్పించేము. ఇప్పుడు మీకు చెప్తున్నవిషయాల్ని దేశరక్షణావసరాలదృష్ట్యా ఒక్కక్షణం క్రితంకూడా చెప్పడానికివీలులేకపోయింది. ఈపట్టణంలోనూ, యూక్రెయిన్‌లోని ఇతరపట్టణాలలోనూ రేపురాత్రి విప్లవ వ్యతిరేకుల తిరుగుబాట్లకు ఏర్పాట్లు జరుగుతున్నాయి. పట్టణంనిండా వైట్‌గార్డు ఆఫీసర్లు నిండిపోయేరు. పట్టణంచుట్టూ

బందిపోటుదొంగల గుంపులు మోహరించివున్నాయి. కుట్రదారులలో కొందరు సాయుధశకటదళాలలో ప్రవేశించి, డ్రైవర్లుగాచేరేరు. ఈ కుట్రనంతనూ సకాలంలో 'ఛేకా'కనిపెట్టింది. అందుకే పార్టీ శాఖలకూ, కామ్సోమోల్ శాఖలకూ ఆయుధాలిచ్చి సంసిద్ధంచేశాం. ఒకటోదీ, రెండోదీ కమ్యూనిస్టుపటాలాలు సైనికపాఠశాల యూనిట్లతోనూ, ఛేకా దళాలతోనూ కలిసి పని ప్రారంభిస్తాయి. సైనికపాఠశాల యూనిట్లు అప్పుడే తమపనిమీద వెళ్ళిపోయేయి. ఇప్పుడింక మీదీ వంతు. పదిహేనునిముషాలలో ఆయుధాలు తీసుకొని వరసలో నిలబడాలి. కా॥ మేడ్ జకరయ్ ఈ పనిలో నాయకత్వం వహిస్తాడు. యూనిట్లనాయకులు ఆయన ఆజ్ఞలను పాలించాలి. పరిస్థితులు ఎంత క్లిష్టంగావున్నాయో మీకు నేను వేరేచెప్పనక్కర్లేదు. రేపటి తిరుగుబాటును ఈనేళే అణిచెయ్యాలి."

ఒక్క పావుగంటలో వారంతా ఆయుధాలతోసహా స్కూలుముంగిట బారుతీరి నిలబడ్డారు.

కదలమెదలకుండా నిలబడిన ఆ సైనికుల్ని జకరయ్ ఒక్కసారి ఆమూలనించి ఈమూలకు చూసేడు. ఆపంక్తికి మూడుఅడుగులుముందు తోలుపటకాలతో నడుములుబిగించిన యిద్దరు నిలబడివున్నారు. వాళ్ళల్లో ఒకడు బెటాలియన్ కమాండరు. ఆతనిపేరు మెన్యైలో. వృత్తికి ఒక ఫౌండ్రీలో పనివాడు. భేతాళుడంతమనిషి. ఉరల్సు ప్రాంతంవాడు. రెండోవాడు కమిస్సార్ అకిమ్. ఒకటోకంపెనీ పటాలాలు ఎడమపక్కగా నిలబడివున్నాయి, వారికి రెండడుగులుముందు

కంపెనీ కమాండరూ, రాజకీయశిక్షకుడూ నిలబడివున్నారు. వారివెనక మూడువందలమంది కమ్యూనిస్టులు.

జకరయ్ సంకేతం ఇచ్చేడు.

"బయలుదేరండి."

మూడువందలమంది నిశ్శబ్దంగావున్న నగరవీథులలోకి కదిలేరు.

నగరం నిద్రిస్తూంది.

ల్వోవ్‌స్క్వాయావీథిలో దికాయా కెదురుగా పటాలం దళాలుగా విడిపోయింది. ఇదే వారి కార్యరంగం.

వారు నిశ్శబ్దంగా అక్కడున్న భవనాలను చుట్టుముట్టేరు. ఒక దుకాణం మెట్లమీద సేనాధిపతి కార్యాలయం పెట్టేరు.

నగరమధ్యభాగంనుంచి ఒక కారు హెడ్‌లైట్ల వెలుతుర్లో చీకట్లను చీల్చుకుంటూ ల్వోవ్‌స్క్వాయా వీథికివచ్చి, బెటాలియన్ కమాండర్ కార్యాలయంవున్న దుకాణం అరుగుప్రక్కన నిలబడింది.

హ్యూగో లిట్కే ఈమారు కారులో తన తండ్రిని తీసుకువచ్చేడు. కారు నిలబడగానే కమాండెంటు క్రిందికురికేడు. లెట్టిష్‌భాషలో కొడుక్కి ఏదో చెప్పేడు. కారు బయలుదేరింది. క్షణంలో రోడ్డుమలుపు తిరిగి అదృశ్యం అయిపోయింది. లిట్కే చేతులు స్టీరింగ్‌మీందా, కళ్ళు రోడ్డుమీదా అతికేసి, వెర్రివేగంలో కారును పోనిస్తున్నాడు.

ఆ రోజురాత్రి అంతవేగంగా కారును నడపవలసిన అవసరంవుంది. ఏదన్నాప్రమాదం జరిగినా ఈవేళ ఆతనిని శిక్షించే పరిస్థితులు లేవు.

ఉల్కలా లిక్కే వీధుల్లో దూసుకుపోతున్నాడు.

కారులో నగరం ఆ మూలనుంచి, ఈమూలకు ప్రయాణించవలసివచ్చిన జకరయ్ ఆతని నేర్పును అభినందించేడు.

"ఈవేళరాత్రి ఎవరిమీదా కారెక్కించకపోతే రేపు నీకు ఒక బంగారువాచీ బహుమానం ఇస్తా."

హ్యూగో ముఖం వికసించింది.

"ఆ మూలమలుపులో పదిరోజులశిక్ష తప్పదనుకున్నా..."

కుట్రదారుల ప్రధానకార్యాలయంమీద మొట్టమొదట దెబ్బతీసేరు. కొద్దిసేపట్లోనే ఖైదీలూ, కాగితాల కవిళ్ళూ స్పెషల్ డిపార్టుమెంటుగుమ్మంలో హాజరుపెట్టబడ్డాయి.

దికాయూవీధి 11 వ నెంబరుఇంట్లో జుబెర్టుఅనే ఆతడు వుంటున్నాడు. తిరుగుబాటు వ్యవహారాలలో ఆతడు చాల ప్రముఖపాత్ర వహిస్తున్నాడని 'ఛెకా'కువచ్చిన సమాచారం వల్ల తెలిసింది. పోడోల్ ప్రాంతంలో పనిచేయవలసిన ఆఫీసర్ల పట్టిక ఆతనివద్దనే వుందట.

సీనియర్ లిక్కే ఆతనిని పట్టుకోవడానికి స్వయంగా దికాయూవీధికి వచ్చేడు. జుబెర్టు నివసిస్తున్న వాటా కిటికీలు తోటలోకివున్నాయి. తోటగోడఆవలే సన్యాసినుల మఠం. ఆవేళప్పుడు జుబెర్టు ఇంటివద్దలేడు. ఆరోజుఅంతా కనబడనే

లేదని ఇరుగుపొరుగువాళ్ళు అన్నారు. సోదాచేసేరు. వాళ్ళకి కావలసిన పేర్లూ, చిరునామాలూ దొరికేయి. ఒకమూల పెట్టెనిండా చేతిబాంబులు కనబడ్డాయి. తన మనుష్యుల్ని గదిలో రహస్యంగావుంచి, దొరికినకాగితాలు పరీక్షించడం కోసం ఒక్కగడియ గదిలో నిలబడ్డాడు.

దిగువనతోటలో మిలిటరీస్కూలులో చదువుతున్న పడుచువాడు ఒకడు సెంట్రీడ్యూటీలోవున్నాడు. ఆతనికి దూరాన మూలగదిలో దీపం వెలుతురు కనబడింది. చీకట్లో ఒంటరిగా తోటలో కాపలావుండడం విసుగనిపిస్తూంది. కొంచెం భయంగాకూడావుంది. గోడమీదనుంచి ఎవరూ పారిపోకుండానూ, రాకుండానూ చూస్తుండమన్నారు అతణ్ణి వెలుతురుచూడగానే ప్రాణంలేచివచ్చింది. ఉన్న ఇబ్బందులకుతోడు చంద్రుడు మబ్బుల్లోదూరిపోతున్నాడు. మసక చీకట్లో తుప్పలూ, పొదలూ భయంపుట్టిస్తున్నాయి. తన బైనెట్‌తో చీకట్లోనే రెండుపోట్లుపొడిచేడు. అక్కడేంవుంది?

“వాళ్ళు నన్నిక్కడ ఎందుకువుండమన్నట్లు? ఆగోడ ఎవరు ఎక్కగలరు? అంత ఎత్తుంటే... ఓమాటు ఆ కిటికీ దగ్గరకెళ్ళి చూసొద్దాం.”

ఓమారు గోడకేసిచూసి, చెమ్మగా, కుళ్ళిన ఆకుల వాసనవేస్తున్న మూలలోంచి బయటకు వచ్చేడు కిటికీవద్దకు వచ్చేసరికి లిక్కీ అప్పుడే టేబిల్‌మీంది కాగితాలు తీస్తూన్నాడు. అదేక్షణంలో గోడమీదనీడ ఏదో కనబడింది. అక్కడినుంచి గదిలోని మనిషీ, కిటికీవద్దనున్న సెంట్రీకూడా

స్పష్టంగా కనిపిస్తున్నారు. ఆ నీడ గోడపక్కనేవున్న చెట్టు కొమ్మలు పట్టుకొని పిల్లిలాచప్పుడు చేయకుండా తోటలోకి దిగేడు. నెమ్మదిగా పాకుకుంటూ వచ్చేడు. కైజారుతో ఒక్కపోటు గొంతులో పొడిచేసరికి కిమ్మనకుండా సెంట్రీ నేలని చాపచుట్టలా దొర్లిపోయేడు.

తుపాకీ పేల్చినచప్పుడు తోటలో నాలుగువేపులా కాపలాపెట్టిన సెంట్రీలు హెచ్చరికగా నిలబడ్డారు. వాళ్లల్లో అయిదారుగురు ధ్వని వినవచ్చినవేపుగా ఒత్తుకువచ్చేరు. వారి అడుగుల చప్పుడు తోటలో ప్రతిధ్వనిస్తూంది. గదిలో లిక్కబల్లమీదకు వొరిగిపోయేడు. తలనుంచి రక్తంకారుతూంది. ఆయన చచ్చిపోయేడు. కిటికీతలుపులు బద్దలయేయి. కాని, హంతకుడు గదిలోని కాగితాలు అందుకొనేటందుకు వ్యవధి లేకపోయింది.

సన్యాసినుల మఠంగోడవేపునుంచి ఇంకా కాల్పులు కొంతసేపు సాగేయి. హంతకుడు గోడఎక్కి వీధిలోకివురికేడు. లుక్యానోవ్ల తోటమీదుగా పారిపోవడానికి ప్రయత్నిస్తూ వెంటబడ్డవారిమీద కాలుస్తున్నాడు. కాని ఇంతలో ఒక గుండు దెబ్బతగిలి పడిపోయేడు.

ఆరాత్రి రాత్రంతా సోదాలు జరుగుతూనేవున్నాయి. గృహకమిటీల రిజిస్టర్లలో పేర్లుకనబడనివారూ, అనుమానకరమైన పత్రాలున్నవారూ, ఆయుధాలున్నవారూ వందలకొద్ది మందిని అరెస్టుచేసేరు. వారందరినీ ఛెకాఆఫీసులో విచారణ చేస్తున్నారు.

ఒకటిరెండుచోట్ల కుట్రదారులు ఎదురొక్కన్నారు. ఝల్యాన్‌స్కాయావీధిలో సోదాకివెళ్ళినప్పుడు ఆంటన్‌లెబదేవ్‌ను ఒకడు ముఖాముఖి కాల్చివేసేడు.

సోలోమంకాబెటాలియన్‌లో ఆరాత్రి అయిదుగురు చచ్చిపోయారు. ఆరితేరిన కమ్యూనిస్టుయోధుడు జాన్‌లిక్టే మరణం 'ఛెకా'కు చాల నష్టకరం.

అయితేనేం విద్రోహుల తిరుగుబాటు మొగ్గలోనే తుంచివేయబడింది.

ఆరాత్రే పెపెటోవ్కాలో ఫాదర్‌వాసిలీ ఇద్దరు కూతుళ్ళతోసహా ఎరస్టుఅయ్యేడు.

పరిస్థితులు కొంచెం శాంతపడ్డాయనుకొంటే మరో ప్రమాదం ముంచుకొచ్చింది. రైల్వేలమీద నడక స్తంభించిపోయింది. అంటే నగరంలో తిండి దొరకదు. శీతాకాలం వస్తూంది. ఆచలిలో మంటవేసుకోవాలంటే ఇంత కర్రపుల్ల అయినా దొరకదు.

పొయ్యిలోకీ, పొయ్యిమీదికీ—ఇదే ఇప్పుడు అత్యవసరంగా కావాలి.

## ప్రకరణం 2

జికరయ్ నోట్లోంచి పైప్‌తీసి, నుసి దులిపేడు. నిప్పు ఆరిపోయింది.

గుబర్నియా కార్యవర్గం సమావేశం జరుగుతూంది. చైర్మనూ, సభ్యులూ కాలుస్తున్న చుట్టపొగ గదిఅంతా చుట్టుకుపోయింది. ఆ పొగలో గదిలోకూర్చున్న వాళ్ళ మొగాలుకూడా సరిగ్గా కనబడ్డంలేదు.

చైర్మన్ ప్రక్కనేకూర్చున్న తోకరేవ్ చిరాకుగా తన పిల్లిగడ్డం పీక్కుంటున్నాడు. అర్థంలేని సుదీర్ఘ పద జాలంతో వుపన్యాసం కొడుతున్న ఒక బట్టతలమనిషి వేపు కొరకొరా చూస్తున్నాడు.

అకిమ్‌కు ఆ చూపులుచూస్తుంటే చిన్నతంలోచూసిన పందెపుకోడిచూపు గుర్తువచ్చింది.

సమావేశం ప్రారంభమై గంటకిపైగా అయింది ఆ బట్టతలఆయన రైల్వేవంటచెరుకుసంఘం అధ్యక్షుడు.

ఆయన తన ఎదురుగావున్న కాగితాలబొత్తినోమారు తిరగేసి, మళ్ళీ వుపన్యాసం ప్రారంభించేడు.

"...ఈ పరిస్థితులలో గుబెర్ని యాకటిటీ నిర్ణయాల్నీ రైల్వే మానేజ్‌మెంటు నిర్ణయాల్నీ అమలుజరపడం ఏమాత్రం సాధ్యంకాదు. ఇంకో నెల్లాళ్ళకికూడా నాలుగు వందల ఘనమీటర్లకన్న ఎక్కువవంటచెరుకు సప్లయిచేయ లేము. కావలసింది లక్షాఎనభయివేలు ఘనమీటర్లు, అది కేవలం..." ఒక్కక్షణం సరియైనమాటకోసం తడుముకులాడు కొని..."...అసంభవం."—అన్నాడు. తనకేదో ఎవరో బాధకలిగించినట్లు పెదవులు రెండూ ఇంతపొడుగున ముడిచేడు.

చాలసేపు ఎవ్వరూ మాట్లాడలేదు.

జకరయ్ పైప్‌ను చిటికెనవేలితో గిలికి బూడిద పార పోసేడు. చివరకు తోకరేవ్ నిశ్శబ్దాన్ని భంగించేడు.

"అనవసరంగా కబుర్లు ఎందుకు? రైల్వేవంటచెరుకు సంఘంవద్ద వంటచెరకులేదు. ఇక వుండదు... అంతేనా?"

బట్టతలఆయన భుజాలు కుదుపుకున్నాడు.

"క్షమించు, కామ్రేడ్! మేమయితే వంటచెరుకు లాట్లుపెట్టేం. కాని, తెచ్చేందుకు మార్గం..."—కాని మాట పూర్తిచేయలేకపోయేడు. జేబురుమాలుతో బట్టతల తుడుచు కొన్నాడు. మళ్ళీ దానిని జేబులోపెట్టాలని తడుములాడి, చివరకు తనకాగితాలమీద పడేసేడు.

ఒకమూలగా కూర్చున్న డెనెరోవ్ ప్రశ్నించేడు.

ఆ కుట్రదారులతో చేరిన నిపుణుల్ని అరెస్టుచేసి చాలరోజులయిందిగదా, ఇన్నాళ్ళూ ఏంచేస్తున్నారు? వంట చెరుకు తీసుకురావడానికై మీరుచేసిన పనేమిటి?"

బట్టతలాయన ఆ వేపు తిరిగేడు... "తగినన్ని పెట్టెలు సరఫరా చెయ్యకపోతే వంట చెరుకు తీసుకురావడం సాధ్యమే కాదని ఇక్కడికి మూడుమార్లు రైల్వేమంత్రిత్వశాఖకు వ్రాసేను."

తోకరేవ్ ఆతనిని ఇంక మాట్లాడనివ్వలేదు.

"చెప్పేవు. విన్నాం. అవునుగాని, మమ్మల్ని చవటల క్రింద జమకడుతున్నావాయేం? ..."

బట్టతలఆయన హడలిపోయేడు.

"విప్లవవ్యతిరేకులు అల్లరిచేస్తూంటే ఆ బాధ్యత నాదా?"

"కాని, నీకు తెలుసునా, లేదా? రైల్వేలైన్‌కు దూరంగా ఎక్కడో కలపకొడుతున్నారని నువ్వు ఎరగవు?"

"విన్నాను. కాని నాకు సంబంధించని విషయంలో నేను పైవాళ్ళకి ఫిర్యాదు ఎల్లా చెయ్యను?"

ఈమారు ట్రేడ్‌యూనియన్ కౌన్సిల్ అధ్యక్షుడు ప్రశ్నించేడు.

"మీ మనుష్యులు ఎంతమంది పనిలోవున్నారు?"

"రమారమి రెండు వందలు."

"అంటే ఒక్కొక్క అన్నఖరాబీగాడు ఏడాదికో ఘనమీటరు చొప్పున తెస్తాడన్నమాట."— అని తోకరేవ్ బుస్సుమన్నాడు.

ట్రేడ్‌యూనియన్ ఛైర్మన్ వదలలేదు.

"రైల్వే కలపకమిటీకి స్పెషల్ రేషన్లు ఇస్తున్నాం. పనివాళ్ళకి తిండిపెడుతున్నాం. మీరు చేస్తున్నపనేమిటో

చూస్తున్నావా? మీకు రెండు వేగన్ల గోధుమపిండి పనివాళ్ళ కోసమని ఇచ్చేం. అదేమయింది?"

నాలుగు వేపులనుంచీ ప్రశ్నలు వర్షంలా కురుస్తున్నాయి. చుట్టుముసురుకుంటున్న రుణదాతలను తప్పించుకో ప్రయత్నిస్తున్న రుణగ్రస్తుడిలాగ బట్టతలాయన ఏవేవో సమాధానాలు చెప్తున్నాడు. సరాసరి సమాధానాలు చెప్పకుండా కాలిది మెడకీ, మెడది కాలికీ వేస్తున్నాడు. అక్కడుంటే చిక్కులున్నాయని గ్రహించేడు. బయటబడడం క్షేమ మనిపించింది. ఇంటిదగ్గర పడుచుపెళ్ళాం, తనకోసం కనిపెట్టుకూర్చుని వుంటుంది. జోయికబుర్లు చెప్పుకుంటూ శుభ్రంగా తిండితినక ఏమిటీపీడ అనుకొన్నాడు.

ఆయనఇస్తున్న సమాధానాలనువింటూ జకరయ్ తన నోటుబుక్‌లో వ్రాసుకుంటున్నాడు.—"ఈ మనిషిని నిగాలో వుంచాలి. ఇతనిది కేవలం చేతకానితనంకాదు. ఇతని సంగతులు రెండుమూడు ఇదివరకే నా చెవిని పడ్డాయి... ఇంక చర్చలుఆపి, మనిషినిపంపేస్తే పనిచూసుకోవచ్చు."

ఆ మాటలు అధ్యక్షుడుకూడా చదివేడు. సరే నన్నట్లు తలవూపేడు.

జకరయ్ లేచి, వరాండాలోకి వెళ్ళి ఎక్కడికో ఫోన్ చేసేడు. తిరిగివచ్చేసరికి అధ్యక్షుడు తీర్మానం చదువుతున్నాడు:

"...విధ్వంసక్రియలద్రుష్ట్యా రైల్వేవంట చెరుకుసంఘం నిర్వాహకుణ్ణి తొలగించడానికీ, కలపకోత వ్యవహారాలను పరిశీలనకై అధికారులకు వప్పచెప్పడానికీ నిర్ణయించబడింది."

ఏం పీకకి చుట్టుకుంటుందోయని బట్టతలవాడు భయపడ్డాడు. కాని, ఇంత తేలిగ్గా బయటపడినందుకు సంతోషమే కలిగింది. 'విధ్వంసక్రియలదృష్ట్యా' వుద్యోగంనుంచి తొలగించడం మొత్తంమీద తనపై నమ్మకం లేకుండా చేస్తుంది. కాని, అదో పెద్ద సమస్య కాదు. ఇంక బోయార్కా-లో జరుగుతున్న అల్లరా? అది తన వ్యవహారానికి సంబంధించినది కాదు. "ఏదో పేచీ తవ్వి తెచ్చేరనుకున్నా. చావుతప్పి కన్ను లొట్టపోయినట్లయింది.

ధైర్యం చిక్కింది. కాగితాలు సంచిలో పెట్టుకొంటూ ఆతడు నోరుపెట్టుకు దబాయించాలనుకొన్నాడు.

"నేనెంత స్పెషలిస్టునయినా పార్టీ వాణ్ణికాను. మీరు అనుమానిస్తే అనుమానించండి. నాదేం తప్పులేదనడానికి నా అంతరాత్మే సాక్షి. నాకు వప్పచెప్పిన పనిని చెయ్యలేకపోయానంటే సాధ్యంకాకపోవడంచేతనే..."

ఎవ్వరూ ఏమీ అనలేదు. బట్టతలఆతడు గది వదిలేడు. మెట్లు గబగబా దిగి, వీధిలోపడి, 'బతికేనురా బాబూ!' అనుకొన్నాడు.

"మీ పేరేమండి?"

తన పేరు అడుగుతున్న మనిషి సైనికులు వేసుకొనే ఓవర్‌కోటు తొడిగివుండడం చూసేసరికి ఆతని గుండెలు ఝల్లుమన్నాయి.

చె...ర్వి...న్స్కి...

చెర్విన్స్కి- గదివదలగానే కమిటీసభ్యులు పదముగ్గురూ టేబిల్ చుట్టూ దగ్గరగా కుర్చీలు లాక్కున్నారు.

జకరయ్ ఒక మ్యాపువిప్పి టేబిల్ పైన పరిచేడు.

ఇదిగో బోయార్కా స్టేషన్ ఇది. ఇక్కడికి ఆరు వెర్స్టు లలో కలప కొడుతున్నారు. అక్కడ రెండులక్షల పదివేల ఘనమీటర్ల వంట చెరుకు లాట్లు పెట్టివుంది. కొన్నివందల మంది ఎనిమిది నెలలపాటు కష్టపడి పనిచేసి అదంతా పేర్చేరు. కాని లాభంఏమిటి ? మహాద్రోహం జరిగింది. నగ రానికీ, రైల్వేలకూకూడ కట్టెలు లేవు. ఆ వంట చెరుకును ఆ ఆరు వెర్స్టులూ స్టేషనుకు చేర్చాలంటే అయిదు వేల బళ్ళు నెలరోజులు, రోజుకు కనీసం రెండు తడవులు తిరిగితే జరుగు తుంది. అక్కడికి వూళ్ళు కూడా దగ్గర్లో లేవు. దగ్గరవూరు 15 వెర్స్టులలో వుంది. పైగా ఆర్లికూ, వాడి బందిపోటుజట్లూ ఆచుట్టుప్రక్కలే వున్నారు. అంటే ఏమిటన్నమాట? అసలు పథకంప్రకారం చెట్లుకొట్టుడు ఇక్కడ ప్రారంభించి స్టేషన్ వేపు నరుక్కుంటూరావాలి. కాని, ఆదొంగ వెధవలు అల్లా అడవుల మధ్య వేపు నరుక్కుంటూపోయేరు. వంట చెరుకు స్టేషన్‌కు చేర్చకుండా చెయ్యడానికే వాళ్ళీపనిచేసేరు. వాళ్ళు సరిగ్గానే అంచనా వేసేరు. తీరా చేసి నూరుబళ్ళు కూడా మనకి దొరకడంలేదు. మనల్ని దొంగ దెబ్బ కొట్టేరు. వాళ్ళు ప్రారంభించదలచిన తిరుగుబాటుకన్న ఇది తక్కువ ప్రమాదకరమేంగాదు. ...''

జకరయ్ పిడికిలి బిగించి మ్యాపుమీద ఒక్కగుద్దు గుద్దేడు. ఆతడు చెప్పకపోయినా పరిస్థితులు ఎంత ప్రమాద కరంగావున్నాయో అందరికీ అర్థంఅయింది. శీతాకాలం వస్తూంది మంచు పడుతుంది. హాస్పిటళ్ళు, స్కూళ్ళు, ఆఫీ

సులు, లక్షలమంది ప్రజానీకమూ ఆమంచులో బిగిసిపోవల సిందే. స్టేషన్లు జనంతో నిండివుంటున్నాయి. వారిని కదిలించ డానికి బళ్ళులేవు వారాని కొకటితప్ప.

ఎవరికివారే నిశ్శబ్దంగా కూర్చుని ఆలోచనలోపడ్డారు.

మరల జకరయ్యే ప్రారంభించేడు.

"కామ్రేడ్స్! ఇప్పుడున్నదారి ఒక్కటే. ఈ మూడు నెలలలోపున స్టేషనునుంచి కలపలాట్లవరకూ ఏడు వెర్స్టల దూరమూ సన్న రైలుదారి వెయ్యాలి. అందులో మొదటి భాగం ఆరువారాలలో పూర్తిచెయ్యాలి. గడిచిన వారం రోజులనుంచీ ఇదే ఆలోచిస్తున్నాను. మనకి మూడువందల ఏభయిమంది పనివాళ్ళూ, ఇద్దరు ఇంజనీర్లూ కావలసివుం టారు. పుష్చా‌-వోదిత్సాలో కావలసినన్ని రైలుపట్టా లున్నాయి. ఏడు ఇంజన్లున్నాయి. వేర్‌హౌసులలోంచి కామ్‌సోమాల్స్ వాటన్నిటినీ బయటకి తీసేరు. యుద్ధానికి పూర్వం పుష్చా-వోదిత్సానుంచి పట్టణంలోకి రైలుబాట కలపాలనే ప్రయత్నంవుండేది. ఉన్నచిక్కల్లా ఒక్కటే. బోయూర్కాలో పనివాళ్ళు బసచేసేటందుకు చోటులేదు. ఉన్నగుడిసెలు కూలిపోయేయి. పదిహేనేసిరోజులకో జట్టు చొప్పున అక్కడికి పనివాళ్ళని పంపాలి. అంతకుమించి ఏక బిగిని ఎవడూ నిలబడలేడు. అకిమ్! కామ్‌సోమాల్స్‌ని పంపు దామా?"

తనప్రశ్నకి సమాధానంకోసంకూడా ఎదురుచూడ కుండానే అతడు తన వుపన్యాసం కొనసాగించేడు.

"కామ్‌సోమాల్ ఎంతమందివుంటే అంతమందినీ వెంటనే అక్కడికిపంపాలి. సోలో మెంకా కామ్‌సోమాల్ వుంది. పట్టణంలో కొందరున్నారు. పని చాలా చాలాకష్టం. సందేహంలేదు. కాని, ప్రమాదం ఎంత భయంకరంగా ఎదుర్కొంటూందో తెలియచెప్తే వాళ్లు తప్పకవస్తారు. చేస్తారు. నాకా నమ్మకం వుంది."

నమ్మకంలేనట్లు తలతిప్పేడు, రైల్వేఅధికారి.

"ఏమీ లాభంలేదనుకొంటాను. ఓమూల వర్షాలు ఏ క్షణంలోనైనా ప్రారంభం అయ్యేరోజులు. వెంటనే మంచు పడుతుంది. ఈ పరిస్థితుల్లో ఏడు వెర్‌స్టుల పొడుగున-సన్నదే అయితేనేం—రైలుదారి వెయ్యడం. ..."

జకరయ్ మధ్యలోనే గయ్‌మన్నాడు.

"ఆంద్రీవాసిలీవిచ్! వంటచెరుకును:గురించి ఏంచెయ్యాలాయని నువ్విదివరకే ఆలోచించివుండాలిసింది. కాని నీకా తీరికలేకపోయింది. ఇప్పుడు తప్పదు. ఆరైలుదారి వేసితీరాలిసిందే. చేతులుముడుచుకుకూర్చుని చలిలోబిగిసి చావదలచుకోలేదు. ఏమంటావు?"

*     *     *

కావలసిన పనిముట్లతో పెట్టెలన్నీ రైలుకెక్కించేరు. జనం ఎక్కుతున్నారు. సన్నని తుంపరపడుతూంది. రీటా తొడిగిన తోలుచొక్కామీద స్వచ్ఛమైన వర్షపు బిందువులు జారిపోతున్నాయి.

ఆమె తోకరేవ్‌తో కరచాలనంచేసి సన్నని గొంతుతో వీడ్కోలు ఇచ్చింది.

“పని పూర్తిచేసుకరా.”

ఆ ముసలివాడామె నెంతో అపేక్షగాచూసేడు.

“ఆముండాకొడుకులు, అక్కర్లేనిబెడద తెచ్చిపెట్టేరు. మీరంతా ఇక్కడి పని చూసుకోండి. అక్కడ పనేదన్నా మొండిపడిందంటే, ఏంచెయ్యాలో ఎక్కడ దబాయించాలో కాస్త చూస్తుండండి. ఇక్కడి జనం సరాసరి పనిచెయ్యరు. ఆఫీసుఫైళ్ళు పైకి క్రిందకీ తిరుగుతూంటేతప్ప ఓపనీజరగదు. ఇంక బండిలోకి పోతా. వెళ్ళమ్మా!”

ముసలాడు కోటు బొత్తాలు బిగించుకొన్నాడు. ఆఖరు నిముషంలో ఆమె యాధాలాపంగా అడిగినట్లు కోర్చాగిన్ వస్తున్నాడా అంది.

“ఎక్కడా కనిపించినట్లులేదు. ఆతడు రావడంలేదా?”

“లేదు. నిన్ననే ఆతడూ, సూపరింటెండెంటూకలిసి అక్కడి ఏర్పాట్లుచూడ్డానికి ట్రాలీలో వెళ్ళేరు.”

భుజంమీద ఓకోటు వ్రేలాడేసుకొని, చేతిలో సిగరెట్టుతో అన్నాబోర్‌హార్ట్ జార్కీ, దుబావాలతో కలసి అటువచ్చింది.

వాళ్ళువచ్చేలోపున రీటా మరోప్రశ్న వేసింది.

“కోర్చాగిన్ పాఠాలకి వస్తున్నాడా?”

ముసలివాడు ఆశ్చర్యంతో చూసేడు.

“పాఠాలేమిటి? వాడు నీ దగ్గరకాదా చదువుతూంట? నిన్నుగురించి ఎన్నోచెప్పేడు. నువ్వంటే మహాగురి.”

నిజమేనా అన్నట్లు చూసింది, రీటా—"నిజమేనా ? నేను పాఠం చెప్పేక, తెలియలేదంటూ ఆతడు నీ దగ్గిరి కెన్నడూ రాలేదూ ?

ముసలివాడు పకపక నవ్వేడు :

"నాదగ్గిరికా ? ఒక్కమాటుకూడా రాలేదు."

ఇంజన్ గీపెట్టింది. పక్కపెట్టెలోవున్న క్లావిసెక్ కేకేసేడు.

"కామ్రేడ్ ఉస్తినోవిచ్! మాతాతని వదులు. ఆతడు రాకుంటే మాపని ఏంకాను ?"

తోకరేవ్ ఏదో అనడానికి నోరు తెరిచేడు. కాని, ఆలస్యంగా వస్తున్న ఆ ముగ్గురూ ఆతనికంట బడ్డారు. మాట తిప్పుకొన్నాడు. దుబావాకు వీడ్కోలిస్తున్న అన్నాకళ్ళల్లో కనబడ్డ విచారరేఖలు గమనించి తలతిప్పుకొన్నాడు.

* * *

వర్షం ముఖానకొడుతూంది. నీటితోనిండిన నీలిరంగు మబ్బులు భూమిమీద పాకుతున్నాయన్నంత దిగువన కదులుతున్నాయి. ఆకు రాలిపోయి చెట్లన్నీ మోళ్ళలావున్నాయి.

అడవిమధ్యన దిక్కులేనిదానిలాగ స్టేషనువుంది. గుడ్సుప్లాట్ఫారమ్నుంచి అడవిలోకి కొత్తగా తవ్వీపోసిన మట్టిగట్టు నల్లగా కనిపిస్తూంది. ఆగట్టుకు ఇరువేపులా జనం చీమలలాగ చేరి పనిచేస్తున్నారు.

కాళ్ళక్రింద జర్రుపాములు లేస్తున్నాయి. కొందరు గడ్డపలుగులతో తవ్వుతూంటే, కొందరు పారలతోకొట్టి

మన్ను ఎత్తుతున్నారు. దెబ్బదెబ్బకీ ఏ రాయోతగిలి ఖంగ్ మని ధ్వని వినిపిస్తూంది.

ధారకట్టి పోస్తున్నట్లు వర్షం కురుస్తూనేవుంది. చల్లని నీరు పనిచేస్తున్న వాళ్ళ మస్తుల లోపలికంటా ప్రవేశిస్తూంది. జల్లులకి గట్టుగా పేరుస్తున్న మన్ను కరిగి అండలు దిగజారుతున్నాయి.

బట్టలు, వొళ్ళు తడిసిముద్దయినా, బాగా చీకటిపడే వరకూ వాళ్ళు పనిమానడంలేదు. రోజూ చీకటిపడేసరికల్లా, పోతగట్టు అడవిలోపలికంటా పాకుకుంటూపోతూంది.

స్టేషనుకు అంతదూరాన శిథిలమైపోయిన ఇల్లుఒకటి కనబడుతూంది. లాక్కుపోడానికి వీలయినవన్నిటినీ ఇదివరకే లాక్కుపోయేరు. కిటికీలూ, దర్వాజాలబదులు గోడల్లో పెద్ద పెద్ద కంతలున్నాయి. గాడిపొయిమీది ఇనపతలుపు లాక్కుపోయేరు. పైన వేసిన పెంకు జారిపోయి వాసాలూ, గుజ్జులూ అస్థికంకాళాల్లా కనబడుతున్నాయి.

నాలుగు పెద్దగదుల్లోనూ నేలకు చేసిన కాంక్రీటు మాత్రం చెక్కుచెదరలేదు. రాత్రిపూట ఆ నాలుగువందల మందీ ఆ చెమ్మనేలనే తడిగుడ్డలతోనే పడుకొని నిద్రపోతున్నారు. గదిలోకి వచ్చేముందు గుమ్మంలో వారు బట్టలు పిండుకొన్నప్పుడు నల్లని బురదనీరు మెట్లమీద జాలుకడుతూంది. వర్షాన్నీ బురదనీ నానాబూతులూతిడుతూ తడినేలని గడ్డిపరుచుకొని పడుకుంటారు. వెచ్చదనానికై ఒకరిడొక్కల్లో ఒకరుదూరుతారు. తడిబట్టలనుంచి ఆవిరులు పైకిలేస్తాయి. కాని ఆవి ఆరడంఅంటూవుండదు. కిటికీలకీ, గుమ్మాలకీ జల్లు

కొట్టకుండా గోనెతెరలు మేకులతో దిగకొట్టేరు. జల్లుకొట్టక పోయినా తెరలమీదపడిననీరు గదుల్లో జాలువారుతూంది. జారిపోగా మిగిలిన పెంకులమీదా, రేకులమీదా వర్షపుజల్లులు మృదంగం వాయిస్తున్నాయి. ఈదురుగాలి ఈలలువేస్తూంది.

కూలిపోయిన వసారాములని వంటశాలపెట్టేరు. తెల్లవారేసరికి ఇంత మరుగుతున్న టీ ఇస్తారు. అది తాగి పనిలోకి వెడతారు. ఉడకపెట్టినదుంపలూ, ఉక్కుముక్కలా బిగిసి పోయిన నల్లనిరొట్టె రోజురోజూతినలేక నోరుచచ్చిపోతూంది.

పట్టణాధికారులు అంతకన్న మరొకటి సప్లయిచెయ్య లేదు.

సూపరింటెండెంటు వలేరియన్ నికోడిమోవిచ్ పాటో ష్కినూ, టెక్నిషియన్ వకులెంకోలు ఇద్దరూ స్టేషన్‌మాస్టర్ ఇంటివద్ద మకాంపెట్టేరు.

స్టేషన్‌లోని ఛెకాఆఫీసరు ఖోల్యావాగదిలో తోకరేవ్ మకాంపెట్టేడు.

ఎంతో ఓర్పుతో జనం కష్టాల్నిసహించేరు. రోజు రోజూ రైలుకట్ట అడవిలోపలికంటా చొచ్చుకుపోతూంది.

వాళ్ళల్లోంచి కొందరు పారిపోతూనూవున్నారు. ఓ మారు తొమ్మిదిమంది, మరో రోజున అయిదుగురూను.

పని ప్రారంభం అయిన ఓ వారంరోజులకి మొట్ట మొదటిసారు మహాకష్టం వచ్చిపడింది. రాత్రిబండిలో రావలసిన రొట్టెలు రాలేదు.

దుబావా తోకరేవ్‌నులేసి ఆవార్త అందించేడు. ఆతడు బుర్రబరుక్కుంటూ ఆలోచనలోపడ్డాడు.

"అసలుకథ ఇప్పుడుంది."—అంటూ అతడు వడివడిగా దుస్తులు వేసుకొన్నాడు.

ఖోల్యావా అప్పుడే గదిలోకివచ్చేడు. అతనిని చూడగనే తోకరేవ్ చేయవలసిన పనిచెప్పేడు.

"స్పెషల్ డిపార్టుమెంటుకు ఫోనుచెయ్యి."—అంతలోనే ఆయన "రొట్టెరాలేదన్నవార్త ఎవ్వరికీ తెలియనీయవద్దు" అని దుబావాను హెచ్చరించేడు.

రైల్వే టెలిఫోన్ ఆపరేటర్లతో ఓ గంటసేపు దెబ్బలాడి, ఖోల్యావా జకరయ్ ఆఫీసును పిలవగలిగేడు. స్పెషల్ డిపార్టుమెంటు సహాయాధికారి జకరయ్ ఫోన్ దగ్గరకు వచ్చేవరకూ తోకరేవ్ కంగారుపడుతూనే వున్నాడు.

వార్త వినగానే జకరయ్ మండిపడ్డాడు.

"ఏమిటి? రొట్టెరాలేదు? ఆపనిచేసిందెవరో కనుక్కుంటూవుండు."

తోకరేవ్ మహాకోపంగా వున్నాడు.

"అదిసరే. రేపు జనానికి ఏం తినపెట్టను?"

జకరయ్ ఏంచెయ్యాలా యని ఒక్కగడియ ఆలోచించేడు.

"ఈవేళరాత్రే లిట్కే ద్వారా కారులో రొట్టె పంపుతాను. అతడు దారి ఎరుగునులే. తెల్లవారేసరికి తెచ్చి ఇస్తాడు."

తెల్లవారేసరికి రొట్టెలబస్తాలు వేసుకొని కారు స్టేషన్ ముందు హాజరయింది. రాత్రి తెల్లవార్లూ నిద్రలేకపోవడంతో కళ్ళుమూసుకుపోతూంటే లిట్కే అతిఅలసటగా కారుదిగేడు.

రైలుబాట నిర్మాణానికి అనేక ఆటంకాల నెదుర్కో వలసివస్తూంది. పట్టాలక్రింద వెయ్యడానికి స్లీపర్లులేవని రైల్వే శాఖవారు ప్రకటించేరు. పట్టాలనూ పెట్టెల్నీ బాటవేస్తున్న చోటికి తీసుకెళ్ళడానికి తమవద్ద బళ్ళూ, లారీలూ ఏవీలేవని పట్టణాధికారులు తెలియపరిచేరు. తీరాచూస్తే ఇంజన్లకే చాలా మరమ్మతులు కావలసివున్నట్లు కనబడింది. మొదటి జట్టు పదిహేనురోజులూ పనిచేసివెళ్ళిపోతే వాళ్ళస్థానంలో రెండోజట్టు రావాలంటే మనుష్యులు లేరు. ఉన్నవాళ్ళు బాగా నలిగిపోయేరు. వాళ్ళని ఉంచడంలో అర్థంలేదు.

పార్టీసభ్యులలోని నాయకులు ఆరాత్రి స్టేషన్ షెడ్డులో కూర్చుని తెల్లవార్లూ పరిస్థితుల్నిగురించి ఆలోచించేరు.

మరునా డుదయమే తోకరేవ్, దుబావా, క్లావిసెక్ లు పట్టణంవెళ్ళేరు. ఇంజన్లను మరమ్మతుచేసి, పట్టాలు త్వరగా తెచ్చేటందుకని తమతో ఓ అరడజనుమందిని వెంటబెట్టుకు వెళ్ళేరు. క్లావిసెక్ రొట్టెలపనివాడు. కనక ఆతనిని పనివాళ్ళకి రొట్టెల సప్లయిబాధ్యత ఇచ్చిపంపేరు. మిగతావాళ్ళంతా పుష్చా-వోదిత్సా వెళ్ళేరు.

ఇక్కడ నిర్మాణప్రదేశంలో వర్షం విధీవిరామం లేకుండా ఒక్కలా కురుస్తూనేవుంది.

*　　*　　*

పావెల్ కోర్చాగిన్ బురదలో కూరుకుపోయిన పాదాన్ని అతికష్టంమీద లాక్కున్నాడు. కాలికి చల్లగా తగిలింది. బూట్ మడమజారిపోయిందనుకొన్నాడు. అదివరకే జోళ్లుఅరిగి

బొత్తలుపడి పనిలో చాలబాధ కలుగుతూంది. అవి ఆరడం అంటూలేదు. అడుగేసేసరికి లతలతలాడుతున్నాయి. ఇప్పుడు మడమే వూడిపోయింది. చల్లగా మంచులావున్న బురద తగిలి కాలు జివ్వుమనిపోతూంది. ఎంతో విసుగుగా తిట్టుకొన్నాడు. ఒక కాలికి చెప్పులేకుండా పనిచెయ్యడం సాధ్యమే కాదు. చేసేదిలేక తిరిగివచ్చేడు. వంటశాలలో గాడిపొయ్యి ప్రక్కనేకూర్చుండి కాలినున్న బురదగుడ్డ విప్పేసి, మొద్దుబారిపోయిన కాలు నిప్పులవేపు జాపేడు.

లైన్‌మన్ భార్య ఓదార్కా వంటవానికి సహాయంగా వుంటూంది. పావెల్ వెళ్ళేసరికి బీట్‌దుంపలు తరుగుతూంది. ఓదార్కా ప్రౌఢవయస్క. స్థూలశరీరం. మంచిబలిష్ఠురాలు. ఆవిడచేతిలోని కత్తి మహావేగంతో ఆడుతూంటే, రెండో వేపున తరిగిన ముక్కలు చిన్నగుట్ట పడిపోతున్నాయి.

పావెల్ రాకను ఓరగంట గమనించి ఆమె కట్టెవిరిచినట్లు అనేసింది.

“తిండికోసం వచ్చేవేమో. ఇంకా వేళకాలేదు. అలా పని ఎగకొట్టి వచ్చినందుకు సిగ్గులేదూ? పొయ్యిమీదినుంచి ఆ కాళ్ళుతియ్యి. ఇది వంటశాల అనుకున్నావా, నీళ్ళగది అనుకున్నావా?”

వంటవాడు గదిలోకి వచ్చేడు.

వేళకానివేళ తాను వంటగది కెందుకు వచ్చేడో సమాధానం చెప్పుకొన్నాడు.

“దీనిదుంపతెగ! ఈబూటు చిరిగిపోయింది.”

వంటఆతడు చిరిగిపోయిన బూట్ పరీక్షించి ఓదార్కా వేపుచూసేడు.

"ఆమె మగడు జోళ్ళుకుట్టగలడు. వెళ్ళి బాగుచేయించుకో. లేకపోతే లాభంలేదు. జోడులేందే ఒక్కఘడియ జరగదు"

ఆ సలహా విని ఓదార్కా ఈమారు పావెల్‌ను పరిశీలనగా చూసింది. మనిషిని తప్పుఅర్థం చేసుకొన్నానని గ్రహించింది.

నిర్మొగమాటంగా తనతప్పు వొప్పుకుంది.

"వట్టి త్రిపాదిగాడి వనుకొన్నా"

తనకు కోపంరాలేదన్నట్లు పావెల్ చిరునవ్వు నవ్వేడు. ఓదార్కా అతనిబూట్ చేతతీసుకొని పరీక్షగా చూసింది.

"దీనికి మాసిక వేసి లాభంలేదు. అయితేనేం, వుండు చెప్తా. మా ఇంట్లో పాతజోడు ఒకటి పడుంది. అదిస్తా. ఈబూట్ మీద తొడుక్కో. కాలునెప్పిపుట్టదు. వట్టికాలితో తిరగబోకు. నిష్కారణం చచ్చిపోతావు. మంచుకురిసే రోజులు వచ్చేయి.

ఓదార్కా తన చిరాకునంతనూ మరచిపోయింది. కత్తిక్రిందపెట్టి, హడావిడిగా ఇంటికెళ్ళి పాతఘడావుజోడూ, పొడుగుపాటి గుడ్డపీలికా తీసుకొచ్చింది.

ఆమె తెచ్చినగుడ్డ కాలికి చుట్టుకొని ఘడావుతొడిగేసరికి ప్రాణం హాయిఅనిపించింది. పావెల్ కృతజ్ఞత దీపించే చూపులతో ఓదార్కాను అభినందించేడు.

* * *

తోకరేవ్ నగరంనుంచి ధుమధుమలాడుతూవచ్చేడు. కమ్యూనిస్టుపార్టీ సభ్యులు ముఖ్యమైన వారిని ఖోల్యావాగదికి పిలిచేడు. దుర్వార్త వారి చెవిని వేసేడు.

"పొడుగునా ఆటంకాలే. ఎక్కడికెళ్ళినా పనిసాగి పోతున్నట్లే కనబడుతుంది. తీరాచూస్తే ఏమీ జరగదు. ప్రతి చోటా విద్రోహులు పుట్టలు, పుట్టలుగా వున్నారు. మన బ్రతుకంతా వాళ్ళతో పేచీలోనే గడిచిపోయేలావుంది. ఇదిగో, పరిస్థితులేం బాగాలేవు. మనకు బదిలీ మనుష్యులింతవరకు లేరు. అసలెందరున్నారో తెలియదు. పింజమంచు పడడం ఏ రోజయినా ప్రారంభం కావచ్చును. అనాటికి ఏవిధంగా అయినాసరే చిత్తడినేలలుదాటి ముందుకుపోవాలి. లేకపోతే నేలబిగిసిపోయిందా ఇంకేపనీ నడవదు. నానా కంగాళీచేస్తున్న వ్యక్తుల్ని అక్కడ పట్నంలో నులుపుతూండగానే, మనం ఇక్కడ రెట్టింపువేగంతో పని నడపాలిసి వుంది. ఈ రైలుమార్గం వేసితీరాలి. వేస్తాము. చచ్చినా మానం. వేయలేకపోతే మనం బోల్షివిక్కులమే కాము."

అతని కంఠం ఖంగుఖంగుమంది. చూపులు నిశిత మైనాయి.

"ఈవేళనే మనం సమావేశాలు జరపాలి. పార్టీసభ్యులందరికీ కబురందించండి. మనం అందరం రేపటినుంచి పనిలో దిగుదాం. పార్టీసభ్యులు కానివాళ్ళని వెళ్ళిపొమ్మందాం. మిగతా అందరం వుందాం. ఇదిగో గుబర్నియా కమిటీ తీర్మానం."

తోకరేవ్ చేతిలోని కాగితాన్ని పాంక్రాటోవ్ తీసుకొని మడతవిప్పేడు. ఆతని వెనకనే నిలబడ్డ పావెల్‌కోర్చాగిన్ పైకిచదివేసేడు :

"అత్యవసర పరిస్థితులదృష్ట్యా కామ్‌సోమాల్ సభ్యులంతా పనికొనసాగించవలసిందే వంటచెరుకు బళ్ళకెక్కించి పంపేవరకూ వారక్కడే వుండాలి.

(సం.) రీటా ఉస్తినోవిచ్.
(గుబర్నియాకమిటీ కార్యదర్శిస్థానే.)

వంటవసారా జనంతో కిక్కిరిసిపోయింది. ఆకాస్త ప్రదేశంలో నూటఇరవై మంది నిలుచున్నారు. గోడల్ని వొత్తుకొని, బల్లలెక్కి, కిటికీ బోరియల్లో ఎక్కడ కాస్త చోటు దొరికితే అక్కడల్లా నిలబడ్డారు.

పాంక్రాటోవ్ సమావేశాన్ని ప్రారంభించేడు. తోకరేవ్ కొద్దిసేపు మాట్లాడేడు. ఆతడు చేసిన ప్రకటన సభలో దిగ్భ్రమ కలిగించింది.

"కమ్యూనిస్టులూ, కామ్‌సోమాలూ పనివదలివెళ్లరు."

దానికి తిరుగులేదన్నట్లాతడు చేయివూపేడు. ఆచేయి వూపులో ఇంటికి తిరిగిపోవడంకోసం పెట్టుకొన్న ఆశలన్నీ తుడుచుకపోయేయి.

కొద్దిక్షణాలసేపు పెద్ద రణగుణధ్వని. అసలే మసకగా వున్న గుడ్డిదీపపు వెలుతురు జనం కదలికతో అసలే కనబడకుండా పోయింది. కనుచీకట్లో గలభా మరింతఎక్కువయింది. ప్రతివారికీ 'ఇంటి'మీద చూపువారింది. ఇంక ఒక్కక్షణం

ఈకష్టాలు తట్టుకోలేము అనేసేరు. కొద్దిమంది ఆలోచనలో పడ్డారు. కాని పనివొదిలిపోతానని బయటపడ్డవాడు ఒక్కడే.

ఒకమూలనుంచి ఎవ్వరో బండబూతుల ఆసరాతో తాను ఇంటికి పోతాననే భావాన్ని ప్రకటించేడు.

"ఉరిపెట్టుకు చావమనండి. నేనిక్కడింక ఒక్కరోజు కూడా వుండేదిలేదు తప్పుచేసినవాడిచేత కఠినమైనపని చేయిస్తారు. దానికిఅర్థం వుంది. కాని, మేంచేసిన నేరం ఏమిటి? ఇంతవరకు వుండడమే మా తెలివితక్కువ. ఇప్పటికే వచ్చి రెండువారా లయింది. చాలు. కూర్చుని తీర్మానాలుచేసే వారెవరో వారినేవచ్చి పనిచెయ్యమనండి. ఈ బురదలో మగ్గి పోవాలనుకొనేవా రెవరన్నావుంటే వుండండి. నాకు మాత్రం సాధ్యంకాదు. రేపు వెళ్ళిపోయేదే."

ఓకునేవ్ వెనకనే ఆ మాటలు వినబడ్డాయి ఎవరో చూద్దామని ఆతడు అగ్గిపుల్లగీసేడు. క్షణకాలం ఆ వెలుతురులో కోపోద్దీప్తమైన ముఖమూ, ఆవేశంతో తెరిచిననోరూ కనబడ్డాయి. గుర్తు తెలిసింది. గుబర్నియా ఆహారశాఖలో గుమాస్తాకొడుకు.

"ఏం? ఎవరని చూసుకుంటున్నావా? నాకేం భయంలేదు. దొంగతనం ఏమీచెయ్యలేదు."

అగ్గిపుల్ల ఆరిపోయింది. పాంక్రాటొవ్ లేచేడు:

"ఏమిటామాట? పార్టీబాధ్యతను కఠినవరకం అనే పెద్దమనిషి ఎవరయ్యా?"

ఆతడా గుడ్డివెలుతురులోనే ప్రథమశ్రేణిలో నిలబడ్డ వారి ముఖాలను పరీక్షించడానికి విఫలప్రయత్నం చేసేడు.

"లేదు. కామ్రేడ్స్! మళ్ళీ పట్నంపోయేటందుకు అవకాశంలేదు. మనపని ఇక్కడేవుంది. మనంవెళ్ళిపోయేమాం జనంఅంతా చలికి బిగుసుకుచచ్చిపోతారు. ఈపని నెంత త్వరగాపూర్తిచేస్తే అంతత్వరగా ఇళ్ళకిపోతాం. వెనకనుంచి మాట్లాడిన ఆయనమాదిరిగా పారిపోవడం మన ఆశయాలకు విరుద్ధం. క్రమశిక్షణకు భంగకరమూను..."

పాంక్రాటోవ్ అసలు దీర్ఘోపన్యాసాలుచేయగలవాడు కాదు. కాని, ఆతని ఈచిన్న వుపన్యాసాన్నికూడా వెనుక నుంచి వినవస్తున్న గొంతుకే అడ్డుకొట్టింది.

"పార్టీసభ్యులుకానివారు పోవచ్చుకాదా?"

"నిరభ్యంతరంగా."

పొట్టికోటు తొడుక్కున్న ఒక కుర్రడు జనాన్ని వొత్తిగించుకుంటూ ముందుకు వచ్చేడు. కామ్‌సోమాల్ కార్డు ఒకటి గదిమూలనుంచి ఎగిరివచ్చి, పాంక్రాటోవ్ గుండెలకు తగిలి బల్లమీద పడింది.

"ఇదిగో నీకార్డు. నువ్విచ్చే ఓ అట్టముక్కకోసం నా ఆరోగ్యం చెడగొట్టుకోవడంలేదు."

చివరిమాటలను మింగేస్తూ నాలుగు దిక్కులనుంచీ కుపిత కంఠాలు లేచేయి.

"ఏమనుకొంటున్నావు, ఆలా గిరాటు వేస్తున్నావు?"

"ద్రోహపువెధవ."

"కామ్‌సోమాల్ అంటే గార్లో,బూర్లో అనుకున్నాడు."

"పొమ్మనండి."

"ఏడీ ఎక్కడున్నాడు, ఈ పేనుగాడు?"

ఆతడు తలవంచుకొని గదిలోంచి వెళ్ళిపోయేడు. కుష్ఠువానినిచూచి అసహ్యించుకొన్నట్లు ఆతని కంతా దారి ఇచ్చి పక్కకు తప్పుకొన్నారు. ఆతడు వెళ్ళిపోయేక తలుపు జేర వేసేరు.

ఆతడు పార వేసిపోయిన పార్టీ కార్డును పాంక్రాటోవ్ తీసి దీపంబుడ్డికి ముట్టించేడు.

అట్టకు నిప్పుముట్టుకొని, మెలికలు చుట్టుకుపోతూ కాలిపోయింది.

* * *

అడవిలో తుపాకీచప్పుడు ప్రతిధ్వనించింది. ఒకరౌతు శిధిలగృహం పక్కనుంచి అడవిలోకి గుర్రాన్ని పరుగెత్తించేడు. ఒకక్షణం తర్వాత శిధిలగృహం లోపలినుంచి జనం పరుగెత్తుకొంటూ వచ్చేరు. ఎవరో తలుపుగొళ్ళెంలో దోపివున్న కర్రముక్కచూసేరు. దానికో కాగితం చుట్టివుంది. అగ్గిపుల్ల గీసేరు. గాలికి ఆరిపోకుండా చేయిఅడ్డంపెట్టి ఆవెలుతురులో కాగితంముక్కను చదివేరు.

"లేచిపోండి. ఇంటికి తిరిగిపోండి. లేదా, అందరినీ కాల్చిపారేస్తాం. రేపురాత్రిలోపు లేచిపోవాలి.-అటామన్ చెస్నోక్."

చెస్నోక్ ఆర్లిక్ బండెపోటు·ముఠావాడు.

* * *

రీటా బల్లమీద ఆమె డైరీ తెరిచిపెట్టుకూర్చుంది.

డిసెంబరు, 2

ఈవేళనే మొట్టమొదటి పర్యాయం మంచుపడింది. పింజమంచు చాల తీవ్రంగా పడింది మెట్లమీద వ్యాచెస్లావ్ ఓల్షిన్స్కీ ఎదురయ్యేడు. ఇద్దరం వీథిషికారు బయలుదేరేం.

"మంచుపడ్డరోజున నాకెంతో హాయిగావుంటుంది. ఇల్లాగ పింజమంచు పడుతూంటే మరీ సరదాగా వుంటుంది. కదూ."

"నా ఆలోచనలన్నీ బోయూర్గామీదనే వున్నాయి. అందుచేతనే మంచూ, పింజమంచూ నాకు సరదాగా తోచడంలేదు. పైగా ఎంతో బాధఅనిపిస్తూంది. ఆమాటే చెప్పేను. కారణంతోసహా...

"అది కేవలమూ ఆత్మప్రత్యయనేయ భావధోరణి అన్నాడు. ఆలాగేఅయితే యుద్ధకాలంలో ఆనందం, సరదా అన్నీ మన్నాచేయువలసిందే. కాని, జీవితం అలా సాగదు. దుఃఖం, బాధ మొదలయినవన్నీ యుద్ధం జరుగుతున్న అగ్రశ్రేణికి మాత్రమే పరిమితం. అక్కడ మృత్యువు తాండవిస్తూంటుంది. అయినా అక్కడకూడా జనం నవ్వుతూనే వుంటారు. యుద్ధరంగానికి వెలుపలఅన్నీ మామూలుగా జరిగిపోతూనే వుంటాయి : జనం నవ్వుతారు. ఏడుస్తారు. ఆనందిస్తారు. బాధలు పడతారు. ప్రేమకలాపాలు సాగిస్తారు. వినోదిస్తారు. హుషారు పడతారు."

"ఓల్షిన్స్కీ మాటలలో ఎగతాళీ, అపహాస్యమూ ఎక్కడాలేదు. ఆయన విదేశాంగశాఖలో వుద్యోగి. 1917 నుంచీ పార్టీలో వున్నవాడు శుభ్రమైన బట్టలువేస్తాడు.

నున్నగా గడ్డం గీసుకొంటాడు. అత్తరు పులుముకొంటాడు. మాయింట్లోనే, సెగాల్‌వాటాలో వుంటున్నాడు. ఒకొక్కప్పు డెప్పుడేనా చూడ్డానికి నాగదికి వస్తుంటాడు. సరదాగా మాట్లాడతాడు. యూరపునంతనూ ఎరుగును. ఎన్నో ఏళ్ళపాటు పారిస్‌లో వున్నాడు. కాని, ఆయనతో స్నేహం నాకు సాధ్యంకాదు. కారణం ఏమంటే ఆతనిదృష్టిలో నేను వట్టి ఆడదానిని. అంతే. నాపార్టీ సభ్యత్వం అంత ప్రధానం కాదు ఆయనకు. ఆవిషయంలో తన అభిప్రాయాల నెన్నడూ దాచుకోలేదు. నిజమే. నిర్భయంగా తన అభిప్రాయాలు చెప్పేస్తాడు. ఆలాగని నాతో వ్యవహరించేటప్పుడు పెద్ద మనిషితరహా తప్పడు. మంచి లబ్జులు కనబరుస్తాడు. కాని నా కాతడంటే ఇష్టంలేదు.

“ఓల్షిన్‌స్కీ చూపే యూరపియన్ మర్యాదలకన్న జకరయ్ నిరాడంబరత్వం అంటే నాకిష్టం.

“బోయారాక్కునుంచి వచ్చేవార్తలన్నీ చాల సంగ్రహంగావుంటున్నాయి. రోజుకో వంద*సాజెనేల రైలుమార్గం వేస్తున్నారు. రైలుకట్ట రాయికట్టుకుపోయింది. దానిమీద చిన్నచిన్న గాడికొట్టి స్లీపర్లువేస్తున్నారు. మొత్తంఅంతా కలిపి రెండువందల నలభై మంది పనిచేస్తున్నారు. కొత్తగా పంపించిన జనంలో సగంమంది పారిపోయేరు. అక్కడి పరిస్థితులు చాల భయానకంగావున్నాయి. ఈ పింజమంచు పడుతూంటే వాళ్ళు పని ఎల్లా సాగించగలుగుతారో. దుబావా

* సాజెనే : రష్యను మానము — సాజెనే ఏడు ఇంగ్లీషుఅడుగులకు సమానము.

వెళ్ళి వారంఅయింది. పుష్చా-వోదిత్సాలోవున్న ఎనిమిది ఇంజన్లలో అయిదింటినిమాత్రమే మరమ్మతుచేయగలిగేరు. మిగిలినవాటిలో వేయడానికి కావలసిన యంత్రభాగాలు దొరకలేదు.

“ట్రామ్‌కార్ అధికారులు డిమిత్రీమీద దొంగతనం నేరం ఆరోపించేరు. పుష్చా-వోదిత్సానుంచి పట్టణానికి నడుస్తున్న ట్రాంకార్లను ఆతడూ, అతని అనుచరులూ ఆపేసి, జనాన్నిదింపేసి, వాట్లలో బోయార్కా రైలుబాటకోసం రైల్వేస్లీపర్లు ఎక్కించి తీసుకుపోయేరు. ట్రామ్‌లద్వారా వాటు స్టేషన్‌కు పంథొమ్మిదివేగన్ల స్లీపర్లూ, పట్టాలూ చేరవేసేరు. ట్రాంపనివాళ్ళు హుషారుగా వాళ్ళకిసహాయంచేసేరు.

“ఇంకా పట్టణంలో మిగిలిన సోలోమెంకా కామ్‌సోమాల్స్ రాత్రి తెల్లవార్లూపనిచేసి పట్టాలు పెట్టెలకెక్కించేరు. డిమిత్రీ, అతనిమనుష్యులూ వాళ్ళనికూడా వెంట బెట్టుకొని బోయార్కాకు వెళ్ళిపోయేరు.

“దుబావాచేసిన పనినిగురించి కామ్‌సోమాల్ బ్యూరోలో విచారణ జరపడానికి అకీమ్ వొప్పుకోలేదు. ట్రామ్‌శాఖలో సాగుతున్న అధికార దుర్వినియోగంగురించీ, ఫైళ్ళ తిప్పట గురించీ దుబావా ఎన్నోసంగతులుచెప్పేడు. రెండు కార్లను మించి ఇవ్వము అనేశారట, వాళ్ళు.

“అయినా, తుఫ్తా రహస్యంగా దుబావాను మందలించేడు. ఈ గెరిల్లాదాడుల్ని ఈపాటికి ఆపమని బెదిరించేడు. లేకపోతే జైలుతప్పదన్నాడు. పేచీలుతప్ప సఖ్యపడడానికి మార్గమేలేకపోయిందా అన్నాడు.

"దానితో దుబావాకు ఎంత కోపంవచ్చిందని—

"నువ్వా కలంపోటుగాడివేకా? పోయి మాట్లాడక పోయేవ్వా? చింతపండుబుట్టలా కుర్చీలో చతికిలబడి కబుర్లు చెప్తావు. రైలుపట్టాలు తీసుకెళ్ళకుండా బోయార్కా వెడ తాననే అనుకొన్నావా? ఇక్కడ కూర్చుని అందరికి అడ్డం వచ్చేబదులు కొంతవుపయోగమేనా అవుతుంది, నిన్నక్కడికి తోసేస్తే. తోకరేవ్ నీకు బుద్ధేనా చెప్తాడు—అంటూ డిమిట్రీ ఆఫీసంతా ఎగిరిపోయేలాగ అరిచేసేడు.

"తుఫ్తా వెంటనే దుబావామీద నేరారోపణపత్రం తయారుచేసేడు. అకిమ్ నన్నుపంపేపి పదినిముషాలు గట్టిగా చీవాట్లుపెట్టేడు. తుఫ్తా వెర్రిమొగం వేసుకొని వెళ్ళిపోయేడు.

డిసెంబరు, 3

గుబెర్నియాకమిటీకి ఈవేళ మరోకంప్లెయింటువచ్చింది. ఈమారు ఇది రహదారిశాఖ ఛెకానుంచివచ్చింది. పాంక్రాటోవ్, ఓకునేవ్ మొదలయినవాళ్ళంతా మోటోవిలోవ్కా స్టేషన్కువెళ్ళి, అక్కడ ఖాళీగాపడివున్న ఇళ్ళతాలూకు కిటికీలూ, ద్వారాలూ పీక్కుపోయేరట. వాటిని వేగనుకి ఎక్కిస్తూంటే స్టేషనులోని ఛెకావుద్యోగి వారిని అరెస్టుచేయబోయేడు. దానితో వాళ్ళు ఆతనివద్దవున్న ఆయుధాలు లాగేసుకొన్నారట. రివాల్వరు తోటాలుతీసేసి, బండిబయలుదేరాకగాని ఆవట్టి రివాల్వరు ఇవ్వలేదట. కిటికీలూ, దర్వాజాలూ పట్టుకుపోయేరు.

"మరో ఛార్జి: బోయారాక్ రైల్వేనిలవలనుంచి తోక రేవు ఇరవై *పూడ్లమేకులు తీసుకుపోయేడని రైల్వేసరఫరా శాఖవారి ఆరోపణ. స్త్రీపర్లుగా పనికివచ్చే కలప లాగి తెచ్చి, సాయపడిన రైతులకు ఆమేకులు కూలికిబదులుగా ఇచ్చేడట.

"ఈ సంగతులన్నీ జకరయ్‌కి చెప్పేను. ఆయన నవ్వేసేడు. 'వాటిసంగతి నే చూస్తాలే' అన్నాడు.

"రైలుబాట నిర్మాణం చాల ధూకుడుగా జరిగిపోతూంది. ఒక్కొక్క రోజుకు ఎంతెంతో విలువ. ప్రతిచిన్న పనికీ ఇక్కడ ఎంతో రభసచేయవలసివస్తూంది. ఆటంకకారుల్ని ఉండీ, ఉడిగీ గుబర్నియాకమిటీ ఆఫీసుకిపిలిపించి దబాయించవలసివస్తూంది. అక్కడవాళ్ళు ఆఫీసుపనిపద్ధతులకు తిలాంజలి ఇచ్చేసి అవసరాన్నిపట్టి పనిచేసుకుపోతున్నారు.

"ఓల్షిన్‌స్కీ నాకో చిన్న ఎలక్ట్రిక్ స్టవ్ బహుమతీ తెచ్చేడు. దానిమీద నేనూ, ఓల్గాయురెనేవా ఇద్దరం చేతులు వెచ్చకాచుకొన్నాం. దానిని వెలిగించినా గది వేడిఎక్క లేదు. అల్లాంటిది అడవిలో ఆ గడ్డుచలిలో వాళ్ళెల్లావుంటున్నారో. హాస్పిటలులో రోగులు ఎన్నికంబళ్ళు కప్పినా వొణికిపోతున్నారని ఓల్గాచెప్పింది. రెండేసిరోజుల కోమారు అక్కడ సెగళ్ళు వెలిగిస్తున్నారట.

"వద్దు. కామ్రేడ్ ఓల్షిన్‌స్కీ! యుద్ధరంగంలోని దుఃఖం, వెనకపీటీనకూడా బాధేకలిగిస్తుంది.

---

* పూడ్ : రష్యను మానము—36 పౌనుల బరువుకు సమానము.

డిసెంబరు, 4

రాత్రిఅంతా మంచుకురుస్తూనేవుంది. మంచుకప్పేసిందనీ, రైలుబాటలో మంచుతీసెయ్యడానికి పనులు ఆపవలసివస్తూందనీ బోయూర్కానుంచి వ్రాసేరు. జనవరి 1 (1922) నాటికి రైలుబాట ప్రథమభాగం కలపఅడితుల ప్రారంభందాకా వేసెయ్యడం పూర్తికావాలని ఈవేళ గుబర్నియా కమిటీ ఒకతీర్మానంచేసింది. ఆవార్త తెలియగానే తోకరేవ్ "ఈలోపునే చచ్చిపోకుండావుంటే తప్పకుండా ఆ రోజు నాటికి పూర్తిచేస్తాం, లే." అన్నాడట.

"జోర్చాగిన్‌నుగురించిన వార్తలే తెలియడంలేదు. పాంక్రాటోవ్‌లాగ ఆతడూ ఏదోనెత్తికి తెచ్చుకోకుండా వుండడం ఆశ్చర్యంగానేవుంది. ఆతడు నా ఛాయలకికూడా రాకుండా తప్పించుకుపోవడం ఎందుకో అర్థంకావడంలేదు.

డిసెంబరు, 5

రైల్వేనిర్మాణప్రదేశంమీాద నిన్న బందిపోట్లు దాడీ చేసేరట.

* * *

మెత్తగా, దిగబడిపోతున్న మంచులో గుర్రాలు కాళ్ళీడ్చుకుంటూ నడుస్తున్నాయి. మధ్యమధ్య మంచులో కప్పడిన ఏ పుల్లమీాదనో అడుగుపడి ఫటుక్‌మంటుంది. గుర్రంబెదిరి ముందుకు అడుగువెయ్యకుండా మొరాయిస్తుంది. వెనకనుంచి కొరడా ఛెళ్ళుమంటుంది. ఆ దెబ్బతో పరుగెత్తి ముందుకుపోతున్నవాటిని కలుసుకొంటుంది.

మంచులో కప్పడిపోకుండావున్న పోతగట్టుకి దిగువన కొండవంచలో పదిపన్నెండుమంది రౌతులు కనబడ్డారు. కొంతదూరంవచ్చి గుర్రాల్ని నిలబెట్టేరు. కళ్ళెం, జీనులింకులు తగిలి సన్నని ధ్వని వినిపిస్తూంది. నాయకుడిగుర్రం ఒళ్ళు విదిలించుకొంది.

దళనాయకుడు యూక్రేనియన్ భాషలోమాట్లాడేడు.

"చచ్చినంతమంది వున్నారు. కానీ, లే. దెబ్బకి దెయ్యం వదిలిపోతుంది. రేపు తెల్లవారేలోపున తరిమెయ్యమని అటామన్ దొరవారిఆజ్ఞ. వంటచెరుకు అడితులకి దగ్గరపడ్డారు."

చిన్నలైన్ వెంబడే ఒకేవరసలో వారు స్టేషన్‌దాకా వెళ్ళేరు. పాతస్కూల్‌బిల్డింగ్ దగ్గరలోవున్న వెల్లడికనబడగానే నడకవేగం తగ్గించేరు. చెట్లగుంపుచివర ఆగిపోయేరు. వెల్లడిలోకి రావడానికి ధైర్యంచాలలేదు.

నిశీధి నిశ్శబ్దాన్ని చీకుకుంటూ తుపాకీ కాల్పులు వినిపించేయి. వెన్నెలలో తెల్లగా వెండిచెట్టులా మెరిసిపోతున్న బిర్చిఆకులనుంచి మంచుపింజలు జలజలరాలేయి. చెట్లమధ్య తుపాకులు కాలుస్తున్నప్పుడు మెరపుల్లే చిన్నచిన్న వెలుగులు కనబడుతున్నాయి. చవుదురికిన గోడలగిలాబా మన్ను పెళ్ళలు తూటాలుతగిలి జలజలరాలిపోతూంది. పాంక్రాటోవ్ ఎంతో పేచీ తెచ్చుకొని సంపాదించిన కిటికీలూ, అద్దాలూ, తుంపులు, తుంపులయిపోయేయి.

మొదటిచప్పుడు వినగానే గదిలోవున్న జనం చటుక్కున లేచేరు. కాని, గదిలోకే తుపాకీగుళ్ళు ఎగరడం ప్రారంభంకావడంతో ఎవరికివారే చదికిలబడ్డారు.

పావెల్ బయలుదేరబోతూంటే దుబావా ఆతనికోటు పట్టుకొని లాగికూర్చోపెట్టేడు.

"ఎక్కడికి?"

"చూసొస్తా."

"తల పైకిచూపితే చస్తావు. పడుకో. చవటతలకాయి."

ఇద్దరూ దర్వాజాపక్కనే పక్కపక్కగా పడుకున్నారు. రివాల్వరుతో ద్వారాన్ని కమ్ముకుంటూనే దుబావా నేలని కరుచుకు పడుకున్నాడు. పావెల్ లేచి గొంతుకూర్చుని రివాల్వరు సవరించుకున్నాడు. దాంట్లో అయిదే తూటాలున్నాయి. ఒకగది ఖాళీగావుంది. బేరల్ తిప్పేడు.

హఠాత్తుగా కాల్పులు ఆగిపోయేయి. ప్రతిఒక్కరూ ఎంతో ఆదుర్దాగా ఎదురుచూస్తున్నారు.

"ఆయుధా లున్నవాళ్ళంతా ఇటురండి."—దుబావా సన్నగా ఆజ్ఞాపించేడు.

పావెల్ ఎంతో నెమ్మదిగా తలుపుతీసేడు. వెల్లడిలో ఒక్క మనిషికూడా లేడు. మంచుపింజెలు దట్టంగా పడుతున్నాయి.

పదిగుర్రాలు అడవిలో పరుగుపెడుతూ పోవడం కనబడింది.

మరునాడు పట్టణంనుంచి ఒకరైలుకారు వచ్చింది. దాంట్లో జకరయ్, అకిమ్‌లు వచ్చేరు. వారిని స్టేషనులో

తోకరేవ్, ఖోల్యావాలు కలుసుకొన్నారు. ఆబండీలోనే ఒక మాక్సిం మరతుపాకీ, మరతుపాకీ తూటాలబెల్టులతో పెట్టెలు, రెండు డజన్ల రైఫిళ్ళూవచ్చి, ప్లాట్ఫారంమీద దిగేయి.

నలుగురూ రైలుబాట పోస్తున్నచోటికివెళ్ళేరు. జకరయ్ తొడిగిన పొడుగుకోటుచివరలు మంచులో జీరాడుతున్నాయి. సముద్రంలో నౌక వూగుతూంటే ఆచుకుంటూ నడవడం అలవాటు ఆతడికింకాపోలేదు. ఆతడు ఒకప్పుడు నౌకలలో పనిచేసేడని ఆ నడకపట్టిచ్చేస్తుంది. అకిమ్ ఆతని పక్కనే అడుగుకలిపి నడుస్తున్నాడు. వాళ్ళతో సమానంగా నడవడానికి తోకరేవ్ మధ్యమధ్య పరుగెత్తవలసివస్తూంది.

"బందిపోట్లు దాడిచెయ్యడం భయం ఒక్కటేకాదు మన ఇబ్బంది. లైన్ వేసేదారిలో మిట్ట ఒకటుంది. దురదృష్టం. ఏంతవ్వినా తవ్వాలి."

తోకరేవ్ నిలబడి అరచేతులు దోసిలిపట్టి, సిగరెట్టు వెలిగించేడు. నాలుగు గుక్కలుపీల్చి మళ్ళీవాళ్ళని అందుకోడానికి పరుగెత్తేడు. ఆతని రాకకోసం అకిమ్ కొంతదూరములో నిలబడ్డాడు. కాని, జకరయ్ నడిచిపోతున్నాడు.

"అనుకొన్ననాటికి పనిపూర్తవుతుందనే అనుకొంటున్నావా?"— అన్నాడు అకిమ్.

తోకరేవ్ ఒక్కక్షణం ఆలోచించేడు.

"ఇదిగో, అసలుసంగతి ఇది. మామూలుగా అయితే పనిపూర్తికాదు, కాని, చేసితీరాలి.

ఇద్దరూ వేగంగా నడిచి జకరయ్‌ని అందుకున్నాక తోకరేవ్ చెప్పుకుపోతున్నాడు

"ఈ పరిస్థితులలో రైల్వేలైన్ వేయడం అసాధ్యమని పాటోస్కినూ, నేనూమాత్రం ఎరుగుదుం. జనంలేరు. పనిముట్లు తక్కువ. కాని, మిగతా అందరూ ఏమైనాసరే అనుకున్ననాటికి పనిపూర్తి చేసితీరాలనే పట్టుదలతో వున్నారు. మంచుకు బిగిసి చచ్చిపోకుండా వుంటే పనిపూర్తి అవుతుందన్నది అందుకే. మీరే ఆలోచించండి. నెలరోజులనుంచి తవ్వకం సాగుతూంది. ఈ పాటికి నాలుగోబదిలీ మనుష్యులు వచ్చివుండాలి. రాలేదు. ఈనాడు పనిచేస్తున్నవాళ్ళల్లో ఎక్కువమంది మొదటవచ్చినవాళ్ళే. పడుచుదనపు బిగువులో పనిచేసుకుపోతున్నారు. అందులో సగంమంది వణికిపోతున్నారు. వాళ్ళని చూస్తూంటే బాధకలుగుతుంది. అల్లాంటి జనం దొరకడం కష్టం. ఈదిక్కుమాలిన ప్రదేశం వాళ్ళల్లో ఎందర్ని పొట్టపెట్టుకుంటుందో..."

*　　*　　*

స్టేషనుకు ఒక కిలోమీటరువరకూవచ్చి చిన్నరైలుబాట ఆగిపోయింది. అక్కడనుంచి ఒకటిన్నర కిలోమీటర్లవరకే స్లీపర్లు పడ్డాయి. ఆదిగువన మిట్టదాకా గట్టు మాత్రమే పడింది.

ఈభాగంలో పాంక్రోటోవ్ నాయకత్వాన పనిచేస్తున్న ఒకటోదళం నిర్మాణం సాగిస్తూంది. సలభయిమంది స్లీపర్లుతెచ్చి అమరుస్తున్నారు. ఒక పిల్లిగడ్డంవాడు కర్ర

దుంగలు తెచ్చి పోతగట్టుమీద పడేస్తున్నాడు. పొడుగునా అదేవిధంగా స్లెడ్జిబళ్ళు దుంగలు జేరేస్తున్నాయి. పక్కనే పొడుగుపాటి ఇనపకమ్మీలు రెండు పడేసివున్నాయి. స్లీపర్లు ఎగుడుదిగుళ్ళు లేకుండా చూసుకోడానికి వీటి నుపయోగిస్తున్నారు. ఇంక గట్టుమీద రాయిరప్పవేసి దిమ్మిసా వేయడానికి గుద్దలి, గునపం, పార ఏదివుంటే దానినే వుపయోగిస్తున్నారు.

*　　　*　　　*

స్లీపర్లు వేయడం ఎంతో శ్రమతో కూడినపని. త్వరగా జరగదు. అవి నేలలో గట్టిగా కుదురుకొనేటట్లు చేయాలి. లేకపోతే పట్టాలు సమానంగా ఆనవు.

స్లీపర్లు అమర్చే నేర్పు అక్కడున్నవాళ్ళల్లో ఒక్కడికే వుంది. లైన్ ఫోర్మన్ లగూటిన్ ఏభయినాలుగేళ్ళవాడు. మధ్యకు పాపిడితీసి రెండువేపులకూ విగిచిదువ్విన నల్లనిగడ్డం. ఆతడు మొదటినుంచీ జోయార్కా పనిలోవున్నవాడే. పడుచువాళ్ళతో సమంగా కష్టపడుతున్నాడు. అందరిమన్ననలూ పొందినవాడు. లగూటిన్ పార్టీసభ్యుడుకాడు. కాని, పార్టీసభ్యుల సమావేశాలకు ఆతనిని పిలిచి, గౌరవస్థానం ఇస్తున్నారు. ఆలా పిలవడం, గౌరవించడం ఆతని కెంతో ఉత్సాహంగావుంది. ఆపని ఏదోపూర్తి అయితేగాని ఇంటికి వెళ్ళనని వుండిపోయేడు.

"మీరే చూసుకోండని వెళ్ళిపోతే ఎల్లాగ? అనుభవంవున్నవాళ్ళు చూసుకొంటూంటేతప్ప ఏదయినా పాడు

కావచ్చు. నాకు ఆ అనుభవంవుంది. బుద్ధిఎరిగింది మొదలు ఈనాటివరకూ ఎన్నిచోట్ల ఎన్ని స్లీపర్లు బిగించేనో నాకే జ్ఞాపకంలేదు.''

ఆలాగే వుండిపోయేడు.

*　　*　　*

లగూటిన్‌కి పనిబాగా తెలుసునని పాటోష్కిన్ చూసేడు. అందుచేత ఆ ప్రదేశానికి తనిఖీకోసం ఎప్పుడో గాని రాడు. తోకరేవ్ అకిమ్‌నూ, జకరయ్‌నీ తీసుకొని పని జరుగుతూన్న చోటికివచ్చేసరికి పాంక్రాటోవ్ ఒక స్లీపరు బిగించడానికై గాడితవ్వుతున్నాడు. శ్రమకి ముఖం జేవురించి పోయింది. అంత చలిలోనూ చెమటలు కారిపోతున్నాడు. అకిమ్ ఆతనిని గుర్తేపట్టలేకపోయేడు. మనిషిబాగా చిక్కేడు. చెప్పిదవడలు పడ్డాయి. కళ్ళు గుంటలు పట్టేయి.

అకిమ్‌ను చూడగానే చాలఉత్సాహంతో కరచాలనం చేసేడు.

''అమ్మయ్య! పెద్దలు వచ్చేరే.''

అందరు పని నిలిపేరు. పారకొట్టుడు చప్పుడు ఆగింది. తనచుట్టూ చేరినవాళ్ళ ముఖాలు పీక్కుపోయివుండడం అకిమ్‌చూసేడు. వాళ్ళు కోట్లుతీసి మంచులోనే ఒకపోగుగా పడేసేరు.

లగూటిన్‌తో కొద్దిసేపుమాట్లాడేక తోకరేవ్ వచ్చిన వారిద్దరినీ తవ్వుపని జరుగుతున్నచోటికి తీసుకెళ్ళేడు. పాంక్రో టోవ్‌నికూడా తనతో రమ్మన్నాడు. ఆతడూ బయలు

దేరేడు. జకరయ్ ఆతనిని పక్కన పెట్టుకొని నడుస్తూ సంభాషణ కుపక్రమించేడు.

"పాంక్రాటోవ్! మోటోవిలోవ్కాలో ఏం జరిగిందో ఏమిటో చెప్పు. ఛెకామనిషి చేతిలో ఆయుధం లాక్కోవడంలో నువ్వు కొంచెం అతిగా పోయేవనుకుంటున్నా."

పాంక్రాటోవ్ చిరునవ్వు నవ్వేడు.

"అతనూ, నేనూ కలిసి ఆలోచించి చేసినపనేఅది. తన ఆయుధం లాక్కోమని ఆతడే చెప్పేడు. కుర్రవాడు మంచివాడు. అతడికి సంగతు లన్నీ చెప్పేను. విని ఏమన్నాడో తెలుసా ?—ఇదిగోనయ్యా! మీకష్టాలు నాకు తెలుసు, కాని ఆకిటికీలూ, దర్వాజాలూ మిమ్మల్ని పట్టుకుపోనిచ్చే అధికారం నాకులేదు. రైల్వే ఆస్తులు ఎవరూ దోచుకుపోకుండా కాపలాకాయమని కామ్రేడ్ జెర్జిన్‌స్కీ ఆజ్ఞలు మాకున్నాయి. ఇక్కడి స్టేషన్‌మాష్టరుకి నామీద పీకలవరకూ వుందికోపం. నేను వచ్చేక వాడిదొంగతనాలు సాగటంలేదు. పక్కాబందిమాన్. ఇప్పుడు మీరు కిటికీలూ, దర్వాజాలూ పట్టుకుపోతూంటే చూస్తూవూరుకున్నానా నామీద రిపోర్టు చేస్తాడు. రివల్యూషనరీట్రిబ్యునల్ వాళ్లు నాపీకపట్టుకుంటారు. కాని, మీరోపని చెయ్యండి. నాచేతిలో తుపాకీ లాగేసుకొండి. సామాను తీసుకునిపోండి. స్టేషనుమాస్టరు రిపోర్టు చెయ్యకపోతే కథేవుండదు.''— అన్నాడు. మేము చేసేసేము. అవునుగాని, ఈ తలుపులూ, దర్వాజాలూ మాస్వంత ఇళ్ళకోసంకాదుగదా..."

జకరయ్ కళ్ళల్లో కనబడిన హాసరేఖనుచూసి పాంక్రాటోవ్ ధైర్యంగా అనేసేడు.

"కామ్రేడ్ జకరయ్! కావాలంటే మాకు శిక్ష వెయ్యి. కాని ఆకుర్రాణ్ణి ఏమీ చెయ్యకు."

"అయిపోయిందేదో అయిపోయిందిలే. మళ్ళీ అల్లాంటి పనులుమాత్రం చెయ్యకు. అది క్రమశిక్షణకు భంగం. ఒక క్రమపద్ధతిలో అధికారవర్గాన్ని అణిచివేయగల స్తోమతు మనకిప్పుడు చిక్కింది. అది వదిలెయ్. మనం మాట్లాడుకోనేదింకో ముఖ్యవిషయం వుంది.

జకరయ్ బందిపోట్లదాడిని గురించిన వివరాలు అడగడం మొదలు పెట్టేడు.

* * *

బోయూర్కా స్టేషనుకి నాలుగున్నర కిలోమీటర్ల దూరంలో రైలుబాట కడ్డంగా మిట్టవుంది. జనం మిట్ట తవ్వుతూంటే ఏడుగురు రక్షణగా నిలబడ్డారు. కోల్యావా రైఫిలూ, కోర్చాగిన్, పాంక్రాటోవ్, దుబావా, ఖోముటోవ్‌ల రివాల్వర్లూ వాళ్ళ ఆయుధాలు,

పక్కనేవున్న రాతిమీద కూర్చుని పాటోష్కిన్ ఏదోలెక్కలు వేస్తున్నాడు. ఈపనిమీదవున్న ఇంజనీరు ఆతడొక్కడే. దొంగలచేతిలో చచ్చిపోయేకన్న పనివదలి పారిపోయినందుకు తిట్లుతినడమే మెరుగు అనుకొని టెక్నీషియన్ వకులెంకో ఆవేళవుదయమే పారిపోయేడు.

"నేలంతా నల్లరాయయిపోయింది. ఇది తవ్వేందుకు కనీసం రెండు వారాలయినా పడుతుంది."—అన్నాడు పాటో ష్కిన్, పక్కనే దిగాలుగా నిలబడివున్న ఖోముటోవ్‌తో.

ఖోముటోవ్ దుబ్బుమీసాలు పెదవులతో లాక్కుంటూ 'హు' అన్నాడు.

"ఈ లైనంతా వెయ్యడానికి మనకి ఇరవయ్యయిదు రోజులు వ్యవధి ఇచ్చేరు. దాంట్లో పదిహేను రోజులు ఇక్కడే పడుతుందంటున్నావు."

"ఏమో, జరుగుతుందనుకోను. ఇల్లాంటి పరిస్థితుల్లో, ఇటువంటి పనివాళ్ళతో నేనెప్పుడూ పనిచేయించలేదు. అయినా నాదీ పొరపాటుకావచ్చు. ఇదివరకు నా అంచనాలు రెండుమార్లు తప్పేయి."

ఈ మాటలు జరుగుతూంటే జకరయ్, అకిమ్, పాంక్రాటోవ్‌లు మిట్టదగ్గిరికి వచ్చేరు.

రైల్వేవర్కుషాపులలో మెకానిక్‌గా పనిచేసిన పీటర్ త్రోఫిమోవ్ కోర్చాగిన్‌ను మోచేతితో పొడిచి ఆగంతుకులను చూపేడు.

"ఎవరు వచ్చేరో చూసేవా?"

వాళ్ళనిచూడగానే కోర్చాగిన్ చేతిలోని పారతోనే మిట్టదిగి పరుగెత్తేడు. జకరయ్‌తో కరచాలనం చేస్తూంటే అతని కళ్లు ఆనందంతో మెరిసేయి.

"పావెల్! ఈ వేషంలో నిన్ను గుర్తుపట్టనే లేకపోయేనే."

కాంద్రాటోవ్ నీరసంగా నవ్వేడు:

"దానికి వేషం అనేది చాలపెద్దమాట. అన్నీ చిరుగులే. పనిమాని పారిపోయినవాళ్ళు ఆతనికున్నకోటు ఒక్కటీ ఎత్తుకుపోయేరు. ఇప్పుడున్నచొక్కా ఓకునేవ్‌ది. వాళ్ళంతా ఒక కమ్యూన్ పెట్టుకున్నారు ఎరుగుదువుగా. పావెల్‌కి ఫర్వా లేదులే. పడుచురక్తం. ఇంకో వారంపదిరోజులు సిమెంటు నేలమీద పడుకోగలడు. గడ్డిపడేసినా అదంత వుపయోగ కరంగా వుండడం లేదులే. ఆ పదిరోజులూ పూర్తిఅయ్యేసరికి మంచి పైన్‌కర్ర చెక్కలతో శవపుపెట్టె సిద్ధంచేయించడం మరిచిపోకు."

ఓకునేవ్ ఫర్వాలేదన్నాడు.

"ఫర్వాలేదు. పావ్‌లూష్కాని మేం జాగ్రత్తపెడతాం. వంటశాలలో ఓదార్కాకి సాయంగా పనిచెయ్యమంటాంలే. తెలివితేటలుంటే చాటునీ, మాటునీ ఓ పిడికెడు నోట్లో వేసుకొంటాడు, పొయ్యిదగ్గర చేరచ్చు. లేకపోతే ఓదార్కానే అంటకాగచ్చు."

ఆమాటకు అంతా పకపక నవ్వేరు. ఆ రోజున వాళ్ళు నవ్వడం అదే మొదటిమాటు.

*                    *                    *

జకరయ్ మిట్టనాలుగువేపులూ చూసి, స్లెడ్జిలో బయలుదేరి కలపలాట్లదగ్గరికి వెళ్ళేడు. ఆతనితో తోకరేవ్రూ, పాటోష్కినూ వెంబడించేరు. ఆతడు తిరిగివచ్చేవేళకింకా పనివాళ్లు తవ్వుతూనేవున్నారు. వీపు ఎత్తకుండా పారకొట్టుడు సాగిస్తూనేవున్నారు. జకరయ్ అకిమ్‌వేపుతిరిగి నెమ్మదిగాఅన్నాడు:

"ఇక్కడ మీటింగు లక్కర్లేదు. ప్రచారం, ఆందోళన అవసరంలేదు. తోకరేవ్ చెప్పినట్లు వీళ్ళు రత్నాలమొలకలు. ఇల్లాంటిచోట్లనే యోధులు కాకలుతీరడం."

తప్పుతున్నవాళ్ళని జకరయ్ ఎంతో ఆత్మీయతతో చూసేడు. కొద్దిరోజులక్రితమే వీరు సైన్యాలలోకి వచ్చేరు. విప్లవం ప్రారంభమైననాడే వాళ్లు కత్తిపట్టేరు. ఈవేళ ఏకాగ్రతతో రైలురోడ్డు వేస్తున్నారు.

*　　　*　　　*

ఎంతో మర్యాదగానే, అనుమానానికి తావియ్యకుండా పాటోష్కిను ఆమిట్టను రెండువారాలలోపున తవ్వడం సాధ్యంకాదని జకరయ్‌తోచెప్పేడు. ఆతడా వాదనలను పరధ్యానంగా విన్నాడు. మనిషి ఏదో ఆలోచనలలో మునిగి వున్నాడు.

చివరకు ఆలోచనలలోంచి బయటపడ్డాడు:

"మిట్టతవ్వకం ఆపి, దిగువన పని ప్రారంభించండి. దీనిని మరోపద్ధతిలో పగలగొడదాం."

స్టేషనుకెళ్లేక ఆతడు చాలసేపు టెలిఫోన్ వద్దనే కూర్చున్నాడు. బయటగుమ్మంలో ఖోల్యావా కాపలానిలబడి ఆతని మాటలు వింటున్నాడు.

"ఏరియా మిలిటరీ కార్యాలయాధికారిని పిలు. వెంటనే రైలుబాట వేస్తున్నచోటికి ఫుజూరేవ్‌స్కీ పటాలాన్ని పంపమన్నానని నామాటగాచెప్పు. ఒక్కక్షణం ఆలస్యంలేకుండా బండెపోట్లని ఇక్కడనుంచి తరిమెయ్యాలి. మందుగనులు

నాలేవాళ్ళతో సాయుధరైలును పంపమను. మిగిలింది నే చూసుకుంటా. నేను తిరిగివచ్చేసరికి ఆలస్యం అవుతుంది. అర్ధరాత్రివేళకి కారుతో స్టేషన్‌వద్ద సిద్ధంగా వుండమన్నానని లిస్కాతో చెప్పు."

బారకాసుల్లో జనంఅంతా సమావేశంఅయ్యేరు. కొద్దిసేపు అకిమ్‌మాట్లాడేక జకరయ్ ప్రారంభించేడు. ఇష్టాగోష్ఠిగా ఒక గంటసేపు గడిచిపోయింది. రైలుబాట జనవరి ఒకటి నాటికి పూర్తి కావలసిందేనని జకరయ్ ఖండితంగా చెప్పేడు.

"ఈ క్షణంనుంచీ ఈపనికి యుద్ధరంగపుస్థాయి నిస్తున్నాం. ఇక్కడున్నవారిలో పార్టీసభ్యులంతా దుబావా నాయకిత్వాన ప్రత్యేక కంపెనీగా పనిచేస్తారు. ఆరుదళాలకీ వేరేవేరే పనులు ఏర్పాటుచేస్తాము. ఇంక జరగవలసిన పని భాగాన్నంతనీ ఆరుగా విడతీస్తాం. ఒక్కొక్క విభాగం ఒక్కొక్క దళానిది. ఎవరి పని ముందయిపోతే వారు వెళ్ళిపోవచ్చు. ప్రతిదళంలోనూ బాగాపనిచేసినవారికి "ఎర్రజెండా పదకం" బహూకరించవలసిందని గుబర్నియా కార్యవర్గం ప్రభుత్వాన్ని కోరుతూంది."

వేర్వేరు దళాలకు నాయకుల్ని కూడా ఏర్పాటుచేసేరు. కామ్రేడ్ పాంక్రాటోవ్, కామ్రేడ్ దుబావా, కా. ఖోముటోవ్, కా. లగూటిన్, కా. కోర్చాగిన్, కా. ఓకునేవ్‌లు దళనాయకులు.

"ఈపని బాధ్యత, రాజకీయనాయకత్వం, అధికారం ఇదివరకులాగే. ఆంటన్‌నికోఫోరోవిచ్ తోకరేవ్ చేతిలోనే వుంటుంది."—అంటూ జకరయ్ తన వుపన్యాసం ముగించేడు.

గాలిలోకి ఎగరేసిన పావురాలు రెక్కలు టప టపలా డించినట్లు సభ్యులంతా చప్పట్లుకొట్టి హర్ష ధ్వానులుచేసేరు.

అకిమ్‌నూ, జకరయ్‌నూ సాగనంపడానికై ఇరవై మంది వరకూ స్టేషన్ దాకా వెళ్ళేరు.

కోర్చాగిన్‌తో కరచాలనంచేస్తూ జకరయ్ ఆతని చిరుగుబూట్లు చూసేడు.

"నీ కాళ్ళు కొయ్యబారిపోలేదుగద. వుండు, వెళ్ళ గానే కొత్తబూట్లు పంపిస్తా."

"కాళ్ళువాచినట్లు కనబడుతున్నాయి."

పావెల్‌కు ఇంతలోనే మరొకటి గుర్తువచ్చింది. చటు క్కున జకరయ్ చేయిపట్టుకొని ఆతురతగా అడిగేడు.

"నా రివాల్వరులో మూడే తూటాలున్నాయి. మరి కొన్ని వుండాలి. నీ దగ్గరేమన్నా వున్నాయా?"

జకరయ్ విచారంగా తలతిప్పేడు. పావెల్ కళ్ళల్లో నిరాశ ప్రతిబింబించింది. వెంటనే తన పటాకానుంచి మాజరు తీసేడు.

"ఇదిగో, ఇది నీకు బహుమతీ."

తన చిరకాలవాంఛితం సమకూరుతూందన్న సంగతి చూస్తున్నా పావెల్‌కు నమ్మకం కలగలేదు. కాని మాజ రును పటాకాతోసహాతీసి జకరయ్ ఆతని మెడలోవేసేడు.

"తీసుకో. తీసుకో. చాలరోజులనుంచి దీనిమీదనీకన్ను పడింది. కాని, దీనిని మనవాళ్ళమీదే వుపయోగించేవు గనక. జాగ్రత్త. ఇవిగో దానికి తూటాకట్టలు."

ఇతరుల కళ్ళల్లో కనిపించిన ఆశల్ని పావెల్ గమనించేడు.

"ఏయ్ పావ్కా! ఒక జతబూట్లూ, కోటూ ఇస్తాను, అది నాకిస్తే"—అని ఎవరో అన్నారు.

పాంక్రాటోవ్ పావెల్ వీపుమీద పొడిచేడు.

"నేను ఫెల్టుబూట్లు ఇస్తాను ఇచ్చెయ్యి. అదివుండి మాత్రం లాభం ఏమిటి? ఆ ఛడావులతోనే వున్నావా క్రిస్టమస్ దాకా వుండవు."

రైలుకారు మెట్టుమీద కాలువేసి, అది వొత్తుగా చేసుకొని జకరయ్ రివాల్వరుంచుకొనే అధికారపత్రంమీద సంతకంచేసి అందించేడు.

* * *

మరునాడుదయమే సాయుధరైలు ఝుణఝుణలాడుతూ వచ్చి స్టేషనులో నిలబడింది. ఇంజనునుంచి తెల్లని ఆవిరి మంచు గాలిలో అదృశ్యమైపోతూంది. ఉక్కుకవచాల వెనుకనుంచి తోలుదుస్తులువేసిన సైనికులు దిగేరు. మరో కొద్ది గంటలలో మందుగనులునాటేవాళ్ళు ముగ్గురు వెళ్ళి గుమ్మడికాయల్లాంటి రెండు నల్లనివస్తువుల్ని మిట్టమీదనాటి, వానికి రెండు పొడుగుపాటి ఫ్యూజులు తగిలించేరు. జనానికి హెచ్చరికగా రెండుమార్లు తుపాకీ కాల్చేరు. ఆ చప్పుడు వినగానే ఎక్కడివాళ్ళక్కడ సర్దుకొన్నారు. అగ్గిపుల్లగీసి ఫ్యూజు ముట్టించేరు. అది చురచురలాడుతూ అంటుకుంది.

ఒక్కక్షణం అంతా శ్వాసకూడా బిగపట్టి నిలబడ్డారు. ఇంతలో భూమి అదిరింది. ఒక బ్రహ్మాండమైనశక్తి మిట్టను

చీల్చి, పెద్దపెద్ద రాతిఅండలను ఆకాశంలోకి ఎగచిమ్మింది. రెండో ప్రేలుడు మొదటిదానికన్న చాల బలమైనది. అది చేసిన ధ్వని చుట్టూవున్న అరణ్యంలో ప్రతిధ్వనించింది.

పొగ, దుమ్ము అణిగింది. ఇదివరకు మిట్టగావున్న చోట ఇప్పుడో పెద్దగొయ్యి పడింది. రాళ్ళూ, మంచు ముక్కలూ ఎంతో దూరంవరకూ చెదిరిపడ్డాయి.

ప్రేలుడుమూలంగా ఏర్పడ్డ గోతివేపు జనం పారలూ, పలుగులూ తీసుకొని పరుగెత్తేరు.

* * *

జకరయ్ వెళ్ళిపోయేక పని ముందు పూర్తిచెయ్యాలని దళాలమధ్య పోటీ ప్రారంభమైంది.

బాగా రాత్రివుండగానే కోర్చాగిన్ చప్పుడుకాకుండా లేచేడు. ఇతరులులేవకుండా పిల్లిలా అడుగులు వేసుకుంటూ వంటశాలలోకి వెళ్ళేడు. మంచులావున్న సిమెంటునేలమీద తిమ్మిరెక్కిపోయినకాళ్ళు ఆనుతున్నదికూడా ఆతనికి తెలియడంలేదు. పొయ్యివెలిగించి టీ తయారుచేసి, తన దళాన్ని లేపడానికి వెళ్ళేడు.

మిగతా దళాలవాళ్ళంతా లేచేసరికి తెల్లగా తెల్లారిపోయింది.

ఆరోజువుదయం దుబావాదళం చల్దులు తింటూవున్నప్పుడు పాంక్రాటోవ్ వచ్చేడు. ఆతడు మహోవ్రేకంతో "చూసేవా మిత్యా" అన్నాడు దుబావాతో.

తెల్లవారకుండానే పావ్కా తన దళంవాళ్ళని తీసుకు పోయేడు. ఈపాటికి వాళ్ళు పది సాజెనేలయినా వేసేసి వుంటారు. నే చెప్తున్నా విను. ఇరవయ్యోయిదో తేదీకి తమపని పూర్తిచేసెయ్యాలని రైల్వేకార్ఖానా కుర్రాళ్ళందరికీ కిరికిర్రంచేడట. మనల్నందర్నీ దిగతొక్కాలనికాబోలు. అదేం సాగదు.''

దుబావా వ్లూనహాసంచేసేడు. రైల్వేకార్ షాప్ వాళ్ళు చేసినపనికి ఈతని కింత అక్కసు ఎందుకో తెలుసు. అసలు విషయం ఆతనిస్నేహితుడు పావెల్ మిగిలిన అందరిమీదా సొడ్డువేసేడు. ఒక్కమాటేనా చెప్పకుండా అక్కడున్నవాళ్ళందర్నీ సవాలుచేసేడు.

స్నేహితుడుకానీ, మరొకళ్ళుకానీ నెగ్గినవాడే ఉత్తముడు— అన్నాడు పాంక్రాటోవ్.

నడిమధ్యాహ్నమప్పుడు కోర్చాగిన్ దళం మంచి పట్టుగా పనిచేస్తున్నసమయంలో విఘ్నం వచ్చింది. రైఫిళ్ళ వద్ద కాపలాగా నిలబడ్డ సెంట్రీ దూరాన అడవిలో కొందరు గుర్రపురౌతులు తమవేపుగా వస్తూండడంచూసి హెచ్చరికకై తుపాకీ కాల్చేడు.

పావెల్ వెంటనే అందర్నీ పిలిచేడు.

''బందిపోట్లు! తుపాకులు తియ్యండి.''

ఆతెడు తనచేతిలోవున్న పార క్రిందపారేసి, కొమ్మకి తగిలించిన మాజర్ అందుకోడానికై చెట్టువేపుగా పరుగెత్తేడు.

మిగిలినవాళ్ళుకూడా చటుక్కున రైఫిళ్ళు అందుకొన్నారు. రైలుబాట అంచువెంబడే మంచుల్లో బోరగిలా

పడుకొని రక్షణ తీసుకొన్నారు. గుర్రాలమీద వస్తున్న వాళ్ళు దూరంనుంచే టోపీలువూపుతూ ఏదో సంజ్ఞ చేసేరు.

"కామ్రేడ్స్! కాల్చకండి. ఆగండి."

బుడెన్నీటోపీలు, దానిమీద ఎర్రని నక్షత్రాలతో ఏభయిమంది రోడ్డు ఎక్కేరు.

పనిప్రదేశాన్ని చూసుకోవడానికై వుజూరేవ్‌స్కీ రెజిమెంటుకు సంబంధించిన దళం అది. ఆ దళనాయకుడి గుర్రం చాల అందంగావుంది. నుదుటన తెల్లనిమచ్చ. నలువుకుతిరిగిన ఎరువురంగు గుర్రం. దాని ఒక చెవి చివరి భాగం తెగిపోయింది. పావెల్ ముందుకెళ్లి కళ్ళెం పట్టుకొన్నాడు. గుర్రం సంకోచంతో పక్కకు అడుగువేసి నిలబడింది.

"ఓలిస్కా! మళ్ళీ కనబడతావనుకోలేదే." — అంటూ పావెల్ మెడ కౌగలించుకొని ముఖం తట్టేడు.

దళనాయకుడు పావెల్‌వంక ఒక్కక్షణం పరీక్షగా చూసేడు. మనిషిని గుర్తుపట్టేడు.

"కోర్చాగిన్ కాదూ! గుర్రాన్ని గుర్తుపట్టగలిగినవాడివి నీ పాతస్నేహితుడు సెరె దాని గుర్తుపట్టలేకపోయేవా? బాగున్నావా?"

* * *

ఈలోపున రైల్వేలైన్ నిర్మాణాన్ని త్వరితపరచడానికై ఆదుర్దా పట్టణంలో ఎక్కువైంది. అది నిర్మాణంలో కూడా కనబడసాగింది. కామ్సోమాల్ జిల్లాకమిటీలోవున్న

మగవాళ్ళనందరినీ జార్యా హడావిడిగా బోయార్కాకు రవాణా చేసేసు. సోలోమెంకాలో ఆడవాళ్ళుమాత్రమే మిగిలేరు. రైల్వేస్కూలునుంచి కొంతమంది విద్యార్థుల్ని కూడా పంపేటట్లు చేసేడు.

తను చేసినదానిని అకీమ్‌తో చెప్తూ హాస్యమాడేడు.

"స్త్రీకార్మికులుమాత్రమే మిగిలేరు. నా కుర్చీలో తాల్యాలగూటినాను కూర్చోబెట్టి, గుమ్మంలో 'మహిళాశాఖ' అని బోర్డు తగిలించెయ్యాలి. తిన్నగా బోయార్కాకి పోవాలి-అని ఆలోచిస్తున్నా. ఇంతమంది ఆడవాళ్ళమధ్యన మగాణ్ణి నేనొక్కడినీ వుండడం ఎల్లాగోవుంది. వాళ్ళ చూపులు చూస్తే ఒంటిమీద జెర్రులు పాకుతున్నట్లుంటూంది. 'అందర్నీ తోలేసి తానొక్కడూ బైరాయించేడు' — అన్నట్లుంటాయి ఆ చూపులు. ఇంకా ఏమనాన్న తిట్టుకొంటున్నారో ఏమో. నువ్వు నన్ను వదిలిపెట్టాలి."

కాని, అకీమ్ నవ్వివూరుకున్నాడు.

బోయార్కాకు కొత్తపనివాళ్ళు వస్తున్నారు. రైల్వే పాఠశాలనుంచి అరవైమంది వచ్చేరు.

రైల్వేఅధికారులతో జకరయ్ మాట్లాడి కొత్తవాళ్ళు బసచేయడంకోసం నాలుగు పెట్టెలు పంపేటట్లుచేసేడు.

దుబావాదళాన్ని పనిలోంచితీసి, ఇంజన్లూ, అరవయ్యయిదు మూతలేసి రైలుకార్లూ తీసుకురావడానికై పుష్చావోదిత్సాకు పంపేరు. ఇదికూడా వాళ్ళవంతు పనిలో భాగంగానే లెక్కకడతామన్నారు.

వెళ్లేముందు దుబావా తోకరేవ్‌ను పిలిచి, క్లావిసెక్‌ను పట్టణంనుంచి రప్పించమనీ, కొత్తగావచ్చినవాళ్ళదళం ఒకటి ఆతని బాధ్యతలో వుంచమనీ సలహా ఇచ్చాడు. తోకరేవ్ వెంటనే ఆ విధంగాచేసేడు. దుబావా కోరికలోని ఆంతర్యం ఆతనికి తెలియదు. కొత్తగావచ్చినవాళ్ళు తమతో ఒకజాబు తెచ్చేరు.

సోలోమెంకానుంచి అన్నా వ్రాసిందది :

డిమిట్రీ! నీకోసం నేనూ క్లావిసెకూ కలిసి పుస్తకాలు ఏరి తీసేం. నీకూ, అక్కడ పనిచేస్తున్న వీరశ్రామికులకూ అభివందనలు. మీరంతా మహాగట్టివాళ్లు. ఓపిగ్గా పని చెయ్యండి. నిన్నటితో ఇక్కడున్న కలపకాస్తా చుప్తాగా పంచిపెట్టేసేం. క్లావిసెక్ నిన్నుఅడిగేనని చెప్పమన్నాడు. ఆతడు చెడ్డవాడు. బోయార్కాకు పంపవలసిన రొట్టెలన్నీ ఆతడే తయారుచేస్తున్నాడు. పిండి జల్లించడం, చోవి తయారుచెయ్యడం అన్నీ అతడే చేస్తున్నాడు. ఇంకెవళ్లనీ నమ్మి ఆపని వప్పచెప్పడు. ఎక్కడ సంపాదించేడో మంచి పిండి తెచ్చేడు. రొట్టె మహాబాగుంటూంది. సాయంకాలం లగూటినా, అర్త్యూఖిన్, క్లావిసెక్ అప్పుడప్పుడు జార్కూ వగైరా మన మిత్రులంతా నా గదిలో చేరుతుంటారు. అప్పుడప్పుడు చదివినా మొత్తంమీద అనేక విషయాలమీద, ముఖ్యంగా బోయార్కా గురించి చర్చలు ఎక్కువగా సాగిస్తూంటాం. తమరినికూడా పనికి రానివ్వలేదని ఆడపిల్లలకి తోకరేవ్ మీద కోపం పీకెల మట్టుకుంది. మిగిలినవాళ్ళల్లాగ మేంమాత్రం కష్టపడలేమా అంటారు. వాళ్లనాన్న చొక్కా

తొడుక్కొని వెళతా. ఎల్లా రానివ్వరో చూస్తానంటూంది తాల్యా.

"అది చెప్పినంతపనీ చెయ్యగలదిమాత్రం అవును. పావెల్ కోర్చాగిన్‌ను అడిగేనని చెప్పు.

అన్నా."

*　　　*　　　*

ఉన్నట్లుండి మంచుతుపాను వచ్చిపడింది. కారు మేఘాలు ఆకాశాన్నంతనీ మూసేసేయి. మంచు దట్టంగా కురుస్తూంది. చీకటిపడేసరికి గాలి అందుకుంది. చెట్లు వూగి పోతున్నాయి. మంచుపింజెల్ని విసిరికొడుతూ వూళలేస్తూంది.

తెల్లవార్లూ మంచుతుపాను విసురుతూనేవుంది. గదులలో తెల్లవార్లూ నెగళ్ళు మండుతూనేవున్నా జనం వొణికి పోతూనేవున్నారు. శిధిలం అయిపోయిన ఆ భవనపుగోడలు వేడిని నిలపలేకుండావున్నాయి.

పొద్దుట మోకాలిలోతు మంచులో దున్నుకుంటూ తమతమ సెక్షనులకు వెళ్ళవలసివచ్చింది. ఆకాశంలో ఇంత మబ్బు పిసరుకూడా లేదు. సూర్యుడు చరచరా ఎక్కి వస్తున్నాడు.

కోర్చాగిన్ తన బంటాను తీసుకొని తన సెక్షన్ లోని మంచు తీసెయ్యడానికి వెళ్ళేడు. చలికి మనిషి ఎంత బాధపడతాడో అప్పుడు తెలిసినంతగా మరెప్పుడూ అతనికి తెలియలేదు. ఓకునేవ్ ఇచ్చిన పల్చనికోటు చలి నాప లేకుండావుంది. కాలినున్న చధావుల నిండా మంచే. మంచులో

జారుతూంది. అవికూడా విచ్చిపోయేటట్లున్నాయి. చల్లని నేలమీద పడుకోవడంచేత మెడమీద రెండు పెద్దపెద్ద గడ్డలు లేచేయి. మెళ్ళో చుట్టుకొనేటందుకు తోకరేవ్ తన తుండు తెచ్చి యిచ్చేడు.

కళ్ళు నిప్పుల్లా వున్నాయి. మహా పట్టుదలగా మంచు పారతో కొట్టి, మంచుఎత్తి విసురుతున్నాడు. ఆ సమయంలో ప్యాసింజరు ట్రెయిన్ ఒకటివచ్చి స్టేషన్‌లో ఆగింది. ఇంజనులో నిప్పు దిగజారిపోయింది. ఎల్లాగో కళేబరాన్ని స్టేషనులో జేరవేసింది. బొగ్గుపెట్టెలో ఒక్క కర్రముక్కగాని, బొగ్గుపిసరుగాని లేదు.

కర్రో బొగ్గో ఇచ్చేరా వెళ్ళిపోతాం. లేదా సైడింగు ఖాళీ ఇవ్వండి. ఇంజనులో శక్తివుండగానే లాగించేస్తా"—నని ఇంజన్ డ్రైవరు స్టేషనుమాస్టరుకు కేకపెట్టిచెప్పేడు.

బండి సైడింగ్‌కు పోయినిలబడింది. ప్రయాణీకులకు పరిస్థితి చెప్పేరు. ఆ ఇంజనుతో బండిని అక్కడికి తేవడమే గగనమై పోయింది. ప్రయాణీకులు అరిచేరు, తిట్టేరు.

ట్రెయినుగార్డులు వెంటబడుతూంటేవెళ్ళి తోకరేవ్‌తో మాట్లాడమని స్టేషన్‌మాస్టరు ఆయనను చూపించి పంపేడు.

"నిర్మాణం పనిబాధ్యత అంతా ఆయనది. స్లెడ్జిమీద కలప తెప్పించి ఇవ్వవచ్చు. స్లీపర్లకోసం వాళ్ళు దుంగలు వాడుతున్నారు."

గార్డులు తోకరేవ్‌ను కలుసుకొన్నారు.

"ఇస్తాను. కాని దానికి పెలఇవ్వాలి. అది మాకలప కదా, ఎన్ని చెప్పినా మంచుతో మా పనిఅడ్డింది. మీ బండిలో కనీసం ఆరేడువందలమంది జనం వుంటారు. ఆడవాళ్ళనీ పిల్లలీని బండిలో వుండనివ్వండి. మగవాళ్ళనివచ్చి సాయంకాలందాకా మంచుతీసెయ్యమనండి. కలప ఇస్తాను. కాదంటారూ సంవత్సరాదిదాకా అందులోనే వుండమనండి, మా అభ్యంతరంలేదు."

* * *

తామున్న వేపుగా వస్తున్న జనాన్నిచూసి పావెల్ ఆశ్చర్యపడ్డాడు. వాళ్ళముందు తోకరేవ్ వస్తున్నాడు.

"చూడు ఆ జనం. ఇల్లాగే వస్తున్నారు, ఆడవాళ్ళు కూడా."

తోకరేవ్ పావెల్‌ను పిలిచేడు.

"ఇదిగో వందమందిజనం వస్తున్నారు. వాళ్ళకి పని చెప్పు. కూర్చోనివ్వకు."

వచ్చినవారందరికీ కోర్చాగిన్ పనిచూపించేడు. నీటుగా వున్న యూనిఫారం, బొచ్చుకాలరు, వెచ్చని కారాకుల్ టోపీ ధరించిన ఒకపొడుగుపాటి వ్యక్తి తనచేతిలోవున్న మంచుపార నావల విసిరికొట్టేడు. అతని ప్రక్కనే ఒకపడుచు వుంది. ఆమెకూడా విలువైన దుస్తులలోనే వుంది.

"నేను మంచు ఎత్తను. నాచేత ఈ పనిచేయించేటందు కెవరికీ అధికారంలేదు. నేను ఇంజనీరుని. అడిగితే ఈపనిచేయింపిస్తా. కాని, ఈ మంచు ఎత్తేటందుకు నీకూ,

నాకూ కూడ నిర్బంధం లేదు. రూల్సుకిది వ్యతిరేకం. ఈ ముష లాడు శాసనాన్ని ధిక్కరిస్తున్నాడు. అతనిని జైలులో పారేయించగలను.—" అంటూ ఆతడు పక్కనున్న పని వానిని పిలిచేడు.

"మీ మేస్త్రీ ఎవరు?

కోర్చాగిన్ వచ్చేడు.

"మీరు పనిచెయ్యడంలేదేం?"

ఆవ్యక్తి ఎంతో అసహ్యం పుట్టిపడేటట్లు పావెల్‌ను ఆపాదమస్తకం పరిశీలించేడు.

"నువ్వు ఎవరేం?"

"నేనో పనివాణ్ణి."

"నీతో నాకేం పనిలేదు. మీ మేస్త్రీయో, ఎవ రున్నారో పంపు..."

కోర్చాగిన్ కనుబొమ్మలు ముడిపడ్డాయి.

"మీకిష్టంలేకుంటే పనిచెయ్యకండి. కాని, మేము టిక్కట్టుమీద సంతకంపెట్టనిదే మిమ్మల్ని రైలు ఎక్క నివ్వరు. అది మా అధికారి ఆజ్ఞ."

"మీమాటేమిటమ్మా!"—అని ఆత డామెవంక తిరి గేడు. ఎదుట తోన్యాతుమనోవా. ఆతని కెంతో ఆశ్చర్యం కలిగింది.

చిరుగుగుడ్డలూ, తాళ్ళుకట్టిన చెప్పులూ, మెడలో దుళ్ళుగుడ్డా ఆతడూ తానెరిగిన పావెలేనని తోన్యా నమ్మ లేకపోయింది. ఆతని కళ్ళనుపట్టి తప్ప మనిషిని గుర్తుపట్టడమే

సాధ్యంకాదు. పావెల్ కళ్ళు నామె మరవలేదు. ఈమాదిరి మనిషినేనా తాను మొన్నమొన్నటివరకూ ప్రేమించినది ?

ఆమె యీమధ్యనే పెళ్ళిచేసుకొంది. మగనితోకలసి ఆయన ఉద్యోగపువూరు వెడుతూంది. ఆయన రైల్వేడిపార్టు మెంటులో మంచివుద్యోగంలోవున్నాడు. చిన్ననాడుప్రేమిం చిన మనిషి ఇల్లాదారిలో అగతగులుతాడని ఎవరనుకొం టారు ? ఆతనితో కరచాలనంచేయడానికి సందేహించింది. వాసిలీ ఏమనుకొంటాడోఏమో. కోర్చాగిన్ చివరికిల్లాతయా రయ్యేడేమిటి ? చివరకి కూలిపనిలోంచి బయటపడలేకపోయే డన్నమాట.

ఆమె సందేహిస్తూ నిలబడింది. తనభార్యవేపు వీడె వడో తేరిపారచూస్తున్నాడే అనే కోపంతో రైల్వేఇంజనీరు విసురునవెళ్ళి ఆమెపక్క నిలబడ్డాడు.

"తోన్యా! పోదాం నడు. ఈ లాజరోస్నిని చూస్తేనే మంటపుట్టుకొస్తూంది."

గైసెప్పీ గారీబాల్డీచదివిన కోర్చాగిన్‌కు లాజరోస్ని ఎవరో తెలుసు.

" నేను లాజరోస్నినైతే కావచ్చు కాని నువ్వు వట్టి బూర్జువా ఛండాలుడివి."

కోర్చాగిన్ ఈమారు తోన్యావంక తిరిగేడు.

"కామ్రేడ్ తుమనోవా ! పారతీసుకో. ఈ ఆంబోతా నీకు ఆదర్శం... క్షమించు నీకేమన్నాబంధువు కాదుగద !"

పావెల్ ఆమె కాళ్ళనున్న బొచ్చుబూట్లవంకచూసి చిరునవ్వు నవ్వేడు.

"మీరు ఇక్కడ నిలబడ్డం అట్టే క్షేమంకాదు. మొన్న రాత్రే బందిపోట్లదాడి జరిగిం దిక్కడ."

మారుమాటకు అవకాశం ఇవ్వకుండా అతడు వెను తిరిగి పోయేడు. చిరిగిపోయిన చర్మావు మడమ ఈడిగిలబడుతూ ఆతని నడకను దిగపీకుతూంది.

పావెల్ ఆఖరుమాటలతో రైల్వేఇంజనీరు బుర్రతిరి గింది. తోన్యాకూడా ఆతడు ఆగి, పనిచేసేటట్లు చేయగలి గింది.

సాయంకాలం పనిముగియగానే బాటసారులంతా స్టేషన్ వేపు బయులుదేరేరు. బండిలో చోటుండదేమోనని తోన్యా భర్త అందరికన్నాముందే పరుగెత్తేడు. తనవెనకనేవున్న పనివాళ్ళకి దారివదలి తోన్యాపక్కకు నిలబడింది. వెన కాల బాగా అలసిపోయి కాళ్ళుఈడ్చుకుంటూ పావెల్ వస్తున్నాడు.

ఆమె ఆతనిపక్కనే నడుస్తూ "పావ్లూషా" అని పిలి చింది.

"నువ్వు ఈ స్థితిలోవుండగా చూడవలసివస్తుందని నేనెప్పుడూ అనుకోలేదుసుమా. ఇంతకన్న సులువుపని ఇవ్వవలసింది నీకు. ఈపాటికి ఏ కమీసారువో అయివుంటా వనుకున్నా. ఎంత దురదృష్టవంతుడివి..."

పావెల్ నిలబడి ఎంతో ఆశ్చర్యంతో ఆమె నెగాదిగా చూసేడు.

"అంత ... వన్నెల విసనకర్రలా తయారవుతావని నేనూ అనుకోలేదు..."

తోన్యా చిన్నపుచ్చుకుంది.

"మాటమురుసుతనం పోనిచ్చుకున్నావు కాదు."

అంతవరకూ నేలనానించి నడుస్తున్న పారను భుజాని కెత్తుకొని కోర్చాగిన్ పదడుగులు వేసి నిలబడ్డాడు.

"నీ వినయం కన్నా నా దురుసుమాట ఎక్కువబాధ కలిగించదులే కామ్రేడ్! ఇంక నా బ్రతుకునుగురించి నువ్వేం విచారపడకు. చెడిపోయిందేమీ లేదు. అసలు చెడినది నీ జీవితం. ఇల్లా తయారవుతావని నేనెన్నడూ అనుకోలేదు. రెండేళ్ళక్రితం ఇల్లాగే వున్నావా? కూలివాడితో కరచాలనం చేయడానికి సందేహించేవుండేదానివా? ఈ వేళ కలరావుండలతో వాసన ఎత్తిపోతున్నావు. నిజానికి మన ఇద్దరిమధ్యా మాటలకేం అవకాశంలేదు."

*　　　*　　　*

ఆర్టెమ్ తాను పెళ్ళిచేసుకోబోతున్నాననీ, పెళ్ళికి తప్పకరావలసిందనీ పావెల్‌కు జాబు వ్రాసేడు.

ఉత్తరం చదువుతూంటే గాలివిసురుకు చేతిలోనికాగితం ఎగిరిపోయింది. ఇప్పుడు పెళ్ళివేడుకలూ లేవు. ఏమీ లేవు. ఈపరిస్థితులలో కదలడానికి వీలా? నిన్ననే పాంక్రాటోవ్ దళం మహావేగంగా పనిచేసి ముందుకు సాగిపోయింది. ఎల్లాగేనా మొదటివాడుగా రావాలని ఆతని ప్రయత్నం. వెనకటిలా 'పోనీలే' అన్నట్లులేదు. తనదళంవాళ్ళని తరుముతున్నాడు.

జనం పనిలోచూపుతున్న పట్టుదలచూసి పాటోష్కిన్ బుర్రగోక్కున్నాడు. "వీళ్ళు మనుష్యులా, రాక్షసులా?"–

అని ఆతని ఆశ్చర్యం. "వీళ్లకీబలం ఎక్కడిది? ఎనిమిది రోజులపాటు వాతావరణంలో మార్పురాకుండావుంటే కలప కొట్టుళ్ళదగ్గిర కెళ్లిపోతాం." నిజంగా చూడతగిందవును. వీళ్ళు అంచనాలు, వ్యూహాలు మించి పనిచేస్తున్నారు."

తాను తయారుచేసిన రొట్టెలు ఆఖరుమూటలు తీసుకొని క్లావిసెక్ నగరంనుంచివచ్చేడు. వస్తూనే తోకరేవ్‌తో మాట్లాడేడు. అక్కడినుంచి కోర్చాగిన్‌ను వెతుక్కుంటూ బయలుదేరేడు. ఆతనిని కలుసుకోగానే అమితానందంతో కరచాలనంచేసేడు. క్లావిసెక్ మూటలోంచి స్వీడన్‌లో తయారుచేసిన అందమైన చర్మంకోటు పైకితీసేడు. మెత్తని బొచ్చుచర్మంతో దానికి లైనింగ్ వేసేరు. క్లావిసెక్ ఎంతో అభిమానంతో చర్మాన్ని చేతితో దువ్వేడు.

"ఇదిగో, ఇది నీకే. ఎవరిచ్చేరో తెలుసా? చెప్పుకో! ఎరగవు? చెప్పుకోలేవు? వట్టిమొద్దువన్నమాట. కామ్రేడ్ ఉస్తినోవిచ్ నీ వెక్కడ కొంకరించుకుపోతావోనని దీనిని పంపింది. ఓల్షిన్‌స్కీ దీని నామెకిచ్చేడట. అల్లా ఆతని చేతిలోంచి తీసుకొని నీకిమ్మని సరాసరి నాచేతిలో పెట్టింది. ఓసన్నని చొక్కాతో మంచులో నువ్వు పనిలోకి పోతున్నావని అకిమ్ చెప్పేడు. తానిచ్చిన కోటు ఇల్లాపంపుతూంటే చూసి ఓల్షిన్‌స్కీ వెర్రిమొగంవేసేడు. "నేనాకామ్రేడ్‌కి ఒక మిలిటరీకోటు పంపిస్తా" నన్నాడు. కాని రీటా నవ్వేసింది. "ఫర్వాలేదులే. ఈకోటుతోడుక్కుంటేనే బాగా పని జరుగుతుంది."—అంది.

పావెల్ ఆశ్చర్యపడ్డాడు. ఒక్క నిముషం ఆలోచించి చాల ఖరీదయిన ఆకోటు తొడిగేసుకొన్నాడు. తొడిగే తొడగడంతో చలికి మొద్దుబారిన చేతులూ, గుండెలూ వెచ్చబడినట్లయింది.

* * *

రీటా తనడైరీలో వ్రాసింది.

డిసెంబరు, 20.

వరసన ఒకదాని తర్వాత మరొకటిగా మంచుతుపానులు. మంచూ, హోరుగాలీను. బోయార్కాలో ఇంచుమించు పని ఆఖరుకావచ్చింది. ఇంతలో ఈతుపానులువచ్చి పని ఆగింది. పీకలమట్టుకు మంచులో దిగబడి పోతున్నారు. రాయిలా బిగిసిపోయిన నేలని తవ్వడం మాటలుకాదు. ఇంకొక్క ముప్పాతిక కిలోమీటరుదూరం మిగిలింది. కాని, అదే మరీ కష్టంగా వుంది.

జనంలో టైఫాయిడ్ జ్వరం బయలుదేరిందని తోకరేవ్ వ్రాసేడు. అప్పుడే ముగ్గురు మనుష్యులు పక్కేసేరట."

డిసెంబరు, 22.

కామ్సోమాల్ గుబర్నియా కమిటీ విస్తృత సమావేశం జరిగింది. బోయార్కానుంచి ఎవ్వరూ రాలేదు. అక్కడికి పదిహేడు కిలోమీటర్ల ఆవల బందిపోటు దొంగలు ధాన్యపురైలు కూలదోసేరు. రైలుకట్టపనిలోవున్నవాళ్ళందరినీ అక్కడికి వెళ్ళమని ఆహారశాఖప్రతినిధి ఆజ్ఞలు పంపేడు.

డిసెంబరు, 23.

బోయూర్కానుంచి మరో ఏడుగురు టైఫాయిడ్ రోగుల్ని హాస్పిటలుకి తీసుకొచ్చేరు. వాళ్ళల్లో ఓకునేవ్ ఒకడు. ఖార్కోవ్‌నుంచి వస్తున్న రైలులో మెట్లమీద కూర్చుని ప్రయాణంచేస్తూ చలికి కొంకరించుకొని చాలమంది చచ్చిపోయూరు. ఆ శవాల్ని తీసేస్తూంటే చూసేను. హాస్పిట ళ్ళలో ఒక్క నెగడి మండటంలేదు. ఈ దిక్కుమాలిన మంచు తుఫానులు ఎల్లా పోతాయో గాని?

డిసెంబరు, 24.

జకరయ్‌ని ఇప్పుడే చూసేను. నిన్నరాత్రి ఆర్లికూ, ఆతనియూవత్తు బందిపోటు బలగమూ బోయూర్కామీద దాడిచేసినాడన్నవార్త నిజమేనని చెప్పేడు. రెండుగంటల సేపు యుద్ధంసాగింది. తీగెలు తెగిపోయేయి. తెల్లవారేవరకూ జకరయ్‌కికూడా అసలువార్త వివరంగా తెలియదు. బందె పోట్లని తరిమేశారు. కాని తోకరేవ్ గాయపడ్డాడు. తూటా రొమ్ములోంచిపోయింది. ఈవేళ పట్టణంలోకి ఆయనను తీసు కొస్తారు. ఫ్రాంజ్ క్లావిసెక్ రాత్రి గార్డుదళంనాయకుడు. ఆతడు చచ్చిపోయేడు. దొంగల్ని మొదటచూసి హెచ్చరిక ఇచ్చి నది ఆతడే. దొంగలమీద అతడు కాలుస్తూనేవున్నాడు. కాని బిల్డింగులోకి వెళ్ళేలోపుగానే మీదపడిపోయేరు. క్లావి సెక్‌ను నరికేసేరు. పనివాళ్ళలో పదకొండుమంది గాయ పడ్డారు. ఈపాటికి రెండుస్క్వాడ్రన్ల గుర్రపుసైన్యమూ, ఒక సాయుధరైలూ అక్కడికి చేరుకొనే వుంటాయి.

"నిర్మాణంబాధ్యత పాంక్రాటోవ్ చేతిలోపెట్టేరు. ఈవేళ గ్లూబోకీ గ్రామంలో దాగివున్న బందిపోటుగుంపులో ఒకభాగాన్ని ఫుజూరేవ్‌స్కీ చుట్టుముట్టి పూర్తిగా తుడిచిపెట్టేసేము. పార్టీకి సంబంధించని కొందరుపనివాళ్ళు రైలు కోసంకూడా చూడకుండా, రైలురోడ్డువెంబడే నడిచిబయలు దేరేరు.

డిసెంబరు, 25

గాయపడ్డ తోకరేవ్‌నూ, తదితరుల్నీ తీసుకొచ్చి హాస్పిటలులో చేర్చేరు. ముసిలాడిని బ్రతికించగలమని డాక్టర్లు అంటున్నారు. ఆతడికింతవరకు స్మృతిరాలేదు. మిగిలిన వాళ్ళకి ప్రాణభయంలేదు.

మాకూ, గుబర్నియాకమిటీకీ బోయార్కానుంచి టెలిగ్రాంవచ్చింది–"బందిపోటుదొంగల దాడికి సమాధానంగా మేమూ, సాయుధరైలులోని సైనికులూ, గుర్రపుసైన్యంలోనివాళ్ళూకలిసి సమావేశం జరిపేము. దానిలో ఎన్ని కష్టాలువచ్చినా చిన్నరైలుదారిని పూర్తిచేసి జనవరి ఒకటో తేదీకి పట్టణంలోకి వంటచెరుకుతేవాలనీ తీర్మానించుకున్నాము. జనాన్నిఅందరినీ సమీకరించి పనికి పూనుకొంటున్నాం. కమ్యూనిస్టుపార్టీ జిందాబాద్ !

సమావేశం అధ్యక్షుడు : కోర్చాగిన్.

కార్యదర్శి : బెర్జిన్.

క్లావిసెక్‌కు సైనికమర్యాదలతో సోలోమెంకాలో అంత్యక్రియలు జరిగేయి.

* * *

గమ్యం చాల సన్నిహితం అయింది. కాని పని బహు నెమ్మదిగా జరుగుతూంది. ప్రతిదినం చాలమంది టైఫాయిడ్‌తో పక్క లేస్తున్నారు. పనిలో అవసరంగా వున్న చేతులు లోటవుతున్నాయి.

ఒకరోజున తూలిపోతూ కోర్చాగిన్ స్టేషనుకివచ్చేడు. ఆతనికి కాళ్ళు నిలబడ్డంలేదు. కొద్దిరోజులనుంచి జ్వరం వస్తూంది. తోసుకు తిరుగుతున్నాడు. కాని, ఈవేళ కదల లేకుండావున్నాడు.

అదివరకే టైఫాయిడ్‌తో పనివాళ్ళసంఖ్య తగ్గిపోతూంటే ఇప్పుడు మరొకడు రోగపడ్డాడు. కాని, పావెల్ శత బండ. జ్వరంవస్తూన్నా నాలుగైదురోజులు ఏలాగో ఓపిక చేసుకొని అందరితోపాటు పనిలోకి వెళ్లేడు. కాని, ఈవేళ మరి ఆతని బండతనం పనిచెయ్యలేదు. కోటుతొడిగినా, జక రయ్ ఇచ్చిన బూట్లుతొడిగినా చలి ఆగడంలేదు.

అడుగు వేసినప్పుడల్లా గుండెల్లో శూలంపుచ్చుకు పొడిచినట్లు బాధ. పళ్ళు కటకటలాడిపోతున్నాయి. కళ్ళు తిరిగిపోతున్నాయి.

ఎల్లాగో కాళ్లు ఈడ్చుకొంటూ స్టేషన్‌లోకి చేరుకొన్నాడు. అక్కడేదో హడావిడిగావున్నట్లుతోచి నిలబడ్డాడు. జ్వరంతో కళ్ళు ఎఱ్ఱబడిపోయివున్నాయి. అతికష్టంమీద కళ్ళుతెర చేడు. ప్లాట్‌ఫారంపక్కన పొడుగునా గుడ్సుబండి నిలబడి వుంది. దానివన్నీ గూడులేని ప్లాట్‌కార్‌లే. వాటినుంచి సన్న రైలుదారికి కావలసిన పట్టాలనీ స్లీపర్లనీ జనందింపుతున్నారు. చూస్తూనే పావెల్ తూలిపోయేడు. బోర్లాపడ్డాడు. తల నేలని

కొట్టుకున్నప్పటి నెప్పీ, జ్వరంతో కాలిపోతున్న ముఖానికి మంచునేల తగిలినప్పుడు హాయి అనిపించిన చల్లదనమూ...

ఎన్నో గంటలకి ఆతనినిచూసి, బారకాసులకి తీసుకుపోయేరు. మనిషి వొళ్ళెరగడు. తెగ ఆయాసపడుతున్నాడు. సాయుధరైలులోవున్న చిన్నడాక్టరు వచ్చిచూసేడు. టైఫాయిడూ, న్యుమోనియా కలిసివున్నాయని చెప్పేడు. జ్వరం నూటఆరు డిగ్రీలుంది. కీళ్ళువాచేయి. మెడమీదపుళ్ళు. కాని డాక్టరు వాటివలన ప్రమాదంలేదనీ, న్యుమోనియా, టైఫాయిడ్ లు ప్రాణంతీయడానికి చాలుననీ అన్నాడు.

పట్టణంనుంచి తిరిగివచ్చిన పాంక్రాటోవ్, దుబావాలు పావెల్ ను బ్రతికించడానికై శాయశక్తులా పనిచేస్తున్నారు.

పావెల్ వూరివాడే అయిన అల్యోషాకోఖాన్ స్కీకి వప్పచెప్పి ఆతనిని వాళ్ళఇంటికి చేర్చమన్నారు.

కోర్చాగిన్ దళంవాళ్ళంతా వచ్చేరు. ఖోల్యావా పొట్టేలులా జనాన్నితోసుకుంటూ లోపలజొరబడ్డాడు. వాళ్ళని చుట్టూపెట్టుకొని పాంక్రాటోవ్, దుబావాలు ఏలాగో కష్టంమీద కిక్కిరిసిపోయివున్న రైలుపెట్టెలోకి పావెల్ను జేరవేసేరు. ప్రయాణీకులు ఆతడు టైఫస్ రోగి అని అనుమానించేరు. లోపలికి రానివ్వమన్నారు. దారిలో కిటికీలోంచి బయటికి తోసేస్తామన్నారు.

ఖోల్యావా తుపాకీ తీసేడు. "ఇది అంటురోగంకాదు. మిమ్మల్నందర్నీ బయటకిఈడ్చివేసి అయినా ఇతణ్ణి రైలులో

పంపుతాం. జాగ్రత్త. రైలుస్టేషన్లన్నిటికీ కబురుచేస్తున్నా. ఆతనిమీద చెయ్యిపడిందంటే ఇంతమందినీ బొక్కలో తోయిస్తా. ఇదిగో అల్యోషా! పావ్కామాజర్ తీసుకో. దగ్గిర కెవడువచ్చినా కాల్చిపారెయ్యి.''

బుస్సుమంటూ రైలు స్టేషనులోంచి బయలు దేరింది. నిర్జనంగావున్న ప్లాట్‌ఫారంమీద దుబావా నిల్చుని రైలు పోయినవేపే చూస్తున్నాడు. పాంక్రాటోవ్ ఆతనిదగ్గిర కెళ్ళేడు.

''బతికి బట్టకడతా డంటావా?''

ఆ ప్రశ్నకు సమాధానం రాలేదు.

''మిత్ర్యై. నడు. ఏంచేస్తాం. ఇంక బాధ్యత అంతా మనమీద వుంది. ఆబళ్ళన్నీ రాత్రి దింపించి పొద్దుటే ఇంజన్లలో నిప్పువేయిద్దాం.''

రోగపడి రైలులో ప్రయాణంచేస్తున్న కోర్చాగిన్‌ను ఎక్కడా ఎవ్వరూ దింపకుండా చూడవలసిందని ఖోల్యావా రైలుదారి పొడుగునావున్న చెకా మిత్రులకు తంతివార్తలు పంపేడు. వాళ్ళు అలాగే అని తిరుగువార్త పంపేవరకు నిద్రకుపడలేదు.

*　　　*　　　*

రైలుమార్గంలో దిగువన ఒక జంక్షన్‌లో గుర్తుతెలియని ఒకయువకుని శవాన్ని బండిలోంచితీసి ప్లాట్‌ఫారంమీద పడేసేరు. ఆతడెవరో, చావుకు కారణం ఏమిటో ఎవరూ ఎరగరు. స్టేషన్‌లోని చెకావుద్యోగులు ఖోల్యావా తంతి గుర్తుచేసుకొని, పరుగెత్తివెళ్ళేరు. చనిపోయిన ఆ యువకుడి

శరీరాన్ని 'మోర్గ్' (శవాలను పెట్టేగది)కు పంపించి, ఖోల్యా వాకు అతనిమిత్రుడు చనిపోయేడని తంతిపంపేరు.

కోర్చాగిన్ మరణవార్త బోయార్కానుంచి గుబర్నియా కాంసోమాల్ కమిటీకి తంతిద్వారా తెలియపరచబడింది.

ఈలోపున అల్యోషాకోఖానస్కీ పావెల్‌ను అతని యింట్లో దిగబెట్టి, తాను జ్వరపడి మంచంఎక్కేడు.

జనవరి, 9.

ఎందుకు నాకీ బాధ? ఇదిరాస్తూంటే ఏడుపొస్తూంది. రీటా ఏడుస్తుందనీ, అంతబాధ పడుతుందనీఅంటే ఎవరన్నా నమ్ముతారా? కన్నీళ్ళు బలహీనతకు నిదర్శనమా? నాకన్నీళ్ళీవేళ మనస్సు కోతఫలితాలు. విజయం లభించింది. చలిబాధ భయంతగ్గింది. రైలుస్టేషన్లన్నింటా వంటచెరుకు పుష్కలంగా పేర్చివుంది. విజయోత్సవంజరిగింది. నగరసోవియటు విస్తృత సమావేశంలో రైలుదారి నిర్మాణంలో పాల్గొన్న యోధులందరికీ సన్మానం జరిగింది. ఇటువంటిరోజున నాకీ దుఃఖం ఏమిటి? ఈ విజయసాధనలో ఇద్దరు ప్రియమిత్రులు క్లావిసెక్, కోర్చాగిన్ ప్రాణాలుబలిఇచ్చేరు.

పావెల్ మరణవార్తతో నా కళ్ళువిడ్డాయి. ఆతడు నాకంతప్రేమపాత్రుడనే సంగతిని నేనింతవరకు గుర్తించనేలేదు.

ఇంకీ డైరీ ఆపుతా. మళ్ళీ తెరుస్తాననే నమ్మకంలేదు. యూక్రేనియన్ కామ్‌సోమాల్ కేంద్రకమిటీలో ఉద్యోగం ఇస్తానన్నారు. అంగీకరిస్తూ రేపే ఖార్కోవ్‌కు వ్రాస్తా.

# ప్రకరణం 3

కాని పడుచు రక్తం విజయం సాధించింది. పావెల్ టైఫాయిడ్ జ్వరంనుంచి బయటపడ్డాడు. నాలుగోసారి చావుతప్పి బయటపడ్డాడు. కాని, ఆతడు మంచందిగి క్రింద కాలుపెట్టేసరికి నెల తిరిగివచ్చింది. బక్కచిక్కేడు. పాలిపోయేడు. కాళ్ళలో పట్టులేదు. గోడ ఆసరా చేసుకుని తూలుతూ నడిచేడు. తల్లి సాయంతో వెళ్ళి కిటికీపద్దచాలసేపు నిలబడ్డాడు. వసంతోదయ మయింది. ఎండ వేడికి కరిగిన మంచునీరు రోడ్డు మీద పల్లాలలో చేరి ఎండలో మిలమిలలాడుతూంది. ఆ రోజునే మంచు కరగడం ప్రారంభమయింది.

కిటికీకి ఎదురుగా చెర్రీచెట్టు కొమ్మమీద కూర్చుని పిచిక ఒకటి జూలు సవరించుకొంటూనే మధ్యమధ్య పావెల్ వేపు అనుమానంగా చూస్తూంది.

పావెల్ నెమ్మదిగా వ్రేలితో కిటికీతలుపుమీద కొట్టేడు.

"నువ్వూ నేనూ శీతాకాలపు గండంగడిచి బయటపడ్డా మన్నమాట."

ఆతని తల్లి ఉలికిపడింది.

"ఎవరితోటిరా మాటలు!"

"పిచిక... అదిగో చూడు, ఎగిరిపోతూంది."-అంటూ పావెల్ మందహాసం చేసేడు.

వసంతరుతువు సగం గడిచేసరికి పావెల్ మళ్ళీ పట్నం పోవాలనే ఆలోచనలో పడ్డాడు. మనిషికి నడవగల ఓపిక వచ్చింది కాని, ఏదో అనారోగ్యం ముంచుకొస్తూంది. ఒక రోజున దొడ్డిలో నడుస్తూంటే వెన్నులో చెప్పలేనంత బాధ కలిగింది. కాళ్ళు నిలబడ్డంలేదు. అతికష్టంమీద గదిలోకి చేరగలిగేడు. మరునాడు డాక్టర్లు జాగ్రత్తగా పరిశీలించేరు. వీపు పరీక్షిస్తుండగా డాక్టరుకు వెన్నుపూసమీద లోతయిన గుంట కనిపించింది. ఆశ్చర్యం కలిగింది.

"ఈదెబ్బ ఎక్కడ తగిలింది?"

"రోవ్నో యుద్ధంలో. మూడంగుళాల ఫిరంగిగుండు ఒకటి మా వెనకాల రోడ్డుమీద పేలింది. ఆపేలుడులో ఒక రాయి ఎగిరివచ్చి వీపున తగిలింది."

"అయితే ఎల్లా నడవగలిగేవు? ఎప్పుడూ బాధకలిగించ లేదూ?"

"లేదు. దెబ్బతగిలేక గంటో, రెండుగంటలో లేవలేక పోయేను. తర్వాత నెప్పితగ్గింది. గుర్రం ఎక్కేను. మామూలుగానే సాగిపోయింది. ఆనాటికీనాడు ఈబాధ కనిపించింది."

ఆ గాయపుమచ్చ పరిశీలిస్తూ డాక్టరుముఖం చాల గంభీరమయింది.

"ఔనయ్యా! పరిస్థితి నాకేమీ నచ్చలేదు. వెన్నుపూసకి అంత దెబ్బతగలడం బాగులేదు. కానీ, ఇదివరకట్లేనే తగ్గిపోతుందేమో చూద్దాం."

పావెల్ చొక్కా తొడుక్కుంటూవుంటే డాక్టరు ముఖంలో సానుభూతీ, సంతాపమూ ప్రతిబింబించేయి.

*　　　*　　　*

ఆర్టెమ్ అత్తవారింట్లో వుంటున్నాడు. ఆతనిభార్య పేరు స్త్రోషా. చాల అమాయికంగా కనిపిస్తుంది. బీదరైతు కుటుంబంలోపుట్టి పెరిగింది. ఒకరోజున పావెల్ అన్నగారిని చూడబోయేడు. చెత్తా చెదారంతో అసహ్యంగావున్న చిన్నముంగిలివాకిట్లో మన్నుకొట్టుకొనివున్న చిన్నకుర్రవాడు గంతులేస్తున్నాడు. పావెల్ వాకిట్లో అడుగుపెట్టగానే వాడు నిలబెట్టేడు:

"ఏం కావాలి? ఏదన్నాఎత్తుకుపోదామనా? జాగ్రత్త! మా అమ్మ చంపేస్తుంది."

ఆ మాట వినబడగానే ఆ పాతఆకుటింటి కిటికీ ఒకటి తెరుచుకుంది. కిటికీలోంచి ఆర్టెమ్ తొంగిచూసేడు.

"రా రా. పావెల్"

పచ్చబడి బెరడులావున్నముఖమూ ఆవిడా ఒకముసిలిది పొయ్యివద్ద కూర్చునివుంది. పావెల్ పక్కనుంచి వెడుతూంటే ఆమె అయిష్టంగా కోరచూపుచూసి తలతిప్పుకొంది.

చిన్నచిన్న జడలువేసిన ఇద్దరు ఆడపిల్లలు పొయ్యి పక్కనున్న తిన్నెమీదకూర్చుని కొత్తవానివంక ఆశ్చర్యంతో చూస్తున్నారు.

బల్లవద్దకూర్చున్న ఆర్టెమ్ ఏదోచికాకుగా కనిపించేడు. తల్లికిగాని, తమ్ముడికిగాని తానీ పెళ్ళిచేసుకోడం ఇష్టంలేదని

ఆతడెరుగును. కొన్నితరాలనుంచి పట్టణాల్లో పనిచేసుకు బ్రతుకుతున్న కుటుంబం తమది. మూడేళ్ళపాటు పొరుగింటి తాపీమేస్త్రికూతురు గాల్యా అంటే మోజుపడి తిరిగేడు. ఆమె కూడా కుట్టుపని నేర్చుకొందిగాని వట్టినే లేదు. ఆమెను కాదని ఏమీ తెలియని ఈ మొద్దుని పెళ్ళిచేసుకొన్నాడు. అయిదు నోళ్ళకి ఆతడొక్కడే సంపాదన. పగలల్లా రైల్వేవర్కుషాపులో రెక్కలు ముక్కలు చేసుకొని, ఇంటికొచ్చేక మూలబడ్డ వ్యవసాయాన్ని పునరుద్ధరించడానికై నాగలి దున్నుతున్నాడు.

*　　　*　　　*

అన్నగారు పెటీబూర్జువా వాతావరణంలో పడిపోయేడని పావెల్ అనుకొంటున్నాడనీ, ఇప్పుడు అక్కడి పరిస్థితులను పరిశీలిస్తున్నాడనీ ఆర్టెమ్ ఎరుగును.

ఇద్దరు ఎరిగున్న వ్యక్తులు ఏదోదారిలో కలుసుకొన్నప్పుడు మాట్లాడుకొన్నట్లు అన్నదమ్ములిద్దరూ యాధాలాపంగా రెండుమాటలు మాట్లాడుకొన్నారు. కొంతసేపున్నాక పావెల్ వెడతానని లేచేడు. కాని ఆర్టెమ్ ఆపేడు.

“కాస్సేపుఆగు. తిండితిని పోదువుగాని. స్త్యోషా పాలు తెస్తుంది. అయితే రేపు వెడతానంటావు. బాగా వోపిక చేరిందా ?”

స్త్యోషా ఇంట్లోకివచ్చింది. పావెల్‌ను పలకరించి రెండు మాటలు చెప్పేక, పాకలోంచి ఏదో తేవాలనీ, సాయంపట్టడానికి రమ్మనీ ఆర్టెమ్‌ను పిలిచింది. ముటముటలాడుతున్న ముసలామె పావెలూమాత్రం అక్కడ మిగిలేరు. కిటికీలోంచి

దూరాన చర్చిగంటలు వినిపిస్తున్నాయి. అవి వినబడగానే ముసలామె చేతిలోని గరిట కిందపెట్టి గొణుగుడు ప్రారంభించింది.

"ఈదిక్కుమాలిన ఇంటిచాకిరీతో కాస్సేపు ప్రార్థన చేసుకోందామన్నా కుదిరిచావడంలేదు."

పావెల్ వంక ఓరగంటచూస్తూనే ఆమె పైనకప్పుకొన్న దుప్పటి చిలకకొయ్యకు తగిలించింది. మూలన ఒకబల్లమీద పొగచూరిపోయిన దేవతావిగ్రహాలున్నాయి. వాటిముందర పోయి నిలబడింది. పుల్లలమాదిరిగావున్న మూడు వేళ్ళదగ్గరగాపట్టుకొని, తన శరీరంమీద శిలువ గీసుకొంది.

పెదవులు కదుపుతూ నెమ్మదిగా ప్రార్థన సాగించింది.

"స్వర్గంలో నివసించే ఓ తండ్రీ నీకీర్తి అక్షయం..."

వాకిట్లో ఆడుకుంటున్న కుర్రవాడు అక్కడున్న ఒక నల్లపంది నడ్డిమీదకూర్చుని "చల్! చల్!" అంటూ చిన్ని మడమలతో దానిపక్కలలో పొడిచేడు.

పంది ఉలికిపడి దొడ్డిఅంతా పరుగులు ప్రారంభించింది. వీపునవున్న ఆ కుర్రవాడిని తోసెయ్యాలని దాని తాపత్రయం. కాని ఆ బండసన్యాసి పట్టువదలడంలేదు.

ముసలామె ప్రార్థన మాని కిటికీలోంచి బయటకు చూసింది.

"ఓరిభడవా! దిగు. నీచర్మం వొలిచేస్తా. నీదుంపతెగ."

పంది ఏలాగైతేనేం వీపుమీదవున్న బరువును దులపరించుకోగలిగింది. ముసలామె సంతృప్తిపడి మళ్ళీ బొమ్మల ముందు చేరింది.

"ఓ దేవా..."

ఆ కుర్రవాడు నెప్పితో ఏడుస్తూ, కళ్ళూ ముక్కూ వాచిపోతూంటే చొక్కాతో తుడుచుకుంటూ గుమ్మంలో హాజరయ్యేడు.

"అమ్మమ్మా! ఏదన్నా పెట్టవే..."

ముసలావిడ వానిని కసిరికొట్టింది.

"నేను ప్రార్థన చేసుకోవడం కనబడ్డంలేదట్రా గుడ్డి వెధవా! ఏమన్నా పెట్టాలి... ఉండు పెడతా..."

ఆమె బల్లమీదనున్న బెత్తం తీసేసరికి కుర్రవాడు క్షణంలో మాయమయిపోయేడు. పొయ్యి అరుగుమీదవున్న ఆడపిల్లలు కిచకిచలాడేరు.

మళ్ళీ ముసలావిడ దైవప్రార్థన ప్రారంభించింది.

పావెల్ లేచేడు. అన్నగారు వచ్చేవరకూ ఆగకుండా వాకిట్లోకి వచ్చేసేడు. కోరడి తలుపు జేరవేస్తూంటే ముసలావిడ మూలకిటికీలోంచి తనను పరీక్షగా చూస్తున్నట్లు కనబడింది.

ఆర్టెమ్ ఇక్కడ ఎల్లావచ్చి పడ్డాడు? ఇంకింతే. యావజ్జీవం హోప్పాయి. స్త్రోషా ఏడాదికో పిల్లని కని పడేస్తుంది. పేడలోపురుగులా ఆర్టెమ్ ఈ జంజాటంలో అతుక్కుపోతాడు. చివరకు వర్కుషాపుపని మానుకోడంకూడ తటస్థపడుతుందో ఏమో."

పావెల్ నిర్జనంగావున్న ఆ నగరవీధుల్లో నడుస్తూ అనేకవిధాల ఆలోచనలలో మునిగిపోయేడు.

"వాడిని రాజకీయాలలోకి లాగాలనుకొన్నాను."

మరునాడు ఈ చిన్నపట్టణం వదలి పెద్దపట్టణానికి పోతున్నాననీ, మళ్ళీ తన మిత్రుల్నీ సహచరుల్నీ కలుసు కొంటాననీ పావెల్ హుషారుపడ్డాడు. పెద్దపట్టణం ఆతనిని బాగా ఆకర్షించింది. ఎప్పుడూ సమ్మర్దంగావుండే ఆవీధులు, అంతులేని జనప్రవాహం, హడావిడి, ట్రాముల గణగణ, కార్ల అరుపులు ఆతని కేదో చెప్పలేనంత ఉజ్జీవం కలిగి స్తాయి. అన్నింటికన్నా పెద్దపెద్ద ఫ్యాక్టరీ బిల్డింగులు, పొగచూరినకార్ఖానాలు, యంత్రాల్నూ, ఝుమ్మని రొదచేసే ట్రాన్స్మిషన్ బెల్టులు మళ్లీ ఎప్పుడు కనబడతాయాయని ఆతనిమనస్సు కొట్టుకుపోతుంది. పెద్దపెద్ద ఫ్లైవీల్సుకోసం, యంత్రాల నూనెవాసనకోసం, ఆతనిమనస్సు ఉత్తప్తమవు తూంది. ఈచిన్నపట్టణం వీధుల్లోనడుస్తూంటే ఏదో దిగులుగా వుంది. పొరుగూరు వచ్చినట్లుంది. వీధుల్లో పగటిపూట నడుస్తున్నా ఏదో బాధగానేవుంది. గుమ్మాల్లో కూర్చుని బాతాఖానీవేసే ఆడవాళ్ళకబుర్లు వినకూడదనుకొన్నా చెవిని పడతాయి:

"ఎవరీ అక్కుపక్షి."

"క్షయరోగపక్షిలావున్నాడు."

"కోటు మంచిదే తొడిగేడు. ఎక్కడెత్తుకొచ్చేడో గాని."

అదేధోరణిలో వ్యాఖ్యానాలూ, ఉపాఖ్యానాలూ, అవన్నీ వింటూంటే పావెల్‌కు అసహ్యమనిపిస్తూంది.

చాలకాలమయింది, ఇవన్నీ మరిచిపోయి. తాను పని చేసి, స్నేహితుల్ని సంపాదించిన పెద్దపట్టణంతో ఏదో సన్నిహిత సంబంధం ఏర్పడింది.

అలా నడిచినడిచి పైన్ అడవివద్దకు వచ్చేసేడు. అక్కడ బాటచీలివుంది. కుడివేపున అడవికి ఆవల పాతజైలు గోడలమీద నాటిన ఇనప ఊచెలబారూ, దాని వెనక ఎత్తయిన తెల్లని భవనాలూ కనిపిస్తున్నాయి.

దానికి ఎదురుగావున్న మైదానంలోనే వాల్యాను వురితీసేరు. ఆమెతోటి వాళ్ళని కాల్చిచంపేరు. ఉరిస్తంభం నాటిన ప్రదేశానికి వెళ్ళి పావెల్ నిశ్శబ్దంగా ఒక్కనిముషం నిలబడ్డాడు. తర్వాత మిట్టఎక్కి, విప్లవ వ్యతిరేకుల దౌర్జన్యాలకు గురిఅయినవా రందరినీ సమాధిచేసిన గోతివేపునడిచేడు.

మరణించినవారి ప్రియబంధువులు ఎంతో ప్రేమగా నాటిన స్ప్రూస్ మొక్కల నీడల్లో సమాధిస్థలం చల్లగావుంది. మిట్టమీద పైన్ చెట్లు, కొండసాలువుల్లో సిల్కుతివాసీ పరిచినట్లున్న పచ్చిక కన్నులకు చల్లగా కనిపిస్తున్నాయి.

పట్టణం చివరిభాగాలలో ఏమిటోలావుంటుంది మనస్సు. చెట్లు గుసగుసలాడుతుంటాయి. వసంతరుతుశోభలో భూమి పునరుజ్జీవితమయింది... ఈ ప్రదేశంలోనే పావెల్ మిత్రులు బీదతనంలో మగ్గిపోతున్నవారు సుఖజీవితం గడపగలిగేటందుకని తమప్రాణాలుబలిపెట్టేరు. బానిసపుట్టుకలనుంచివిముక్తి చేయడానికే వారు బలిదానంఅయ్యేరు.

పావెల్ నెమ్మదిగా తలమీందిటోపీతీసేడు. అతనిమనస్సు శోకాకులితమైపోయింది.

మనుష్యజీవితం అతడి ప్రియతమమైన ఆస్తి. దానినాతడు ఒక్కమారుమాత్రమే అనుభవించగలడు. పశ్చాత్తాపంతో కుమిలిపోనక్కర్లేకుండా, గతజీవితాన్ని తలుచుకొని దుఃఖపడ నక్కర్లేకుండా ఆ బతుకు వెళ్ళబుచ్చుకోవాలి. చచ్చిపోయే టప్పుడు "ప్రపంచంలోకల్లా మానవ స్వాతంత్ర్యపోరాటం ఉత్తమోత్తమమైనది. దానిలోనే నా శక్తియుక్తులన్నీ విని యోగపరిచేను."—అని సంతృప్తిపడగలిగేటట్లు బ్రతకాలి. ఏక్షణంలో మృత్యువువచ్చిపడుతుందోనన్నట్లు బ్రతికివున్న ప్రతి ఘడియా ఉపయోగంలో పెట్టాలి.

ఈ ఆలోచనలతో కోర్చాగిన్ సమాధిదగ్గరనుంచి వెనుతిరిగేడు.

*                *                *

కొడుకు ప్రయాణానికి ఏర్పాట్లుచేయడం తల్లి కెంతో బాధగావుంది. ఆ ముసలామె కళ్ళల్లో నీళ్ళుతిరుగుతున్నాయనీ, తన దుఃఖం కనబడకుండా దాచుకోనేటందుకు ప్రయత్నిస్తున్న దనీ పావెల్ చూసేడు.

పావ్లూషా! వుండిపోరాదట్రా. ముసలిదాన్ని ఒక్కర్తినీ వుండాలి. పిల్లలెందరుంటే నేం లాభం? పెరిగిపెద్దవాళ్ళయ్యేదాకానే తర్వాత మనకి ఒక్కడూ కాడు. ఇప్పుడుపట్నం ఎందుకో చెప్పు? ఇక్కడే శుభ్రంగా వుండొచ్చునే. ఎవర్తైనా చిలక అక్కడుందా? కుర్రాళ్ళంతాఇంతే. ఒక్కడూ తల్లితో నన్నా చెప్పరు. ఒక్క మాటా పలుకూ లేకుండా ఆర్టెమ్ పోయి పెళ్ళిచేసుకు లేచొచ్చేడు. వాడితాతవు నువ్వు. కాలో,

చెయ్యో విరిగితేతప్ప నువ్వు కనబడవు."—అంటూ ఆమె నెమ్మదిగా మూటకట్టింది.

పావెల్ తల్లిని కౌగలించుకొన్నాడు.

"నాకింకా ఎవర్తీ ఏర్పడలేదమ్మా! ఔనుకాని, ఏ పక్షికా పక్షి అంతకి తగినబొంతని ఏసుకొంటుంది. నేను చిలకనే నంటావా?"

కొడుకుమాటలకు తల్లి నవ్వుకుంది.

"ప్రపంచంలోవున్న బూర్జువాలందరికీ సెలవిచ్చేసే వరకూ నాకు పిల్లా పీచూ ఎవరూవొద్దు చెప్తున్నావిను. ఎంతకాలంకో అంటావా? ఫర్వాలేదు. వాళ్ళింక ఎంతో కాలం నిలబడలేరు. త్వరలోనే ప్రపంచప్రజలందరూ ఒకే ఒక రిపబ్లికుగా ఏర్పడతారు. అప్పుడు యావజ్జీవం నానా కష్టాలూపడ్డ నీబోటివాళ్ళని ఏ ఇటలీకో విశ్రాంతికోసం పంపిస్తాం. అక్కడ సముద్రంవొడ్డున వెచ్చగా, సుఖంగా వుంటుంది. అక్కడ శీతాకాలంఅంటూ వుండదట. కోటీశ్వరుల పెద్దపెద్ద భవనాలుంటాయి. వాటిల్లో మీకు విశ్రాంతి. మేముపోయి అమెరికాలోని బూర్జువాలని ఖతంచేసేస్తూంటే మీరు నులివెచ్చనిఎండలో విశ్రాంతి తీసుకొందురుగాని."

"నువ్వుచెప్పింది బాగానేవుంది, కథలాగ. కాని, అంతవరకూ నేనుబ్రతికివుండొద్దూ...సరిగ్గా మీతాత ఇల్లాగే వుండేవాడు. ఎప్పుడూ ఏదోకలలుకంటూవుండేవాడు. మహా పొగరుబోతు. చచ్చి ఏస్వర్గానవున్నాడో. సెబాస్టోపల్ యుద్ధంలో ఓ చెయ్యీ, కాలూ పోయి ఇంటికిచేరేడు. ఆతడు

చేసిన సేవకి రెండు క్రాసులూ, రిబ్బన్లమీద రెండు వెండి బిళ్ళలూ చొక్కాకి గుచ్చిపంపేరు. బాగా పండుముసలితనం దాకా బ్రతికేడు. బ్రతికినంతకాలం మహాదరిద్రం అనుభవించేడు. మహాకోపిష్ఠి. ఎవడో ఆఫీసరుని చేతిలోవున్న వూతంకర్రతో నెత్తినికొట్టేడు. ఆ నేరానికి ఓ ఏడాదిపాటు బంకోలులో పడేసేరు మిలిటరీ క్రాసులు చూసినా వాళ్ళు వదలలేదు. ఆ మీ తాతపోలికే నువ్వు. ఏమీసందేహంలేదు."

"వెళ్ళిపోయేటప్పుడు ఈ మాటలెందుకమ్మా! ఏదీ. అకార్డియన్ ఓమాటిల్లా ఇయ్యి. ఎన్నాళ్ళయిందో ముట్టుకొని..."

ఆతడు తలవంచుకొని అకార్డియన్ వాయించడం ప్రారంభించేడు. ఆతని సంగీతజ్ఞానంలో పొడసూపిన కొత్త గమకాలు విని తల్లి ఆశ్చర్యపడింది. ఆతడెప్పుడూ ఇల్లా వాయించగా ఆమె వినలేదు. ఆ పాటలుకూడా కొత్తవే. వేళ్ళు వెనకటల్లే మెట్లమీద బహుసున్నితంగా పరుగులు తీస్తున్నాయి. కాని, ఈమారు అవి సృష్టిస్తూన్న స్వరాలు కొత్తవి. అతిగంభీరంగా వున్నాయి.

*          *          *

పావెల్ ఒక్కడే స్టేషనుకు వెళ్ళేడు.

బండి బయలుదేరేటప్పుడు దుఃఖంభరించలేక ఏడ్చేస్తుందని ఆతడుతల్లిని రావద్దన్నాడు.

ప్లాట్‌ఫారంమీద కాచుకొనివున్న జనం తోసుకుంటూ బండిలో ఎక్కేరు. పావెల్ పై బల్లఎక్కి సర్దుకు కూర్చు

న్నారు. కింద ఎక్కుతూ, దిగుతూ అటూ ఇటూ కదులు తున్నజనం కేకలువేస్తూ, వాదనల్లో ఏమేమిటో అభి నయం చేస్తున్నారు.

బండిలోకివచ్చినవాళ్ళు తమచేతుల్లో మూటలు కన బడకుండా కూర్చుండే బల్లలక్రిందికి తోసెయ్యడం ఇంకా సాగుతూనేవుంది.

రైలు బయలుదేరేక హడావిడి చల్లారింది ప్రయాణీ కులు సర్దుకుకూర్చుని మూటలువిప్పి తినడం ప్రారంభించేరు.

పావెల్ నిద్రపోయేడు.

*　　　　*　　　　*

కీవ్‌లో బండిదిగేడు. నగరం నడిబొడ్డునవున్న క్రెష్చా తిక్ వీధికి బయలుదేరేడు. నెమ్మదిగా వంతెన ఎక్కేడు. ఏమీ మార్పులేదు. రైలింగులమీదచేయి జారుస్తూ నెమ్మ దిగా నడిచేడు. క్రిందికి దిగేముందు ఒక్కక్షణం నిలబడ్డాడు. వంతెనమీద ఆ సమయంలో ఒక్కమనిషికూడా లేడు. చీకట్లో తన ఎదుట కనిపిస్తున్న విశాలదృశ్యం ఎంతో ఆకర్షణంగా వుంది. దిగంతాలవరకూ చీకటి నల్లగా వెల్వెట్ గుడ్డపరచి నట్లు కనిపిస్తూంది. ఆకాశంలో నక్షత్రాలు భాస్వరం ముక్కల్లా మెరుస్తున్నాయి. దిగువన దూరంగా మన్నులు, మిన్నులు కలిసినచోట లక్షలకొలది దీపాలు చీకట్లని చెదర గొట్టేస్తూన్నాయి.

ఎవరో గట్టిగా వాదించుకొంటూ తనవేపురావడంతో పావెల్ ధ్యానభంగం అయింది. నెమ్మదిగా నగరదీపాలనుంచి చూపులు తిప్పుకొని వంతెన దిగేడు.

ప్రాంతీయ స్పెషల్ డిపార్టుమెంటు ఆఫీసులో వాకబు చేస్తే జకరయ్ చాల నెలల్రితమే పట్నంవదిలి వెళ్ళిపోయే డన్నారు.

ఆరోజున డ్యూటీలోవున్న మనిషి పావెల్‌ను ఎరుగడు. నిజంగా ఈతడు జకరయ్‌కి స్నేహితుడేనా యని చాలసేపు నిదానంగాచూసి, చివరకి చెప్పేడు. తుర్కి-స్థాన్‌లో పని చెయ్యడానికి ఆయనను తాష్కెంట్ పంపేరు. పావెల్‌కు ఆవార్త దిగ్భ్రమకలిగించింది. మారుమాట్లాడకుండా వెనక్కి తిరిగేడు. ఎంతో నీరసం అనిపించి మెట్లమీద చదికిలబడ్డాడు.

పక్కనుంచి ఝుణఝుణలాడుతూ ట్రామ్‌కారు పరుగెత్తింది. జనం వస్తూపోతున్నారు. ఆడవాళ్ళ నవ్వులు, యువకులు హుషారుకబుర్లు, ముసలివాళ్ళ తొక్కుమాటలు వినిపిస్తున్నాయి. జనప్రవాహానికి తగ్గుదలేలేదు. దీపాలతో మెరిసిపోతున్న ట్రాములు, కన్నులు మిరిమిట్లుగొలిపే కారు హెడ్‌లైట్లు, దగ్గరనేవున్న సినీమాహాలుముందున్న దీపాలు- ఎక్కడపడితే అక్కడజనం - వాళ్ళసంభాషణలు- రాత్రివేళ నగరంస్వరూపంఅంతా ఎట్టఎదుట కనబడుతూంది!

జకరయ్ వెళ్ళిపోయేడని వినడంలో కలిగిన దుఃఖం ఆసందడి చూస్తూంటే తగ్గింది. ఇప్పుడెక్కడికి వెళ్ళాలి? తన స్నేహితులంతావుండే సోలోమెంకా పోవాలంటే చాలదూరం వుంది. దగ్గరలోనే యూనివర్శిటీ వీధివుండాలనిగుర్తువచ్చింది. అక్కడికి వెళ్ళొచ్చు. జకరయ్ తర్వాత చూడాలనుకొన్నది రీటానేకదా. ఆ రాత్రికి అకిమ్ ఇంట్లో గడపొచ్చు.

దూరంనుంచే కిటికీలో వెలుతురు కనబడింది. ఒక్క క్షణం భావోద్వేగాన్ని చిక్కబట్టుకొని తలుపుతోసేడు. ఒక్కక్షణం మెట్లమీద నిలబడ్డాడు. లోపలినుంచి మాటలూ, గైటర్ మీద వాయిస్తున్న పాటా వినబడ్డాయి.

"ఓహో! గైటర్లూ అవీ రానిస్తూంది. బింకం సళ్ళిం దన్నమాట."— అనుకొన్నాడు. మెల్లెక్కి తలుపుమీద నెమ్మదిగా తట్టేడు.

గిరజాలజుట్టు పసుచు ఒకామె తలుపుతీసింది. ఆమె కోర్చాగిన్ వేపు ప్రశ్నార్థకంగా చూసింది.

"ఎవరు కావాలి?"

ఆమె తలుపు జేరవేసి పట్టుకొంది. పరిస్థితిని అర్థం చేసుకొన్నాడు. తన ప్రయత్నం ఇక్కడా వృధాయే నని పించింది.

"ఉస్తినోవిచ్ వున్నదా?"

"ఆమె ఇక్కడలేదు. గతజనవరిలోనే ఆమె ఖార్కోవ్ వెళ్ళింది. ఇప్పుడు మాస్కోలో వుంటూందని విన్నాను."

"కామ్రేడ్ అకిమ్ ఇక్కడున్నారా? ఆయన వెళ్ళి పోయాడా?"

"ఆయనా లేడు. ఒడెస్సాగుబర్నియా కామ్‌సోమాల్ కి ఆయన ఇప్పుడు కార్యదర్శి."

వెనక్కి తిరగడంతప్ప చేయగలది లేదు. పట్నం వచ్చి నప్పటి వుత్సాహం సగం చచ్చిపోయింది.

రాత్రి గడిపేటందుకు ఏదోచోటు చూసుకోవాలి.

వెనకటి స్నేహితు లెవరూ వున్నట్లులేదు. వాళ్ళ కోసం తిరిగేసరికి కాళ్ళరిగిపోతున్నాయి.”—అనుకుంటూ పావెల్ ముందుకునడిచేడు. అయినా పాంక్రాటోవ్ నా పట్నంలో వుండకపోతాడా, ప్రయత్నించి చూద్దామను కొన్నాడు. ఆతడు వార్ఫ్లదగ్గర్లోవుండేవాడు. సోలోమెంకా కన్న అది దగ్గరలోవుంది.

పాంక్రాటోవ్ ఇంటిసమీపానికి చేరేసరికి పావెల్ బాగాఅలిసిపోయేడు. “ఇతడుకూడా లేకపోతే ఇంకెవ్వరినీ వెతకను. పోయి ఆ పడవక్రింద పడుకొని రాత్రిగడిపేస్తా” ననుకొంటూ వెళ్ళి తలుపుతట్టేడు.

ముసలామె తలుపు తెరిచింది. ఆమె పాంక్రాటోవ్ తల్లి.

“ఇగ్నాత్ వున్నాడా, మామ్మా.”

“ఇప్పుడే వచ్చేడు.”

ఆమె పావెల్ను గుర్తుపట్టలేదు. వెనక్కి తిరిగి కొడుకుని పిలిచింది.

“ఇగ్నాత్ ! నీకోసం ఎవరోవచ్చేరు నాయనా !”

పావెల్ ఆమె వెనకనే ఇంట్లో అడుగుపెట్టి గదిలో భుజానవున్న ‘కిట్ బాగ్’ దింపుకున్నాడు. పాంక్రాటోవ్ బల్లవద్దకూర్చుని భోజనం చేస్తున్నాడు. కొద్దిగా వెనక్కి తిరిగిచూస్తూ ...

“నేనే. కూర్చుని మాట్లాడండి పొద్దుటినుంచి కడు పులో ఏమీపడలేదు.”—అంటూ కర్ర తెడ్డు తీసుకొన్నాడు.

పావెల్ ఒక పక్కగావున్న కాలుకట్టుకట్టిన కుర్చీలో కూర్చున్నాడు. తలనున్న టోపీతీసి, తన అలవాటుప్రకారం దానితో మొహం తుడుచుకొన్నాడు.

"ఇగ్నాత్ కూడా నన్నుగుర్తుపట్టలేకపోయేడే. అంతగా మారిపోయేనా''- అని ఆతని ఆశ్చర్యం.

పాంక్రాటోవ్ ఒకటిరెండు గరిటెలపులుసు జుర్రుకొన్నాడు. ఎంతసేపటికీ వచ్చిన ఆతడు మాట్లాడకపోయే సరికి వెనక్కితిరిగేడు.

"ఏం మాట్లాడవేం? చెప్పు."

నోట్లోపెట్టుకోదలచిన రొట్టెముక్క మధ్యలోనే ఆగిపోయింది. వచ్చిన ఆతనివేపు గుడ్లుమిటకిరించిచూసేడు.

"ఎవరిది..."

పాంక్రాటోవ్ కంగారూ, ఆశ్చర్యమూచూసి పావెల్ పకపక నవ్వేడు.

పాంక్రాటోవ్ వెర్రిగా కేకవేసేడు. "పావ్కా!"

"కాని, నువ్వుపోయేవనే అనుకుంటున్నాము. ఆగు. నీ పేరేమిటన్నావు?"

ఆతని అరుపులువిని పాంక్రాటోవ్ పెద్దఅక్కా, తల్లీ పక్కగదిలోంచి పరుగెత్తివచ్చేరు. ముగ్గురూ పావెల్‌ను ప్రశ్నలతో ముంచెత్తేరు. చివరకాతడు పావెల్ కోర్చాగినేనని ధృవపరచుకొన్నారు.

ఇంట్లోఅంతా నిద్రకుపడ్డాకకూడా పాంక్రాటోవ్ గడచిననాలుగు నెలల ఘటనలనూ పావెల్‌కువినిపిస్తూనేవున్నాడు.

"శీతాకాలంలో జార్కా, మిత్రైలు ఖార్కోవ్ వెళ్ళేరు. సన్యాసులు, ఎక్కడికెళ్ళేరని నీవూహ? కమ్యూనిస్టు యూనివర్సిటీకిసుమా. ప్రవేశపరీక్షకు చదువుతున్నారు. మొదట్లో మేమంతా పదిహేనుమందిమి వుండేవాళ్ళం! 'భవదీయుడు' గాడుకూడా చదువుకుంటాననటూ దరఖాస్తు పెట్టేడు. రంపందుమ్ములో ఎంతకాలంతే అనిపించింది నాకూను. కాని పరీక్షబోర్డువాళ్ళు నన్ను పొమ్మన్నారు."

ఆనాటి ఘటనలు తలచుకొని పాంక్రాటోవ్ గురగుర లాడేడు.

"మొదట్లో అంతా బాగానేవుంది. అన్నీ బాగానే వున్నాయి: నాకు పార్టీ కార్డువుంది. కామ్‌సోమాల్‌లో చాల కాలం వున్నా. నా గతచరిత్ర, కుటుంబగాథలు అన్నీ బాగానే వున్నాయి. కాని, రాజకీయాలదగ్గిరే వచ్చిపడింది చిక్కు."

"పరీక్షబోర్డులో ఒకరితో వాదం వేసుకున్నాను. ఆతడు వేసిన ముందా ప్రశ్న చూడు, "కామ్రేడ్ పాంక్రాటోవ్! నీకు తత్వశాస్త్రం ఏమన్నా తెలుసా?" వెధవది నాకాసంగతి కించిత్తూ తెలియదు. కాని, మాతోపాటు వార్ఫులదగ్గిర ఒకడు పనిచేసేవాడు. చిన్నతనంలో గ్రామర్ స్కూలులో చదివేడు. మధ్యలో కొంతకాలం బలాదూరుగా తిరిగేడు. సరదాకోసం రేవుపనిలోకి వచ్చేడు. ఆత డేమి టేమిటో చెప్పేవాడు. గ్రీసుదేశంలో కొందరు మహాబుద్ధిమంతు లుండేవారట. ఏమి అడిగినా వాళ్ళు సమాధానం ఇచ్చేవారనీ, వాళ్ళని తత్వవేత్త లనేవారనీ చెప్పేవాడు.

డయోజినిస్ జో, ఏదో పేరు చెప్పేను. ఆతడు బ్రతికివున్నంత కాలం ఒక నీళ్ళతొట్టిలోనే కూర్చున్నాడుట... వాళ్ళల్లో కల్లా మహా తెలివిగలవాడుండేవాడట. నలుపును తెలుపనీ, తెలుపును నలుపనీ నలబైసార్లైనా తిరగేసీ, బోర్లవేసీ ఒప్పించేవాడట. వట్టి బాతాఖానీరాయుళ్ళు అన్నమాట. ఆ ప్రశ్నకు రాగానే “బోల్తాకొట్టించాలనా నీ ఎత్తు” — అనుకొన్నా. పరీక్షకుడు కన్ను మెదుపుతూ నావంక చూస్తున్నాడు. అడగడం తనువు తప్పేమని సమాధానం చెప్పేసేను. “తత్వ శాస్త్రం వట్టి బాతాఖానీ, మసిపూసి మారేడుకాయ చేయడం. దానితో నాకేమీ ప్రసక్తిలేదు. కామ్రేడ్స్! పార్టీ చరిత్ర అంటూరా? అడగండి. చెప్తా.”– అన్నాను. తత్వ శాస్త్రమంటే ఈతమాషా అభిప్రాయం ఎల్లా పట్టుబడిందా యని ఇంక ప్రశ్నలు ప్రారంభించేరు. చెప్పేను. ఆ విద్యార్థి సంగతీ, అతడు చెప్పిన కథలూ వినేసరికి వాళ్ళు పక్కలు పట్టుకొని ఒకటే నవ్వు. నాది తప్పేకావచ్చు. కాని మహా తట్టుకాలు వేసుకొచ్చింది. “ఏం వెర్రిపీనుగు ననుకొంటున్నారా యేం?” అని లేచి చక్కా వచ్చాను.

“తరవాత గుబర్నియాకమిటీ మీటింగులో ఆ పరీక్షకుడు నన్ను లంకించుకొని పక్కామూడుగంటలు వుపన్యాసంతో వూదరపెట్టేసేడు. వాట్నల్లో పనికివచ్చినకుర్రాడు అయినవీ, కానివీ కలిపి చెప్పినట్లు తోస్తుంది. తత్వశాస్త్రం మంచిదే నని పిస్తూంది. చాలా ముఖ్యమైనదటకూడా.

“దుబావా, జార్యాలు పరీక్షలు ప్యాసయ్యేరు. మిత్యా ఎప్పుడూ బాగానే చదువుతాడు. కాని జార్యా

నాలాంటివాడే. అయినా పతకం పనిచేసిందని తోస్తోంది. ఏదేమయితేనేం, నేను వెనకబడిపోయేను. వారు వెళ్ళిపోయేక నాకు వార్ఫుల్లో అసిస్టెంటుగా వేసేరు. అంతవరకూ పశుచు వాళ్ళనిగురించి మేనేజర్లని వేపుకుతినేవాణ్ణి. ఇప్పుడు నేనే మేనేజరునయ్యేను. ఇప్పుడెవడన్నా పనిలో బద్ధకిస్తున్నట్లు కనిపించేడా మేనేజరుహోదాలోనూ, కామ్‌సోమాల్ కార్యదర్శి హోదాలోనూ దెండాడిపారేస్తున్నా. నా కళ్ళల్లో దుమ్ముకొట్టడం ఎవళ్ళ తరంకాదు. అదీ నా వ్యవహారం. ఇంక అకిమ్‌సంగతి నీకు తెలియనే తెలుసు. వెనకటివాళ్ళలో తుఫ్తాఒక్కడే ఇప్పుడు గుబర్నియాకమిటీలోవున్నాడు. వెనకటిపనేఇప్పుడూ. తోకరేవ్ సోలోమెంకా జిల్లాకమిటీ కార్యదర్శి. నీతో కమ్యూన్‌లో వుండేవాడే, ఓకునేవ్, ఆతడిప్పుడు కామ్‌సోమాల్ జిల్లాకమిటీలో వున్నాడు. తాల్యా రాజకీయ విద్యాశాఖలో పనిచేస్తోంది. నువ్వు కారుషాపులలో చేస్తూండినపనిలో ఇప్పుడు త్స్వెతాయేవ్ పనిచేస్తున్నాడు. మేమంతా ఎప్పుడన్నా గుబర్నియాకమిటీలోనే కలుస్తుంటాం. త్స్వెతాయేవ్ తెలివిగలవాడేగాని, కొంచెం గర్విష్ఠి. అన్నాబోర్హార్టు జ్ఞాపకంవుందా? ఆవిడకూడా సోలోమెంకాలోనేవుంది. పార్టీ జిల్లాకమిటీ మహిళాశాఖ నామెచూస్తోంది. ఇక్కడికి అందర్నిగురించీచెప్పేను. పావ్లూషా! పార్టీ చాలమందిని చదువుకోనేందుకు పంపింది. వెనకటి కార్యకర్తలంతా గుబర్నియా సోవియట్‌స్కూలుకో, పార్టీస్కూలుకో వెడుతున్నారు. నన్నుకూడా వచ్చేఏడాది పంపుతామన్నారు."

వాళ్లుపడుకొనేసరికి అర్ధరాత్రి దాటిపోయింది. మర్నాడుదయం పావెల్ లేచేసరికి పాంక్రాటోవ్ నాప్ఫలకి వెళ్ళిపోయేడు. సరిగ్గా ఆతనిపోలికలోనేవుండే ఆతని చెల్లెలు దూశ్యా పావెల్‌కి టీ తెచ్చియిచ్చి, దగ్గరకూర్చుని ఒకటే కబుర్లు ప్రారంభించింది. అతని అన్నగారు మెరైన్ ఇంజనీరు. ఇంటి వద్ద వుండడంలేదు.

పావెల్ వీధిలోకి బయలుదేరబోతూంటే దూశ్యా జ్ఞాపకం చేసింది.

"మరిచిపోకు. భోజనానికి రా."

* * *

పార్టీ గుబర్నియా కమిటీ ఆఫీసు ఎప్పటిల్లే మహా హడావిడిగావుంది. తలుపుతియ్యడం, వెయ్యడం—విధీవిరామం లేదు. ఆఫీసునిండానూ, వసారాలలోనూ జనమే. లోపలి గదిలోంచి టైపురైటర్ల కటకటధ్వని వినిపిస్తూంది.

ఎవళ్ళయినా ఎరిగినవాళ్ళు కనబడతారేమోనని పావెల్ కాస్సేపు వసారాలో తచ్చాడేడు. కాని, ఎరిగిన మొఖాలేవీ కనబడలేదు. ఇంక సరాసరి కార్యదర్శి దగ్గిరికెళ్ళేడు.. ఆతడు నీలిరంగుకోటు తొడిగి పెద్దటేబిలు వెనక కూర్చునివున్నాడు. పావెల్ గదిలోకిరాగానే ఒక్కమారు తలపైకెత్తి చూసి, మళ్ళీ తన వ్రాతలో మునిగిపోయేడు.

పావెల్ ఆతనిఎదుటకూర్చుని, అకిమ్‌తర్వాత కార్యదర్శిగావచ్చిన ఈ కొత్తవాని రూపురేఖలు పరిశీలించేడు.

కార్యదర్శి తనవ్రాతపూర్తిచేసుకొని తల పైకెత్తేడు.

"మీకేం కావాలి?"

పావెల్ తన కథనంతనూ చెప్పేడు.

"కామ్రేడ్! ఇప్పుడు చేయవలసిందల్లా పార్టీసభ్యత్వపుపట్టికల్లో నాపేరు మళ్లీ చేర్చడమే. తర్వాత రైల్వేవర్క్షాపులకు పంపండి. ఆ విధంగా సూచనల్నివ్వండి."

కార్యదర్శి తనకుర్చీలో జేరగిలబడ్డాడు.

"నీపేరు సభ్యత్వపులిస్టులో చేర్చడానికేముంది, సులభమే." తర్వాత కొంత సందేహంలో పడ్డాడు."

"వర్క్షాపులకి పంపడమే కొంచెం ఇబ్బంది. అక్కడ త్స్వెతాయేవ్ పనిచేస్తున్నాడు. అతడు గుబర్నియాకమిటీ సభ్యుడుకూడాను. మీకు మరోపని ఏదన్నా చూడవలసి వుంటుంది."

కోర్చాగిన్ కనుబొమ్మలు ముడిపడ్డాయి.

"త్స్వెతాయేవ్ పనికి నేను అడ్డంపోబోను. పార్టీకార్యదర్శిగాగాక నాపనిలోకిపంపమని అడుగుతున్నా. నాఆరోగ్యం ఇంకా పూర్తిగా కుదుటపడలేదు. కనక నన్ను మరో పనిలోకి పంపకండి."

కార్యదర్శి ఒప్పుకొన్నాడు. ఒక చిన్న కాగితంముక్క మీద ఏదో గిలికేడు.

"ఇది కామ్రేడ్ తుఫ్తా కివ్వండి. ఆతడే అన్ని సంగతులూ చూస్తాడు."

తుఫ్తా దగ్గిరికి వెళ్ళేసరికి ఆతడు తన అసిస్టెంటుని చీవాట్లు పెడుతున్నాడు. ఆ వాగ్వాదం వింటూ పావెల్ ఒక్క-

నిముషం నిలబడ్డాడు. అదెంతసేపూ తెమిలేలాగ కనబడక పోయేసరికి ఎదుటపడ్డాడు.

"తుఫ్తా! మరోమాటు తీసుబడిగా వాగ్వాదం పెట్టుకోందువుగాని, నా వ్యవహారం గురించి సర్దడానికి ఇదిగో జాబు తెచ్చేను."

తుఫ్తా కాగితంకేసీ, మనిషికేసీ మార్చి మార్చి చూసేడు. ఎంతోసేపు అతనికేమీ అర్థంకాలేదు. ఆఖరుకి తెలిసింది.

"ఓరి నువ్వట్రా? అయితే చచ్చిపోలేదన్నమాట? ఇప్పుడేమిటి చెయ్యడం? నీపేరు పట్టికల్లో కొట్టేసెరల్లేవుంది. నాచేత్తో నేనే నీ పార్టీ కార్డును కేంద్రకమిటీవాళ్ళ కిచ్చేను. పైగా జనాభా లెక్కల్లోకూడా నీపేరు లేకుండాపోయింది. ఆ లెక్కల్లో చేరనివాళ్ళు లేనట్లేనని కామ్‌సోమాల్ కేంద్ర కమిటీ ఆదేశం పంపింది. అందుచేత ఇంక మామూలు పద్ధతిలో దరఖాస్తు పెట్టుకోవడమే నీకున్న దారి."

తుఫ్తాకంతం సమాధానం కోరడంలేదు.

పావెల్ ముఖం చిట్లించేడు.

"మళ్ళీ వెనకటినాటకం ప్రారంభించేవన్నమాట. నీకు వయస్సు ఆట్టేలేకపోయినా కాగితాలపురుగుకన్న కనాకష్టం. ఇంక నీకు జ్ఞానం రావడం ఎప్పుడు వోలోద్కా!"

తేలుకుట్టినట్లు తుఫ్తా ఎగిరిపడ్డాడు.

"నాకేం సలహా లివ్వనక్కర్లేదు. ఇక్కడి పనిబాధ్యత నాది. ఆదేశాలన్నవి ఆచరించడానికిగాని, అతిక్రమించ

డానికికాదు. నీ తిట్టుబోతుతనం ఏమిటో చూస్తా. నన్ను వురుగంటావేం?"

ఈ ఆఖరుమాటలు బెదిరింపుస్వరంతో ఉచ్చరించేడు. చేయివిసిరి ఇంక పొమ్మన్నట్లు సూచించేడు. ఎదట పెట్టివున్న వుత్తరాలబొత్తి దగ్గరకు లాక్కున్నాడు.

పావెల్ నెమ్మదిగా లేచేడు. గుమ్మందాకా వెళ్ళేక ఏదో గుర్తువచ్చి మళ్ళీతిరిగేడు. తుఫ్తాఎదురుగా టేబిల్ మీదపడివున్న చీటీ-తాను తెచ్చినది-తీసుకొన్నాడు. అతడు చూస్తూవూరుకున్నాడు. పక్కనున్నగుమాస్తా అన్నీ గమనిస్తూన్నాడు.

పావెల్ వెనక్కి తిరుగుతూ అవహేళనగా ఎత్తిపొడిచేడు.

"అంతాబాగానేవుంది. లెక్కలన్నీ నేను తారుమారు చేసేను. సరే. చెప్పకుండా, చెయ్యకుండా చచ్చివూరుకొంటున్నవాళ్ళతో ఎల్లా వ్యవహరిస్తున్నవో గాని, పాపం! అయినా ఎవడూ రోగపడకూడదని కాని, చావకూడదని కాని, ఆదేశాలలో వుండివుంటుం దనుకోను."

తుఫ్తాగుమాస్తా పట్టలేక ! 'హో! హో! హో!' అని నవ్వేడు.

తుఫ్తా వ్రాస్తున్న పెన్సిలుమొన విరిగిపోయింది. విసుగుతో దాని నాతడు నేలబెట్టికొట్టేడు. ఆతడూ ఏదో అనబోయేడు. కాని, ఆలోపునే గదిలోకి నవ్వుతూ తుళ్ళుతూ చాలమంది తోసుకువచ్చేరు. వాళ్ళల్లో ఓకుసేవ్ కూడా వున్నాడు. పావెల్ను గుర్తుపట్టగానే మహానందపడ్డాడు. అంతు

లేని ప్రశ్నలు వేసేడు. మరోశా స్తసేపటికి మరింతమంది వచ్చేరు. వారితో ఓల్గాయురిసేవా కూడావుంది. పావెల్‌ను చూడ్డంతోనే ఆశ్చర్యం, ఆనందంతో చాలసేపటివరకూ ఆతనిని పట్టుకొని వదిలిందేకాదు.

వచ్చినవారికల్లా తన కథ మళ్ళీ మళ్ళీ చెప్పేడు.

తన మిత్రుల ఆనందం, సానుభూతి, కౌగలింతలు, కర చాలనాలు హడావిడిలో పావెల్ తుఫ్తాతోడి అనుభవాన్ని ఒక్కనిముషం మరచేడు.

తనకథంతాచెప్పి తుఫ్తాతోజరిగిన సంభాషణ విని నలుగురూ గంయ్‌మన్నారు. తుఫ్తాను తినేసేలాగచూస్తూ ఓల్గా కార్యదర్శిగదిలోకి విసవిస నడిచింది.

ఓకునేవ్ మిగిలినవాళ్ళని 'రాండి' అన్నాడు.

"రాండి. నెజ్దానోవ్‌ను చూద్దాం. ఈసంగతేదో ఆతడు చూస్తాడు."

పావెల్‌ను రెక్కబట్టుకొని ఓకునేవ్ లాక్కుపోతూంటే, మిగిలినవాళ్ళంతా వెంటబడ్డారు. బిలబిలలాడుతూ అందరూ ఓల్గావెనకనే కార్యదర్శి ఆఫీసులో జొరబడ్డారు.

"తుఫ్తాని ఆఫీసులోంచితీసేసి ఓ ఏడాదిపాటు పాంక్రాటోవ్ క్రింద మూటలుమోయించాలి. ఆతడికి అధికార మదం..."

ఓకునేవ్, ఓల్గాలు తదితరులు తుఫ్తాను ఆఫీసులోంచి తీసెయ్యాలని డిమాండుచేస్తూంటే గుబన్నియాకమిటీ కార్యదర్శి సానుభూతిగా విన్నాడు.

అన్నివిని కోర్చాగిన్‌ను మళ్లీ తీసుకుంటాం, అంటూ ఆతడు ఓల్గాకు భరోసాయిచ్చేడు.

"సందేహం అక్కర్లేదు. కోర్చాగిన్‌ను తీసుకుంటాం. వెంటనే ఆతనికి కొత్తకార్డు ఇస్తాం. తుఫ్తా వట్టి అభంద్రా మనిషి. నేను ఎరుగుదును. కాని, తనకు వప్పచెప్పిన పనిని బాగాచేస్తాడు. నేను అనేకచోట్ల చూసేను. కామ్‌సోమాల్ జనాభా లెక్కలు ఒక్కచోటా సరిగ్గాలేవు.ఒక్కఅంకెను నమ్మ డానికి వీల్లేదు. ఇక్కడమాత్రం అన్నిస్రక్రమంగా వున్నాయి. తుఫ్తా తరుచుగా రాత్రి తెల్లవార్లూకూర్చుని పనిచేస్తూంటాడు. మీరూ ఎరుగుదురు. అందుచేత నా అభిప్రాయం ఇది : ఆత నిని తీసెయ్యడం ఎంతో సేపుకాదు. కాని, ఆతని స్థానంలో వచ్చేవాడు వట్టి కబుర్లపోగయినా, పని తెలియకపోయినా, మనకి అధికారమనమత్తులూ వుండరు, ఆఫీసులో ఒక్కపనీ జరగదు. ఆతనిని పనిలో వుండనిద్దాం. కాస్త గట్టిగా చీవాట్లు పెడతాను. దానితో కొన్నాళ్ళు తిన్నగావుంటాడు. తరవాత చూసుకొందాం."

ఓకునేవ్ వొప్పుకొన్నాడు.

"సరే, వుండనీ. రా, పావ్లూషా! మనం సోలో మెంకా పోదాం. ఈవేళ రాత్రిక్లబ్బులో కార్యకర్తల మీటిం గుంది. "కోర్చాగిన్ మాట్లాడుతారు"—అన్నామంటే ఎంత ఎల్లావుంటుంది! నువ్వు చచ్చిపోకపోవడం వుండే చాల అద్భుతంగావుంది పావ్లూషా. చచ్చిపోతే శ్రామికవర్గానికి నీ వల్ల వుపయోగం ఏం వుంటుంది?"

—అంటూ అతడు మిత్రుని భుజంమీద చెయ్యివేసి తీసుకుపోయేడు. "సెర్గా! నువ్వూ వస్తావా"

"ఆహాఁ."

*           *           *

కోర్చాగిన్ భోజనానికి పాంక్రాటోవ్ లయింటికి వెళ్ళనేలేదు. అసలు ఆరోజునే అటువెళ్ళలేదు. సోవియట్ భవనంలోని తనగదికి ఓకునేవ్ ఆతనిని తీసుకుపోయేడు. సంపాదించగలంతలో మంచిభోజనం సమకూర్చేడు. ఆతని ఎదురుగా ఒకకట్ట వార్తాపత్రికలూ, జిల్లాకామ్‌సోమాల్ బ్యూరో సమావేశాల మినిట్సువ్రాసిన రెండు పెద్దఫైళ్ళూ ఆతని ఎదుట పడేసేడు.

"ఇవన్నీ ఓమారు చూడు. నువ్వు టైఫస్‌తో మంచానపడివున్నప్పుడు ఎన్నెన్నో జరిగిపోయేయి. మళ్ళీ సాయంకాలం వస్తా. ఇద్దరం కలిసి క్లబ్బుకి వెడదాం. ఆయాసం అనిపిస్తే, కాస్సేపు పడుకో."

ఓకునేవ్‌కు పోర్టుఫోలియో చేతపట్టడమంటే తగని అసహ్యం. అది పరుపుక్రింద పడేసివుంచేడు. ఇంక అన్ని రకాలకాగితాలూ జేబుల్లో కూరుకొని, వెళుతున్నానని చెప్పి వెళ్ళిపోయేడు.

సాయంకాలం అతడు వచ్చేసరికి గదిఅంతా కాగితాలే. పరుపుకిందవున్న పుస్తకాలుకూడా బయటికి వచ్చేసేయి. వాటిలో కొన్ని టేబిల్ ఎక్కేయి. తన మిత్రుడి

తలగడక్రింద కనబడిన కేంద్రకమిటీ జాబుల్ని చదువుతూ పావెల్ మంచంమీద కూర్చునివున్నాడు.

ఓకునేవ్ కోపం అభినయించేడు.

“గది మహా అందంగా చేసేవు కాదూ. వుండుండు. అవన్నీ రహస్యపత్రాలు. నీబోటిగాడికి గది వప్పచెప్తే ఇంతకన్న మరొకటి అవుతుందా?”

పావెల్ నవ్వుతూ వుత్తరం ముగించి పక్కన పెట్టేడు.

“ఇదేం రహస్యం వుత్తరం కాదులే. కాని దీపానికి నీడకోసం చాటుపెట్టిన వుత్తరంవుంది చూడు, దానిమీద వుంది, రహస్యం అని చూడు. ఇది చివరలు ఎల్లా కాలిపోయిందో.”

“ఆ దిక్కుమాలిన వుత్తరంకోసం మూడురోజుల నుంచి వెతుకుతున్నా. ఏమైపోయిందో అనుకొంటున్నా. ఆ, జ్ఞాపకంవస్తూంది. వోలింట్సేవ్ దాన్ని నీడకోసం అడ్డం పెట్టేడు. తర్వాత దానికోసం గదంతా తిరగేసేడు.”

ఓకునేవ్ ఆ జాబుతీసుకొని జాగ్రత్తగా మడిచి పక్క కింద దోపేడు.

“అన్నీ మళ్ళీవచ్చి సర్దుకుందాం. లే, కాస్త ఎంగిలి పడి క్లబ్బుకిపోదాం. రా, టేబిల్ దగ్గరకు లాక్కో.”

కాగితాన్ని చుట్టబెట్టిన ఎండుహెర్రింగుచేప నొక జేబులోంచీ, రెండురొట్టెలు మరోజేబునుంచీ తీసేడు. టేబిల్ మీద వార్తాపత్రిక కాగితంఒకటి పరిచేడు. హెర్రింగ్ చేప తల చేతిలోపట్టుకొని, టేబిల్ పంచనేసి కొట్టిదులిపేడు.

టేబిల్ మీద కూర్చుని, పదపదాలు ఆపేస్తూ ఓకునేవ్ మహా హుషారుగా ఆనాటి వార్తలన్నీ వినిపిస్తూ, హాస్యాలాడుతున్నాడు.

* * *

క్లబ్బుదగ్గరకెళ్ళేక వెనకదారిని వేదిక వెనకనున్న తలుపుగుండా ఓకునేవ్ పావెల్‌ను లోపల ప్రవేశపెట్టేడు. విశాలమైన ఆహాలులో వేదిక సమీపంలోవున్న పియానో పక్కన తాల్యాలగూటినా, అన్నా బోర్హార్టులు రైల్వేజిల్లా కామ్‌సోమాల్ సభ్యులతో కూర్చుని మాట్లాడుతున్నారు. రైల్వేవర్కుషాపుల్లోని కామ్‌సోమాల్ సంస్థ కార్యదర్శి వోలిన్ట్సేవ్ అన్నాకెదురుగా కూర్చునివున్నాడు. ఆతనిముఖం మిగుల మగ్గిన ఆపిల్ పండులావుంది. గట్టిమబ్బులా జట్టూ, మరీ మాసి రంగు తెలియకుండావున్న తోలుకోటూను.

ఆతనిపక్కనే, పియానో మూతమీద మోచేయి ఆనుకొని త్స్వేతాయేవ్ నిలబడివున్నాడు. అతనిముఖం చాలా అందమైనది. మలచినట్లుంటాయి పెదవులు. ఎర్రనిజుట్టు. చొక్కాపై బొత్తం తగిలించకుండా వొదిలేసేడు.

ఓకునేవ్ గదిలోకివచ్చేసరికి అన్నామాట వినబడింది.

"కొత్తవాళ్ళని చేర్చుకోడానికి కొంతమంది లేనిపోని వన్నీ తెచ్చిపెడతారు. త్స్వేతాయేవ్ అదే తంతు."

త్స్వేతాయేవ్ చాల కటువుగా సమాధానంఇచ్చేడు.

"కామ్‌సోమాల్ అంటే వనభోజనం అనుకున్నావా యేం!"

శాల్యా ఓకుసేన్‌ను చూడగానే "అదుగో, నికో లాయ్!" అంది.

"ఏమిటబ్బా! అంత హుషారుగావున్నావు."

నలుగురూ ఓకుసేవ్‌ను తమమధ్య కూర్చోబెట్టుకొని ప్రశ్నలతో ముంచెత్తేరు.

"ఎక్కడికెళ్ళేవు?"

"పని ప్రారంభిద్దామా?"

ఓకుసేవ్ ఆగమన్నట్లు చేయిఎత్తేడు.

"ఒక్కనిముషం వుండండి. తోకరేవ్ రాగానే ప్రారంభిద్దాం."

"అదుగో వచ్చేసేడు" అంది అన్యా.

జిల్లాపార్టీకమిటీ కార్యదర్శి రానే వచ్చేడు. ఆతనిని కలుసుకోడానికి ఓకుసేవ్ పరుగెత్తేడు.

"రా, బాబాయ్! నా స్నేహితుడి నొకరినిచూపిస్తాను. ఇల్లా వేదిక వెనక్కిరా. జడుసుకోకేం.

తోకరేవ్ సిగరెట్టు పీలుస్తూ "ఏమిటది?" అన్నాడు. కాని, ఓకుసేవ్ వదలలేదు. చేయిపట్టుకొని లాగేడు.

*        *        *

ఓకుసేవ్ చేతిక్రింద గంట 'గంయ్' మంది. పట్టి వాగుడు గుల్లలుకూడా వులిక్కిపడి మాటలు కట్టిపెట్టేరు.

తోకరేవ్ వెనుకవేపున పచ్చని ఫ్రేములో 'కమ్యూనిస్టు మానిఫెస్టో' రచయిత సభాసదుల్ని అవలోకిస్తున్నాడు. ఓకుసేవ్ సభను ప్రారంభిస్తూంటే తోకరేవ్ వేదిక ఎక్కి

వింగ్‌లో నిలబడి సమయంకోసం వేచివున్న కోర్చాగిన్ వంక ఎంతో ఆప్యాయంతో చూస్తూన్నాడు.

"కామ్రేడ్స్! ఈవేళ అజెండాలో ప్రస్తుతనిర్మాణ సమస్యలచర్చ ప్రాధానాంశం. దానిని ప్రారంభించడానికి ముందు ఒక కామ్రేడ్ మాట్లాడ్డానికి అనుమతికోరేడు. ఆయనను మాట్లాడనివ్వాలని నేనూ, తోకరేవ్‌కూడ ప్రతిపాదిస్తున్నాం."

సభికులు అంగీకరించేరు. ఓకునేవ్ పిలిచేడు.

"మాట్లాడవలసిందిగా పావ్కా కోర్చాగిన్‌ను ఆహ్వానిస్తున్నా."

సభలోవున్న నూరుమందిలో కనీసం ఎనభయిమంది కోర్చాగిన్‌ను ఎరుగుదురు. ఫుట్‌లైట్లు వెలుతురులో తమకు పరిచితమైన విగ్రహం నిలబడి వుపన్యాసం ప్రారంభించగానే అందరూ సంతోషం, ఉత్సాహంతో చప్పట్లు కొట్టేరు.

"కామ్రేడ్స్!"

కోర్చాగిన్‌కంఠంలో వుద్రేకం వినబడకపోయినా మనిషి చాల ఉత్సాహంగా వున్నాడు.

"మిత్రులారా! మీతో కలిసి పనిచేయడానికి మళ్ళీ వచ్చేను. వచ్చినందుకు చాల ఆనందంగావుంది. ఇక్కడ నా మిత్రులు చాలమంది కనిపిస్తున్నారు. సోలోమెంకాలో కామ్‌సోమాల్ సభ్యులసంఖ్య వెనకటికన్న నూటికి ముప్ఫయి పెరిగిందని విన్నాను. వర్కుషాపుల్లో సిగరెట్ లైటర్లు తయారు చెయ్యడం మానేసేరనీ, రైల్వేయార్డుల సమాధుల్లోంచి

పాతకళేబరాల్ని పైకితీసి మరమ్మత్తులకోసం పంపుతున్నారనీ తెలిసింది. అంటే మన దేశం పునరుజ్జీవం పొందుతున్నదన్న మాట. శక్తి కూడగట్టుకొంటున్నదని అర్థం. మన జీవితాల కొక గమ్యం చిక్కింది. ఈ సమయంలో నేను చచ్చిపోతానా?''

కోర్చాగిన్ ముఖాన చిరునవ్వు వెలిసింది.

జనం చప్పట్లుకొడుతూ, హర్షధ్వానులు చేస్తూండగా పావెల్ వేదిక దిగి అన్నా, తాల్యాలు కూర్చున్నచోటికి వెళ్ళేడు. వాళ్ళిద్దరూ ఆతనివేపు చేతులుచాచి తమమధ్య కూర్చోబెట్టుకున్నారు. తాల్యా ఆతని చేయిపట్టుకొని చాల సేపుదాకా వదలలేదు. అన్నా తెరిచిన కన్ను మూయకుండా ఆతనివంక ఆశ్చర్యంగా చూస్తూంది.

* * *

రోజులు గడిచిపోతున్నాయి. కాని, గడుస్తున్నట్లే అనిపించడంలేదు. రోజూ ఏదో కొత్తే. పొద్దుటేలేచి పావెల్ ఈవేళ ఈపనిచెయ్యాలనుకొంటాడు. కాని, తీరాచూసేసరికి అనుకొన్న పనంతా జరగదు. రోజులో గంటలు చాలడం లేదనుకొంటూంటాడు.

ఆతడు పావెల్ గదిలోకి మారేడు. రైల్వేవర్కుషాపుల్లో ఎలక్ట్రికల్ ఫిట్టరుకు అసిస్టెంటుగా పనిలోచేరేడు.

కామ్‌సోమాల్ నాయకత్వం ప్రస్తుతానికి తీసుకోను అన్నప్పుడు ఆతనికి ఓకునేవ్‌తో పెద్ద చర్చపడింది. కాని, చివర కాతడు ఒప్పుకొన్నాడు.

"వర్క్‌షాపులో కాలుసాచుకు కూర్చుంటూనంటే ఇక్కడ మనుష్యులు లేరు. జబ్బుగావున్నానని సాకు చూపించకు. టైఫస్‌నుంచి బయటపడ్డాక నెలరోజులపాటు కర్ర పుచ్చుకొని తూలితూలిపడుతూ పనిచేసేను. నాకన్నూ కప్పబోకు. పావ్కా! నీ వ్యవహారం నాకు తెలుసు. ఇందులో రహస్యం వేరు. చెప్పు."

"కోల్యా! నీమాట అబద్ధంకాదు. నిజమే. చదువుకోవాలని చూస్తున్నా."

ఓకునేవ్ ఎగిరిగంతేసేడు.

"నేచెప్పలేమూ. అసలు సంగతి వేరు. నాకుమాత్రం చదువుకోవాలని లేదంటావా? పెద్ద నువ్వో మొనగాడివైనట్లు. నువ్వు చదువుకోవడానికి వెడితే ఈ బండిని మేం లాగాలేం? అదేం పనికిరాదు. రేపుపొద్దుటినుంచి ఆర్గనైజరుగా పనిచూడు."

కాని, చాలసేపు వాదన జరిగేక ఓకునేవ్ వొప్పుకొన్నాడు.

"సరే. రెండు నెలలపాటు మాట్లాడను. నీవిషయంలో యెంతో మెత్తగా వుంటున్నా. తెలుసా? కాని త్స్వేతాయేవ్‌తో ఈవ్యవహారం సాగదు. అతడు కాస్త పెంకెఘటం. ఏమనుకున్నావో."

వర్క్‌షాపులో పావెల్ అడుగు పెట్టగానే త్స్వేతాయేవ్ బెదిరేడు. ఇంక నాయకత్వంకోసం తగువు ప్రారంభమవుతుందని అతడు అభిప్రాయపడ్డాడు. అది

తనను అవమానంగా భావించేడు గట్టిగా ఎదుర్కోవాలని దృఢపరచుకొన్నాడు. కాని, త్వరలోనే తన అభిప్రాయం తప్పు అని గ్రహించేడు. తనను కామ్‌సోమాల్ బ్యూరో సభ్యుణ్ణిగా చెయ్యడానికై ప్రయత్నాలు జరుగుతున్నట్లు తెలియగానే కోర్చాగిన్ కార్యదర్శి ఆఫీసుకు వెళ్ళేడు. ఓకునేవ్‌తో మాట్లాడేసనీ, తనపేరు ఎజెండానుంచి తీసెయ్యమనీ అడిగి తీయించివేసేడు.

షాప్సులో వున్న కామ్‌సోమాల్ సెల్‌లో పావెల్ రాజకీయతరగతులు తీసుకొన్నాడు. కాని, బ్యూరోలో పనికి వొప్పుకోలేదు. నాయకత్వంలో అతనికి స్థానం లేకపోయినా సమిష్టికార్యక్రమా లన్నింటా అతని పలుకుబడి స్పష్టంగా కనిపిస్తూనేవుంది. సహచరుడుగా, ఆర్భాటం ఏమీలేకుండా అనేక సందర్భాల్లో త్స్వెతాయేవ్‌ను చిక్కుల్లోంచి బయట పడేసేడు.

ఒకరోజున త్స్వెతాయేవ్ షాపులోకి వచ్చేసరికి అందరు కామ్‌సోమాల్ సభ్యులూ, పార్టీసభ్యులుకానివారు మూడుడజన్లమంది కిటికీలన్నీ కడిగేవారూ, మిషన్లవద్ద పేరుకుపోయిన మడ్డినీ, మట్టినీ గోకేవారూ, యార్డులో వున్న చెత్తనంతనూ బయటకు తీసుకుపోయి పారేసేవారూ మహా హడావిడిగావున్నారు. పావెల్ పెద్దచీపురు తీసుకొని సిమెంటునేలని పట్టుకొన్న నూనెమరకలూ, గ్రీజుమరకలూ, తుడుస్తున్నాడు.

"వసంతోత్సవాలా యేం?" ఏమిటీ అలంకరణం?"

"ఈమడ్డి చూస్తూంటే అసహ్యం వేస్తూంది. ఇరవ య్యేళ్ళ ఈమధ్య చీపురుకట్ట మొహం చూసినట్లులేదు. ఒక్క వారంలో చూడు కొత్తదానిలాగ చేసేస్తాం."

త్స్వేతాయేవ్ భుజాలు కుదుపుకొని వెళ్ళిపోయేడు.

తమ వర్కుషాపును శుభ్రంచేసుకొన్నాక ఎలక్ట్రిక్ పనివాళ్ళు ఫ్యాక్టరీయార్డుమీద పడ్డారు. పనికిరాని వస్తువు లన్నీ తెచ్చి ఆయార్డులో పడేస్తూండడం మామూలు. అల్లాగ ఏళ్ళతరబడి పడేసిన సామాను లక్కడ పేరుకొనివున్నాయి. రైలుబండిచక్రాలు, ఇరుసులు, తుప్పుపట్టిన ఇనుము, రైలు పట్టాలు, బఫర్లు, ఇరుసుచివరవుండే పెట్టెలు (కుంచాలు) ఒకటేమిటి వేలకొద్దీటన్నుల సామగ్రి తుప్పుపట్టిపోతూంది. కాని, ఫ్యాక్టరీమేనేజ్మెంటు ఆపనుచువాళ్ళని అడ్డగించేరు.

"ఇంతకన్న ముఖ్యమైన పనులు చాలా వున్నాయి. యార్డు కేంతొందరొచ్చింది?"

ఇంకె ఎలక్ట్రిక్ పనివాళ్ళు చేసేదేముంది? తమ షాపు కెదురుగా కొంతమేర బాగుచేసుకొని, గుమ్మంబయట తీగ లతో అల్లినచాప కాళ్ళుతుడుచుకొనేటందుకు పడేసి సంతృప్తి పడ్డారు. కాని షాపులోపల పనిపూర్తిఅయ్యేక శుద్ధికార్య క్రమం కొనసాగుతూనేవుంది. ఒక వారంపోయేక చీఫ్ ఇంజ నీర్ స్త్రిజ్ చూడవచ్చేసరికి షాపు దీపాలకాంతిలో ధగధగ లాడిపోతూంది. ఇనపచువ్వల కిటికీలను పట్టివున్న దుమ్మూ, సాలెగూళ్ళూ పోవడంతో వెలుతురు శుభ్రంగా ప్రవేశి స్తూంది. మెరుగుపెట్టిన డీసిల్ ఇంజన్ల బాపతు రాగి భాగాలు

ఈ వెలుతురులో మిలమిలలాడుతున్నాయి. యంత్రాలబరువు భాగాలకు కొత్తగా ఆకుపచ్చరంగు వేసేరు. చక్రాల ఆకులకి పసుపురంగుతో చారలు గీసేరు.

స్త్రిజ్ చాల ఆశ్చర్యపడ్డాడు.

“బాగుంది...”

షాపులో ఒక మారుమూల ఇంకా కొంతమంది చేరి బాగుచేత కొనసాగిస్తున్నారు. స్త్రిజ్ ఆ వేపుబయలుదేరేడు. దారిలో రంగుడబ్బాతీ కెడుతూ కోర్చాగిన్ ఎదురయ్యేడు.

‘‘మాట’’—అని ఇంజనీరు అతనిని ఆపేడు.

“మీరుచేస్తున్నపని చాలాబాగుంది. కాని, రంగులు ఎక్కడ సంపాదించేరు? నా అనుమతిలేనిదే రంగులుముట్టుకో వద్దని గట్టిగా చెప్పలేమూ? ఇల్లాంటివాటికూడా రంగులు ఎక్కడ తేగలం? మనకున్నది ఇంజన్లకే చాలదుకదా.”

“లేదు, మీరు పారేసిన డబ్బాల అడుగులుగోకి తీసేం. రెండురోజులు కష్టపడితే కష్టపడ్డాం. కాని ఇరవయ్యయిదు పౌనులరంగు తీసేం. కామ్రేడ్ ఇంజనీర్! మేమిక్కడి నిబంధనలు వేటినీ అతిక్రమించడంలేదు.

ఇంజనీరు బిక్కమొగంవేసేడు. అనవసరంగా తొందర పడ్డానే అనుకొన్నాడు.

‘‘అయితేకానీండి... బాగుంది... ఈ పనెందుకు ప్రారంభించేరు... వర్కుషాపు శుభ్రంగావుంచాలనే ప్రయత్నం ఎందుకువచ్చింది? ఎవరి పని వారు పూర్తిచేసేకనే చేసేరు కదు?’’

ఇంజనీరుస్వరంలో దిగ్భ్రాంతి వినబడుతూంది.

“కాదు. మీ రేమనుకొన్నారు?”

“కాని...

కామ్రేడ్ స్త్రిజ్! ఇందులో ఆశ్చర్యం ఏమీలేదు. దుమ్మూ, ధూళిగురించి కమ్యూనిస్టులు పట్టించుకోరని మీ కెందుకు అనిపించింది?”

రంగు ఇంజనీరుమీదపడకుండా తప్పించుకొని కోర్చాగిన్ వెళ్ళిపోయేడు.

ప్రతిరోజూ సాయంకాలం పావెల్ లైబ్రరీలో హాజరవుతాడు, ఓరాత్రివరకూ అక్కడేవుంటున్నాడు. లైబ్రేరియన్లతో స్నేహంచేసేడు. వాళ్ళని ఒప్పించి తనకి కావలసిన పుస్తకాలకోసం బీరువాలలో వెతుక్కొనేటందుకు అధికారం సంపాదించేడు. నిచ్చెనవేసుకొని గంటలతరబడి ఒకటితర్వాత ఒకటిగా పుస్తకాలన్నీ తిరగేసేడు. అక్కడివన్నీ పాతపుస్తకాలే. ఆధునికగ్రంథాలన్నీ ఒక్కబీరువాడు మాత్రమే వున్నాయి. మార్క్సువ్రాసిన ‘కాపిటల్’, జాక్ లండన్ వ్రాసిన ‘ఐరన్ హీల్’ (ఉక్కుపాదం) వగైరాలన్నీ దాంట్లోవున్నాయి. పాతపుస్తకాలు తిరగేస్తుంటే ‘స్పార్టకస్’ కనబడింది. దానిని రెండురాత్రులలో పూర్తిచేసేడు. బాగా నచ్చింది. తెచ్చి బీరువాలో మాక్సింగోర్కీ రచనలప్రక్కన పెట్టేడు. ఈవిధంగా విప్లవభావోద్దీపకాలయిన ఆధునికసాహిత్యాన్ని వెతికితియ్యడంలో కొన్నాళ్ళు గడిచింది.

లైబ్రేరియన్లు ఏమీ అనలేదు. ఏ పుస్తకం ఎక్కడున్నా వాళ్ళకేం పట్టలేదు.

*　　　*　　　*

ఒక చిన్న ఘటనతో అంతవరకూ ప్రశాంతంగా సాగిపోతున్న రైల్వే వర్కుషాపుల కామ్సోమోల్ జీవితం అల్లకల్లోలంఅయింది. మరమ్మతుల పనిచేసే కోస్త్యా ఫిడిన్ విదేశాలనుంచి తెప్పించిన మంచి ఖరీదయిన డ్రిల్లును ఒక ఇనప ముక్కమీద విరగగొట్టేడు. ఫిడిన్ పరమబద్ధకుడు. చప్పిడి ముక్కూ, స్ఫోటకంమచ్చల మొగం అతడూ సెల్ కమిటీ సభ్యుడు. నిర్లక్ష్యంమూలంగానే డ్రిల్లు విరిగిపోయింది. అంత కన్నా అధమం, దానినిపాడుచెయ్యాలనే చేసేడాఅనిపించిన ఘటన అది.

అదొకరోజు పొద్దున్నే జరిగింది. మరమ్మతులపనిలో సీనియరుఫోర్మను కోస్త్యాకు ఒకఇనపముక్క ఇచ్చి దానిమీద చిల్లులు కొయ్యమన్నాడు. కోస్త్యా మొదట నిరాకరించేడు. కాని, ఫోర్మన్ బలవంతంమీదతీసుకొని డ్రిల్లింగ్ యంత్రంలో పెట్టేడు. ఫోర్మన్ మీద పనివాళ్ళకి అంత సద్భావం లేదు. ఒకప్పుడు మెన్షెవిక్ పార్టీలో వుండేవాడు. ఫ్యాక్టరీ జీవితంలో ఏమీకలగచేసుకోడు. కామ్సోమోల్స్ అంటే ఆతనికిష్టంలేదు. ప్రాణాలుతోడేసి పనిచేయించే రకం. పని తెలుసును. ఏమాత్రం ప్రాల్మాలిక లేకుండా తన పని చేసుకుపోతాడు. కోస్త్యా డ్రిల్లులో నూనెవెయ్యకుండా 'పొడి' గానే బొత్తకోస్తున్నాడని ఫోర్మన్ ఖోడోరోవ్ చూసేడు. వెంటనే వెళ్ళి, మిషన్ ఆపేడు.

‘‘కళ్ళు లేవా యేం? అంతకన్న డ్రిల్లు చేసే పద్ధతి తెలి
యదా!’’—అవిధంగా చేస్తే డ్రిల్లు ఎంతో కాలం మనదనే
ప్రదేశంతో ఆతడు కోస్త్యాను కేకలు వేసేడు.

కోస్త్యా ఎదురుతిరిగేడు. లేతు మళ్ళీ నడిపేడు. ఆవిష
యం చెప్పడానికై ఖోడోరోవ్ వెంటనే డిపార్టుమెంటు అధి
కారివద్దకు వెళ్ళేడు కాని, ఈలోపున కోస్త్యా డ్రిల్లుపని
చేస్తుండగానే దానినల్లా వదిలి నూనె తేవడంకోసం వెళ్ళేడు.
ఖోడోరోవ్ మళ్ళీ వచ్చేసరికి నూనె వేసి ఆతడు అనవసరంగా
అల్లరి చేసేడనిపించాలని ఆశనివ్రూహ. కాని, నూనె ‘కాన్’తో
వచ్చేసరికి డ్రిల్లు విరిగిపోయింది. ఫిడిన్‌ను బర్తరఫు చేయాలని
సిఫార్సు చేస్తూ డిపార్టుమెంటు అధికారి పైకి రిపోర్టుచేసేడు.
కామ్‌సోమాల్ సెల్లుబ్యూరో ఫిడిన్ తరఫున నిలబడి కామ్‌సో
మూల్స్‌మీద ఖోడోరోవ్‌కు కక్షవున్నదని, అదే దీనికి కారణ
మనీ వాదన ప్రారంభించేరు. మేనేజ్‌మెంటు ఫిడిన్‌ను బర్త
రఫు చేయాలన్నారు. కేసును వర్కుషాపులోని కామ్‌సో
మాల్ కార్యవర్గంముందు పెట్టేరు. గొడవ ప్రారంభమయింది.

కోస్త్యాను చీవాట్లుపెట్టి, మరోపనికి పంపేస్తే చాలు
నని కార్యవర్గసభ్యు లయిదుగురిలో ముగ్గురి అభిప్రాయం.
వారిలో త్స్వేతాయేవ్ ఒకడు. ఫిడిన్‌ను అసలు శిక్షించనే
కూడదన్నారు, తతిమ్మా ఇద్దరూ.

త్స్వేతాయేవ్ ఆఫీసులో కార్యవర్గం సమావేశం పిలి
చేరు. ఎర్రని గుడ్డపరిచిన పెద్ద టేబిలుచుట్టూ బెంచీలు, బల్లలు
వేసివున్నాయి. వాటన్నింటినీ వడ్రంకార్ఖానాలో యువ

కమ్యూనిస్టులే తయారుచేసుకొన్నారు. గోడలమీద నాయకుల బొమ్మలున్నాయి. టేబిలువెనకనున్న గోడనంతనూ ఆవరించేటంత పెద్ద రైల్వేవర్క్‌షాప్ బ్యానరువుంది.

త్స్వెతాయేవ్ ఇప్పుడు 'హోల్‌టైమ్‌వర్కరు' గా వుంటున్నాడు. వృత్తికిఅయితే ఫౌండ్రీపనివాడు. కాని నిర్మాణ వ్యవహారాలలో కుశలత వుండడంచేత కామ్‌సోమాల్ నిర్మాణంలో నాయకుడుగా నియమించబడ్డాడు. కామ్‌సోమాల్ జిల్లాకమిటీ కార్యవర్గ సభ్యుడు గుబర్నియా కమిటీసభ్యుడూను. యంత్రికర్మాగారానికి సంబంధించిన ఫౌండ్రీలో పనిచేసేడు. ఈమధ్యనే రైల్వేషాపుల్లోకి వచ్చేడు. ప్రథమంనుంచీ మేనేజ్‌మెంటు వ్యవహారాలు తనచేతిలోకే తీసుకొన్నాడు. ఆత్మవిశ్వాసంగలమనిషి. కాని, కొంచెం తొందరపాటువుంది. మొదటినుంచీ ఇతర కామ్‌సోమాల్ సభ్యులలో చొరవ తల ఎత్తనివ్వకుండానే చేసేడు. ప్రతిదీ తానే చేసుకొనేవాడు. కాని, అన్నిపనులూ చెయ్యలేడు. దానితో విసుక్కొని ఇతరులెవళ్ళూ పనిచెయ్యడం లేదనేవాడు.

ఆఫీసులో అలంకారాలుకూడా ఆయన చేతిమీదుగానే జరిగేయి.

మెత్తలున్నసోఫా ఒకటి క్లబ్బుగదిలోంచి తెప్పించి తనగదిలో వేయించేడు. ఇప్పుడాతడు దానిలోనే కూర్చొండి సమావేశాన్ని నిర్వహిస్తున్నాడు. కార్యవర్గ సభ్యులకు మాత్రమే ప్రవేశంవున్న రహస్యసమావేశం అది. పార్టీ ఆర్గనైజర్ ఖోముటోవ్ మాట్లాడబోతూంటే తలుపుకొట్టినచప్పు

డయింది. త్స్వెతాయేవ్ విసుక్కున్నాడు. మళ్ళీ చప్పు డయింది. కాత్యాజెలెనోవా లేచిపెళ్ళి తలుపు తీసింది. గుమ్మంలో కోర్సాగిన్ నిలబడివున్నాడు. ఆతనిని లోనికి రానిచ్చి ఆమె మరల తలుపు వేసేసింది.

అక్కడ ఖాళీగావున్న ఒకకుర్చీలో పావెల్ కూర్చో బోతూంటే త్స్వెతాయేవ్ పిలిచేడు.

"కోర్చాగిన్! కార్యవర్గం రహస్యంగా సమావేశ మవుతూంది.

పావెల్ సిగ్గుపడ్డాడు. మొగం కందిపోయింది. నెమ్మ దిగా టేబిలువంక తిరిగేడు.

"నాకు తెలుసు. కాని, ఫెడిన్ వ్యవహారంలో మీా అభిప్రాయం తెలుసుకోవాలని వచ్చేను. ఆసందర్భంలో నేను చెప్పవలసిందొకటుంది. ఏమంటారు? నేను వుండడం మీాకే మన్నా అభ్యంతరమా?"

నాకేమీా అభ్యంతరంలేదు. కాని, రహస్య సమా వేశాలన్నవి కార్యవర్గసభ్యులకే పరిమితం. ఆసంగతి నీ వెర గవా? జనం ఎక్కువైనకొద్దీ చర్చలు సాగారి, పర్యవసానం తేల్చడం కష్టంఅవుతుంది. అయినా వచ్చేవుగనక కూర్చో."

కోర్చాగిన్‌కు ఇంత చిన్నపుచ్చుకోవలసిన పరిస్థితి ఎన్నడూ తటస్థపడలేదు. ముఖం చిట్లించేడు.

"ఏమిటీ ఆర్భాటం"—అని ఖోముటోవ్ అయిష్టం కనబరిచేడు. కాని పావెల్ ఏమీాఅనవద్దని నివారించి మాట్లా డక కూర్చున్నాడు. ఖోముటోవ్ తన ప్రసంగం ప్రారం భించేడు.

"నే చెప్పదలచుకొన్న దిది. ఖోడోరోవ్ పాతకాలం మనిషి. కాని క్రమశిక్షణమాటేమిటి? కామ్సోమాల్సంతా డ్రిల్లులు విరిచెయ్యడం ప్రారంభిస్తే పని ఎల్లాజరుగుతుంది? అంతేకాదు. పార్టీసభ్యులు కానివారికి మనంచూపే ఆదర్శం ఇదా? నావుద్దేశ్యంలో కోస్త్యాకు గట్టి హెచ్చరిక నివ్వాలి."

అతడు పూర్తిచేసేవరకన్నా ఊరుకోకుండా త్స్వెతా యేవ్ అభ్యంతరంచెప్పేడు. పదినిముషాలు గడిచింది. సభికుల ఆలోచనలెల్లావున్నాయో కోర్చాగిన్ పసికట్టేడు. చర్చ ముగించి వోటుకి పెట్టబోయేసమయంలో తానూ మాట్లాడు తానన్నాడు. త్స్వెతాయేవుకి ఇష్టంలేదు. అయినా అంగీకరించేడు.

పావెల్ ప్రారంభించేడు. అప్రయత్నంగానే అతనికంఠ స్వరం కఠినం అయింది.

"ఫిడిన్ వ్యవహారంలో నా అభిప్రాయం చెప్పాలను కొంటున్నా, కామ్రేడ్స్! ఫిడిన్ వ్యవహారం మనకో హెచ్చరిక అనాలి. కోస్త్యా చేసినపనిలో లేదు అసలువిషయం. నేను నిన్న కొన్ని లెక్కలు సంగ్రహించేను."

పావెల్ జేబులోంచి ఒక నోటుబుక్కు తీసి చదవడం ప్రారంభించేడు.

"వీటిని 'టైమ్‌కీపర్' దగ్గర తీసుకొన్నాను. వినండి జాగ్రత్తగా: మన కామ్సోమాల్సులో నూటికి ఇరవై ముగ్గురు రోజూ పనిలోకి అయిదునుంచి పదిహేనునిముషాల వరకు ఆలస్యంగా వస్తున్నారు. అదో మామూలైపోయింది.

ప్రతినెలా ఒకటిరెండు రోజులపాటు చెప్పనన్నా చెప్పకుండా పనిలోంచి గైరుహాజరయ్యేవాళ్ళు నూటికి పదిహేడుగురు దాకా వున్నారు. పార్టీవాళ్ళుకాని పనుచువాళ్ళలో నూటికి పధ్నాలుగుమంది గైరుహాజరుఅవుతున్నారు. ఇదిచూస్తూంటే కర్రుకాల్చి పెట్టినట్లుంటుంది. ఇంకా కొన్ని లెక్కలు వ్రాసు కొచ్చేను. వినండి : పార్టీసభ్యులు నాలుగుశాతంమంది నెలకో రోజు పని ఎగవేస్తున్నారు. నాలుగుశాతం పనికి ఆలస్యంగా వస్తున్నారు. పైవాళ్ళలో పదకొండుశాతం నెలకో రోజు గైరుహాజరవుతున్నారు. పదమూడుశాతం తప్పకుండా ఆల స్యంగా పనిలోకి వస్తున్నారు. విరిచివేసిన పనిముట్లలో నూటికి తొంభయివరకూ పనుచువాళ్ళచేతుల్లోనే విరుగు తున్నాయి. వాళ్ళల్లో ఏడుశాతం కొత్తగావచ్చినవాళ్ళు. దీనిఅర్థం ఏమిటి? పార్టీసభ్యులకన్నా, పైవాళ్ళకన్నా కొమ్సొమోల్సు, ఎక్కువ నాశనంచేస్తున్నామన్నమాట. అన్ని చోట్లా ఇదేమాదిరిగా లేదు. ఫౌండ్రీలో పని బాగావుంది. ఎలక్ట్రిక్ పనివారిలోకూడ ఫరవాలేదు మిగతా అంతటా ఇంచుమించు ఒకేమాదిరిగా వుంది. క్రమశిక్షణగురించి చెప్ప వలసిందాంట్లో శతాంశంకూడా ఖోముటోవ్ చెప్పనేలేదని నా అభిప్రాయం. ఈ ఎగుడుదిగుళ్ళన్నీ సరిచెయ్యడానికి వెంటనే పూనుకోవాలి. ఇక్కడ ఆందోళన ప్రారంభించడం నావుద్దేశంకాదు. కాని, ఏదోచోట ప్రారంభించాలికదా. ఈ నిర్లక్ష్యాన్నీ, బద్ధకాన్నీ తుదముట్టించాలి. పెట్టుబడిదారీ యజమానులకోసం పనిచేసినరోజుల్లో ఇంతకంటె బాగా పని జరిగేది అని పెద్దవాళ్ళు నిర్మొగమాటంగా చెప్తున్నారు.

ఇప్పుడు యాజమాన్యం మనదే. ఇంకెందుకు సరిగ్గా పని చెయ్యకూడదు? తప్పు కోస్త్యాదా, మరొకరిదా యినికాదు. తప్పు మనదే. తప్పు జరిగినప్పుడు వెంటనే చర్యతీసుకోడానికి బదులు, మనమే కోస్త్యావంటివాళ్ళని వెనకేసుకువస్తున్నాం.

"ఇప్పుడే కోస్త్యావంటి ఉత్తమోత్తముడు లేడని సామోఖినూ, బుటిల్యాగూ అన్నారు. మంచి కార్యకర్త యట. చురుకైనవాడట. ఒక డ్రిల్లును విరిచేస్తేనేం? పొరపాటు ఎవరికేనా వస్తుందట. ఆతడు మనవాడూ, ఫోర్మన్ పరాయివాడూ నట...... మనలో ఎవరన్నా ఖోడొరోవ్‌తో ఎప్పుడన్నా మాట్లాడిచూసేరా? ఆతనికి ముప్ఫయ్యేళ్ళ పని అనుభవం వుంది. మనం ఇప్పు డాతని రాజకీయాల్నిగురించి చర్చించబోవడంలేదు. ఈ వ్యవహారంలో ఆయన దేమీ తప్పులేదు. మనం ఎంతో విలువైన పనిముట్లని ధ్వంసం చేస్తూంటే బయటవాడైనా ఆయన ప్రభుత్వఆస్తిని కాపాడటానికి ప్రయత్నించేడు. ఈ పరిస్థితుల్ని ఏమంటారు? మనం వెంటనే చర్యతీసుకొని, ఈ వ్యవహారం సరిదిద్దుకోవాలనంటాను.

"పని బద్ధకుడుగా, ఉత్పత్తిని పాడుచేస్తున్నవాడుగా, ఫెడీనును కామ్సోమాల్‌నుంచి బర్తరఫు చెయ్యాలి. ఈ వ్యవహారం అంతనూ గోడవార్తాపత్రికలో చర్చకుపెట్టాలి. ఫలితాలకు భయపడకుండా ఈ లెక్క లన్నింటినీ సంపాదకీయ వ్యాసంలో చర్చించాలి. మనం బలీయంగా ఉన్నాం. తగినంతమంది గట్టివాళ్ళున్నారు. మనవాళ్ళలో అరవైమంది

వరకూ యుద్ధాల్లో పనిచేసినవాళ్ళున్నారు. అక్కడి పరీక్షకు బాగా నిలబడ్డవాళ్ళే. వాళ్ళ సహాయమూ, తోడ్పాటుతో మనం కష్టాలనుంచి బయటపడగలం. అయితే మన దృక్పథంలో మార్పుమాత్రం రావాలి.”

సాధారణంగా శాంతంగా మాట్లాడే కోర్చాగిన్ చూపిన ఆవేశాన్ని చూసేసరికి త్స్వేతాయేవ్‌కు ఆశ్చర్యం కలిగింది. పావెల్ నిజరూపం చూడ్డం అతని కిదే ప్రథమం. అతడు చెప్పింది నిజమేనని ఎరుగును. కాని, బహిరంగంగా ఆమాట వొప్పుకోడానికి దమ్ములు లేకపోయేయి. ప్రకృతం కామ్‌సోమాల్‌లోవున్న నిర్మాణపరిస్థితుల్ని తీవ్రంగా విమర్శిస్తున్నాడనీ, తన్ను అధికారంనుంచి పీకేసేటందుకు ప్లాను కొన్నాడనీ వూహించుకొన్నాడు. తన శత్రువును నేల కరిపించెయ్యాలనుకొన్నాడు. మెన్షెవిక్ ఖోడోరోవ్‌ను సమర్థిస్తున్నాడంటూ పావెల్ మీద విరుచుకుపడ్డాడు.

చర్చలు మూడుగంటలసేపు తీవ్రంగా సాగేయి. పర్యవసానానికి వచ్చేసరికి రాత్రి బాగా పొద్దుపోయింది. సత్యవిషయాల్ని కాదనలేక, సభ్యులలో హెచ్చుమంది కోర్చాగిన్‌ను సమర్థిస్తూంటే ఉండబట్టలేక త్స్వేతాయేవ్ మండిపోయేడు. ఆ ఆవేశంలో తొందరపడ్డాడు. వోటు తీసుకొనేముందు కోర్చాగిన్‌ను బయటకుపొమ్మని ఆదేశించి ప్రజాతంత్రపద్ధతుల నుల్లంఘించేడు.

“అలాగే. వెడతా. నీ వ్యవహారం బాగులేదు. కామ్రేడ్ త్స్వేతాయేవ్! నీ ధోరణిలోనే కొనసాగించే

టట్లయితే నేను ఈ విషయాన్ని సర్వసభ్యసమావేశంలో పెడ తాను. అక్కడ నీ మెజారిటీ చెల్లదు. త్స్వేతాయేవ్! పొర పాటు చేస్తున్నావు. కామ్రేడ్ ఖోముటోవ్! సర్వసభ్యసమా వేశానికి ముందు పార్టీగ్రూపులో ఈ విషయం ఆలోచించ వలసిన బాధ్యత నీమీద వుంది."

త్స్వేతాయేవ్ పెంకెతనంగా కేకలుప్రారంభించేడు.

"బెదిరిస్తున్నావా యేం? పార్టీగ్రూపుముందు ఆపెట్టే దేదో నేనే పెడతాను. నీ వ్యవహారంకూడా తేల్చవలసిందే. పని బాధ్యతతీసుకోడానికి సిద్ధంగా లేనప్పుడు ఇతరులకి అడ్డం రాకు."

పావెల్ బయటకువెళ్ళి తలుపు జేరవేసేడు. నుదు రంతా ఉడికిపోతూంది. చేయితో ఒత్తుకొన్నాడు. నిర్జనంగా వున్న ఆఫీసువరండాలు దాటి వీధిలోకివచ్చేడు. సిగరెట్టు వెలిగించి ఒక్కదమ్ము పీల్చేడు. సరాసరి తోకరేవ్ వుంటున్న బెత్యేవా మిట్ర వేపు బయలుదేరేడు.

వెళ్ళేసరికి తోకరేవ్ రాత్రి భోజనప్రయత్నంలో వున్నాడు.

"రా, లోపలికి. కబుర్లేమిటి? దార్యా! వీడికో ప్లేటుతో జావపట్టుకురా."

తోకరేవ్ భార్య దార్యాఫోమినిచ్నా మొగుడిలా గాక పొడుగ్గా, పుష్టిగా వుంటుంది. పావెల్‌కోసం ఒక ప్లేటులో జొన్నఅంబలి తెచ్చి బల్లమీద పెట్టింది.

"రా, నాయనా!"

* * *

త్రోకరేవ్ రైల్వే వర్కుషాపుల్లో పనిచేసే రోజుల్లో పావెల్ వాళ్ళయింటికి తరుచువస్తూవుండేవాడు. సరదాగా కాలక్షేపంచేసేవాళ్ళు. కానీ, ఈ పర్యాయం పట్నం వొచ్చేక అక్కడికిరావడం ఇదే మొదలు.

పావెల్ చెప్పినదంతా త్రోకరేవ్ శ్రద్ధగావిన్నాడు. మధ్యమధ్య ఆ, ఊఁ, అనటంతప్ప వ్యాఖ్యానాలేవి చేయలేదు. అంబలితాగేసేక జేబురుమాలుతో మీసాలు తుడుచుకొని కంఠం సవరించుకొన్నాడు.

"నీఅభిప్రాయం బాగానేవుంది. ఈసమస్యని ఏనాడో ఎత్తుకోవలసివుంది జిల్లాలో మరెక్కడావున్నకంటె రైల్వే వర్కుషాపుల్లో పార్టీసభ్యులు చాలమందివున్నారు. అందుచేత పని అక్కడేప్రారంభించాలి. చివరకు నువ్వూ త్స్యోతాయేవూ పేచీపడ్డారన్నమాట. అబ్బే అదేం బాగులేదు. అతడు కొంచెం తలబిరుసుమనిషి. కాని, నువ్వందరితో సర్దుకుపోయే మనిషివేనే! అవునుగాని వర్కుషాపుల్లో నీ పనేమిటి ?

"ఒక డిపార్టుమెంటులో పనిచేస్తున్నానంతే. అయితే సాధారణంగా ప్రతిపనిలోనూ కలగచేసుకొంటూనేవున్నాను. మా సెల్లులో రాజకీయ అధ్యయనతరగతులు నేనే తీసుకొంటున్నాను."

"కార్యవర్గంలో వున్నావా ?"

కోర్చాగిన్ సందేహించేడు.

"అంతగా వోపికి చేరలేదుగదాయనీ, కాస్త చదువు కొందామనీ, నాయకత్వంలో కొంతకాలం దూరంగావుందామనుకొన్నాను."

తోకరేవ్ అసంతృప్తి ప్రకటించేడు.

"అదా సంగతి. ఆరోగ్యం అంటున్నావు గనక గాని నిన్ను చీవాట్లు పెట్టి వుండేవాడిని. ఇప్పు డెల్లా వున్నావు? ఓపిగ్గా వున్నావా?"

"ఆ."

బాగుంది. ఇంక పనికి దిగు. తటపటాయింపులు కట్టి పెట్టు. దూరంగా కూర్చుంటే ప్రయోజనం ఏమీ వుండదు. బాధ్యత కాస్తా తప్పించుకుందామని నీ ఎత్తు. ఔనా? రేపు అన్నీ దారిలో పెట్టుకో. ఓకు సేవ్ తో ఓమాటు మాట్లాడు తాను లే

పావెల్ ఆదుర్దా కనబరిచేడు.

"వద్దు! బాబాయ్! నాకు పనేమీ చెప్పవద్దని నేనే అడిగేను."

తోకరేవ్ ఎకసెక్కెంగా 'ఆ' అన్నాడు.

"నువ్వడిగేవు, అత డొదిలేసేడు. ఇంక మీతో ఎల్లాగ వేగడం?...సరే. కూర్చుని ఆ పేపరు చదువు, వింటాను. కళ్ళు కనబడకుండా వచ్చేయి."

* * *

వర్కుషాపుల్లోని పార్టీ కార్యవర్గం కామ్సోమాల్ కార్యవర్గంలో అత్యధిక సంఖ్యాకులు చేసిన నిర్ణయాన్ని ఆమోదించింది. పనిలో క్రమశిక్షణను ప్రవేశ పెట్టడానికై పార్టీ, కామ్సోమాల్ గ్రూపులు పూనుకొన్నాయి. కార్యవర్గ సమావేశంలో త్స్వేతాయేవ్ ను గట్టిగా దుయ్యబట్టేరు. మొదట డబాయించబోయేడు. కాని కార్యదర్శి లోపాఖిన్ పట్టు

కొన్నాడు. ఇంక మాటపెగలలేదు. లొంగిపోయి తన తప్పు నొప్పుకున్నాడు.

మరునాడు గోడవార్తాపత్రికల్లో వచ్చిన వ్యాసపరం పర చూసేసరికి రైల్వేవర్కుషాపులో పెద్దఅలజడి బయలు దేరింది. వ్యాసాలను చదివేరు. చర్చించేరు. ఆరోజు సాయం కాలంజరిగిన యువకుల సమావేశంలో ఎన్నడూలేనంతమంది హాజరయ్యేరు. ఆ సభలో ప్రధానంగా దీనిమీదనే చర్చలు జరిగేయి.

ఫిడిన్‌ను కొమ్సోమాల్‌నుంచి బహిష్కరించేరు. కోర్చాగిన్‌ను కార్యవర్గంలోకి తీసుకొని, ఆతనికి రాజకీయాధ్యయన తరగతుల నిర్వహణను వప్పచెప్పేరు.

ఈ నూతనదశలో రైల్వేవర్కుషాపుల్లో పరిష్కరించ వలసివస్తున్న నూతనసమస్యలనుగురించి నెజ్డానోవుచెప్తూంటే లంతా బహుశ్రద్ధగా విన్నారు.

సమావేశానంతరం పావెల్ తనకోసం కాచుకూర్చున్నాడని త్స్వేతాయేవ్ చూసేడు.

"నీతో మాట్లాడాలి. కలిసివెడదామా?"—అన్నాడు పావెల్.

త్స్వేతాయేవ్‌కు కోపంతీరలేదు.

"ఏం మాట్లాడాలి?"

పావెల్ నిశ్శబ్దంగా ఆతనిచేయి పట్టుకొన్నాడు. ఇద్దరూ పదిఅడుగులువేసి బెంచీవద్ద ఆగేరు.

పావెల్ బెంచీమీదకూర్చుంటూ, ఆతనిని కూడా రమ్మన్నాడు.

"ఒకక్షణం కూర్చుందామా?"

త్స్వెతాయేవు కూర్చున్నాడు. అతనినోట్లో సిగరెట్టు ఎర్రగా వెలుగుతూ, చల్లబడుతూ కాలుతూంది.

"త్స్వెతాయేవ్! నామీద నీకెందుకు కోపం?"

ఒక్క-క్షణం ఎవ్వరూ మాట్లాడలేదు.

త్స్వెతాయేవ్ ఆశ్చర్యం నటించబోయేడు. కాని కంఠం వణికింది.

"అదా సంగతి. ఇంకా ఏదో మాట్లాడుతావనుకొన్నాను."

పావెల్ అతని మోకాలిమీద చేయివేసేడు.

"దిమ్కా! ఎరగనట్లు నటించకు. డిప్లొమాట్లకిగాని మనకామాట లెందుకు? నే నంటే నీవ్యతిరేకతకి కారణం ఏమిటి?"

త్స్వెతాయేవ్ పల్లేరుకాయలమీద కూర్చునట్లు బల్లమీద అటూయిటూ కదిలేడు.

"ఏమిటామాట? నీమీద నాకు కోపంఏమిటి? నా అంతట నేనే నిన్ను పనిచెయ్యమన్నానా, లేదా? అప్పుడు చెయ్యనన్నావు. ఇప్పుడు పని ఇవ్వడంలేదంటున్నావు."

కాని అతని పలుకుల్లో ఆత్మవిశ్వాసంలేదు. పావెల్ వదలలేదు.

"నువ్వు చెప్పడంలేదు, కాని నేనుచెప్పేస్తా. నీపనికి అడ్డంరాదలచేననీ నీవుద్యోగం వూడలాక్కోవా లనుకొంటున్నాననీ నీవూహ. ఆవూహ నీకు లేకపోతే కోస్త్యా వ్యవహారంలో మనిద్దరికీ పేచీవచ్చేదికాదు. మనం ఇదేనూదిరిగా వున్నామా మనపని తెగులబడుతుంది. మనిద్దరికిమాత్రమే సంబం

గించిన సంగతే ఏదెల్లావున్నా బాధలేదు నన్ను గురించి నువ్వేమనుకున్నా నాకు బాధలేదు. రేపటినుంచి మనం ఇద్దరంకలిసి పనిచెయ్యాలి. ఇల్లావుంటే ఏంచేస్తాం? విను. మన మధ్య పేచీవద్దు మన మిద్దరం శ్రామికులం. అన్నిటికన్నా నీకు మన ఆదర్శంమీదనే అధిక ప్రేమ వుంటే, చేతిలో చెయ్యి వెయ్యి. రేపటినుంచి మనం మిత్రుల్లా పనిచేసుకొందాం. కాని నీమనస్సులోంచి ఈ దురభిప్రాయాలన్నీ వదుల్చుకో. కుట్ర బుద్ధి చూపించకు. లేకపోతే మన పనిలో వచ్చే ప్రతిదెబ్బనూ తన్నుకోవడం ప్రారంభిస్తాం. ఇదిగో నా చెయ్యి. స్నేహం కోరుతూ నీకందిస్తున్నా. తీసుకొంటా వా?"

త్స్వెతాయేవ్ తనచేతిలో చెయ్యివేస్తూంటే, కోర్చాగిన్ సంతృప్తితో చిరునవ్వు నవ్వుకొన్నాడు.

* * *

ఒకవారం గడిచింది. పార్టీ జిల్లాకమిటీ ఆఫీసులో పని వేళ ఆఖరుకావచ్చింది. ఆఫీసులన్నీ నిశ్శబ్దంగావున్నాయి. తోకరేవ్ మాత్రం ఇంకా మేజావద్దనేవున్నాడు. పడకకుర్చీలో కూర్చుని, ఆరోజున వచ్చిన రిపోర్టులు చదువుతున్నాడు. తలుపుతట్టిన చప్పుడయింది.

"రాండి."

కోర్చాగిన్ గదిలోకివచ్చి రెండు ప్రశ్నావళులను పూర్తిచేసి టేబిలుమీద పెట్టేడు.

"ఏమిటిది?"

"ఈ సాక్ష్యంగా ఇంక వుండదలుచుకోలేదు బాబాయ్! ఇప్పటికే ఆలస్యమైపోయింది, నన్నడిగితే. నువ్వూ అదే అభిప్రాయంలో వుంటే నీ సహాయానికి చాల కృతజ్ఞుడినై వుంటాను."

తోకరేవ్ కాగితాల శీర్షిక చూసి, పావెల్ వంక దీక్షగా చూసేడు. పెన్ తీసుకొన్నాడు.

రష్యన్ కమ్యూనిస్టుపార్టీ (బోల్షివిక్) సభ్యత్వం కాండిడేట్‌గా పావెల్ అంద్రెయేవిచ్ కోర్చాగిన్‌ను సిఫారసుచేస్తున్న కామ్రేడ్‌కు పార్టీలోవున్న స్థానం—అనే కాలముకు ఎదురుగా '1903' అని వ్రాసి క్రిందసంతకంచేసేడు.

"ఇదిగో, నువ్వు ఈ ముసిలివాడికెన్నడూ అవమానం తీసుకురావనే నమ్మకం నాకుంది. తీసుకెళ్ళు."

* * *

గదిలో ఉక్క భరింపశక్యంగాకుండావుంది. ఎవరికివారే ఎప్పుడుపోతామా, ఎంత వేగంగా సోలోమెంకాలోని చల్లని చెస్ట్‌నట్ చెట్లనీడల్లోపోయి కూర్చుందామా అనే ఆలోచిస్తున్నారు.

చెమటలు కారిపోతూంటే త్స్వెతాయేవ్ లేచేడు.

"మూసెయ్యి, పావ్కా! ఇంకొక్కనిముషం కూడా కూర్చోలేను."

కాత్యూషా, మిగిలినవాళ్ళూ ఆతనిని బలపరిచేరు.

వాళ్ళంతా లేస్తూంటే గోడనున్న పురానామోడల్ ఎరిక్సన్ టెలిఫోన్ గణగణలాడింది. త్స్వెతాయేవ్ రిసీవరు

తల్లి పిలిచేసరికి ఆడపిల్ల ఒకర్తే, మగపిల్లవాడొకడూ చటుక్కున వచ్చి చెరో కుర్చీలోనూ కూర్చున్నారు. ఇద్దరూ వీపులానించి కూర్చున్నారు. ఆటతల్లి "పావురాలకి మేత పెట్టండి." అని కేక వేసింది. ఇంక కూర్చున్నవాళ్ళు కూర్చున్నట్లే వెనక్కి విరగబడి పెదవులు తాకించేరు. వాళ్ళ విరగబాటుకు చుట్టూవున్న జనం విరగబడి నవ్వేరు.

తర్వాత 'రింగు' ఆట, 'పోస్టుబంట్రోతు' ఆటా ఆడేరు. ఈ రెండూకూడ ముద్దులుపెట్టుకొనే ఆటలే. పోస్టుబంట్రోతు ఆటలో ఆటగాళ్ళు నలుగురిమధ్యాగాక గదిలో దీపాలు ఆర్పేసి అక్కడ చాటుగా ముద్దుపెట్టుకోవాలి. ఈ ఆటల మీద ఇష్టంలేనివాళ్ళకోసం ఒకమూల టేబిలుమీద 'పువ్వుల ఆట' కార్డులకట్ట పడేసివుంది. పావెల్ ప్రక్కన పదహారేళ్ళ నీలికళ్ళపడుచు చేరి ఆ కార్డులకట్టలోంచి ఒక కార్డు తీసి చేతిలో పెడుతూ నెమ్మదిగా అంది.

"వైలెట్"

కొద్ది ఏళ్ళక్రితం పావెల్ ఈ మాదిరి వినోదాలకు హాజరయ్యేవాడు. ఈ ఆటలలో సరాసరి పాల్గొకపోయినా వీనిలో ఆతనికి తప్పేం కనపడలేదు. కాని, ఇప్పుడాతడీ మాదిరి పెట్టీబూర్జువా జీవితపద్ధతుల జోలీసాంతీ పట్టించుకోవడంలేదు. అందుచేత ఈ వినోదమంతా ఆతనికి అపహాస్యంగా కనబడింది.

అయినా తనచేతిలో కార్డువుంది.

దాంట్లో 'వైలెట్' కెదురుగా 'నువ్వంటే నాకెంతో ఇష్టం' అనేమాట వుంది.

పావెల్ ఆ అమ్మాయివంక చూసేడు. ఆమె అతని వంక బిడియపడుతూ చూసింది.

"ఎందుకు?"

అతని ప్రశ్నకు అర్థంలేదు. ఈమారు మూరా ఇంకో కార్డు చేతికిచ్చింది.

"గులాబీ"

గులాబీ కెదురుగా ఒకమాటవుంది.

"నువ్వే నాకు ధ్యేయం."

కోర్చాగిన్ సాధ్యమైనంతవరకు తన కంఠాన్ని సర్దుకొని ఆమెవంక జాలిగా చూసేడు.

"ఏమిటి ఈ తెలివితక్కువవ్యవహారం?"

మూరా వెర్రిమొగంవేసింది. ఏంచెప్పాలో అర్థంకాలేదు. బుంగమూతిపెట్టి మూరా "కోపంవచ్చిందా"— అని అడిగింది.

పావెల్ ఆ ప్రశ్నకు సమాధానం ఇవ్వలేదు. ఆమెను గురించి ప్రశ్నలు వేయడం ప్రారంభించేడు. ఆమె సమాధానాలిస్తూంది. మూరా సెకండరీస్కూలులో చదివింది. ఆమె తండ్రి కార్ షాపులో పనిచేస్తున్నాడు. ఆమె పావెల్‌ను చాలరోజులనుంచి ఎరుగు. ఆతనితో పరిచయం పెట్టుకోవాలనుకొంది.

"నీ యింటిపేరేమిటి?"

"వాలెంట్సేవా"

"యార్డులలో కామ్‌సోమాల్ కార్యదర్శిగావున్నది మీ అన్నే కాదు?"

"ఔను."

ఇంక పేచీయేమేలేదు. జిల్లాలోకల్లామంచి కామ్‌సోమాల్ కార్యకర్త అనిపించుకొంటున్న వాలెంత్సేవా తనచెల్లెలిని వట్టిమూర్ఖురాలినిగా వదిలిపెడుతున్నాడు. ఈఏడాదీ ఈమధ్య ఆమె తనస్నేహితులతో కలిసి ఈమాదిరి ముద్దులాట లెన్నింటికో హాజరయింది. ఆమె పావెల్‌ను తన అన్నగారిగదిలో చాలమార్లు చూసేసంది.

తన పక్కనున్న అతడికి తనప్రవర్తన నచ్చలేదని మూరా గ్రహించింది. ఆతనిముఖాన కనబడిన అపహాస్యపు నవ్వునుచూసేక 'పావురాలమేత' ఆటకి రమ్మన్నా ఆమె వెళ్ళడానికి నిరాకరించింది. మూరా అక్కడే కూర్చుని చాల సేపు కబుర్లుచెప్పింది. ఇంతలో జెలనోవా వారుకూర్చున్న చోటికి వచ్చింది.

"అకార్డియన్ తీసుకురానా?"

మూరావంక కొంటెగాచూస్తూ 'మీరిద్దరూ స్నేహం కలిపేరే'—అంది.

పావెల్ ఆమెను తమపక్కన కూర్చోబెట్టుకొన్నాడు. గదిలో జనం నవ్వుతూ, తుళ్ళుతూ గొడవగొడవ చేస్తున్నారు.

"నేను వాయించదలచుకోలేదు. మూరా నేనూ పోతున్నాం."

"అయితే మనసు కలిసిందన్నమాట"—అని జెలనోవా ఇద్దరినీ మార్చిమార్చి చూసింది.

"అదిసరేగాని, కాత్యూషా! మనంతప్ప కామ్‌సోమా ల్నిక్కడింకెవరేనా వున్నారా? లేక మనకొక్కళ్ళకేనా 'పావురాలమేత' అంటే యిష్టం."

"ఇప్పుడింక ఆ అల్లరిచిల్లరిఆటలు ఆడబోవడంలేదు. ఇంక డాన్సుచేస్తాం."

కోర్చాగిన్ లేచేడు.

"అదిసరే. నువ్వు డాన్సుచెయ్యి. నేనూ, మూరా పోతున్నాం."

*　　　*　　　*

ఒకరోజున సాయంకాలం అన్నాబోర్హార్టు ఓకునేవ్ గదికివచ్చింది. గదిలో కోర్చాగిన్ ఒక్కడే వున్నాడు.

"పావెల్! పనిలోవున్నావా? సిటీ సోవియట్ విస్తృత సమావేశంవుంది. నువ్వుకూడా వొస్తావా? ఒంటరిగా వెళ్ళడం ఇష్టంలేదు. చాలరాత్రి కావచ్చు.

కోర్చాగిన్ వెంటనే బయలుదేరేడు. పరుపుమీద వున్న మాజరు తీయబోయేడు. కాని, బరువనిపించి వదిలేసేడు. డ్రాయరులోవున్న ఓకునేవ్ రివాల్వరుతీసి జేబులో వేసుకొన్నాడు. స్నేహితుడికో చీటివ్రాసి అక్కడపెట్టి గది తలుపు తాళంవేసి, తాళంచెవి గుర్తుగాపెట్టేడు.

విస్తృతసమావేశం జరుగుతున్న సినీమాహాలువద్ద వారికి ఓల్గా, పాంక్రాటోవులు కనబడ్డారు. వారునలుగురూ ఒకేచోటకూర్చున్నారు. మధ్య విశ్రాంతిసమయంలో నలు

గురూ స్క్వేర్‌లో కాస్సేపు షికారు తిరిగేరు. అన్నా అను కొన్నట్లే మీటింగు ముగిసేసరికి బాగా పొద్దుపోయింది.

రాత్రి బాగా పొద్దుపోయింది. చాలా దూరంపోవాలి కూడా. ఈవేళ నాగదికి రాకూడదు?''

అన్నా రానంది. "ఇంటిదాకా దిగపెట్టడానికి పావెల్ వస్తానన్నాడు.

ఓల్గా, పాంక్రాటోవులు రాజబాట వెంబడేబడి బయలు దేరేరు. మిగతా ఇద్దరూ సోలోమెంకాకు వెళ్లే కొండ రోడ్డున బయలుదేరేరు.

రాత్రి ఉక్కగా, కటికచీకటిగావుంది. విస్తృతసమా వేశం ముగిసి సభ్యులంతా ఇళ్ళకు బయలుదేరేసరికి పట్టణం మాటుమణిగింది. నగరమధ్యంనుంచి పావెల్, అన్నాలు వేగంగా నడుస్తూ బయలుదేరేరు. నిర్జనంగావున్న బజారులో గస్తీదళం వారెని ఆపింది. కాగితాలు పరీక్షించి వదిలేసేరు. మరల ఇద్దరూ పార్కు దాటి, ఖాళీజాగా మధ్యగా వేసినరోడ్డు మీదికివచ్చేరు. ఎడమవేపుగా తిరిగి రైల్వేగోదాములకు పక్కగావున్న పెద్దరోడ్డు ఎక్కేరు. అన్నాకు భయంగా వుంది. భయంగా చీకట్లోకిచూస్తూ తనమిత్రుడి ప్రశ్నలకు సరిగ్గా సమాధానాలే ఇవ్వడంలేదు. టెలిగ్రాఫు స్తంభంచూసి జడుసుకొని, అదిఏమిటో తెలిసేక పకపకనవ్వింది. తనభయం ఆతనికిచెప్పి పక్కగాఅనుకొని నడవసాగింది.

"నా వయస్సంతా ఇరవైమూడేళ్ళు. కాని, ముస లమ్మలా వణికిపోతున్నా. ఆలాగని పిరికిదాన్ననుకోకు. ఈవేళ

ఎందుచేతనో మనస్సు ఎలాగోవుంది. నువ్వంటే భయం లేదు. కాని, నా భయం తలుచుకొంటే నాకే సిగ్గేస్తూంది."

పావెల్ నిర్భీకత, సిగరెట్టు వెలుగులో కనబడుతున్న కనుబొమ్మల వంపూ, చీకటిరాత్రిపుట్టిస్తున్న భయాన్ని పారదోలింది. నిన్నరాత్రి పట్టణపు శివార్లలో జరిగిన ఒక ఘోర హత్యగాథ విన్నాక కలిగినభయంకూడా సద్దుకొంది.

గోదాముల్ని దాటేరు. చిన్న వాగుమీదున్నవంతెన దాటేరు. రోడ్డెబడి రైల్వేజిల్లానూ, పట్టణాన్ని కలుపుతూ రైలుబాట క్రిందుగానిర్మించిన అండర్ బ్రిడ్జికేసి నడిచేరు.

కుడివేపున దూరంగా రైలుస్టేషను దాటిపోయింది. అక్కడరోడ్డు రైల్వేడిపోకేసితిరిగి అక్కడ ఆఖరవుతుంది. తమవీధికి వచ్చేసినట్లే. అండర్ బ్రిడ్జిపైన రైలులైనుమీద రంగురంగుల స్విచ్చిదీపాలూ, సెమాఫర్ దీపాలూ మిలమిల లాడుతున్నాయి. దూరంలో డిపోవద్ద షంటింగ్ ఇంజను బుసలుకొడుతూంది.

అండర్ బ్రిడ్జి ముఖద్వారంలో వీధిదీపంఒకటి వెలుగుతూంది. గాలిలో దీపంవూగుతూ ఓమారు ఆగోడమీదా, మరోమారు ఈ గోడమీదా వెలుతురు పడుతూంది.

అండర్ బ్రిడ్జి ముఖద్వారానికి పదిగజాలదూరంలో పెద్ద రోడ్డుపక్కన చిన్నఇల్లొకటుంది. రెండేళ్ళక్రితం ఫిరంగి గుండు తగిలి దానిగోడ కొంతభాగం కూలిపోయింది. ఆ రంధ్రం ఇప్పటికీ అల్లాగేవుంది. రోడ్డుప్రక్కన కూర్చుండి, తనదుస్థితి వెళ్ళబోసుకొనే ముష్టివాడిలాగ అది తన దీనదరి

ర్దావస్థను ప్రదర్శిస్తూంది. పైన బ్రిడ్జిమీాద ఏదో కైలు పరు గెత్తిపోయింది.

"అమ్మయ్య ఇంటికొచ్చేసేం." అని పెద్దనిట్టూర్పు విడిచింది అన్నా.

పావెల్ ఆమెపట్టుకొన్నచేయి వదుల్చుకొందామను కొన్నాడు. కాని, ఆమె వదలలేదు. ఇద్దరూ శిథిలగృహం ప్రక్కనుంచి ముందుకు నడిచేరు.

హఠాత్తుగా వెనక నేదో చప్పుడయింది. ఒగరుస్తూ ఎవరో పరుగెత్తివచ్చి వారిని కలుసుకొన్నాడు.

కోర్చాగిన్ చేయి వదిలించుకోబోయేడు. కానిఅన్నా స్తంభించిపోయి చెయ్యి వదిలించేకాదు. ఎలాగో వదిలించు కొనేసరికి సమయం మించిపోయింది. ఎవరో ఆతనిగొంతు పట్టుకొన్నారు. మరునిముషంలో ఆతడిని వెనక్కితిప్పేడు. చేతితో చొక్కామెడపట్టీ పట్టుకొని మెలితిప్పుతూంటే గొంతు బిగిసిపోతూంది. రెండోవేపునుంచి రివాల్వరుగొట్టం కళ్ళ ముందు నిలబడింది.

పావెల్కళ్ళు ఆ గొట్టంతోపాటే కదులుతున్నాయి. మృత్యువుగొట్టంలోంచి తొంగిచూస్తూంది. ఆ గొట్టంనుంచి కన్ను మలుపుకోవడంకూడా సాధ్యంకావడంలేదు. ఆఖరు గడియకోసం కనిపెట్టుకొనివున్నాడు. కాని, ఆ దొంగాడెందు చేతనో కాల్చలేదు. వాడి పెద్దతలకాయ, మాసినగడ్డం, మీాసం, వెడల్పుఅంచు టోపీక్రిందనుంచి కనపడుతున్నకళ్ళు పావెల్ కంటబడ్డాయి.

దొంగలు ముగ్గురున్నారు. వాళ్ళలో ఒక్కడు భయంతో వణికిపోతున్న అన్నాను ఆ పాడుఇంట్లోకి లాక్కుపోవడం పావెల్ ఓరగంటచూసేడు. చేతులు మెలితిప్పి, వాడు ఆమెను క్రిందపడేసేడు. మూడోవాడు పావెల్ వంక వచ్చేడు. శిథిల గృహంలో కొట్లాడుతున్న ధ్వని వినిపించింది. అన్నా ఒక పట్టాన లొంగడంలేదు. వెర్రికేక వేసింది. కాని, ఆ దొంగ వెంటనే ఆమె నోట్లో టోపీకూరేడు. పావెల్ ను పట్టుకొన్న దొంగ చూపంతా అన్నాను చెరిచేవాడిమీదనే వుంది. బహుశా వాడే ఈముఠాకి నాయకుడేమో. తనకు వాటా లేకుండాపోవడం వాడికిష్టంలేదు. తానుపట్టుకొన్న వాడు వట్టి కుర్రనాగమ్మలా కనిపించేడు. ఇల్లాంటివాడివలన భయం లేదనుకొన్నాడు.

"నెత్తిమీద రెండుమొత్తి పొమ్మంటే మళ్ళీ పట్నం లోకెళ్ళిగాని తిరిగిచూడడు." — అనుకొంటూ వాడు తన పట్టు విడిచేడు.

"ఒరేయ్ లంజ... ఫో, నోరెత్తేవంటే జాగ్రత్త."

దొంగ తన రివాల్వరుగొట్టం కోర్చాగిన్ నుదుటి కానించేడు. "ఊఁ. ఫో." అని వాడు తన రివాల్వరు నేలకి వాల్చేడు.

కోర్చాగిన్ వెనక్కితూలిపోయేడు. ఓరగంట దొంగ వేపు చూస్తూ పక్కవాటుగా పరుగు ప్రారంభించేడు. తాను కాలుస్తానేమోనని ఆకుర్రవాడింకా భయపడుతున్నాడను కొని దొంగ వెనుతిరిగి శిథిలగృహంవేపు నడిచేడు.

అందుకొన్నాడు. గదిలోవున్న గొడవలో మాట వినబడ్డం లేదు. గట్టిగా అరుస్తున్నాడు.

సంభాషణ పూర్తిచేసి రిసీవరు దించేసి కోర్చాగిన్ వేపు తిరిగేడు.

"స్టేషన్‌లో పోలిష్ కాన్సలేట్ తాలూకు రైలుకార్లు రెండు వున్నాయి. వాటిలో దీపాలు వెలగడం లేదట. వైరింగేదో చెడిపోయుంటుంది. పావెల్, నువ్వు వెళ్ళి వాటిసంగతి చూడు. చాల అర్జంటు."

రెండుపెట్టెలూ, ఒకటో ప్లాట్‌ఫారంమీద వున్నాయి. అందులో ఒకదాంట్లో దీపాలు వెలుగుతున్నాయి. రెండోది చీకటిగావుంది.

పావెల్ వెళ్ళి పెట్టెలో ప్రవేశించడానికై కమ్మి పట్టుకొన్నాడు. ఇంతలో స్టేషన్ గోడపక్కనే వున్నవా రెవరో గబగబవచ్చి ఆతనిచేయి పట్టుకొన్నారు.

"ఎక్కడికయ్యా!"

ఎవరిదో ఎరిగినగొంతుకే. పావెల్ వెనుతిరిగిచూసేడు. చర్మపుకోటు, ఆటోపీ, సన్నని కొసదేలిన పొడుగుపాటి ముక్కు, ఆ అనుమానపుచూపులు గుర్తుపట్టేడు.

అర్ట్యూఖిన్. మొదట నాతడు పావెల్‌ను గుర్తించక పోయినా ఇప్పుడు తెలిసింది. భుజంమీద చెయ్యితీసేసేడు. అతనిభుజాన వేలాడుతున్న పనిముట్లసంచీ చూసేడు.

"ఎక్కడికి బయలుదేరేవు?"

పావెల్‌సంగతి చెప్పేడు. రైలుపెట్టె వెనుకనుంచి ఎవరో ఎదుటకు వచ్చేరు.

"ఒక్క క్షణం. కండక్టరును పిలుస్తానుండు."

కండక్టరుతో కలిసి పావెల్ పెట్టెలోకి వెళ్ళేసరికి నీట యిన దుస్తులు ధరించిన వ్యక్తులు చాలమంది దానిలో మాట్లాడుకుంటూ కనిపించేరు. ఒక టేబులువద్ద గుమ్మం వేపు వీపుతిప్పి ఒక స్త్రీ కూర్చుని ఎదురుగావున్న పొడుగు పాటి ఆఫీసరుతో మాట్లాడుతూంది. ఆతడు రాగానే వారు తమ సంభాషణను నిలిపేరు.

ఆబండీలోని వైర్లు సరిగ్గానేవున్నాయి. అంతసేపూ ఆతనివెనక అడుగులో అడుగువేసుకుంటూ కండక్టరు కని పెట్టుకొనేవున్నాడు.

"ఇక్కడేం లేదు. బేటరీ పనిచేస్తూనేవుంది. నడు రెండోపెట్టెలోకి. అక్కడే వుండాలి లోపం ఏదో."

కండక్టరు తాళం తిప్పేడు. ఇద్దరూ చీకటిగావున్న రైలుపెట్టె కారిడరులోకి వెళ్ళేరు. పావెల్ చేతిలోని టార్చితో జాగ్రత్తగా పరిశీలించి అసలు లోపం ఎక్కడుందో కని పెట్టేడు. మరమ్మతు పూర్తికాగానే కారిడర్‌లో దీపం ఓమారు వెలిగింది.

"పెట్టెలో బల్బులుమాడిపోయివుంటాయి. మార్చాలి."

"అయితే దొరసానిని పిలుచుకురావాలి. తాళంచెవి ఆమెవద్దవుంది."

పావెల్‌ను ఒక్కడినీ అక్కడ వదలడం ఇష్టంలేక కండ క్టరు ఆతనినికూడా రమ్మని తీసుకెళ్ళేడు.

ఆమె ముందర పెట్టెలోకి వచ్చింది. వెనక కోర్చాగిన్ ఎక్కేడు. కండక్టరు గుమ్మంలో నిలబడ్డాడు. సీటుమీద

రెండు తోలుపెట్టెలున్నాయి. ఒక సిల్కు బట్ట వాటిప్రక్కన నిర్లక్ష్యంగా పడేసివుంది. కిటికీపక్కనున్న మేజామీద అత్తరుబుడ్డీ, వానిటీబాగ్సూ వున్నాయి. సోఫాలో ఒక ప్రక్కన ఆమె చదికిలబడింది. జుట్టు వొత్తుకుంటూ పావెల్ పనిని గమనిస్తూంది.

కండక్టరు గుమ్మంలోంచి తొంగిచూస్తూ "మేడమ్ గారు బీరు కావాలంటున్నారు. నన్ను వెళ్ళమంటారా" అని అడిగేరు.

వెళ్ళమంది ఆమె.

ఆ సంభాషణ పోలిష్‌భాషలో నడిచింది.

కారిడరులోని దీపం వెలుతురు ఆ స్త్రీ భుజంమీద పడుతూంది. ఆమె తొడిగిన గౌను అతిసున్నితమైన లయాన్స సిల్కుగుడ్డతో పారిస్‌లోని సుసమర్థులయిన కుట్టుపనివాళ్ళు తయారుచేసినది. ఆ దుస్తుల్లో ఆమెభుజాలూ, చేతులూ బాగాకనిపిస్తున్నాయి. చెవులలో రత్నాలతమ్మంట్లు మిల మిలలాడుతున్నాయి. ముఖంమాత్రం నీడలోవుంది. పావెల్ స్క్రూడ్రైవరుతో బల్బులపైన తగిలించిన చిక్కంవిప్పేడు. మరునిముషంలో పెట్టెలో దీపం వెలిగింది. రెండో బల్బు ఆ స్త్రీ కూర్చున్నసోఫాకు పైనవుంది. ఇంక అదిచూడాలి.

కోర్చాగిన్ ఆమెఎదుట నిలబడ్డాడు.

"ఆబల్బు చూడాలి."

"లేస్తా." అని ఆమె పరిశుద్ధమైన రష్యనుభాషలో సమాధానంఇచ్చింది. ఆమెలేచి ఆతనిపక్కకువచ్చింది. ఆత

డామెను గుర్తుపట్టేడు. విలువంపుగావున్న ఆ కనుబొమ్మలు, ఆ పెదవులబిగువు అతనికి బాగా పరిచితమే. సందేహంలేదు. నెల్లీ లెస్జిన్స్కీయే. అతనిముఖంలో ఆశ్చర్యం దీపించింది. ఆ సంగతిని ఆమె కనిపెట్టకపోలేదు. పావెల్ ఆమెను గుర్తుపట్టినా, ఆమె అతనిని గుర్తుపట్టలేదు. ఈ నాలుగేళ్ళలోనూ ఆతడు బాగా మారిపోయేడు.

ఆతడు ఆశ్చర్యంతో తనను నిదానించిచూడడం ఇష్టంలేక ఆమెగుమ్మంవేపు తిరిగింది పావెల్ దృష్టిమళ్ళించుకొని బల్బును పరిశీలించేడు. చిక్కంవిప్పి, బల్బుతీసేడు. దానిని వెలుతురులో పరీక్షగాచూస్తూ అప్రయత్నంగా పోలిష్ భాషలో ఆమెను ప్రశ్నించేడు.

"విక్టర్ కూడా ఇక్కడేవున్నాడా ?"

ఆమె ఆశ్చర్యానికి మేరలేదు. ప్రశ్నవేసేక వెనుతిరిగి చూడకపోయినా, చాలసేపటివరకూ సమాధానంరాకపోయేసరికి ఆమె కంగారు అర్థంఅయింది.

"అతన్ని ఎరుగుదువా ?"

"బాగాఎరుగుదును. మా పొరుగునేగా వాళ్ళయిల్లు. నువ్వు నన్నెరగవా ?"

పావెల్ ఆమెవంక తిరిగేడు.

నెల్లీ ఆశ్చర్యపడింది.

"నువ్వు... పావెల్ వికావ్రూ... మీ అమ్మ..."

"మీయింట్లో వంటపనిచేసేది."—అని కోర్చాగిన్ ఆమెకు జ్ఞాపకంచేసేడు.

"ఎంతవాడ వయ్యేవు! వట్టిఅల్లరివాడివిగా వుండేవా
డివి. నే ఎరిగినప్పుడు."

నెల్లీ ఆతనిని ఆపాదమస్తకం పరిశీలనగా చూసింది.

"విక్టర్‌నుగురించి అడిగేవెందుకు? మీ యిద్దరికీ అంత
నేస్తం లేదనుకుంటానే"— అంది ఆమె.

పావెల్ కోర్చాగిన్ స్థూర్తి బిగించేడు.

"విక్టర్ నాకుకొంచెం బాకీవున్నాడు కనిపిస్తేచెప్పు.
ఎప్పటికైనావసూలుచెయ్యగలననే అనుకుంటున్నానని..."

"ఎంత ఇవ్వవలసివుంటాడో చెప్పు. నే నిచ్చేస్తా."

కోర్చాగిన్ బాకీ ఏమిటో ఆమెకు బాగా తెలుసు.
పెట్లూరాసైనికులకు పావెల్‌ను పట్టిచ్చినసంగతి ఆమె ఎరు
గును. కాని, ఈ 'రౌడీ'ని అవహేళన చేయాలని ఆమె
ఆవిధంగా అంది.

పావెల్ ఏమీ అనలేదు.

"ఔనుకాని, మాయిల్లు దోచుకుపోయేరనీ, ఆలనా
పాలనాలేక శికస్తుపడిపోతూందనీ విన్నాను. నిజమేనా?
లతలూ, లతామంటపమూ పీకేసివుంటారనుకొంటా."

"ఆయిల్లు ఇంక మీదికాదు. మాది అది. మాఆస్తిని
మేము పాడుచేసుకోము."

నెల్లీ ఎకసక్కెంగా నవ్వింది.

"నీకు పాఠాలు బాగానేవంటపట్టినట్లు కనబడుతూంది.
అదృష్టవశాత్తూ ఈరైలుపెట్టె పోలిష్ రాయబారులదికావ
డం, నేనేదీనికి అధికారిణినికావడంజరిగింది. వెనకటిలాగే

ఇష్టపడుతూ నాకు సేవచేస్తున్నావునువ్వు. నేను హాయిగా ఫాల్గోసా పడుకొని చదువుకోగలిగేటందుకోసం నువ్వు దీపాలు బాగుచేస్తున్నావు. మీ అమ్మ మా బట్టలు ఉతికిపెట్టేది. నువ్వు నీళ్ళు మోసుకొచ్చేవాడివి. మళ్ళీ వెనకటి పరిస్థితుల లోనే మనం కలుసుకోవడం తటస్థపడింది.''

ఆ మొహంలో విషం, విజయగర్వం ప్రతిబింబించేయి. చాకుతో ఇన్సులేషన్ వైర్ చివరిభాగాన్ని గీకుతూ పావెల్ ఆమెవంక అసహ్యం ఉట్టిపడేలా చూసేడు.

"నీకోసమే అయితే ఒక్క మేకుకూడా కొట్టివుండే వాడినికాదు. కాని, బూర్జువావర్గం డిప్లొమాట్లను సృష్టిం చింది. కనక ఆ ఆటే మేమూ ఆడవలసివస్తూంది. వాళ్ళ గొంతులు మేము కోయడంలేదు. పైగా ఎంతో మర్యాదఇస్తు న్నాం. మీకంటె మేము ఎన్నోరెట్లు నయం.''

నెల్లీ ముఖం కందిపోయింది.

"వార్సాను మీరు పట్టుకోగలిగివుంటే మమ్మల్ని ఏంచేసి వుండేవాడివి? నన్ను ఖైమాకొట్టివుండేవాడివా, ఉంపుడుకత్తెగా ఇంట్లో పెట్టుకొనేవాడివా?''

ఆమె సవిలాసంగా గుమ్మంలో నిలబడివుంది. కొకె యిన్ వేసుకోవడం అలవాటుతో ముక్కులుఅదురుతున్నాయి. సోఫామీద దీపంవెలిగింది. పావెల్ దిగివచ్చేడు.

"నిన్నా? నిన్ను చంపడం బెడదకూడ ఎందుకు? ఎప్పుడో ఆ కొకెయిన్‌తో నువ్వే చచ్చిపోతావు ఇంక నిన్ను వుంచు కోవడమా? నీకంటె ఏ గుడిసెవేటుదైనా నయమే.''

పావెల్ తన సంచీతీసుకొని గుమ్మంవేపు వచ్చేడు. ఆమె దారితొలగింది. అతను కారిడర్‌లో నడుస్తూంటే వెనక నుంచి బుస్‌మన్న ధ్వని వినిపించింది.

"కమ్యూనిస్టుమొండాకొడుకు."

*  *  *

ఆమరునాడు పావెల్ లైబ్రరీకి వెడుతూంటే కాత్యూషా జెలనోవా కనిపించింది. ఆమె అతని చొక్కా చేయిపట్టుకొని, నవ్వుతూ నిలబెట్టింది.

"ఎక్కడికా హడావిడి? పాతరాజకీయాలూ, పరిజ్ఞానమూ కోసమేనా?"

పావెల్ అదే ఏకసక్కెపుధోరణిలో సమాధానం ఇచ్చేడు.

"లైబ్రరీకి మామ్మా!"

అతడామె భుజంపట్టుకొని పక్కకు ఒత్తిగించి ముందుకు అడుగేసేడు. కాత్యూషా చేయి వదిలించుకొని అతని పక్కపక్కనే నడిచింది.

"ఇదిగో పావ్లూషా! అస్తమానమూ చదువేనా? ఒకటి చెప్తా విను. ఈవేళ రాత్రి విందుకుపోదాం. అందరూ జినాగ్లాడిష్ ఇంట్లో చేరుతున్నారు. ఆడపిల్లలంతా నిన్ను తీసుకురమ్మంటున్నారు. నిన్ను చూస్తే రాజకీయాలు తప్ప మరోధ్యాసలేదు. ఎప్పుడన్నా కాస్త సరదాగా కాలక్షేపం చెయ్యాలని వుండదూ? మధ్యనోరోజు చదవకపోతే మునిగి పోతుందా?"

“విందేమిటి? ఏం చెయ్యాలేం?”

కాత్యూషా నవ్వుతూ అతనిని వేళాకోళం పట్టించింది.

“ఏం చెయ్యాలట! ప్రార్థనలు చేయనక్కర్లేదు. సరదాగా కబుర్లు చెప్పుకుందాం. నువ్వు అకార్డియన్ వాయిస్తావుకావూ నేనెప్పుడూ విననేలేము. నాకోసమన్నా ఈవేళ వచ్చి వాయించు. జీనా పినతండ్రివద్ద అకార్డియన్ వుంది. కాని వాయించలేము. నువ్వో రాంబాణంపురుగులా తయారయేవు. ఆడపిల్లలకి నవ్వంటే మక్కువ. కామ్‌సోమాల్స్ని వినోదించకూడదని ఎవరు చెప్పేరు? రా. నిన్ను సాగదియ్యలేనుబాబూ! ఇదిగో రాకపోయావా మనిద్దరికీ జగడంతప్పదు. నీతో నెల్లాళ్ళదాకా మాట్లాడనుసుమా.”

కాత్యా ఇళ్ళకు రంగులువేయడం వృత్తి. మంచి కామ్రేడ్. మంచి కామ్‌సోమాల్ కార్యకర్త. ఆమె మనసు నొప్పించడం పావెల్‌కు ఇష్టంలేదు. కనక తనకు ఇష్టంవున్నా లేకపోయినా వస్తానన్నాడు.

ఇంజన్‌డ్రైవరు గ్లాడిష్ ఇంటివద్ద పడుచువాళ్ళంతా చేరి హడావిడిగావున్నారు. పెద్దవాళ్ళంతా ఓ గదిలోకి తప్పుకొన్నారు. పెద్దహాలూ, వెనకాల పూలతోటలోకి గుమ్మంవున్న వసారానూ పడుచుకారు వినోదాలకోసం వదిలేసేరు. మొత్తం ఆడపిల్లలూ, మగవాళ్ళూ పదిహేను మందిదాకా అక్కడ చేరేరు. పావెల్‌తో కాత్యూషా వచ్చేసరికి 'పావురాల మేత' అనే ఆట సాగుతూంది. వసారాలో ఒకదానివీపు కొకటి ఆనించి రెండుకుర్చీలు వేసేరు. ఆట

పావెల్ చటుక్కున జేబులోంచి రివాల్వరు తీసేడు. గిరుక్కున తిరిగేడు. ఎడమచేయి చాచి, గురిచూసి కాల్చేడు.

దొంగ తనతప్పు గ్రహించేడు. కాని, సమయం మించిపోయింది. చేయి ఎత్తేలోపున గుండు డొక్కలో దూరింది.

ఆదెబ్బకు వాడు తూలిపోయి బ్రిడ్జిగోడకి కొట్టుకొని మూలిగేడు. నెమ్మదిగా నేలకి వొరిగిపోయేడు. ఆ చప్పుడు విని ఒకదొంగ ఇంట్లోంచి బయటపడి రైల్వేడిపో వేపు పరుగెత్తేడు. పావెల్ వాడిమీదికి కాల్చేడు. కాని తగలలేదు. ఇంతలో మూడోవాడు వొంగి పరుగెత్తుతూ బ్రిడ్జి కింద చీకట్లలో కలిసిపోయేడు. మళ్ళీ రివాల్వరు పేలింది. కాని, అదీ తప్పింది. మరోమారు కాల్పు. బ్రిడ్జి ముఖద్వారంలో పడిపోయిన దొంగ మృత్యుబాధతో గిలగిల కొట్టుకొంటున్నాడు.

కోర్చాగిన్ వెళ్ళి అన్నాను లేవదీసేడు. తన భయంకరానుభవపు బాధలో ఆమెమనస్సు పనిచేయడంలేదు. గిలగిల కొట్టుకొంటున్న దొంగవేపు అనిమేషంగా చూస్తోంది. తనకింక భయంలేదనేదికూడా ఆమె మనస్సుకింకా పట్టలేదు.

కోర్చాగిన్ ఆమెచేయి పట్టుకొని దీపపువెలుతుర్లోంచి పట్టణంవేపు రోడ్డుమీద చీకట్లోకి లాక్కుపోయేడు. ఇద్దరూ రైలుస్టేషన్ వేపు పరుగు ప్రారంభించేరు. అండర్ బ్రిడ్జివద్ద రైలుకట్టమీద దీపాలు మిణుకుమంటున్నాయి. అప్పుడే ఆవేపునుంచి రైఫిల్ కాల్చిన చప్పుడు వినవచ్చింది.

*　　*　　*

జెత్ర్యావా మిట్టమీంచే నన్న అన్నా ఇంటికి చేరుకొనే సరికి కోళ్ళుకూస్తున్నాయి. అనా మంచంమీంద పడుకుంది. సిగరెట్టుకాలుస్తూ, ఉంగరాలుచుట్టుతున్న పొగనుగమనిస్తూ కోర్చాగిన్ టేబిల్ వద్ద కూర్చున్నాడు. తనజీవితంలో ఈవేళ చంపినవాడు నాలుగోవాడు.

ప్రపంచంలో ధైర్యమంటూ ఒకటున్నదాయని ఆతనికి ఆలోచనకలిగింది. పరిశుద్ధసత్వమంటూ వుంటుందా? రివాల్వరు నోరు తనకళ్ళముందు ఆడుతున్నంతసేపూ భయముతో చేష్టలు ఆగిపోయేయి. కళ్ళు అంతబాగా కనబడక పోవడంచేతనూ, ఎడమచేత్తో కాల్చవలసిరావడంచేతనూ నాదాంగలిద్దరూ పారిపోగలుగుత? ఏమీకాదు. కొద్దిదూరంలోనే అయివుంటే వాళ్ళు ఆకుల్లాగ రాలిపోయేవారు. కాని ఉద్రేకం, తొందరపాటు, కంగారు ఇవన్నీ అల్లరిపెట్టేయి.

టేబిల్ దీపం వెలుతురులో పావెల్ తలనీడ గోడమీద పడుతూంది. అన్నా ఆనీడను చూస్తూంది. ఆతని కదలికలన్నీ గమనిస్తూంది. కళ్ళు ప్రశాంతంగా వున్నాయి. కాని మనస్సు ఏకాగ్రతను నుదుటిముడతలు వ్యక్తీకరిస్తున్నాయి.

"పావెల్! ఏమిటి ఆలోచిస్తున్నావు?"

ఆ హఠాత్ప్రశ్నతో ఆతని ఆలోచనలు చెదిరిపోయేయి. ఉలికిపడి చటుక్కున ఆసమయానికి తోచింది చెప్పేసేడు.

"కమాండెంటు ఆఫీసుకెళ్ళాలి. జరిగినసంగతి రిపోర్టు చెయ్యాలి."

ఎంతో నిస్సత్తువ అనిపిస్తున్నా, బలవంతంగా లేచేడు.

జీనా ఒంటరిగా వుండడానికి భయపడుతూంది. అతని చెయిపట్టుకొని వదలకుండలేదు. ఆతరువాత సర్దుకొని గుమ్మంవరకూ సాగనంపింది. ఆ యువకుడు చీకట్లో అదృశ్యం అయ్యేవరకూ ఆమె ఒక్కర్తే నిలబడింది.

అంతవరకూ అండర్ బ్రిడ్జివద్ద జరిగిన హత్యచేసిందెవరో అర్థంగాక రైల్వేగార్డులు తికమకపడుతున్నారు. పావెల్ రిపోర్టుతో ఆ రహస్యం మంచులాగ విడిపోయింది. చచ్చిపోయినవాని పేరు పిమూక్ అని గుర్తుపట్టేరు. వాడు హంతకుడూ, బందిపోటు దొంగగా పేరుపడ్డవాడు. కొంత కాలం జైలులో వున్నవాడు కూడా.

అండర్ బ్రిడ్జివద్ద జరిగిన ఘటన మరునాటికల్లా అందరికీ తెలిసిపోయింది. పావెల్ త్స్వెతాయేవ్‌లు తలవని తలంపుగా దానిమీదనే పేచీపడ్డారుకూడాను.

పని మధ్యలోవుండగా త్స్వెతాయేవ్ వర్కుషాపులోకి వచ్చేడు. కోర్చాగిన్‌ను బయటకు పిలిచేడు. అతనిని వసారామూలకంటా తీసుకెళ్ళేడు. మనిషి ఎంతో ఆందోళనగావున్నాడు ఏం మాట్లాడాలో, ఎక్కడినుంచి ప్రారంభించాలో తెలియడంలేదు.

"నిన్న నేం జరిగిందో చెప్పు."

"నీకు తెలుసుననుకొన్నానే."

త్స్వెతాయేవ్ భుజాలు కుదుపుకున్నాడు. బ్రిడ్జివద్ద జరిగినఘటన మిగిలినవాళ్ళందరికన్నా అతనికెక్కువ ఆందో

శసకరం అయిందనేసంగతి పావెల్‌కు తెలియదు. పైకిఏమీ ఎరగనట్లున్నా ఆతడు అన్నా బోర్హార్ట్సుమీద మనసునిలిపేడు. ఆమెకోసం తాపత్రయపడేవాళ్లు ఇంకా చాలమందేవున్నారు. కాని, అందరికన్నా త్స్వెతాయేవ్ ఆమెను గాఢంగా అభిలషిస్తున్నాడు. బ్రిడ్జివద్ద జరిగిందంతా ఇప్పుడే లగూటినా ఆతనితో చెప్పింది. ఇంక మనిషి మనిషిలో లేడు. అతనికొక సంగతి తెలియలేదు. ఆవిషయం సరాసరి పావెల్‌ను అడుగలేడు. అయినా తెలుసుకుతీరాలి. తనభయం కేవలం స్వార్థపూరితమనీ, నీచమనీ అనిపిస్తూంది. కాని మనస్సంక్షోభంలో అవన్నీ మరచిపోయేడు.

"కోర్చాగిన్ ! ఇల్లా విను. ఈసంగతి మనిద్దరిమధ్యనే వుండిపోవాలి. అన్నాకోసమని నువ్వు రహస్యంగా వుంచుతూండివుంటావు. కాని నన్ను నమ్మవచ్చు. ఒక్కమాట చెప్పు. దొంగ నిన్ను పట్టుకొన్నప్పుడు మిగిలినవాళ్ళు అన్నాను చెరిచేరా?"

మళ్ళీ అంతలో సిగ్గుపడి తలవంచుకొన్నాడు.

పావెల్‌కు అసలుబాధ చూచాయగా అర్థమయింది.

"అన్నామీద మనస్సుపెట్టుకొని వుండకుంటే అంత ఆదుర్దాపడడు. అయితే ఆమెయెడ ప్రేమేవుంటే..." ఆ ప్రశ్న వేయడంలో అన్నాయెడ ప్రకటించిన అవమానకర ధోరణికి చాలాకోపం వచ్చింది.

"ఎందుకు?"

త్స్వెతాయేవ్ ఏదో గొణిగేడు. ఆప్రశ్న పావెల్‌కు అర్థం అయిందని గ్రహించేడు. కోపం వచ్చింది.

"బాతాఖానీవద్దు. సూటిగా సమాధానం చెప్పు."

"అన్నాను ప్రేమిస్తున్నావా?"

త్స్వేతాయేవ్ చాలసేపు నిశ్శబ్దంగా వూరుకొన్నాడు. ఆఖరుకి 'ఔను' అన్నాడు.

కోర్చాగిన్‌కు కోపం వచ్చింది. కాని, ఏమీ అన లేదు. మారుమాటాడకుండా వెనక్కి తిరిగి వెళ్ళిపోయేడు.

*     *     *

ఒకరోజున పావెల్ పడుకొని చదువుకొంటున్నాడు. ఓకునేవ్ ఏదో చెప్పాలనే ప్రయత్నంలో చాలసేపు తటపటా యిస్తూ మంచంచుట్టూ తిరిగేడు. చివరకు ఒకనిర్ణయానికి వచ్చి, మంచంమీదకూర్చుని ప్రారంభించేడు.

"పావ్లూషా! నీకొకటి చెప్పాలనుకొంటున్నా. ఒక విధంగాచూస్తే అది అంతప్రధానంగా కనిపించకపోవచ్చు. కాని, మరొకవిధంగా చాల అవసరం. చూడు, తాల్యాలగూ టినా నేనూ కొంచెం ఘర్షణపడ్డాం. మొదట ఆమెయంటే నాకెంతో ఇష్టంగా వుండేది. కాని, తాల్యాధోరణి తెలు సుగా... ఆ వివరాలన్నీ ఎందుకుగాని, నిన్ననే మేమిద్దరమూ సఖ్యపడ్డాము. ఇద్దరం కలిసివుండామనీ, మా దాంపత్యం ఎలానడుస్తుందో చూద్దామనీ అనుకొన్నాం. నాకు ఇరవై రెండేళ్ళువచ్చేయి. ఇద్దరికీ వోటుంది. సమానహోదాలో ఇద్దరం కలిసివుండాలనుకొంటున్నాం. ఏమంటావు?"

కోర్చాగిన్ కాస్సేపు ఆలోచించేడు.

"నే నేం చెప్పను? మీరిద్దరూ నాకు మిత్రులే. మనం దరం ఒకేపార్టీకి చెందినవాళ్ళం. తాల్యా మంచిఅమ్మాయి. ఇబ్బందు లేమీ వుండవు."

మరునాడు కోర్చాగిన్ డిపోపనివాళ్ళ హాస్టలులోకి బసమార్చేడు. మరోకొద్దిరోజులు పోయేక అన్నా నూతన దంపతులకు సన్మానం చేసింది. భోజనభాజనాలంటూ ఏమీ లేవు. నలుగురు కూర్చుని కబుర్లు చెప్పుకున్నారు. తమకిష్ట మైన పుస్తకాలలోంచి ఇష్టమైనభాగాలు తీసి చదివేరు. చాలాపాటలు పాడేరు. కాత్యూషా జెలనోవా, వోలిన్ త్సేవాలు అకార్డియన్ ఒకటి తీసుకొచ్చి, పావెల్ చేతిలో పెట్టేరు. అతడారోజున ఎప్పటికన్న చాలబాగా వాయించేడు. పాంక్రాటోవ్ నాట్యం ప్రారంభించేడు. పావెల్ నోరు విప్పి అకార్డియన్‌తో గొంతు కలిపేడు.

పాపం! కోల్చకు పోయేడంటూ డెనికిన్ చెవిలో పడినాడంటే అయ్యో! ఎంతగ ఏడ్చేస్తాడో.

అకార్డియన్‌ను వోలిన్‌త్సేవ్ చేతిలోపెట్టి పావెల్ 'యాబ్లోచ్కా' నృత్యం ప్రారంభించేడు. ఆతడు తన జీవితంలో నృత్యం చేయడం ఇది మూడోమాటూ, ఆఖరు మాటూకూడ.

# ప్రకరణం 4

సరిహద్దు నిశ్శబ్దంగా శత్రుత్వాన్ని ప్రకటిస్తూ రెండు రాటలు ఒకదానికెదురుగా మరొకటిపాతివున్నాయి. వాటిలో ఒకదానికి చిత్రికపెట్టి తోమి నలుపు, తెలుపురంగులు వేసేరు. దానిపైన రాంబంసుబొమ్మ మేకులతో గట్టిగాకొట్టివుంది. రెక్కలువిప్పి, రాటను కాళ్ళతో గట్టిగాపట్టుకొని, కొనదేలిన వంపుముక్కు ముందుకుచాచి రాంబందు విషపూరితముల యిన చూపులతో ఎదుటి రాటనున్న సుత్తీ, కొడవలి చిత్రించిన పలకను తెగచూస్తూంది. మంచిబలంగా, గుండ్రంగా చెక్కిన ఓకురాటను గట్టిగాపాతి దానిమీాద సుత్తీ కొడవలి చిహ్నంగా అమర్చేరు. రెండురాటలు చదునుగావున్న నేల మీాదనే పాతేరు. కాని వానిమధ్య పెద్ద అగాధంవుంది. రెండురాటలకూ వెనక రెండు ప్రపంచాలున్నాయి. మధ్యనున్న ఆరడుగుల మేరలో ఎవరుకాలుపెట్టినా ప్రాణాపాయానికి సిద్ధపడవలసిందే.

అదో సరిహద్దు.

నల్లసముద్రంనుంచి ఆర్కిటిక్ సముద్రంవరకూ కొన్ని వేల కిలోమీాటర్లపొడుగున ఈవిధంగా రాటలుపాతి, సుత్తీ

కొడవలి చిహ్నంచెక్కిన పలకలు దానికి అమర్చివున్నాయి. రాంబందుచిత్రం తగిలించినరాట బూర్జువా పోలండుకూ, సోవియటు యూక్రెయినుకూ మధ్యసరిహద్దు. అది బెరెజ్డోవ్ పట్టణానికి పదిమైళ్ళ దూరంలోవుంది. దానికెదురుగానే పోలిష్‌పట్టణం కోరెస్‌వుంది. స్లావూటానుంచి అనాపోల్ వరకూ ఈ సరిహద్దులో "ఎన్" సరిహద్దు పటాలం కాపలాలో వుంది.

సరిహద్దుస్తంభాలు మంచుకప్పిన మైదానాలగుండా, అడవులు నరికిన ఖాళీలలో, లోయలలో, పర్వతశిఖరాల మీద, నదిగట్లని వరుసగా నాటేరు.

ఆరోజున చలి కరిచేస్తూంది ఫెల్టుబూట్లక్రింద మంచు ముక్కలు గరగరలాడుతున్నాయి. ఒక పొడుగుపాటి రెడార్మీ సైనికుడు సుత్రీ, కొడవలి స్తంభందగ్గర బయలుదేరి గస్తీ ప్రారంభించేడు. పొడుగుపాటి బూడిదరంగుకోటు తొడిగి, ఫెల్టుబూట్లు వేసేడు. ఆ పొడుగుకోటుమీద గొర్రెతోలుకోటు వేసేడు. పెద్ద మెడపట్టీతో మడమలదాకా వ్రేలాడుతూన్న ఆకోటు ఎంత మంచుతుపానులోనైనా చలి అనిపించనివ్వదు. ఆతడు తలమీద తలపాగా చుట్టేడు. చేతులకి గొర్రెతోలు 'మిట్టెన్లు' తొడిగేడు. భుజాన రైఫిల్ వ్రేలాడుతూంది. సెంట్రీకి నిర్దేశించినబాటలోనే నడుస్తూ చుట్ట కాలుస్తూ ఆనందిస్తున్నాడు. మైదానంభూముల్లో కిలోమీటరు కొకడు చొప్పున సోవియట్ గస్తీదార్లుంటారు. పోలండ్ వేపున ఇద్దరుంటారు.

పోలిష్‌గస్తీవాడు సెంట్రీబాటవెంబడే రెడార్మీ వాని వేపు వస్తున్నాడు. ఆకుపచ్చరంగు యూనిఫారమ్ అతనిది. రెండువరసల్లో దానిమీద బొత్తాములు మెరుస్తున్నాయి. తలమీద రాంబసుచిహ్నం తగిలించిన టోపీవుంది. భుజ పట్టీలమీదా, కాలర్ మీదా రాంబసుబొమ్మలు దండిగా వున్నాయి. కాని, వాటివల్ల చలి కొంచెంకూడా తగ్గలేదు. గడ్డచలితో మూలుగుల్లోంచి వణుకు పుట్టుకొస్తూంది. చెవులు బండబారిపోతూంటే చేతులతో రుద్దుకొంటున్నాడు. తిమ్మిరెక్కిపోతున్న కాళ్ళు నేలకిబాదుకున్నాడు. తొడుక్కున్న గ్లోవ్సులు పల్చనివి కావడంచేత చేతులు కొంకరించుకుపోతున్నాయి. ఆతనొక్కక్షణంకూడా నిలబడడానికిలేదు. నడుస్తూండవలసిందే. లేకపోతే చలికి కీళ్ళుబిగిసిపోతాయి. ఇద్దరు సెంట్రీలు దగ్గరపడ్డాక 'జోల్నిర్జ్' రెడార్మీసైనికుడితో సమంగా నడక ప్రారంభిస్తాడు.

సరిహద్దులో సంభాషణ నిషిద్ధం. కిలోమీటరు దూరంలోవున్న రెండోగస్తీవాడుతప్ప దగ్గరలో ఎవరూ లేకపోతే ఇద్దరుగస్తీవార్లూ మాట్లాడుకొంటున్నారో, అంతర్జాతీయ న్యాయసూత్రాల్ని అతిక్రమిస్తున్నారో ఎవరు చూడవచ్చారు?

పోలిషుగస్తీవానికి పొగ తాగాలనివుంది. కాని అగ్గిపెట్టె బారకాసుల్లో మరిచిపోయేడు. కసితీర్చుకుంటున్నట్లు సోవియటుదేశంవైపునుంచి గాలి వీస్తూ, గస్తీదారు కాలుస్తున్న పొగ వాసనను మోసితెచ్చి పూరిస్తూంది. పోలిషు

వాడు ఆగి వెనక్కి తిరిగిచూసేడు. కొంపతవ్వి కెప్టెన్ గాని, లెఫ్టినెంటుదొరగారుగాని తనిఖీకి గుర్రాలమీద ఏపుట్ట మాటునుంచో ప్రత్యక్షమైతే? కాని ఎవ్వరూ కనబడలేదు. కనుచూపుమేరదాకా తెల్లగా ఒకేమంచు. ఆకాశాన ఒక్క మబ్బుతునకకూడా లేకుండా నిర్మలంగావుంది.

పోలిషుగస్తీవాడే మొట్టమొదట అంతర్జాతీయ న్యాయ సూత్రాన్ని అతిక్రమించేడు.

"కామ్రేడ్ ! లైటుందా ?"

ఫ్రెంచిరైఫిలు భుజంమార్చి, కర్రలల్లే కొయ్యబారిన వేళ్ళతో కోటుజేబులోంచి సిగరెట్టుపెట్టె నతికష్టంమీద బయటికితీసేడు.

రెడార్మీసైనికుడు వానిమాటను విన్నాడు. కాని, సరిహద్దులో మాట్లాడరాదని నిబంధన. అదీగాక వానికి కావలసిందేమిటో స్పష్టంగా తెలియలేదు. అందుచేత సమాధానం ఇవ్వకుండా తనదారిని పోతున్నాడు. మెత్తని ఫెల్టు బూట్లక్రింద మంచుపెల్లలు నలిగిపోతూ గరగరలాడు తున్నాయి.

"కామ్రేడ్ బోల్షివిక్ ! లైటువుందా? ఓ అగ్గిపెట్టె ఇల్లా గిరవాటువేసినాసరే."

ఈమారు పోలిషువాడు రష్యన్‌లో మాట్లాడేడు.

రష్యనుసైనికుడు ఆతనిని ఆపాదమస్తకం ఒక్కమాటు పరీక్షగా చూసేడు. "అయ్యవారిపని అయిపోయి నట్లుంది" అనుకొన్నాడు. "పాపం బూర్జువాసైనికుడైతేనేం

ఛస్తున్నాడు. ఆ గుడ్డల్లో ఈ చలిలోకి రావలసివచ్చింది. గంతులేసేశంటే వెచ్చగుండేదూ. దానికితోడు పొగతాగేటందుకు అగ్గిపెట్టెకూడా లేదు తనకాడ." రెడార్మీసైనికుడు అటు తిరక్కుండానే ఒక అగ్గిపెట్టె తనవేపు విసిరేసేడు. పోలీసువాడు అది క్రిందపడకుండా గాలిలోనే అందుకున్నాడు. ఎన్నోమార్లు ప్రయత్నం చేసిచేసి సిగరెట్టు ముట్టించేడు. ఈమారు ఇష్టంవున్నా లేకపోయినా రెడార్మీసైనికుడు తానూ చట్టధిక్కారం చేసేడు.

"అది అట్టేపెట్టుకో. నాదగ్గర ఇంకొకటుంది లే."

సరిహద్దు అవలివేపునుంచి పోలీస్‌వాడు సమాధానం ఇచ్చేడు.

"థాంక్స్. వద్దు. ఈ అగ్గిపెట్టె నావద్దచూసేరంటే రెండేళ్ళు జైలులో పడేస్తారు."

రెడార్మీసైనికుడు అగ్గిపెట్టెను తీసుకొని బొమ్మవంక పరీక్షగాచూసేడు. దానిమీద విమానంబొమ్మ ఒకటుంది. ప్రొపెల్లరుబదులు దానికి పిడికిలి బిగించిన చెయ్యి తగిలించినట్లుంది. దానిమీద " హెచ్చరిక " అనే మాటలు వ్రాసివున్నాయి.

"నిజమే. ఇది వాళ్ళకి భరించదు."

ఆ సైనికుడు రెడార్మీ వానితోపాటే అటూ, ఇటూ నడుస్తూనేవున్నాడు. కాని, ఆ అనంతనిర్జన మైదానభూమిలో ఏకాకితనం అనుభవిస్తున్నాడు.

* * *

మిట్టపల్లాలులేని చదును భూమిమీద గుర్రాలు అడుగు తప్పకుండా నడుస్తున్నాయి. వాని కదలికలకు జీనులు లయ తప్పకుండా కిర్రుమని ధ్వనిచేస్తున్నాయి. చల్లనిగాలిలో గుర్రాలు ఊపిరి వదిలినప్పుడల్లా పొగలూ, ఆవిర్లూ చిమ్ముతున్నట్లు కనబడుతూంది. నల్లగుర్రం ముక్కుపుటాలచుట్టూ మంచుతుంపరులు తెల్లతెల్లగా కనిపిస్తున్నాయి. ఎంతో విలాసంగా అడుగు వేస్తూ, పొడుగుపాటి మెడవంచి బెటాలియన్ కమేండరు ఎక్కిన పచ్చలగోడిగ కళ్ళెన్ని నమలడానికి ప్రయత్నిస్తూంది. ఇద్దరు రౌతులుకూడ పొడుగుపాటి కోట్లు తొడిగి, నడుములకు పటకాలు బిగించారు చొక్కా చేతులమీద మూడేసి ఎర్రని గుడ్డముక్కలు చదరాలుగా కుట్టివున్నాయి. వారిద్దరిమధ్యా తేడా ఒక్కటే బెటాలియన్ కమేండరు గ్రావిలోవ్ కోటుపట్టీలు ఆకుపచ్చగా వున్నాయి. ఆయన సహచరుడివి ఎర్రగా వున్నాయి. గ్రావిలోవ్ సరిహద్దు గస్తీదళాలలో వుంటున్నాడు ఈ డెబ్భయి కిలోమీటర్ల పొడుగు సరిహద్దునీ కాపలా కాయవలసిన బాధ్యత ఆతనిది. ఆయన సహచరుడు బెరెజ్దోవ్ నుంచి వచ్చిన బెటాలియన్ కమిస్సారు కోర్చాగిన్. సార్వజనిక సైనిక శిక్షణా కార్యక్రమంలో ఆతడొక ఉద్యోగి.

గడిచినరాత్రి బాగా మంచుపడింది. తెల్లనిమంచు పింజెలతో నేలంతా కొత్తతివాసీ పరిచినట్లుంది. ఇద్దరూ అడవిలోంచి వస్తున్నారు. సరిహద్దు గాటలకు ఈవల నలభయి గజాలల్లో వున్న బయలులోంచి నడుస్తున్నారు. ఉన్నట్లుండి

గావ్రిలోవ్ గుర్రాన్ని నిలిపేడు. కోర్చాగిన్ ఏమిటో అని వెనక్కి తిరిగేడు. గావ్రిలోవ్ గుర్రంమీదినుంచే వంగి మంచులో ఏదో లాగినట్లు కనిపిస్తున్న చారికను పరిశీలిస్తున్నాడు. ఏదో జిత్తులమారి జంతువ పని అది. దానినిపట్టి అది ఏవేపుగా వెళ్ళిందో చెప్పడం సాధ్యంకాదు. కాని బెటాలియన్ కమేండరు చూస్తున్నదా జాడను కాదు. దానికి రెండు అడుగులు ఆవలగా మంచుపింజెల క్రింద మనిషిఅడుగులు కనిపిస్తున్నాయి. అది మనిషిఅడుగులనడంలో సందేహంలేదు. ఆజాడ సరాసరి అడవివేపునకేవుంది. దానినిపట్టి ఆ వచ్చిన వాడెవరో పోలండు సరిహద్దువేపునుంచే వచ్చేడనడంలో సందేహంలేదు. బెటాలియన్ కమేండరు గుర్రాన్ని అదిలించి అడుగులజాడ వెంబడే గస్తీబాటవరకూ వెళ్ళేడు. అక్కడి నుంచిచూస్తే పోలిష్‌హద్దువల పదిపన్నెండు అడుగుల దూరంవరకూ ఆ అడుగులు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

"ఎవడో రాత్రివేళ సరిహద్దు దాటివచ్చేడు" అంటూ బెటాలియన్ కమేండరు గొణిగేడు.

"మూడో ప్లాటూన్‌వాళ్ళు అజాగ్రత్తగా వున్నారు. ఈసంగతినిగురించి ఉదయం రిపోర్టులో ఏమీ వ్రాయలేదు, వీళ్ళ ముండ మొయ్యా."

ఆతని ఊర్పులు చలికి పేరుకొని మీసాలమీద తెల్లగా కనిపిస్తోంది.

దూరాన ఇద్దరుమనుష్యులు రౌతులు నిలుచున్న వేపు వస్తూ కనిపించేరు. ఒకడు నల్లనికోటు తొడిగేడు. వాని

చేతిలోని రైఫిల్ చివర తగిలించిన వెడల్పాంటి ఫ్రెంచి బైనెట్ సూర్యకాంతిలో మిలమిలలాడుతూంది. రెండోవాడు పసుపుపచ్చని గొర్రెచర్మంకోటు తొడిగిన రెడార్మీసైనికుడు. మచ్చలగుర్రం రికాబుతో డొక్కలో అదమగానే చరచర నడిచింది. రౌతులిద్దరూ గస్తీదారులకు యెదురువెళ్ళేరు. వారు దగ్గరకు వచ్చేరు. రెడార్మీసైనికుడు భుజానవున్న రైఫిల్ చేతిలోకి తీసుకున్నాడు. నోట్లోని సిగరెట్టుముక్క-వుమ్మేశాడు.

బెటాలియన్ కమేండరు సైనికుడితో కరచాలనం చేయడానికై చేయిచాచేడు.

"కామ్రేడ్! నీ బీట్‌లో ఏమీ కొత్తలులేవుకద.

రెడార్మీసైనికుడు చేతికితొడిగిన మిట్టెన్ హడావిడిగా తూశలాగి కరచాలనం చేసేడు గుర్రంమీదనున్నా చేయి అందుకోడానికి గాబ్రిలోవ్ వంగే అవసరం లేకపోయింది. ఆ సైనికుడు అంత పొడుగున్నాడు.

పోలీస్‌సైనికుడు మొదటినుంచీ ఈ దృశ్యం చూసేడు ఇద్దరు రెడార్మీ-ఫీల్డు ఓ సామాన్య సైనికుడితో కరచాలనం చేయడమూ, స్నేహితుడితో మాట్లాడినట్లు మాట్లాడడమూ ఆతనికి ఆశ్చర్యం కలిగించింది. తాను మేజర్ జక్కేవస్కీతో కరచాలనంచేస్తే ఎలావుంటుందో మనస్సులోనే కల్పనచేసుకొన్నాడు. కాని ఆ ఆలోచన తోచేసరికే భయంవేసి, దగ్గర ఎవరన్నా వున్నారేమోనని తిరిగిచూసుకొన్నాడు.

రెడార్మీసైనికుడు రిపోర్టుయిచ్చేడు.

"కామ్రేడ్ బెటాలియన్ కమేండర్! ఇప్పుడే డ్యూటీలోకి ఎక్కేను."

"అజాడు చూసేవా?"

"ఇంకా లేదు."

"రాత్రి రెండునుంచి ఉదయం ఆరుగంటలదాకా డ్యూటీ ఎవరు?"

"సుకోలెంకో, కామ్రేడ్ బెటాలియన్ కమేండరు."

"సరే. కొంచెం కనుగలిగివుండు."

కమేండరు బయలుదేరబోతూ ఒక చిన్న హెచ్చరిక చేసేడు.

"వాళ్ళవెంట వెంటనే నడుస్తూండడం ఎంత తగ్గిస్తే అంతమేలు."

మరల గుర్రాలు బయలుదేరేయి. బెరెజ్డోవ్ రోడ్డుకెక్కి ఇద్దరు పక్కపక్కల్ని గుర్రాలు నడుపుతున్నారు. దారిలో కమేండరు సరిహద్దు ఇబ్బందులు గురించి చెప్తూ పోతున్నాడు.

సరిహద్దులో ఎప్పుడూ కండ్లో వత్తులు పెట్టుక్కూర్చోవాలి. ఒక్కక్షణం ఏమరితివా, తర్వాత బాధపడవలసి వస్తుంది. మాపనిలో కనురెప్పవాల్చడానికి వీలులేదు. పగటిపూట సరిహద్దుదాటడం అంత సులభంకాదు. కాని, రాత్రి అనుక్షణం హెచ్చరికగా వుండవలసిందే, కామ్రేడ్ కోర్చాగిన్! నువ్వేచూడు. నా గస్తీ పరిమితిలో సరిహద్దు నాలుగూళ్ళమధ్యనుంచి పోయింది. దానితో కావలసినన్ని

చిక్కులు చుట్టుకొన్నాయి. గ స్త్రీవాళ్ళని దగ్గరదగ్గరగా పెట్టినా ఈ నైపువాళ్ళు ఆవైపురా, ఆవైపువాళ్ళీవైపునా పురుడొచ్చినా, పుణ్యంవచ్చినా తప్పకుండా పోయివస్తుం టారు. వాళ్ల యిళ్లకావల పదడుగుల్లో వాగు. వాగులో కాలు తడికాదు. ఇంక ఎవరి నాపగలం దీనికితోడు దొంగతనంగా సరుకులు జేరవేయడం జరుగుతూంది. అదంత హెచ్చుగా లేదనుకో. ఏ ముసలమ్మో ఒకటిరెండు సీసాలు పోలిష్ వాడ్కోయో మనోకిటో ఏదో తెస్తూంటుంది. కాని, సరి హద్దు నియమాలకు విరుద్ధంగా జనం రాకపోకలు విశృంఖ లంగా సాగిపోతున్నాయి. వారివెనక చేతిలో బాగాడబ్బు ఆడుతున్నవాళ్ళు కొందరుపనిచేస్తున్నారు. పోలిష్‌వాళ్ళు సరిహద్దుగ్రామాలన్నిటా పెద్దపెద్ద దుకాణాలు తెరిచేరు. విన్నావా ? వాటిలో ఏ సరుకుకావాలన్నా దొరుకుతుంది. ఆ సరుకు ఆవూళ్ళల్లోవాళ్ళకేనంటావా? అక్కడున్నదంతా దరిద్రరైతాంగమేకదా !''

బెటాలియన్ కమేండరు మాటలువింటూ, సరిహద్దులో అంతుపొంతులేని గ స్త్రీజీవితం గడపవలసివుంటుందని కోర్చా గిన్ వూహించుకొన్నాడు.

"దొంగవర్తకమేనా, అంతకన్న ప్రమాదకరమైన వ్యాపారమేదన్నా సాగుతూందా?"

బెటాలియన్ కమేండరు ఆలోచనలోపడ్డాడు.

"అదే వచ్చిన చిక్కు."

* * *

బెరెజ్డోవ్ అడవులమధ్యవున్న చిన్నపట్టణం. యూదు జనాభా ఎక్కువ. అక్కడోపదీ ఇక్కడోనాలుగూగా రెండు మూడువందల ఇళ్ళున్నాయి. మధ్యన ఒక పెద్ద సంత మార్కెట్టు. దాంట్లో ఒక పాతిక దుకాణాలున్నాయి. మార్కెట్టంతా చెత్తా చెదారం, పెంటా, పేడతో హాహా గలీజుగావుంటుంది పట్టణానికిచుట్టూ రైతుల ఇళ్ళున్నాయి. పట్టణంమధ్య యూదుల ఇళ్ళు నానుకొని, కసాయిసాలకి పోయే రోడ్డుమీద శిథిలంఅయిపోతున్న ఒక ప్రాచీనకాలపు సినగాగ్ (యూదు దేవాలయం) వుంది ఈనాటికీ ప్రతి శని వారం సినగాగ్‌లో జపం చేస్తున్నా, వెనకటంత హెచ్చు లేదు. రబీ (యూదుపూజారి) కి చేతినిండా వరుమానం లేదు. ఈ మారుమూల వూళ్ళోకూడ పడుచుకారు తనను గౌర వించడంలేదంటే 1917 లో జరిగిన ఘటన చాల చెడ్డదే నని పించింది. ముసలివాళ్ళు ఇంకా కోషెర్ ఆహారమే తీసు కొంటూ వుండివుండొచ్చు. కాని పడుచుకారు చాలమంది దైవనిషిద్ధమైన పందిమాంసం తింటున్నారు. ఆ మాట తలుచుకొంటే ఒళ్ళు గరిపొడుస్తుంది రబీ బరూఖ్ విసుగ్గా కోపంతో దారిలో పెంటపోగులో తిండానికేదన్నా దొరుకు తుందేమోనని కుళ్ళగిస్తున్న ఒక పందిని బలంకొద్దీ డొక్కలో ఒక్కతన్ను తన్నేడు. బెరెజ్డోవ్ జిల్లా కేంద్రం చేయబడిందనే సంతోషంలేదు. అక్కడికొచ్చిపడి, ఆచారా లన్నీ తలక్రిందులుచేసేస్తున్న కమ్యూనిష్టులమీద ఆయనకు ఏమాత్రం సద్భావంలేదు. రోజూ ఏదోఒక అనాచారవార్త

వినబడుతూంది. నిన్నటికి నిన్న తన యింటిగుమ్మంమీద ఒక నోటీసు.

"యూక్రెయిన్ యంగ్ కమ్యూనిస్టు లీగ్, బెరెజ్డొవ్ జిల్లాకమిటీ."

ఇదేదో ప్రమాదకరమైనదే అయివుంటుందనుకొన్నాడు రబీ. ఆలోచనలలోపడి కొట్టుకుపోతూ ఆయనదగ్గరకు వచ్చే వరకూ సినగాగ్ గుమ్మంమీద అంటించిననోటీసును చూడనే లేదు.

"ఈవేళ క్లబ్బులో శ్రామికయువకులసభ జరుగుతుంది. కార్యవర్గాధ్యక్షుడు లిసిత్సిన్, కామ్‌సోమాల్, జిల్లాకమిటీ తాత్కాలిక కార్యదర్శి కోర్చాగిన్‌లు ప్రసంగిస్తారు. ఉపన్యాసాల అనంతరం తొమ్మిదో తరగతి పిల్లల వాద్యకచేరీ వుంటుంది."

మహాకోపంతో రబీ ఆ నోటీసును చింపిపారేసేడు.

"ప్రారంభమయిందీ!"

* * *

ఊళ్ళో చర్చిపక్కనున్న పెద్దతోట మధ్యగావున్న పాతభవంతి మతాచార్యుడిది. అంతయింట్లోనూ ఆతడూ, పెళ్ళామూమాత్రం వుండేవారు. ఇద్దరు ముసిలాళ్ళూ నిర్జీవమయినబ్రతుకు బ్రతికేవారు. వాళ్ళలాగే ఆ యిల్లుకూడా దుమ్ముకొట్లాడుతూ నిర్జీవంగానే వుండేది. ఇప్పుడాయింట్లోకి కొత్తజనం వచ్చేరు. పాతవాళ్ళు పోవడంతోపాటు ఆయింటి దరిద్రంకూడా వొదిలిపోయింది. చర్చి సెలవులరోజుల్లో అతి

ధులను ఆదరించడానికై ప్రయోగిస్తూండిన ఆ పెద్దహాలు ఇప్పుడు ఎల్ల వేళలా జనసమ్మర్దంగా నేవుంటూంది. ఆయింట్లో బెరెజ్డోవ్ కమ్యూనిష్టుపార్టీ కమిటీ ప్రధానకార్యాలయం పెట్టేరు. ముందుహాలులో అడుగుపెట్టగానే కుడివేపుగా గది కనిపిస్తుంది. ఆ గదిద్వారంబూాద సుద్దతో 'కామ్‌సోమాల్ జిల్లాకమిటీ' అని వ్రాసివుంది. సార్వజనిక సైనిక ద్వితీయ శిక్షణాపటాలంలో మిలిటరీ కమిస్సారుగావచ్చిన కోర్చాగినే కొత్తగా ఇక్కడస్థాపించిన కామ్‌సోమాల్ జిల్లాకమిటీకి తాత్కాలిక కార్యదర్శిగా నియమించబడ్డాడు. ఆతడు దినంకొంతసేపు ఈ ఆఫీసులో పనిచేస్తుంటాడు.

అన్నాయింటివద్ద యువకులంతా చేరి వినోదించి అప్పుడే ఎనిమిదినెలలు గడిచిపోయేయి. అది నిన్ననే జరిగిందనిపిస్తూంది. కోర్చాగిన్ తనఎదుటనున్న కాగితాలను పక్కకుతోసి, కుర్చీలో జేరగిలబడి ఏవేవో ఆలోచనలకు పడ్డాడు.

ఇల్లంతా నిశ్శబ్దంగావుంది. బాగా చీకటిపడింది. పార్టీకమిటీ ఆఫీసులోకూడా ఒక్కరూాలేరు. కమిటీకార్యదర్శి త్రోఫిమోవ్ ఇంటికిపోయి చాలసేపే అయింది. కోర్చాగిన్ ఒక్కడే అంతయింట్లోనూా వున్నాడు. కిటికీఅద్దాలమీాద మంచుపింజెలుపడి లతలు చిత్రించినట్లుంది. టేబిల్‌మీాద కిరోసిన్‌దీపం ఒకటి వెలుగుతూంది. దానిఎదుట కూర్చుని కోర్చాగిన్ తన గతజీవితం అంతా నెమరువేసుకుంటున్నాడు. రైల్వే కార్‌షాపులోని కామ్‌సోమాల్‌సంస్థ ఆగష్టునెలలో మరమ్మతుల రైలుతో యెకటారినోస్లావ్‌కు పంపింది. ఆ

బండిలో నూటయాభయిమంది బయలుదేరేరు. వారు ప్రతి స్టేషనులోనూ ఆగుతూ కావలసిన మరమ్మతులుచేస్తూ పనికి రాని తుక్కు కార్లని పక్కకితీసేస్తూ ఇంచుమించు చలికాలం వచ్చేంతవరకూ ప్రయాణించేరు. వారు అవిఘ్నంగా సినెల్ని కోవోనుంచి పోల్ గీదాకా తిరిగేరు. ఈ దేశంఅంతటా ఒకప్పుడు మాఖ్నో బందిపోటుదళం నానాకల్లోలంచేసి విధ్వంసక్రియలు సాగించింది. గుల్యై-పోల్యేలో వాటర్ టవర్ బాగుచేయడానికే ఒకవారంపట్టింది. విధ్వంసకులు డైనమైట్‌తో వాటర్‌టాంక్‌ను పేలగొట్టేసేరు. ఇప్పుడు వారు ఇనపరేకులు తెచ్చి మళ్ళీ మాసికలు వేసేరు. ఫిట్టర్‌పని తెలియకపోయినా, బరువుపనికిఅలవాటులేకపోయినా కోర్చాగిన్ గంటలతరబడి రెంచిపుచ్చుకొని వేలకొద్ది బోల్టులు బిగించేడు.

ఆకురాలుకాలం వెళ్ళిపోతూందనగా మరమ్మతుల రైలు తిరిగివచ్చింది. దానిలో వెళ్ళిన నూటఏభయిమందీ మళ్ళీ వర్కుషాపుల్లో పనిప్రారంభించేరు.

ఈమధ్య కోర్చాగిన్ తరుచు అన్నాయింటికి వస్తూ పోతున్నాడు. మనిషిలో వెనుకటి ఆందోళన తగ్గింది. మళ్ళీ అతనిముఖాన నవ్వు కనబడుతూంది......

రైల్వేవర్కుషాపు యువజనం అతనిచుట్టూచేరి వెన కటికథలన్నీఆప్యాయంగా చెవులు దోరబెట్టుకు వింటున్నారు. తమను అణచివేస్తున్న రాజరికాన్ని కూలదొయ్యడానికై రైతాంగంఘోషేసిన తిరుగుబాట్లనుగురించి, స్టెఫాన్ రాజిన్,

వుగాచేవ్ వగైరాలునడిపిన తిరుగుబాట్లనుగురించి కోర్చాగిన్ వాళ్ళకి వరసన చెప్పేడు.

ఒకరోజున అన్నాయింట్లో చిన్నకారంతా చేరి కబుర్లు చెప్పుకొంటున్నప్పుడు పావెల్ ఆక్షణంనుంచి తాను పొగ తాగడం మానివేస్తున్నానని ప్రకటించేడు.

“ఇకనుంచీ నేను పొగ తాగను.”

అదంతా తలవనితలంపుగా తటస్థపడింది. ఆరోజున అక్కడికి వచ్చినవాళ్ళలో ఒక పడుచువాడు ఏదో మాటల సందర్భంలో పొగ తాగడంవంటి అలవాట్లను మనుష్యుడు వదుల్చుకోలేడన్నాడు. అందరూ తలోవిధంగా మాట్లాడేరు. మొదట కోర్చాగిన్ ఏమీ అనలేదు. కాని, తాల్యా వదల లేదు. చివరకు చర్చలో అతడూ కలగచేసుకొన్నాడు.

“మనుష్యుడి అలవాట్లు ఆతనిమనస్సుకు అధీనంలో వుంటాయి. అంతేగాని మనస్సు అలవాట్లకు బానిసగా వుండ కూడదు. అలా కాకపోతే యింక మనం సాధించేది ఏముంటుంది?”

త్స్వేతాయేవ్ ఒకమూలనుంచి అంటించేడు.

“పెద్దకబుర్లకేం? చెప్పడానికి బాగానేవుంటాయి. కోర్చాగిన్ ఇన్నికబుర్లు చెప్తున్నాడే, వాటిని తానే ఎందుకు చేసిచూపించడు? అతడు సిగరెట్లు కాలుస్తాడు. అదో దుర లవాటు. మీరంతా ఆ మాటఎరుగుదురు. ఆతనికీ తెలుసు. కాని దానిని మానడంలేదు. ఈమధ్యదాకా అధ్యయన తరగతుల్లలో “విజ్ఞానప్రచారం” చేసేడు. కాని, తనమట్టుకు

తాను బూతులు మాట్లాడడం మానలేదు. వెనకటంతగా లేకపోయినా, అప్పుడప్పుడేనా బూతులు మాట్లాడుతున్నాడని ఆతనితో పరిచయం వున్నవాళ్ళందరికీ తెలుసు. ఎందుకొచ్చినమాటలు?... పరోపదేశ పాండిత్యం..."

అంతా నిశ్శబ్దం. త్స్వెతాయేవ్ కంఠంలో వినిపించిన వెక్కిరింత అక్కడున్నవారందరిలోనూ ఉత్సాహాన్ని చల్లార్చింది. కోర్చాగిన్ ఒక్కనిముషం ఏమీమాట్లాడలేదు. నెమ్మదిగా నోట్లోవున్న సిగరెట్టుదీసి నేలనురాసేసేడు.

"ఇక పొగ త్రాగబోవడంలేదు."

ఒక్కనిముషం వూరుకొని మళ్ళీఅన్నాడు:

"దిమ్కా అన్నాడనిగాక నా ఆరోగ్యంకోసమే దీనిని మానుతున్నాను. దురలవాటు మానుకోలేనివాడు నిష్ప్రయోజకుడు. ఇంక బూతులు మాట్లాడ్డం ఒకటుందికాదు? ఆ దురలవాటును చాలవరకు మానుకొన్నాను. వెనకటంత ఎక్కువగా చెడ్డమాటలు నానోట రావడంలేదని దిమ్కాయే చెప్పేడు. సిగరెట్టు మానివేసినంత త్వరగా బూతులు నోట జారకుండా చేసుకోలేను. అందుచేతనే అదికూడా మానేసేనని ఇక్కడే చెప్పలేకపోయేను. కాని అదికూడా మానేస్తా."

*　　　*　　　*

మంచుపడటం ప్రారంభమవుతుందనగా నది దిగువకు వస్తున్న కలపతెప్పలతో నది కదలమెదలకుండా వుంది. ఆదశలో ఆకురాలుకాలంలోవచ్చే వరదలు వచ్చిపడ్డాయి. వరదనీటివిసురులో కలపకాస్తా కొట్టుకుపోయి మళ్ళీ పట్టణా

ములో కలపకగువు ఏర్పడుతుందనిపించింది. వెంటనే పోలో మెంకా వంటచెరకు తెప్పల్ని బయటకులాగడానికి జనాన్ని పురికించింది.

మిగిలినవాళ్ళకన్నా వెనకబడకూడదనే పట్టుదలతో కోర్చాగిన్ తనకు పడిసెం పట్టినమాట దాచిపెట్టేడు. కలప అంతా పైకిలాగి గట్టుమీద పేర్చేసరికి వారంపట్టింది ఆ వారంరోజులూ మంచుగడ్డలా కరుస్తున్న నీటిలోనూ, చెమ్మ లోనూ పనిచేసేడేమో పెద్దపెట్టున జ్వరంవచ్చింది. రెండు వారాలపాటు కీళ్ళవాతం తీవ్రరూపంలో బాధపెట్టింది. హాస్పిటలునుంచి తిరిగివచ్చేక పనిలోకివచ్చినా బెంచివద్ద నిల్చోలేకుండావున్నాడు. ఫోర్మన్ అతనివంకచూసి, విచారంతో తలతిప్పేడు. కొద్దిరోజులుపోయేక మెడికల్‌బోర్డు ఆతనిని పరిశీలించి పనిచేసేస్థితిలో లేడని తేల్చేరు. పనిలోంచి పంపేస్తూ, జీతం యిచ్చేసేరు. పెన్షన్ ఇవ్వాలని చెప్తూ అవసరమైనకాగితాలు అతనిచేతిలో పెట్టేరు. కాని అతడు పెన్షన్ తీసుకోడానికి నిరాకరించేడు.

వర్కుషాపులు వదలిపోవడంఅంటే కోర్చాగిన్‌కు ఎంతో బాధకలిగింది. చాల నెమ్మదిగా, కర్రమీద ఆను కొనిగాని నడవలేకున్నాడు. అడుగుతీసి అడుగువేసేసరికి ప్రాణం జిలార్చుకుపోతూంది. ఇంటికోమాటు వచ్చి చూసి పొమ్మని తల్లి తెగవుత్తరాలువ్రాస్తూంది. ఆమె గుర్తు వచ్చినప్పుడల్లా ఆఖరున ఆమె అన్నమాటలుకూడా జ్ఞాపకం వస్తున్నాయి.

"కాలో చెయ్యో విరిగినప్పుడుతప్ప నువ్వోకనపడవు"

గుబర్నియాకమిటీ అతని కామ్‌సోమాల్ కార్డునూ, పార్టీకార్డునూ ఆతనికి తిరిగి ఇచ్చింది. బయలుదేరిపోయేట ప్పుడు కొద్దిమందితోమాత్రం చెప్పి గప్‌చిప్‌గా బయలుదేరి స్వగ్రామంచేరేడు. రెండువారాలపాటు ముసలమ్మ కాళ్ళు కాచింది, తోమింది. నెలరోజులు తిరిగివచ్చేసరికి బెత్తం సాయంలేకుండా కదలాడగలిగేడు. రోజులు గడచినకొద్దీ ఆతనిముఖం ఆనందంతో ఉద్దీపించింది. మళ్ళీ రైలెక్కి గుబర్నియా కేంద్రానికి వెళ్ళేడు. మూడురోజులు తిరిగేడు. చివరకు మిలిటరీశిక్షణదళంలో రాజకీయ ప్రబోధకుడుగా వుపయోగించుకోమని నిర్మాణశాఖ ప్రాంతీయ సైనిక కార్యాలయాన్ని ఆదేశిస్తూ ఆజ్ఞాపత్రం పంపింది.

మరోవారం ప్రయాణంచేసి రెండో బెటాలియన్‌లో మిలిటరీ కమిస్సారుగా ఒక చిన్నపట్టణానికి వచ్చేడు. కామ్‌సోమాల్ ప్రాంతీయకమిటీకూడా ఆతనికి పని వప్పచెప్పింది ఆ చుట్టుప్రక్కలు చెదురుబాదురుగావున్న కామ్‌సోమాల్‌ను సమీకరించి జిల్లా యువజనసంఘాన్ని నిర్మించమన్నారు. ఆవిధంగా మరోమారు కొత్తజీవితం ప్రారంభమయింది.

*　　　*　　　*

బయట మహావేడిగావుంది. కార్యవర్గాధ్యక్షుని ఆఫీసు గది కిటికీలోంచి చెర్రీచెట్టుకొమ్మ లోపలికి తొంగిచూస్తూంది. బాటకు ఆవల పోలిష్‌చర్చి గంట గోపురంమీదవున్న బంగారుశిలువ సూర్యుడిఎండలో మిలమిలలాడుతూంది. కిటికీ

ఎదుట పచ్చగడ్డిలో బాతుపిల్లలు తిండికోసం దేవులాడుతూ తిరుగుతున్నాయి.

కార్యవర్గం అధ్యక్షుడు అప్పుడే తనచేతికి అందిన రిపోర్టును కడముట్టా చదువుకొన్నాడు. ముఖం చింతాకులమయింది. తల గోక్కుంటూ కూర్చుండిపోయేడు.

బెరెజ్కోవ్ కార్యవర్గఅధ్యక్షుడిపేరు నికోలయ్‌విచ్ లిసిట్సిన్. ఆయన వయస్సు ఇరవైనాలుగేళ్ళకు మించదు. కాని ఆ మాటచెప్తే ఎవ్వరూ నమ్మరు. మంచి బలంగా, వలంగా, భయంవేసేలా వుంటాడు. చూస్తే ముప్ఫయ్యయిదు ఏళ్ళవాడిలా కనిపిస్తాడు. పెద్దతల, బలిసినమెడ, ఉబ్బిపోయేటట్లుచూసే పిల్లికళ్ళు. బలమునూ, పట్టుదలనూ సూచించే చుబుకం. నీలిరంగు కాలిపట్టీలు ధరించేడు. వలిగిపోయి, రంగుమాసిన దుస్తులు వేసుకొన్నాడు. కోటుమీద జేబుకు ఎర్రజెండా పతకం తగిలించివుంది.

తండ్రీ, తాతాలాగే లిసిట్సిన్‌కూడా చిన్నతనంనుంచీ కమ్మరంపనిచేసేడు. విప్లవంనాటికి తులాఫిరంగి కర్మాగారంలో లేతుమీద పనిచేస్తున్నాడు.

ఒకరోజురాత్రి ఈ తులాతుపాకీపనివాడు రైఫిల్ భుజానవేసుకొని కార్మికప్రభుత్వ సంస్థాపనకు లేచేడు. ఇంక అదే బయలుదేరడం. విప్లవమూ, దానిని నిర్వహిస్తున్న కమ్యూనిష్టుపార్టీ కోల్యాలిసిత్సినును మంచి ఒడుదుడుకుగా వున్నచోటికల్లా పంపుతూవచ్చేరు. అన్నిచోట్లా ఆతడు తనపనిని విజయవంతంగా నిర్వహిస్తూవచ్చేడు. సాధారణ

రెడార్మీసైనికుడుగా బయలుదేరినవాడు రెజిమెంటల్ కమేం డరుగా, కమిస్సారుగా పైకివచ్చేడు.

యుద్ధజ్వాలలూ, ఫిరంగుల మోతలూ ఇప్పు డింక లేవు. ఈనాడు నికోలాయ్ లిసిత్సిన్ సరిహద్దు జిల్లాలో పని చేస్తున్నాడు. జీవితం విశేషంగా ఒడుదుడుకులు లేకుండా సాగిపోతూంది. పంటలకు సంబంధించిన రిపోర్టులు చదువు కోవడమే కార్యవర్గాధ్యక్షుడి కిప్పుడుపని. వాటిని చదువుకోడా నికూ్కడా ఆతనివ్యవధి చాలడంలేదు. ఎంతో రాత్రిదాకా వాటితోనే కూర్చుంటున్నాడు. కాని, ఇప్పుడు చేతికివచ్చిన లేఖ మళ్ళీ ఆయనను గతజీవితపు అనుభవాలలోకి ఈడ్చుకు పోయింది. క్లుప్తమైనభాషలో అది రాబోతున్న ప్రమా దాన్ని గురించి హెచ్చరిస్తూంది.

## అతిరహస్యం

లిసిట్సిన్‌కు బెరెజ్డోవ్ కార్యవర్గం అధ్యక్షుడు...

"సరిహద్దులో ఈమధ్య సంచలనం ఎక్కువగావుంది. పోలిష్‌వాళ్ళు ఈమధ్య ఒక పెద్దగుంపును సరిహద్దుజిల్లాల్లో భయోత్పాతం కలిగించడంకోసం సరిహద్దులోపలికి పంపేరు. తగిన బందోబస్తుచెయ్యి. వసూలుచేసిన పన్నులడబ్బునూ, ఇతరవిలువగల వస్తువులనూ ప్రాంతీయకేంద్రానికి పంపె య్యమని ఆర్థికశాఖకు తెలియపరచు.!!

జిల్లా కార్యవర్గంఆఫీసులోకి ఎవరువచ్చినా, లిసిట్సిన్ కిటికీలోంచిచూస్తే కనిపిస్తారు. ఆతడు తలయెత్తేటప్పటికి

మెట్లమీద పావెల్ కోర్చాగిన్ కనబడ్డాడు. ఒకక్షణానికి తలుపుతట్టిన చప్పుడయింది.

పావెల్‌తో కరచాలనంచేస్తూ లిసిట్సిన్ ఆతనిని కూర్చోమన్నాడు.

"నీతో మాట్లాడాలి."

ఒక్క గంటసేపు యిద్దరూ ఒంటరిగా కూర్చుని మాట్లాడుకొన్నారు.

కోర్చాగిన్ ఆఫీసుగదిలోంచి బయటకు వచ్చేసరికి పొద్దు తిరిగిపోయింది. ఆతడు బయటకువస్తూంటే గుమ్మంలో లిసిట్సిన్ చిన్నచెల్లెలు ఎదురయింది. చాల బిడియంగల అమ్మాయి. వయస్సుకుమించిన ఆలోచనలుగలది. కోర్చాగిన్ ఆమెనెప్పుడూ ముద్దుగా 'అన్యూత్కా' అనే పిలుస్తాడు. ఆమెకూడా ఆతడంటే అభిమానం చూపిస్తుంది. ఆతడు ఎదురుపడగానే జుట్టు వెనక్కితోసుకుంటూ పలకరించింది.

"అన్నయ్య పనిలోవున్నాడా? మేరియా నికోల యేవ్నా అన్నం వడ్డించుకూర్చుంది."

"లోపలున్నాడు. ఎవ్వరూ లేరులే. వెళ్ళి పిలు."

మరునాడుదయం తెల్లవారకపూర్వమే మంచి బలమైన గుర్రాలుకట్టిన బళ్ళు మూడు కార్యవర్గకార్యాలయం ముందువచ్చి నిలబడ్డాయి. వానితోవచ్చిన మనుష్యులు ఏదో గుసగుసలాడుకొన్నారు. ఆర్థికశాఖ గదిలోంచి సీలు చేసిన పెట్టెలు తెచ్చి బళ్ళలో అమర్చేరు. మరో కొద్దినిముషాలలో అవి దంతబాటలకెక్కేయి. వాటికికావలాగా కోర్చా

గిన్ నాయకత్వాన ఒక సైనికదళంవెళ్ళింది. అక్కడినుంచి ప్రాంతీయకేంద్రం రమారమి నలభయి వెర్స్టులుంది. అందులో పాతిక వెర్స్టులు అడవిలోంచి వెళ్ళాలి. రక్షక బలగం సహాయంతో విలువైన వస్తువులన్నీ సురక్షితంగా ప్రాంతీయ ఆర్థికశాఖ కార్యాలయంలోని ఇనుపపెట్టెల్లోకి చేరవేసేరు.

ఇది జరిగిన కొద్దిరోజులకు ఒక అశ్వికుడు నురగ కక్కుతున్న గుర్రంమీద బెరెజ్జోవ్‌కి వచ్చేడు. ఆతడు సరిహద్దువేపునుంచి వస్తున్నాడు. ఆతడు వీధుల్లోంచి గాలప్ మీద వస్తూంటే జనం ఆశ్చర్యంతో విరగబడి చూస్తున్నారు.

కార్యనిర్వాహకవర్గంకార్యాలయంముందు గుర్రాన్ని ఆపి క్రిందికి ఉరికేడు. మొలనున్న కత్తి మెట్లకి తగలకుండా చేతితో ఒత్తిపట్టుకొని ఆఫీసులోకి గబగబ ఎక్కివచ్చేడు. ఆతడు తెచ్చిన కవరుమీద సంతకంచేసి లిసిట్సిన్ లోపలి కాగితం తీసికొని చదివేడు. కాగితం యిచ్చివెయ్యగానే రౌతు వెనక్కితిరిగి గుర్రం ఎక్కేడు. ఒక్కక్షణంకూడా దానికి విశ్రాంతియివ్వకుండా గిరుసతిప్పి మరల ఉరికించేడు.

ఈకాగితంలో ఏంవుందో కార్యనిర్వాహకవర్గం అధ్యక్షుడికితప్ప ఎవ్వరికీ తెలియదు. కాని, పట్టణంలోవాళ్ళు ఏదో ముంచుకువస్తూందని పసికట్టేరు. ఇక్కడున్న చిన్న వర్తకుల్లో మూడువంతులమంది దొంగసరుకుల బేరగాళ్ళే. ఆ వ్యాపారం సాగించడంలో ఏదన్నా అపాయం వస్తూందంటే ఇట్టే పసికట్టేశక్తి పట్టుబడింది.

సైనిక శిక్షణాదళం ప్రధానకార్యాలయంవేపు ఇద్దరు వ్యక్తులు గబగబా నడిచివెళుతున్నారు. వారిలో పావెల్ కోర్చాగిన్ ఒకడు. ఆయన మొలని రివాల్వరుంది. అదెప్పుడూ ఆయనవెంటనేవుంటుంది. కనక దానిలోకొత్తలేదు. కాని రెండోమనిషి త్రోఫిమోవ్ మెడలోకూడా రివాల్వరు వుండడంతో చూచినవాళ్ళంతా ఏదోవిశేషం వుందనుకొన్నారు.

మరోకొద్దినిముషాలకు పదిపదిహేనుమంది రైఫిళ్ళతో బయటకువచ్చేరు. రైఫిళ్ళచివరలసన్నీలుతగిలించివున్నాయి. వారంతా వేగంగాకూడలిలోవున్నమిల్లువేపు వెళ్ళిపోయేరు. ఊళ్ళోవున్న పార్టీసభ్యులకీ, కామ్‌సోమాల్‌సభ్యులకీ పార్టీకమిటీ ఆఫీసుల్లో రైఫిళ్ళు పంచిపెట్టేరు. నెత్తిన కోసక్కు టోపీ, మొలధట్టీలో మాజరుతో లిసిట్సిన్ గుర్రంమీద గాలపులో వెళ్ళిపోయేడు. ఏదోవిశేషం వుందన్నమాటే. పెద్దబజారునుంచీ,పక్కవీధులనుంచీకూడ జనంజారుకున్నారు. ఒక్కపిట్టకూడా కనబడ్డంలేదు. ఒక్కక్షణంలో దుకాణాలన్నీ మూసేసేరు. తలుపులకి పెద్దపెద్దతాళాలు తగిలించేరు. ఎండ బాధిస్తూన్నా పెంటకుప్పల్లో నేమకుంటూ పందులూ, కోళ్ళూ తిరుగుతున్నాయి

పట్టణం చివరవున్నతోటల్లో కాపలాదార్లునిలబడ్డారు. అక్కడినుంచిచూస్తే చుట్టూవున్నపొలాలు కనుచూపుమేర వరకూ అద్దంలాగ కనిపిస్తాయి. వాటిమధ్యనుంచి బట్టలు పరిచినట్లున్నరోడ్డు చాలదూరంవరకూ దృష్టిపథంలో వుంటుంది.

లిసిట్సిన్‌కు ఆరోజున అందినపత్రం చాల క్లుప్తంగా వుంది.

“గతరాత్రి పోదుబ్‌స్కీ ప్రాంతంలో చిన్న ఘర్షణ జరిగేక నూరుమందివున్న ఒక శత్రుదళం రెండు చిన్న మర తుపాకులతో సరిహద్దులో జొరబడింది. తగిన బందోబస్తు చేయి. ఆ శత్రుదళం జాడ స్లావ్యూటా అడవులవరకూ కన బడింది. తర్వాత ఎటుపోయేరో తెలియలేదు. వాళ్ళని వెంటా డ్డానికై రెడ్‌కోసక్కు-కంపెనీని పంపుతున్నాను. వాళ్ళు ఈ పగలే బెరెజ్డోవ్ వేపు వస్తారు. వాళ్ళే శత్రువు లనుకోకు.

గాద్రిలోవ్.

(సరిహద్దుపటాలం కమేండరు)

మరోగంటలో పట్టణంరోడ్డుమీాద ఒక అశ్వికసైని కుడువస్తూ కనిపించేడు. ఆతనికి ఒక కిలోమీాటరు దూరంలో మరికొందరు అశ్వికులువస్తున్నారు. కోర్చాగిన్ బహుజాగ్ర త్తగా వాళ్ళ పోకడలను పరిశీలిస్తున్నాడు. ముందువస్తున్న వాడు ఏడోకోసక్కు- రెజిమెంటు తాలూకుసైనికుడు. రికన్నై జాన్సు వ్యవహారాలకింకా కొత్త. అందుచేత ఆతడు ఎంతో జాగ్రత్తగావస్తున్నా రోడ్డుపక్క-నున్న తోటల్లోని కాపలా దార్లు అతనిని కనిపెట్టేసేరు. ఆతడు తెలుసుకొనకపూర్వమే రోడ్డుపక్క-నేవున్న పొదల్లోంచి సాయుధులయిన జనం చటు క్కు-నవచ్చి చుట్టుముట్టేసేరు. వాళ్ళచొక్కా-లమీాద గుచ్చి వున్న కామ్‌సోమాల్ బిళ్ళలుచూసి ఓ వెర్రినవ్వు నవ్వేడు. వాళ్ళతో కాస్సేపుమాట్లాడి వెనకనే వస్తున్నవారికేసి

గుర్రాన్ని పురికించేడు. కాపలాదార్లు కోసక్కు దళాన్ని దాటించి సాగనంపి, మళ్ళీ తమతమ స్థానాలలో కాపలా నిలబడ్డారు.

శత్రుదళం వుద్దేశం నెరవేరలేదు. వారిని కోసక్కు సేనలు వెంటాడి, నిలబడకుండా తరుముతూంటే వాళ్ళు మళ్ళీ సరిహద్దుఆవలకు జారుకున్నారు.

ఆ జిల్లాలో సోవియట్ జీవితాన్ని నెలకొల్పటందుకై పందొమ్మిదిమంది యువకులు బహుపట్టుదలగా పనిచేస్తు న్నారు. ఇక్కడ పరిపాలనావ్యవస్థ కొత్తగా ఏర్పరచబడింది. కనక తూమొదలు తుదమ్దాకా అన్నీ వెతుక్కోవడమే. దానికితోడు సరిహద్దు దగ్గరలో వుండడంచేత ఎప్పుడూ బహు జాగ్రత్తగా వుండకతప్పదు.

సోవియట్లకి ఎన్నికల ఏర్పాట్లుచేయడానికీ, దొంగలను తరమడానికీ, వైజ్ఞానిక కార్యక్రమాలు ఏర్పాటుచెయ్యడానికీ, దొంగవ్యాపారాలు సాగకుండాచెయ్యడానికీ లిసిట్సిన్, త్రోపిమోవ్, కోర్చాగిన్లు తమ కందుబాటులో వున్న కొద్దిమంది కార్యకర్తలనుపెట్టుకొని రాత్రీ పగలూ అనకుండా పనిచేస్తున్నారు. రక్షణలను బలపరచేటందుకై పార్టీలోనూ, కామ్సోమాల్సెలోనూ చేసేపనికి ఇవన్నీ అదనం.

గుర్రందిగి డస్కుబల్ల దగ్గరకూర్చోడం, సైనికశిక్షణ ఇస్తున్నచోటికిపోయి చూసిరావడం, తర్వాత క్లబ్బు స్కూలు రెండోమూడో కమిటీమీటింగులు — ఇదీ రెండో బెటాలియన్ కమిసార్ దినచర్య. మొలదట్టీలో హాజరు తగిలించు

కొని ఆతడు తరుచుగా రాత్రంతా గుర్రంమీద తిరుగుతూనే వుంటాడు. దొంగసరుకులు జేరవేసే బళ్ళను అటకాయిస్తూనే వుంటాడు.

బెరెజ్డోవ్ జిల్లా కామ్సోమాల్ కమిటీలో కోర్చాగిన్, లిడాపోలెవ్రూఖ్ లున్నారు. లిడా వోల్గాప్రాంతంనుంచి వచ్చింది. మహిళాశాఖ వ్యవహారాలుచూస్తూంది. వారితో నున్న మూడోవ్యక్తి పేరు ఝుంకారజ్వాలిఖిన్. పొడుగాటి వాడు. అందమైన విగ్రహమూను. కొద్దికాలంక్రితంవరకు జిమ్నాసియంలో చదివేడు. ఆయనకు సాహసగాథలూ, వీర గాథలూ చదవడమంటేమహాఇష్టం. షెర్లాక్ హోమ్సుకథలూ, లూయిబుస్సెనార్డ్ కథలూ హృత్తవిలి. ఈమధ్యవరకూ జిల్లా పార్టీకమిటీ మేనేజరుగా వుండేవాడు. కామ్సోమాల్ లోచేరి అంతా నాలుగునెలలుకూడా కాలేదు కాని, మిగిలిన యువ కులవద్ద తా నేనాడో బోల్షివిక్ పార్టీలోచేరిన ఆరిందా పోకిళ్లు పోతాడు. పంపేటందుకు మరొకరెవ్వరూ లేకపోవడంచేత ఎంతో తటపటాయిస్తూనే ప్రాంతీయకమిటీ ఆతనిని బెరెజ్డోవ్ పంపింది. అక్కడ రాజకీయఅధ్యయన తరగతులు నడపడం అతని కిచ్చిన పని.

* * *

మిట్టమధ్యాహ్న మయింది. మహాఉడుకుగావుంది. ప్రాణిజాలం అంతానీడలు వెతుక్కుంటూంది. కుక్కలుకూడా పాకలక్రిందచేరి. వగరుస్తూ బద్ధకంగా కన్నుమూసుకొని పడి వున్నాయి. నూతిపక్కనున్న బురదగుంటలో దొర్లాడుతున్న పందితప్ప మరోప్రాణి చూపుమేరలో కనబడ్డంలేదు.

కోర్చాగిన్ చెట్టుకుకట్టిన గుర్రాన్ని విప్పేడు. మోకాలు బాధకు పెదవులుబిగపట్టి ఎల్లాగో జీనులోచేరేడు. పాఠశాల గుమ్మంలో నిలబడింది.

"కామ్రేడ్ కమిస్సార్! మళ్ళీ కనిపిస్తారుకదూ?"

గుర్రం హడావిడిపడుతూంది. మెడచాపి కళ్ళెంలాగుతూంది.

"సెలవు. కా। మేడ్ రకిటినా! ఆవిషయం తేలిపోయినట్లే. రేపు మొదటిపాఠం చెప్తానన్నమాటే."

కళ్ళెం వదలడంతో గుర్రం వేగంగా నడక ప్రారంభించింది. హఠాత్తుగా పెద్దపెద్ద కేకలు వినిపించేయి. ఇళ్ళు అంటుకొన్నప్పుడు వినిపించే ఏడ్పులాఅనిపించింది. గుర్రాన్ని వెనక్కి తిప్పేడు. ఎవరోరైతుస్త్రీ ఆయాసపడుతూ వూళ్ళోకి పరుగెత్తివస్తూంది. రకిటినా ఆమెను ఆపడానికి వెళ్ళింది. చుట్టూవున్నఇళ్ళల్లోంచి ముసలాళ్ళూ, ముతకవాళ్ళూ బిలబిలాడుతూవచ్చిమూగేరు. పడుచువాళ్ళూ, పనిచెయ్యగలవాళ్ళూ ఆ సమయంలో పొలాలమీద పనులకుపోయేరు.

"ఏమర్రోయి. రండి. రాండర్రోయి. చంపేస్తున్నారు."—అని ఆ స్త్రీ ఒగరుస్తూ అరుస్తూంది.

కోర్చాగిన్ వెళ్ళేసరికి ఆమెచుట్టూ జనం అంతా మూగేరు. తెగ ప్రశ్నలు వేస్తున్నారు. కాని ఆమె అరవడం తప్ప ఏమీ చెప్పడంలేదు. "చంపేస్తున్నారర్రోయ్ ... నరికేస్తున్నారర్రోయ్ ..."

ఒక ముసిలివాడికి విసుగేసింది.

"ఏమిటా అరుపు! ఎవరు చంపుతున్నారు? ఎవరిని చంపుతున్నారు? నీ ఏడుపుమండ."

"మనవాళ్ళూ పోడుబట్టీ వాళ్ళూ కొట్టుకొంటున్నారర్రా. సరిహద్దులదగ్గిర పేచీవచ్చింది. వాళ్ళు మనవాళ్ళని చంపేస్తున్నారు."

అర్థంఅయింది. ఆడవాళ్ళు ఏడ్పులు ప్రారంభించేరు. ముసలివాళ్ళు చిందులుతొక్కడం ప్రారంభించేరు. క్షణంలో ఆవార్త వూరంతా వ్యాపించింది.

"పోడుబట్టీవాళ్ళు మనవాళ్ళని కోసేస్తున్నారు. సరిహద్దులపేచీయే మళ్ళీ..."

మంచాలమీదనుంచి లేవలేనివాళ్ళుతప్ప తతిమ్మా అందరూ బయలుదేరేరు. బరిసెలు, గొడ్డళ్ళూ తీసేరు కొరడిరాటలుపీకి భుజానవేసుకొన్నారు. దెబ్బలాట జరుగుతూందన్నచోటికి బయలుదేరేరు. ఏటా ఆ పేచీ ఓ మామూలయిపోయింది.

ఒక్కదెబ్బవేసేసరికి కోర్చాగిన్ గుర్రం ముందు కురికింది. ఆతని కేకలూ, అదిలింపులతో వేగం హెచ్చించింది. కాళ్లు నేలనికూడా ఆననంతవేగంతో పరుగెత్తుతున్నజనాన్ని దాటుకొని గాలప్ తీసింది. ఎదురుగా చిన్నమిట్టమీద గాలిమిల్లుచక్రం ఆకులు చేతులుబారచాపి ఆపుతున్నట్లు కనిపించింది. కుడివేపుగా నదిగట్టున పల్లపుబీళ్ళు వున్నాయి. ఎడమవేపున చూపు ఆనేటంతమేర రైపొలాలే. గాలిలో రైచేలు కెరటాలు వేస్తున్నాయి. రోడ్డుపక్కన పాపీపువ్వులు

ఎర్రగా కనిపిస్తున్నాయి. వాతావరణం ఎంతో వేడిగావుంది. ఎక్కడా ఉలుకూ, పలుకూ లేదు. కాని దూరాన నదివొడ్డు వేపునుంచి వుండివుండి కొట్లాడుతున్న వాళ్ళ కేకలు వినిపిస్తున్నాయి.

బీళ్ళ వేపుగా గుర్రం పరుగెత్తిపోతూంది. "కాలు బెసికిందా, మా యిద్దరిపనీ ఆఖరే"- అనిపించింది, పావెల్‌కు. కాని, ఇప్పుడు ఆగడానికి వీల్లేదు. గుర్రం మెడమీదికంటా వొరిగి గాలిహోరుమంటూ చెవుల్ని మూసుకుపోతుంటే వినడం తప్ప చేసేదిలేదు.

జనం ఒళ్ళెరగని ఆవేశాలతో కొట్లాడుకొంటున్న చోటికి ఆతడు సుడిగాలిలా విరుచుకుపడ్డాడు. అప్పటికే చాలమందికి వొళ్ళంపట రక్తాలు కారుతున్నాయి.

ముఖాన రక్తంకారుతూంటే పరుగెత్తిపోతున్న ఒక యువకుణ్ణి ఒకముసిలాడు కొడవలివూడిపోయిన పిడికర్రతో కొట్టి తరుముతున్నాడు. పక్కనే భేతాళుడంతమనిషి ఒకడు క్రిందపడిపోయినవాని నొకణ్ణి బూటుకాలితో ముడ్డిమీద తన్నుతున్నాడు. పావెల్ గుర్రం విసురుకు ముసిలాడు బొక్క-బోర్లా పడిపోయేడు.

చేతులుకలిపి తలబడిన జనంమధ్యకు గుర్రాన్ని వురికించేసరికి నలుగురూ బెదిరి, చెదిరిపోయేరు. వాళ్ళు తేరుకొనే లోపుగానే గుర్రాన్ని అటూఇటూ వురుకులెత్తించి జనాన్నింకా తరిమేడు. భయపెడితేతప్ప వీళ్ళని తరమలేమనుకున్నాడు. రివాల్వరు తీసేడు. "ఫోండి, దౌర్భాగ్యుల్లారా! ఒకొక్కణ్ణీ కాల్చిపారేస్తా, దొంగకీనుగుల్లారా!"

మహా ఉక్రోషంతో వికారంగా అరుస్తున్న జనం మీదుగా పైకి రివాల్వరు కాల్చేడు. గుర్రం సున్నాలుతిరుగు తూంటే పిస్తలు టపటపలాడుతూంది. దొమ్మిలోని జనం కొందరు కత్తులూ, కొడవళ్లూ కిందపారేసి పరుగెత్తిపోయేరు. ఆచోటంతనూ కలగదొక్కుతూ, విధివిరామంలేకుండా రివాల్వరు కాలుస్తూ ఎట్టకేలకు ఆతడు పరిస్థితుల్ని అదుపులో పెట్టేడు. దొమ్మినేరం తమమీదకు ఎక్కడవచ్చి పడుతుందో నని ఎవరికివారే రైతులంతా పారిపోయేరు. రెండోవేపున ఈ రౌతుకూడా, ఒకేమొయిని రివాల్వరు కాల్చేస్తున్నాడు.

అదృష్టవశాత్తూ దొమ్మిలో ఎవ్వరూ చచ్చిపోలేదు. గాయాలు తగిలినవాళ్లు నెమ్మదిగా తేరుకున్నారు. త్వరలోనే జిల్లాజడ్జి పోదుబ్ట్సీలో కోర్టుపెట్టి విచారణ జరిపేడు. కాని, పేచీకి అసలుకారకులెవరోమాత్రం బయటపడలేదు. జడ్జీ బోల్లి విక్కులకుండే పట్టుదలా, ఓపికాతో వాళ్ళుచేసినదెంత దుర్మార్గపుపనో రైతులకుచెప్పడానికి ప్రయత్నించేడు. అటువంటి దౌర్జన్యాలను సాగనివ్వం అన్నాడు.

"కామ్రేడ్ జడ్జి! తప్పంతా సరిహద్దుల్లోవుంది. అవి ప్రతిఏటా పేచీలుతెస్తున్నాయి."

తప్పుసరిహద్దులదైనా కొందరురైతులు ఆ దొమ్మీకి బాధ్యత వహించవలసివచ్చింది.

ఒక వారంరోజులుపోయేక ఒక సంఘంవచ్చి భూమి కొలచి తగాదాప్రదేశంలో రాళ్ళుపాతేరు.

సర్వేయరు కోర్చాగిన్‌తో మాట్లాడుతూ —“ఇక్కడికి ముప్ఫయ్యేళ్ళనుంచి చూస్తున్నా. ఎప్పుడూ పేచీలు వచ్చేది సరిహద్దుల్లోనే”— అన్నాడు. ఎండలో నడిచి ఆ ముసిలివాడు చెమటలు కక్కుతున్నాడు. ఎండకీ నడకకూ బాగా అలసిపోయివున్నాడు.

“భీళ్ళుపంచిన పద్ధతిచూస్తే మనకళ్ళని మనమే నమ్మలేము. తాగి తూలిపోతున్నవాడుకూడా ఇంతకంటె తిన్నగా గీతలుగీస్తాడు. ఈ పొలాల హద్దులంతకన్న అధ్వాన్నంగా వున్నాయి. మూడేసిఅంగల వెడల్పు పీలికలు. ఒకవేపున దీంట్లోకి, మరోవేపున దాంట్లోకీ తోసుకుపోతుంటాయి. ఒక్కొక్క తరం పంచుకోవడంతో అవి ఇంకా చిన్నచిన్న ముక్కలయిపోతున్నాయి. నే చెప్తున్నావిను. మరో ఇరవై యేళ్ళుపోయే సరికి గట్లేగాని పొలాలు మిగలవు ఇప్పటికీ నూటికి పదివంతుల మేర ఈ విధంగా నిరుపయోగం అయిపోతూంది.”

కోర్చాగిన్ చిరునవ్వు నవ్వేడు.

“క్రామేడ్ సర్వేయర్. ఇరవై యేళ్ళనాటికి అసలు గట్లనేవే వుండవండీ.”

ముసలివాడు ఆతనివంక పరీక్షగాచూచేడు.

“కమ్యూనిస్టు సమాజంలోననా? అబ్బో! అదేనాటి మాటో.”

“బుదనోవ్కా కోల్ఖోజ్ పేరు విన్నారా?”

“నీ ఆలోచన అర్థమైంది, లే.”

“మరింకేం?”

నే బుదనోవ్కా వెళ్ళేను. కాని, అల్లాంటిది నూటి కొకటీ, కోటి కొకటీను."

సర్వేయర్లు భూముల్ని కొలుచుకుంటూ పోతున్నారు. ఇద్దరు పడుచువాళ్ళు సరిహద్దులో కొయ్యసీలలు పాతుకు పోతున్నారు. ఇదివరకు పాతిన సీలలు చిదికి, చెదలుపట్టి గడ్డిలో కనబడీ కనబడనట్లున్నాయి. సరిగ్గా అక్కడే కొత్త సీలలు పాతుతున్నారో లేదోనని ఇసు వేపులా నిలబడి రైతాంగం మహాపరిశీలనగా చూస్తున్నారు.

* * *

బక్కచిక్కిపోయిన గుర్రాన్ని బాదేస్తూ బండివాడు బాటసాఖలతో వటవట వాగేస్తున్నాడు.

ఈ కామ్‌సోమాల్ లంతా ఎక్కడనుంచిపుట్టుకొచ్చేరో గాని, మా రోజుల్లో ఇల్లాంటివి ఎరగం. ఆ పంతులమ్మే మొదట దీనిని తలపెట్టింది. ఆవిడ నెరుగుదురా? రకిటినా ఆవిడ పేరు. పడుచు లంజ. అంత యోగ్యతవున్న దేం కాదు. వూళ్లోవున్న ఆడవాళ్ళందరికీ ముడ్డిగిల్లుతూంది. వాళ్ళకి ఏమి టేమిటో చెప్తూంది. ఇంక ఏం చెప్పమంటారు. ఒకటే రభస. ఈవేళ కట్టుకొన్న పెళ్ళాన్ని కొట్టడానికి వీలులేదు కదా! ఇదివరకిల్లా వుండేదా? కాస్త చిరాకు పుట్టినప్పుడల్లా ఒకటో, రెండో తగిలించేవాళ్ళం. మళ్ళీమాట్లాడేవాళ్ళా? నెత్తినగుడ్డేసుకుపోవలసిందే. ఇప్పుడల్లా కాదు. ఎంత రభస. ఎంతగోల. ఎందుకు చెయ్యి చేసుకొన్నామురా యనిపించేటట్లు ఒకటే అల్లరి. ప్రజాకోర్టుల్లో పెడతామని బెదిరింపు. ఇంక

పడుచువాళ్ళున్నారు. వాళ్ళతాడు తెగ, మాట్లాడుతే చట్టాలూ, శాసనాలు వప్పచెప్పేస్తున్నారు. ఏమన్నా అంటే చాలు విడాకులిచ్చేస్తామంటున్నారు. మా గాంకా వుంది. నోట్లో నాలికవుందా అనిపించేది. అలాంటిది ఇప్పుడో ప్రజా ప్రతినిధిఅయి కూర్చుంది. ఆడవాళ్ళకి పెద్దఅయిపోయిందన్నమాట. ఊళ్ళు, వూళ్ళనుంచిజనం ఆవిడకోసం వస్తున్నారు. ఆసంగతి వినేసరికి నా అరికాలిమంట నెత్తికెక్కింది. ఓవరస ఉతుకుదామనుకున్నా. కాని తమాయించుకొని, ఛెస్, ఎవరేమనుపువాళ్ళేనుస్తారు మనకెందుకులే అని వూరుకొన్నా, ఇంట్లో పనిపాటలు మామూలుగా నడిచిపోతున్నాయి. ఇంకే గోతిలో దిగితేనేం అనుకున్నా.''

చొక్కా కాలరులోంచి కనబడుతున్న రొమ్మునోమారు గోకుకొని బండివాడు చబుకువిసిరేడు. గుర్రం ఓ అడుగు చురుగ్గావేసింది. బండిలో ఇద్దరున్నారు వాళ్ళెవరో కాదు. రజ్యాలిఖిన్ ఒకడు. లిడా ఒకామె. ఇద్దరూ పోదుబ్ట్సీకే వెళుతున్నారు. మహిళా ప్రతినిధుల్ని సమావేశపరచడానికి లిడా వెళుతూంది. స్థానిక సెల్లుకి సహాయపడి పని చేయించేటందుకు రజ్యాలిఖిన్‌ను పంపేరు.

లిడా ఎగతాళిగా బండివాడిని ఓ ప్రశ్న వేసింది.

“అయితే కామ్సోమాల్స్ అంటే నీకు ఇష్టంలేదన్న మాట.''

బండివాడు గడ్డం దువ్వుకుంటూ ఒక్కక్షణం ఆలోచించేడు.

"ఇష్టం లేకపోవడానికేముంది? వాళ్ళకదో ఆటగా వుంది. నాటకాలూ అవీ ఆడుతున్నారు. ఆడుకోనీ, వాళ్ళ సరదాలు ఇప్పుడుగాక మరెప్పుడు? మొదటిరోజుల్లో కు్ర కారు చెప్పినమాట వినకుండా అయిపోతున్నారనుకొన్నాం. కాని, ఇప్పుడాభయం అనిపించడంలేదు. త్రాగడంఅంటేనూ, తాగి అల్లరిచేయడం అంటేనూ వాళ్ళకేమాత్రం ఇష్టంలేదని చెప్తూంటారు. అంతా చదువుమీదపడ్డారు. ఒక్కటి ఆ దేవుడిమాట తలపెట్టకుంటే బాగుండును. చర్చి లాగేసి క్లబ్బుగా వుపయోగించుకోవాలని వాళ్ళప్రయత్నం. అదేం బాగులేదు. దానితో జనం ఎదురుతిరుగుతున్నారు. కాని, మొత్తంమీద ఫర్వాలేదు. బాగానేవుంది. కాని, నన్నడి గితే వూళ్ళోవున్న చెత్తకారీ జనాన్నందర్నీ చేర్చుకోవడం తప్పంటాను. ఒక్కడికి పైమీద గుడ్డవుండదు. కూలిచేసు కుంటేగాని పొట్టగడవదు. చారెడునేల ఒక్కళ్ళకీవుండదు. అదీ వీళ్ళ సామాజికం. కాస్త డబ్బుగలవాళ్ళ పిల్లల్ని ఆ దరి మానాలకూడా రానివ్వరు."

బండి బడబడలాడుతూ మిట్టదిగి, స్కూలుబిల్డింగు కెదురుగా ఆగింది,

* * *

స్కూలులో పనిచేసేఆమె వారిద్దరికీ గదులుచూపించి, తాను గడ్డిపరచుకుని నిద్రకుపడింది. లిడా, రజ్వాలిఖిన్ లు అప్పుడే ఏదోమీటింగుకివెళ్ళివచ్చేరు. సభముగిసేసరికే పొద్దు పోయింది. స్కూలుపాక లోపలంతా చీకటిగావుంది. లిడా

వస్తూనే బట్టలుతీసేసి పక్క-మీద చేరింది. వెంటనే నిద్రపట్టే సింది. ఒకరాత్రివేళ రజ్యాలిఖిన్ ఆమెవొళ్ళు తడుముతూంటే తెలివివచ్చింది. ఆతనిప్రయత్నం అర్థంఅయింది.

"ఏమిటది ?"

"స్ మాట్లాడకు. ఒక్క-ణ్ణీపడుకుంటే తోచడంలేదు. నీకు నిద్రతప్ప మరోగొడవలేదా."

"ఇంకచాలించు. తియ్యిచెయ్యి. మంచం దిగు."

లిడా ఆతనిని మంచంమీదినుంచి తోసేసింది. రజ్యాలిఖిన్ నవ్వుచూస్తే ఆమెకు తగనిమంట. పట్టుకొని ఓవరస తిట్టేదే. కాని నిద్రముంచుకువస్తూందేమో మళ్లీ పడక వేసింది.

రజ్యాలిఖిన్ వడలలేదు.

"ఆ. రద్దూ. ఇదోసరదా. సన్యాసంగాని పుచ్చుకొన్నావేమిటి, కొంపతీసి. ఏమీఎరగనిదానిలాగ నటించకు. నన్ను మభ్యపెట్టకు. నిజంగానువ్వు ప్రజాసేవకురాలివైతే, నాసరదా తీర్చు. తర్వాత నిద్రపోదువుగానిలే."

ఆమె నిద్రలో ఆతనిమాటలు విననూలేదు; సమాధానం చెప్పనూలేదు. ఆమె మాట్లాడకపోయేసరికి అంగీకరించినట్లే ఆతడు భావించేడు. మంచంమీదకూర్చుని, లిడా భుజంమీద చెయ్యివేసేడు.

లిడాకు తెలివివచ్చింది. చర్రుమని లేచింది.

"జాగ్రత్త. రేపుపొద్దున్న కామ్రేడ్ కోర్చాగిన్‌తో చెప్పిచూస్తా నీ వ్యవహారం ఏమిటో."

రజ్యాలిఖన్ ఆమె చేయిపట్టుకొని సన్నగా బతిమాలు కున్నాడు.

"మీ కోర్చాగిన్‌తో చెప్తే నాకేం భయమనుకున్నావా? నే చెప్తున్నావిను. వినకుంటే వదులుతాననుకోకు."

ఒకచిన్న కుమ్ములాట. రెండు లెంపకాయలు ఛెళ్ళుమని ఆ చీకట్లో వినిపించేయి. రజ్యాలిఖన్ తప్పుకున్నాడు. లిడా తడుముకుంటూ వెళ్ళి తలుపుతీసి వీధిలోకి పరుగెత్తింది. వీధిలో నిలబడి గంయ్‌మంది.

రజ్యాలిఖన్ పళ్ళుకొరికేడు.

"లోపలికి తగులడవే, చవటముండా!"

ఆతడు తన పక్కచుట్టతీసుకొని చూరుకిందపరచుకొని ఆరాత్రిగడిపేసేడు. లిడా లోపలికివెళ్ళి తలుపుగడియవేసేసుకుంది.

పొద్దుటే ఇద్దరూ తిరిగి బయలుదేరేరు. రజ్యాలిఖన్ ఈచూరుబండిలోకూర్చోకుండా, బండివానిప్రక్కన కూర్చున్నాడు. సిగరెట్లుతెగకాల్చేస్తున్నాడు.

"ఈ దూలగొండిలంజ నిజంగాపోయి కోర్చాగిన్‌తో చెప్పేస్తుందోయేమో. దీని దుంపతెగ. ఇంత కొరకరాని కొయ్యలా వుంటుందనుకొన్నానా? ఆవేషం, భాషాచూస్తే రంభా, వూర్వసీ అనిపిస్తుంది. కాని, తీరాచూడాలంటే దీనిలో అందమా? కాని, దీనితోపేచీపెట్టుకొంటే అల్లరి చేస్తుంది. ఇదివరకే ఆ కోర్చాగిన్‌గాడు నన్ను ఓకంట కని పెట్టివుంటున్నాడు."

రజ్యాలిఖిన్ నెమ్మదిగా బండిలోపలికి చేరేడు. తాను రాత్రిచేసినపనికి సిగ్గుపడుతున్నట్లూ, విచారపడుతున్నట్లూ ముఖంపెట్టేడు. తలవొంచుకొని క్షమాపణచెప్పుకుంటూ గొణిగేడు.

ఆతనిఎత్తు నెరవేరింది. వూరుదగ్గిరికి వెళ్ళేలోపునే రాత్రి ఘటనగురించి తానెవరికీచెప్పబోనని లిడా ఆతనికి మాటఇచ్చింది.

* * *

సరిహద్దుగ్రామాలన్నింటా వరసగా కామ్సోమాల్ సెల్లులు ఏర్పడ్డాయి. కమ్యూనిస్టు వుద్యమంయొక్క ఈ మొలకల్ని జిల్లాకమిటీసభ్యులు అతినేర్పుతో ప్రోదిచేసేరు. కోర్చాగిను, లిడాలు రోజులో అత్యధికభాగం స్థానికసంఘసభ్యులతోనే గడుపుతున్నారు.

పల్లెటూళ్ళకిపోవడం అంటే రజ్యాలిఖిన్‌కు ఇష్టంలేదు. రైతుయువకుల్ని కూడగట్టుకోవడం ఏలాగో తెలియక, వ్యవహారాలుపాడుచేస్తున్నాడు. వాళ్ళతో కత్తుకలపడం లిడాకూ కోర్చాగిన్‌కూ అవలీల. ఆడపిల్లలకు లిడా అంటే మహా అభిమానం. ఆమె వాళ్ళల్లో కలిసిపోతుంది. వాళ్ళల్లో కామ్సోమాల్ వుద్యమంమీద ఆసక్తి కలిగించింది. ఇంక కోర్చాగిన్‌ను జిల్లాలోవున్న యువకులందరూ ఎరుగుదురు. సైన్యాలలో చేరదగిన వయస్సువచ్చిన యువకులలో పదహారువందలమంది ఆతని బెటాలియన్‌లోనే ప్రాథమికశిక్షణ పొందేరు. ఇక్కడి గ్రామాలలో ప్రచారానికి ఆతని ఆకార్డియన్ ఎంతో

పనిచేసింది. ఆ సంగీతం పనిముట్టుమూలంగా కోర్చాగిన్‌కు జిల్లాలోని యువకులలో ఎంతో మంచిపేరువచ్చింది. ఆతడు వూళ్ళోకి వచ్చేడంటే సాయంకాలం పనిపాటులు అయిపో గానే వారాతనిచుట్టూ చేరేవారు. పాటలు వినేవారు. చాల మంది యువకుల్ని కామ్‌సోమాల్ వుద్యమంలోకి తీసుకురావ డంలో తోడ్పడినది ఆ మధురసంగీతమే ఆ సంగీతంతో పాటు, ఆ పడుచువాడి మాటలుకూడా వారు వినేవారు. మిలిటరీ కమిస్సారుగా, కామ్‌సోమాల్ కార్యదర్శిగా తమ మధ్యకువచ్చిన ఆ రైల్వేపనివాని మాటలకు వారు ముగ్ధు లయ్యేవారు. గ్రామాలలో కొత్తకొత్తపాటలు వినబడ సాగేయి. బైబిళ్ళు, సువార్తలకీ ప్రక్కన ఇళ్ళలో కొత్త కొత్త పుస్తకాలు ప్రత్యక్షం అవుతున్నాయి.

ఈదశ వచ్చేసరికి దొంగవ్యాపారులపని మరింత ఇరు కునపడింది. సరిహద్దుదళాల్నేగాక కామ్‌సోమాల్ సభ్యుల్ని కూడా వారు కాచుకోవలసివచ్చింది. కామ్‌సోమాల్ సభ్యులు ప్రభుత్వాన్ని బలపరుస్తూ గట్టిగా తోడ్పడుతున్నారు. ఒక్కో క్కప్పుడు కామ్‌సోమాల్‌సభ్యులే ఆ వుత్సాహంలో శత్రు వులవెంట బడుతున్నారు. కోర్చాగిన్ వారికి సహాయంగా పరుగెత్తవలసివస్తూంది.

గ్రిషుట్కా ఖోరోవోద్గా మహామొండుడుకు కుర్రవాడు. పోడుబ్‌ట్సీక్సెల్లు కార్యదర్శి. ఆవేశపరుడు. ఎప్పుడూ ఏదో వాదన వేసుకుకూర్చునుంటాడు. మతవ్యతిరేకప్రచారంలో మహా పట్టుదలగలవాడు. అలాడికో రోజున దొంగవ్యాపారులు కొందరు వూళ్ళో మిల్లులోకి రాత్రివేళ దొంగసరుకులు జేర

వేసే ప్రయత్నంలోవున్నారని తెలిసింది. వెంటనే కామ్‌సో మాల్ సభ్యులందర్నీ కూడదీసేరు. కాల్చడం నేర్చుకొనేటందు కుపయోగించే ఓ రైఫిలూ, రెండుసన్నీలూ వాళ్ళ చేతిలోవున్నాయి. వాటితోనే అర్ధరాత్రివేళ బయలుదేరి మిల్లు కంతదూరంలో కాపలాకాచేరు.

దొంగవ్యాపారుల ప్రయత్నాలవార్త సరిహద్దులోని గూఢచారిశాఖకు కూడా తెలిసి, వారోదళాన్ని పంపేరు. చీకట్లో రెండు దళాలూ కలబడ్డాయి. కాని సరిహద్దుదళంవాళ్ల మెలకువమూలంగా తప్పిందిగాని, కామ్‌సోమాల్ దళం చాల నష్టపడివుండేది. వాళ్ళు ఆ కుర్రవాళ్ళవద్దనున్న ఆయుధాలు లాగేసుకొని, నాలుగుమైళ్ళదూరంలోవున్న వూరికంటా లాక్కుపోయి, కొట్లులోపెట్టి తాళంవేసేరు.

ఆ సమయానికి యాదృచ్ఛికంగా కోర్చాగిన్ గ్రామ లోవ్ ఆఫీసులో వుండడం తటస్థపడింది. మర్నాడుదయం బెటాలియన్ కమాండరు రాత్రిజరిగిన వృత్తాంతాన్ని కోర్చాగిన్‌తో చెప్పేడు. అతడు వెంటనే గుర్రంమీద ఆ యువకుల్ని జైలునుంచి తప్పించడానికై బయలుదేరేడు.

బందిఖానాలో ఆ యువకులను కాపలాగావున్న గూఢచారిశాఖవాడు కోర్చాగిన్‌కు రాత్రికథఅంతా చెప్పి పకపక నవ్వేడు.

"కామ్రేడ్ కోర్చాగిన్! వీళ్ళ నేం చెయ్యబోవడం లేదు. దిట్టమైనవాళ్ళులే. కాని, ఇకముందు మా పనికి అడ్డంరాకుండా కాస్తగట్టిగా చీవాట్లుపెట్టు."

కాపలాదారు తలుపుతీసేడు. కోర్చాగిన్ లోపలి కెళ్ళేడు. పదకొండుమంది కామ్‌సోమాల్ సభ్యులూ లేచి నిలబడ్డారు. తల వ్రేలవేసుకొని, బొటనవ్రేళ్ళతో నేలవ్రాస్తూ సిగ్గుపడుతున్నారు.

కాపలాదారు తెచ్చిపెట్టుకొన్న కంఠంతో గద్దించేడు.

"చూడు. మా పనంతా వీళ్ళు తితర్ బితర్ చేసేసేరు. ఇప్పుడింక ఏరియా హెడ్ క్వార్టర్సుకిపంపి వీళ్ళసంగతేమిటో కనుక్కుంటాం."

గ్రిషుట్కా తల ఎత్తేడు.

"కామ్రేడ్ సఖారోవ్! మేంచేసిన తప్పేమిటేం? ఎంతోకాలంనుంచి ఆ బందిమాన్‌గాళ్ళని కనిపెట్టివుంచేం. సోవియట్ ప్రభుత్వానికి తోడ్పడా లనేదే మా వుద్దేశం. కాని, మీరువచ్చి మమ్మల్ని బందిఖానాలో పెడతామంటున్నారు."

కోర్చాగినూ, సఖారోవూ కొంతసేపు ఒకరు బ్రతిమాలుతున్నట్లూ, ఒకరు ససేమిరాఅంటున్నట్లూ నటించేరు. చివరకు ఆ కుర్రవాళ్ళకి తగినంతబెదురు పుట్టించేమనిపించేక సఖారోవ్ మెత్తబడ్డట్లు నటించేడు.

"ఇంకెప్పుడూ సరిహద్దుల్లో షికారుకొట్టబోమని వాళ్ళు వాగ్దానంచేస్తే, మీరు హామీ నిలబడేపక్షంలో వాళ్ళని వదిలేస్తాను. మాకు సహాయం చెయ్యాలనుంటే వాళ్ళు చెయ్యవలసినవి బోలెడున్నాయి.

"అల్లాగే. వాళ్ళకి నేర్పాలి. ఇంకెప్పుడూ ఇల్లాంటి పనులు చెయ్యరులే"

కుర్రవాళ్ళు పాటలు పాడుకుంటూ పోసెక్సీకి తిరిగి పోయేరు. ఈ సంఘటన పైకి పొక్కకుండా మాఫు చేసేసేరు. తర్వాత కొద్దిరోజులకు ప్రభుత్వాధికారులు మిల్లుయజమానిని అరెస్టుచేసేరు.

*　　　*　　　*

మైదాన్—విల్లా అడవులలో కొంతమంది జర్మన్ ధనికరైతులు వలసవచ్చి కాపురం వుంటున్నారు. ఒక్కొక్క పొలంలో ఒక్కొక్కరైతు చిన్న కోటల్లాంటి యిళ్ళుకట్టు కొని వ్యవసాయాలు చేయిస్తున్నారు. ఒక్కొక్కయింటికి కనీసం అరకిలోమీటరు దూరంవుంటుంది. అంతోన్యాక్ బందిపోటుమూక ఇక్కడనుంచే తమ బందిపోట్లు సాగిస్తు న్నారు. అంతోన్యాక్ జార్ సైన్యాలలో సార్జంట్ మేజ రుగా వుండేవాడు. ఆతను తనదగ్గరి బంధువుల్నే ఏడుగురిని చేరదీసేడు. వారంతా పరమకిరాతకులుగా పేరుపడ్డవాళ్ళే. అందరికీ పిస్తోళ్ళు సరఫరాచేసి, వారిసహాయంతో దారులు కాచి దోపిడీలు సాగిస్తున్నాడు. మనుష్యుల్ని చంపడానికి వాళ్ళెవ్వరూ వెనుదీయరు. డబ్బున్న జట్టీబేరగాళ్ళనైనా దోచుకోవడానికి ఆతనికి అభ్యంతరంలేదు. సోవియట్ కార్య కర్తల్ని హింసించడానికి వెనుతీయడు. అంతోన్యాక్ ఎప్పుడూ ఒక్కచోటనే వుండడానికి ఇష్టపడడు. ఒకరోజున ఇక్కడ ఇద్దరు కో ఆపరేటివ్ గుమాస్తాలను నిలువునా దోచు

ఉంటాడు. రేపు ఇరవైకిలోమీటర్ల దూరాన హాజరయి ఏ పోస్టుజంట్రోతునో అడ్డుకొట్టి కట్టుగుడ్డలతోసహా వూడ్చుకు పోతాడు. ఈతడికి మరోబందిపోటుదొంగ గార్డీ తోడు. వీళ్ళిద్దరూ పోగడి ఆ ప్రాంతంలోని సైనికదళాల్నీ, రహస్యశాఖ దళాల్నీ మహాతిప్పట పెడుతున్నారు. అంతోన్యూక్ బెరెజ్దోవ్ చుట్టుప్రక్కలనే తిరుగుతూ అల్లరిచేస్తున్నాడు. పట్టణానికి పోయేబాటల్లో ప్రయాణించడంకూడా ప్రమాదకరంగావుంది. ఆతడిని పట్టుకోవాలంటే దొరకడంలేదు సైనికదళాలు వెంటబడి పట్టుకొంటాయని తోచినప్పుడు చక్కగా సరిహద్దు దాటేసి, పోలండులో కొన్నాళ్ళుకూర్చుంటాడు. సర్దుమణిగేక హఠాత్తుగా ఏదోమూల హాజరవుతాడు. దొరకకుండా తప్పించుకుపోగలుగుతూండడం మరీ ప్రమాదకరంగా తయారయింది. వాడుచేసిన దోపిడీవార్త వచ్చినప్పుడల్లా లిసిట్సిన్ పళ్ళుకొరకడంతప్ప ఏమీ చేయలేకుండావున్నాడు.

"ఈ తాచుపాము తల ఎప్పుడు చితకపొడుస్తామో? బద్మాష్" వీడి పనిపట్టడానికి నేనే స్వయంగా బయలుదేర వలసివస్తుంది."

జిల్లాకార్యవర్గం అధ్యక్షుడు రెండుమార్లు కోర్చాగిన్‌నూ, మరోముగ్గురు కమ్యూనిస్టుల్నీ తోడుచేసుకొని అంతోన్యూక్ వెంటబడ్డాడు. కాని, రెండుమార్లూకూడ వాడు తప్పించుకుపోయేడు.

ప్రాంతీయ కేంద్రంనుంచి బెరెజ్దోవ్‌కు ఒక ప్రత్యేక దళాన్ని తెచ్చేరు. బందిపోటుదొంగల్ని నిర్మూలించడం

కోసమే వీరిని తీసుకొచ్చేరు. ఆ దళం నాయకుడికి పేరు ఫిలా టోవ్. సైనికవృత్తిలోకి రాకపూర్వం అతను పత్తికవిచాను యువకుడు. సరిహద్దుకి దొంగలే నిబంధనల ప్రకారం ఆతను తనదళం రాకను జిల్లా కార్యనిర్వాహకునికి తెలియపరచాలి. కాని, అతడల్లాగ చేయలేదు. ఆ దొంగల వ్యవహారం ఏదో తానే చూసెయ్యాలనే పతుకుదలవల్ల ఆవేశంతో సరాసరి సరిహద్దు దగ్గరలోవున్న సెమూకినే వూరు చేరుకొన్నాడు. ఆతడక్కడికి వచ్చేసరికి అర్ధరాత్రి అయింది. వస్తూనే వూరు చివరగావున్న ఒకయింట్లో మకాం వేసేడు.

ఈ సాయుధదళం ఎవరో, గ్రామస్థులకి తెలియదు. వారు మకాంచేసిన యింటిప్రక్కనే ఒక కామ్‌సోమోల్ సభ్యుడున్నాడు. అతడు వీరి రాకను గమనించి వెళ్ళి గ్రామ సోవియట్ అధ్యక్షునికి చెప్పేడు. ఆయనకు ఫిలాటోవ్ దళం సంగతి తెలియదు. బందిపోటుదొంగలే వచ్చేరనుకొన్నాడు. వెంటనే ఒక యువకమ్యూనిస్టును పంపి జిల్లాకేంద్రం సహాయంకోరేడు. ఫిలాటోవ్ మూర్ఖత్వం ఆరోజున చాలమంది ప్రాణాలు తీసేదే. గ్రామసోవియటునుంచి వార్త రాగానే రాత్రికిరాత్రి లిసిట్సిన్ పది పన్నెండుమంది సైనికుల్ని తీసుకొని బయలుదేరేడు. వారు సరాసరి ఫిలాటోవ్ దళం విడిసిన ఇంటివద్ద గుర్రాలుదిగేరు. గోడఎక్కి లోపల జొరబడ్డారు. గుమ్మంలోవున్న సెంట్రీని ఒక దెబ్బతో పడగొట్టేరు. తలుపులు తోసుకొని లోపల ప్రవేశించేరు. లిసిట్సిన్ ఒక చేతి బాంబు తీసేడు.

"చేతులెత్తాలి. లేదా ముక్కలక్రింద పేలగొట్టేస్తా."

అతని గర్జనకు కిటికీతలుపులు ఝుణఝుణలాడేయి.

మరునిముషంలో నిద్రపోతున్నవాళ్లు ఉలికిపడి లేచేరు. నిలబడడానికి ప్రయత్నించివుంటే గుండ్లవర్షం కురిసి అందరూ చచ్చిపడుండేవాళ్ళే. కాని చేతిబాంబుతో నిలువెత్తుమనిషి గుమ్మంలో కనిపించేసరికి మాట్లాడకుండా చేతులెత్తేసేరు. కొద్దిసేపటిలోనే ఈ 'బందిపోట్ల'ని వీధిలో వరసన నిలబెట్టేరు. అప్పుడు ఫిలాటొవ్ తమ పరిస్థితిని గమనించేడు. లిసిట్సిన్ చొక్కామీదవున్న చిహ్నం చూడ్డంతోనే తా మెవరో, ఎందుకొచ్చారో చెప్పబోయేడు.

లిసిట్సిన్‌కు మహాకోపం వచ్చింది. అసహ్యంతో తుబుక్కున ఉమ్మేసేడు.

"చవటా."

* * *

జర్మనీలో విప్లవం వచ్చిందనీ, హాంబర్గులో వీధి పోరాటాలు జరుగుతున్నాయనీ వార్తలు సరిహద్దులో కర్ణాకర్ణిగా వినిపించేయి. ఆప్రాంతం అంతా మహోద్రిక్తంగా వుంది. ఎంతో ఆతురతతో ప్రజలు పత్రికలు చదువుతున్నారు. పడమటి దేశాలలోకూడ విప్లవజ్వాలలు కనిపిస్తున్నాయి. యువకమ్యూనిస్టులు ఎర్రసైన్యాలలో చేరడానికై వేలసంఖ్యలో దరఖాస్తులు పడేస్తున్నారు. కోర్చాగిన్‌కు బాగా పనితగిలింది. సోవియట్ రాజ్యం శాంతివిధానాన్ని

అవలంబించడు ఏమిటని, పొరుగు రాజ్యాలవారికి దాసీచేయ బోతుంటేదని అతను కష్టిష్టాంతై ప్రయత్నిస్తు న్నాడు. కాని, వాటివలన ఫలితం అంతగా వుండటంలేదు. మతబోధకుడికి ఇంటికెదురుగున్న తోటలో రోజూ జిల్లా అంతటినుంచీ వచ్చిన యువకమ్యూనిస్టులు సమావేశాలు జరుపుతున్నారు. ఒకరోజున పోడుబట్స్కీ యువకమ్యూ నిస్టులు సాయుధంగా జిల్లాకమిటీ ఆఫీసుముందుకు వచ్చి నిల బడ్డారు. వాళ్ళ రాకను కిటికీలోంచి చూసి కోర్చాగిన్ బైటకు వచ్చేడు. ఖోరోవోద్కో నాయకత్వాన పదకొండుమంది పడుచువాళ్ళు మిలిటరీ యూట్లూ, కిట్ బాగ్ లతో సహితంగా గుమ్మంముందు నిలబడివున్నారు.

కోర్చాగిన్ ఆశ్చర్యంతో ప్రశ్నించేడు.

"ఏమిటి దిగ్గవా!"

సమాధానం చెప్పడానికిబదులు ఖోరోవోద్కో కను బొమలు ఎగరేసేడు. కోర్చాగిన్‌తో కలిసి యింట్లోకి వెళ్ళేడు. లిడా, రజ్వాలిఖిన్ వగైరాలంతా నూతనాగంతు కునిచుట్టూ చేరి ఏమిటీ హడావిడ యని ప్రశ్నించేరు. ఖోరో వోద్కో తలుపులు జేరవేసి, కనుబొమ్మలు చిట్లిస్తూ తమ రాకవుద్దేశ్యం తెలిపేడు.

"కామ్రేడ్స్! ఇదొకమాదిరి నమూనా సైన్య సమీ కరణ అని చెప్పాలి. ఇల్లాచేయాలని నాకే తోచింది. మనం జర్మన్ బూర్జువాజీతో యుద్ధం చేయబోతున్నామనీ, పోలిష్ పానూతో (దొరలు) కూడా యుద్ధం తప్పదనీ జిల్లా కేంద్రం

నుంచి రహస్యంగా తంతివచ్చినట్లు ఈవేళ పొద్దుకు పీళ్ళతో చెప్పేను. యువకమ్యూనిస్టులందర్నీ సైన్యాలలోకి తీసుకో వలసిందిగా మాస్కో-నుంచి ఆదేశాలు వచ్చేయని చెప్పేను. యుద్ధంలోకి పోవడానికి భయంవేసేవాళ్ళు ఆమాట వ్రాసి యిచ్చి, ఇంటిపద్ద దిగబడిపోవచ్చునని చెప్పేను. యుద్ధం మాట రెండోమనిషి చెవినిపడనీయవద్దన్నాను. ఒకరొట్టే, ఇంతమాంసమూ తెచ్చుకొమ్మనీ, మాంసం దొరకకపోతే నాలుగు వుల్లిపాయలు తెచ్చుకోమన్నాను. అందరూ రహ స్యంగా వూరుబయటికి చేరుకొని, సరాసరి జిల్లాకేంద్రానికి వెడదామనీ, అక్కడ ఆయుధాల నిస్తారనీ చెప్పేను. దాని ఫలితం ఇది. నన్ను కభుర్లలో పెట్టి వివరాలు లాగాలనుకొ న్నారు. కాని, నేనేం చెప్పలేదు. ఏర్పాట్లు చూసుకొని బయలుదేరమని గదిమేసేను. ఇళ్ళవద్ద వుండిపోవాలంటే చెప్పెయ్యమన్నా. ఇష్టాపూర్తిగా రావాలంటేనే రమ్మన్నా. అంతా ఇళ్ళకు బయలుదేరేరు. ఎవరువస్తారో, ఎవరు జారు కుంటారో యని చాల మధనపడ్డా. ఎవరూరాకపోతే ఏం చెయ్యడం? సెల్లును రద్దుపరచి మరోవూరికి లేచిపోవడం తప్ప దారిలేదనిపించింది. గుండెలు పీచుపీచుమంటూవుంటే వూరిబయట అనుకున్నచోటికి చేరేను. కొద్దిసేపటికి ఒక్కొ క్కరే రావడం ప్రారంభించేరు. వారిలో కొందరికి భయంగా వుంది. వాళ్ళమొగాలే చెప్తున్నాయి. ఎంతదాస్తే మాత్ర మేం? పదిమందీ వచ్చేరు. ఒక్కడూ తప్పిపోలేదు. మా పోదుబ్‌స్కీ సెల్ అంటే ఏమిటనుకున్నారో."

లిడా పోలెవ్నూఖ్ ఆశ్చర్యపడింది. తేరుకుని చీవాట్లు పెట్టబోయింది. ఉమారొవు కూడా ఆశ్చర్యపడ్డాడు.

"ఏమిటీమాట. వాళ్ళని పరీక్షించడానికిదే మంచి పద్ధతి. వాళ్ళందరూ ఎలాంటివాళ్ళో తేలిపోయింది. ఇందులో మోసం, దగా ఏముంది? ముందు చెప్పినట్లుగా వాళ్ళని ప్రాంతీయ కేంద్రానికి ఈడ్చుకుపోదామనుకున్నాను. కాని, పాపం అలిసిపోయారు. కాళ్ళు తేలిపోతున్నాయి. కోర్చాగిన్! మీరో చిన్న ఉపన్యాసం యివ్వండి. ఏం, ఇవ్వరూ? ఉపన్యాసం లేకపోతే బాగుండదు. సైనిక సమీకరణ ప్రస్తుతం నిలిపేసేమనో, మరొకటో చెప్పండి. వాళ్ళని కాస్త వుబ్బేయండి."

*　　　*　　　*

ప్రాంతీయ కేంద్రానికి పోవాలంటే కొన్ని రోజులు ప్రయాణం చేయాలి. జిల్లాలో పనివత్తిడి చాల ఎక్కువగా వుంది. అందుచేత కదల వీలుగాక కోర్చాగిన్ ప్రాంతీయ కేంద్రానికి వెళ్ళడమే లేదని చెప్పాలి. కాని సందుదొరికితే చాలు రజ్వాలిఖిన్ పట్టణానికి పరుగెత్తుతూంటాడు. ఫెనిమోర్ కూపర్ కథలలోని నాయకులల్లే ఆచేతా, ఈచేతా ఆయుధాలు పట్టుకొని గుర్రం ఎక్కి బయలుదేరేవాడు. అడవిలో వెడుతూ ఉడతల్నీ, పక్షుల్నీ కాలుస్తూండేవాడు. దారిపోయేవారిని వారెవరో, ఎక్కడికిపోతున్నారో అడిగి దబాయించేవాడు. పట్టణానికి దరిదాపులలోకి వచ్చేక ఆయు

ధాలు జేబుల్లో దాచి ఏమీ ఎరగనట్లు కొమ్సోమోల్ ప్రాంతీయ కమిటీ కార్యాలయంలో ప్రవేశించేవాడు.

ఒకరోజున ప్రాంతీయకమిటీ కార్యదర్శి ఫెడోటోవ్ ఆతనిని "బెరెజ్డోవ్ కబుర్లేమిట"ని అడిగేడు.

ఫెడోటోవ్ ఆఫీసు ఎప్పుడూ హడావిడిగానే వుంటుంది. ఒకరిమాట వొకరికి వినబడకుండా పదిమంది ఒకే మాటు మాట్లాడేస్తుంటారు ఆ పరిస్థితుల్లో పనిచేసుకోవడం సాధ్యమయ్యేపనికాదు. నలుగురు మాట్లాడుతూంటే వింటూ, అయిదోవానికి సమాధానం ఇస్తూనే ఏమేమో వ్రాసుకొంటూంటాడు, ఫెడోటోవ్, అష్టావధానం చేస్తున్నట్లు. ఆతడు చిన్నవాడే. కాని, 1919 నుంచీ పార్టీసభ్యుడుగా పనిచేస్తున్నాడు. ఆ విప్లవదినాల్లో తప్ప మరోరోజుల్లో అయితే పదిహేనేళ్ళ కుర్రవాడికి పార్టీసభ్యత్వం దొరకదు.

ఆతని ప్రశ్నవిని రజ్వాలిఖిన్ దగ్గరగా వచ్చేడు.

"ఓ, బోలెడన్ని విషయాలున్నాయి. నిల్చున్నపాటున చెప్పడం సాధ్యంకాదు. తెల్లవారింది మొదలు రాత్రి పడుకునేదాకా ఒకటే నలుగుడు. ఒకటా రెండా చూడటానికి? తూనుంచి తుదుందాకా అన్నీ చూసుకోవలసిందే. నేను రెండు సెల్లులు ప్రారంభించేను. తెలుసుగా? ఔనుగాని, నన్ను పిలిపించిన పనేమిటి?"

ఏదో పెద్దవ్యవహారం పూర్తిచెయ్యవలసినవాడిలాగ రజ్వాలిఖిన్ పడకకుర్చీ దగ్గరకులాక్కుని కూర్చున్నాడు.

ప్రక్కనే టేబుల్ వద్ద కూర్చుని కాగితాలు చూసు కొంటున్న క్రిమెన్కో అతని మాటవిని తలఎత్తిచూసేడు.

మేము నిన్న రమ్మనలేదే. కోర్చాగిన్కు కబురం పేముగాని.”

రజ్వాలిఖిన్ సిగరెట్టు ఒక్క పీల్పుపీల్చి పొగవూదేడు.

“కోర్చాగిన్కు ఇక్కడికిరావడం ఇష్టంవుండదు. అందు చేత మిగతా పనులకు తోడు ఇదికూడా నామీదనే పడు తూంది... మొత్తంమీద కార్యదర్శులకని మహావీలుగా వుందిలే. వాళ్ళు చేత్తో ఒక్కపని చేయనక్కర్లేదు. గాడిద చాకిరీఅంతా నాలాంటిగాళ్ళమీద పడుతుంది. కోర్చాగిన్ సరి హద్దువేపు వెడితే మళ్ళీ రెండుమూడు వారాలదాకా దర్శ నం ఇవ్వడు. అన్నిరోజులూ ఆ పని నామీదే పడుతుంది.”

జిల్లాకార్యదర్శి పదవికి తనకంటె సమర్థుడు దొరక డన్నభావం అతని మాటల్లో ధ్వనించింది. ఆ సంగతిని అందరూ గ్రహించేరు.

రజ్వాలిఖిన్ వెళ్ళిపోయేక ఫెడోటోవ్ ప్రక్కవాళ్ళతో ఆతనిమాటలమీద వ్యాఖ్యానించేడు.

“ఈతడి ధోరణి నాకు నచ్చలేదు.”

రజ్వాలిఖిన్ ఎత్తులన్నీ ఓరోజున తలవనితలంపుగా నలుగురిలో బయటపడిపోయేయి.

సాధారణంగా జిల్లా కేంద్రంనుంచి వచ్చినవారు ఫెడో టోవ్ ఆఫీసుకువచ్చి తమ కేంద్రానికి సంబంధించిన టపా

అంతా పట్టుకుపోవడం అలవాటు. అలాగే ఓరోజున యాదృచ్ఛికంగా లిసిట్సిన్ వచ్చేడు. అతనితో మాట్లాడటంలో రజ్వాలిఖిన్ ఎత్తు బయటపడింది.

లిసిట్సిన్ వెళ్ళిపోయేటప్పుడు ఫెడోటోవ్ మరీమరీ చెప్పేడు.

"కోర్చాగిన్‌ను ఓమారు పంపించు. అతడు మొగం చూపడమే లేదు."

"అల్లాగే. కాని, ఆతనిని అట్టే పెట్టుకో నే ప్రయత్నం మాత్రం చెయ్యొద్దు. మేము ఒప్పుకోము సుమా."

*　　　*　　　*

ఈఏడాది అక్టోబరు విప్లవోత్సవాలు సరిహద్దుప్రాంతంలో ఎప్పటికన్న ఉత్సాహంగా జరిగేయి. సరిహద్దు గ్రామాలలో ఉత్సవాలను జరిపించే బాధ్యత కోర్చాగిన్ నాయకత్వాన ఏర్పడిన ఒక కమిటీకి వప్పజెప్పేరు. ఆరోజున పోదుబ్‌ట్సీ-లో మూడూళ్ళ జనం పెద్దసభ జరిపేరు. సభానంతరం అయిదువేలమంది అర కిలోమీటరుపొడుగున వరుసలుదీరి నిలబడి పెద్ద వూరేగింపు జరిపేరు. మిలిటరీ బ్యాండు వాయిస్తూంటే ఎర్రజెండాలతో సైనికశిక్షణ పొందుతున్న బెటాలియన్ ముందునడిచింది. సరిహద్దుగీతకు అంతదూరంలో సోవియట్ హద్దులోపలనే ఆ వూరేగింపు సాగింది. సరిహద్దు మూలంగా రెండుగా చీలిపోయిన గ్రామాల గుండా ఆ వూరేగింపు నడిచింది. అటువంటి వూరేగింపును పోలండ్ వేపు ప్రజలెన్నడూ ఎరుగరు. వూరేగింపు ముందుభాగాన

బెటాలియన్ కమాండరుగా బ్రిలోవ్రూ, కోర్చాగిన్నూ గుర్రాలమీద వెళుతున్నారు. వారి వెనక బ్యాండు మోగుతూంది. గాలిలో ఎర్రజెండాలు రెపరెపలాడుతున్నాయి. ఊరేగింపులో పాడే పాటలు దిగంతాలలో ప్రతిధ్వనిస్తున్నాయి. దారిపొడుగునా పండుగముస్తాబు చేసుకొని రైతు యువకులు వినోదంగా వచ్చి చేరుతున్నారు. రంగురంగుల దుస్తుల్లో యువతులు కిలకిలలాడుతున్నారు. వయసుమీరినవారు గంభీరంగా నడుస్తున్నారు. ముసలివాళ్ళు విజయానందంలో బోసినవ్వులు చిలకరిస్తున్నారు. కనుచూపుమేర ఒకటే జనప్రవాహం. వారికో ప్రక్కన సరిహద్దు కరకట్ట లాగవుంది. అన్ని వేలమందిలో ఒక్కరుకూడా ఆ కరకట్ట దాటడానికి ప్రయత్నించలేదు. జనం తన ప్రక్కనుంచి ముందుకు సాగిపోతూంటే కోర్చాగిన్ వారినిచూస్తూ గుర్రాన్ని ప్రక్కకు తీసి నిలబెట్టేడు.

కీకారణ్యాలనుంచి ఇంగ్లీషుఛానలుదాక

ఎర్రసేన కెదురేముందీ...—అన్న కామ్‌సోమాల్ పాట పక్కప్రక్కనే ఆడపిల్లలపాట వినబడుతూంది.

కొండపక్క కోనలోన

పడుచుపిల్ల పాటపాడె...

సంతోషాన్ని వెలిబుచ్చుతూ చిరునవ్వులతో సోవియటుసరిహద్దు కాపలాదార్లు వూరేగింపుకు స్వాగతమిచ్చేరు. పోలిష్‌గార్డులు ఆశ్చర్యంతో నోరు తెరిచేరు. సరిహద్దుగ్రామాలలో జరిగిన ఈ వూరేగింపుహద్దుకు ఆవల విపరీతమైన సంచల

నాన్ని కలిగించింది. జెండార్మ్ గుర్రపుగ స్త్రీసైనికులు వెనక్కీ ముందుకీ గుర్రాల్ని వురికించేరు. పోలిషు సరిహద్దుదళాల్ని అయిదింతలు పెంచేరు. అవసరం వస్తుందేమోనని దగ్గరలో వున్న పర్వతాలమాటున రిజర్వుసేనల్ని పెట్టేరు. ఈ వూరేగింపుసంగతిని సోవియట్ అధికారులు పోలిష్ సైన్యాధిపతికి ముందే తెలియపరచినా ఇంత హడావిడిచేసేరు. సరిహద్దుకు ఆవల ఎంతో గంద్రగోళం జరుగుతున్నా వూరేగింపు అను కొన్నప్రకారం సాగిపోయింది. పాటలు, ఆటలు, ఉత్సాహ ధ్వనులతో సోవియటు సరిహద్దుగ్రామాలు ప్రతిధ్వనించి పోయేయి.

సరిహద్దుకు ఆవల ఒక దిబ్బమీద పోలిష్‌సెంట్రీ నిల బడివున్నాడు. వూరేగింపు క్రమం తప్పకుండా అడుగులు వేసుకుంటూవచ్చింది. కవాతుపాట మొదటిచరణాలు ఘణిల్లు మనివినిపించేయి సెంట్రీ చటుక్కున ఎటెన్షన్‌లోకివచ్చేడు. రైఫిల్ చేతిలోకితీసుకొని 'సాయుధవందనం'(*Present arms*) చేసేడు. "కమ్యూన్ జిందాబాద్" అన్నమాటలు స్పష్టంగా కోర్చాగిన్ చెవినిపడ్డాయి.

పావెల్ తిరిగిచూసేడు. ఆ అభివాదనచేసినది తానే నన్నట్లు పోలిష్ సెంట్రీచూపులు చెప్పేయి. పావెల్ ఆశ్చ ర్యానికీ, ఆనందానికీ హద్దులేదు. ఆతనివంక కళ్ళప్పగించి చూస్తూ నిలబడిపోయేడు.

మిత్రుడు! సైనికదుస్తులక్రింద ఆ మానవహృదయం వూరేగింపుదారులయెడ సానుభూతితో సంతప్తమవుతూంది. పావెల్ నెమ్మదిగా పోలిష్ భాషలో అభివాదన తెలిపేడు.

"నమస్తే. కామ్రేడ్ !"

ఊరేగింపు సాగిపోయేంతవరకూ పోలిష్ సెంట్రీ అలాగే నిలబడివున్నాడు. పావెల్ ముందుకడుస్తూ మధ్యమధ్య తిరిగి చూస్తూనేవున్నాడు. పూరాన ఆ నల్లనినీడ అలాగే నిలబడి వుంది.

ఆతడు నిలబడిన చోటికి దగ్గరలో మరొక పోలిషు సెంట్రీ వున్నాడు. మీసాలు నెరిసివున్నాయి. ఉమ్కారం గులోవున్న ఆతనికళ్ళు ఉత్సాహాన్నిగాని, కోపాన్నిగాని ప్రకటించడంలేదు. అంతఃపూర్వమే విన్న అభివాదనఇంకా పావెల్ చెవుల్లో గింగురుమంటూనేవుంది తనదగ్గరలోవున్న సెంట్రీకూడా అభివాదనచేసినట్లే ఆతడు భావించి పునరభి వాదనంచేసేడు.

"నమస్తే, కామ్రేడ్ !"

సమాధానంలేదు.

గ్రావిలోవ్ చిరునవ్వు నవ్వేడు. ఆతడంతవరకూ జరిగిందంతా చూస్తూనేవున్నాడు.

"నీకోరికలు చాల పెద్దవయ్యా! ఇక్కడ పెట్టిన వాళ్ళందరూ పట్టి కాల్బలసైనికులే అనుకోకు. వాళ్ళలో కొందరు జెండార్మేలున్నారు. ఇతగాడి చొక్కాచేతిమీద ఆగుర్తు చూడలేదు? ఇతడుమాత్రం జెండార్మేయే సందేహంలేదు."

ఊరేగింపు ముందుభాగం మిట్టదిగి సరిహద్దుమూలంగా రెండుగా చీలిపోయిన గ్రామంలోకి ప్రవేశిస్తూంది. సోవి

యట్ హద్దులోవున్న గ్రామభాగం పెద్ద సంరంభంతో సభకు సన్నాహాలుచేసింది. గ్రామస్తులంతా సరిహద్దులో వున్న వాగుమీది వంతెనదాకా వూరేగింపుకు ఎదురువచ్చి స్వాగతం ఇచ్చేరు. గ్రామంలోని పడుచుకారు రోడ్డు కిరు వేపులా బారులుతీరి నిలబడ్డారు. పోలండ్ సరిహద్దు గ్రామ భాగంలోని జనంఅంతా ఇళ్ళూ, చెట్లూ ఎక్కి ఆ వినో దాన్ని పరిశీలిస్తున్నారు. పైకి ఎక్కలేనివారు తమ కుటీ రాల ముంగిళ్ళలోనూ, కోరడి గుమ్మాలలోనూ నిలబడి వాగుఆవల జరుగుతున్న కార్యకలాపాల్ని చూస్తున్నారు. ఊరేగింపు రోడ్డుప్రక్కల నిలబడ్డ యువజన పంక్తులమధ్యకు రాంగనే బ్యాండు అంతర్జాతీయ గీతాన్ని అందుకుంది.

"ఆకలిమంటల మలమలమాడే — అనాథు లంతా లేవండోయ్!"

తర్వాత విశాలంగావున్న మైదానంలో సభ ప్రారంభ మయింది. రంగానికి ఒకవేపున ఎత్తయిన వేదిక అమర్చేరు. దానిని పచ్చని మొక్కలూ, తీగలతో సుందరంగా అలంక రించేరు. అనేకమంది ఒకరితర్వాత నొకరుగా ఉపన్యాసా లిచ్చేరు. పడుచువాళ్ళూ, జుట్టునెరిసినవాళ్ళూకూడ ఉపన్య సించేరు. కోర్చాగిన్‌కూడా యూక్రేనియన్ భాషలో వుప న్యాసం ఇచ్చేడు. అతని కంఠస్వరం సరిహద్దు ఆవలకంటా ఖంగున వినిపిస్తూంది ఆ వుపన్యాసాన్ని ప్రజలువింటే ఏమి వుత్పాతాలు పుట్టుకొస్తాయోనని జెండార్మే అధికారుల భయం. ఇంక ఒక్కక్షణం అగల్‌బగల్‌న వుండకుండా

జనాన్ని తరమడం ప్రారంభించేరు. నగ్గై కా*లు గాలిలోకి తుపాకులు కాల్చి జనాన్ని భయపెట్టేరు.

కాల్పులు వినబడగానే పోలిష్ గ్రామభాగంలో ప్రసు లన్నీ నిర్మానుష్యం అయిపోయేయి. జెండా శ్మీ తుపాకీ కాల్పులు ప్రారంభంకాగానే యువకులు ఇళ్ళకప్పులూ, చెట్టు కొమ్మలూ దిగేసేరు. సోవియట్ భాగంలోని ప్రజలా దృశ్యాన్నిచూసి నిరవంగాచూస్తూ వుండిపోయేరు. ఆ దృశాన్నిచూసిన ఆవేశంలో ఒకముసలి గొర్రెలకాపరి విస వినావచ్చి వేదికనెక్కి వుపన్యాసం ప్రారంభించేడు. ఆతని కంఠం వుద్రేకంలో వొణుకుతూంది.

"చూసేరా, నాయనలారా! ఒకప్పుడు మననీ ఆలాగే పీక్కుతినేవారు. ఈవేళ మనకాస్థితి తొలగింది. రైతే నేడు గ్రామంలో పెద్ద. నగ్గైకాలు మచ్చుకుకూడా కనబడరు. పెద్దకుటుంబాలవాళ్ళ పెత్తనంపూడింది. మనవీపులు బెత్తాల దెబ్బలకి తట్టుతేరడంలేదు. మళ్ళీ ఆపెత్తంవార్లువచ్చి వీపు మీాద కూర్చోకుండా చూసుకోనేబాధ్యత మీాది. ముసిలాడి నైపోయేను. పెద్ద వుపన్యాసాలివ్వగల శక్తాలేదు. చెప్పగల శక్తేవుంటే చెప్పవలసిందిమాత్రం బోలెడుంది. జార్ చక్ర వర్తుల పరిపాలన సాగినంతకాలం కడుపు కాలుతూంటే, దరి ద్రంలో కుంగిపోతూ దున్నల్లా పనిచేసేం... అదిగో అటు చూస్తున్నారా? అంతే..."

* పోలిష్ ఫాసిస్టు బలగానికి పేరు.

ఆతడు ఎండిపోయి వుల్లలావున్న తనచేతిని పోలిష్ గ్రామభాగంవేపు చూపుతూ చంటిపిల్లవాడిలాగ గొల్లున ఏడ్చేడు.

తరువాత గ్రిషుట్కా ఖోరోవోద్కా వుపన్యసించేడు. మహోవుద్రేకకరంగావున్న ఆతని మాటలువింటూ గావ్రిలోవ్ పోలిష్ సరిహద్దువేపు చూసేడు. ఎక్కడన్నా ఏపోలీసువాడన్నా కూర్చుని ఆ వుపన్యాసాన్ని వ్రాసుకొంటున్నాడేమోనని ఆతని యనుమానం. కాని, అటువంటి వాళ్ళెవ్వరూ కనబడలేదు. వాగుగట్టు ఆవలఅంతా నిర్జనంగావుంది. వంతెనపక్కవుండే సెంట్రీనికూడా వాళ్ళు తీసేసేరు.

"బతికేం. ఈవేళ వుపన్యాసాలమీద విదేశాంగ శాఖకు అసమ్మతిలేఖ రాదన్నమాటే"

ఆ మాటతోచి ఆతడు చిరునవ్వు నవ్వుకొన్నాడు.

*　　　*　　　*

ఒకరోజున రాత్రి మంచివర్షం కురుస్తున్న వేళ అంతోన్యూక్ బందిపోటుమూక గొడవ నిర్మూలమైపోయింది. మైదాన్ - విల్లాలోని ఒక ధనిక జర్మన్ భూస్వామి యింటి పెళ్ళికి అంతోన్యూక్ తన అనుచరవర్గంతోసహా హాజరయ్యేడు. విందులో ఆతడూ అతిథిగా పాల్గొన్నాడు. ఆవార్త ఖ్రోలిన్‌స్కీ గ్రామానికిచెందిన రైతాంగానికి అందింది.

పెళ్ళికి బందిపోటుదొంగలు వచ్చేరన్న విషయం అక్కడి ఆడవాళ్ళనోట అల్లా అల్లా పాకిపోయింది. వెంటనే

ఆ గ్రామంలోని కామ్సోమోల్ సభ్యులు పన్నెండుమంది చేతికి అందిన ఆయుధమల్లా తీసుకొని బండిలో మైదాన్ - విల్లాకు బయలుదేరేరు. బయలుదేరేముందు సహాయంకోసం వార్తాహరుణ్ణి బెరెజ్గోవ్కు పంపించేరు. సెమాకీవద్ద ఫిలాటోవ్ దళం కనబడేసరికి ఆ వార్తాహరుడు వెంటనే ఆ వార్తను వాళ్ళచెవిని వేసేడు. ఆ వార్తవినగానే ఫిలాటోవ్ ఎకాయెకీని మైదాన్ - విల్లాకు బయలుదేరేడు.

ఈలోపున క్రోలిన్స్కీ కామ్సోమోల్స్ని మైదాన్ విల్లాకు చేరుకున్నారు. పెళ్ళి జరుగుతున్న ఇంటిసమీపంలో అంతోన్యూక్ దళం మకాంచేసింది. ఆ యింటిని చుట్టుముట్టి కాల్పులు ప్రారంభించేరు. బందిపోట్లు ఇంట్లో గోడలవెనక రక్షణలు తీసుకొని ఆ చుట్టుప్రక్కలకు వచ్చినవాళ్ళందరి మీందా కాల్పులు సాగించేరు. వారు ఆయింట్లోంచి బయట పడడానికి ఎన్నోమార్లు ప్రయత్నించేరు. కాని, కామ్సోమోల్స్ ఆ ప్రయత్నాన్ని సాగనివ్వలేదు. అంతోన్యూక్కు ఇల్లాంటిచిక్కు లిదివరకు అనుభవమే. అన్నిమార్లూ చేతి బాంబులూ, మరతుపాకలూంతో గండికొట్టుకొని బయటపడి పోగలిగేడు. ఈ మారుకూడా అతడు తప్పించుకుపోగలిగే వాడేమో. క్రోలిన్స్కీ దళంలో అప్పుడే ఇద్దరు చచ్చి పోయేరు. కటికచీకటి. కాని మంచిసమయంలో ఫిలాటోవ్ దళం వచ్చిపడింది. తనరోజులు చెల్లిపోయేయని అంతోన్యూక్ గ్రహించేడు. లొంగడానికిబదులు చేతికివచ్చినట్లల్లా కాల్పులు సాగించేడు. తెల్లవారేముందు ఫిలాటోవ్ ఆ

యింటివిని పట్టుకోగలిగేడు. దొంగలు ఏడుగురూ చచ్చేరే గాని, ఒక్కడూ లొంగలేదు. ఈ ముఠాని నిర్మూలించడానికి ఆరోజున నాలుగు ప్రాణాలు బలిఅయిపోయేయి. వాళ్ళల్లో ముగ్గురు క్రోలిన్‌స్కీ యువకులే.

*        *        *

ప్రాంతీయ సైన్యదళాలు ఆకురాలు కాలంలో నిర్వహించదలచిన మూకయుద్ధాలలో పాల్గొనేటందుకై కోర్చాగిన్ బెటాలియన్‌కుకూడా ఆహ్వానం వచ్చింది. ఒకరోజున హోరున వర్షం కురుస్తూంటే బెటాలియన్ బయలుదేరింది. ప్రాంతీయ కేంద్రకార్యాలయం అక్కడికి నలభై కిలోమీటర్లుంది. ఈ దూరంఅంతా వారు ఒక్కరోజులో నడిచేరు. తెల్లవారేముందు బయలుదేరి, ఓ రాత్రివేళకు చేరుకున్నారు. బెటాలియన్ కమేండరు గుసేవ్రూ ఆయన కమిస్సారూ గుర్రాలమీద వచ్చేరు. ఆ దూరం నడిచేసరికి బెటాలియన్ లోని ఎనిమిదివందలమందీ బాగా అలసిపోయేరు. వస్తూనే బారకాసుల్లోపడి నిద్రపోయేరు. మరునాటి వుదయమే మూకయుద్ధాలు ప్రారంభమవుతాయి. ప్రాంతీయ సైన్యం ప్రధాన కార్యాలయంవారు బెటాలియన్‌కు కబురంపేసరికే ఆలస్యమయిపోయింది.

ప్రొద్దుట పరిశీలనకోసం బెటాలియన్‌ను బారులుతీర్చి నిలబెట్టేసరికి దాని స్వరూపమే మారిపోయింది. యూనిఫారాలు, సరికొత్త ఆయుధాలలో వారంతా గుర్తుపట్టలేనంతగా మారిపోయేరు. ఈ బెటాలియన్‌కు మంచి శిక్షణ నిచ్చే

టండాకై గుసేవ్రా, కోర్చాగినూ చాలా శ్రమ పడ్డారు. తమ శ్రమ విఫలంకాలేదనీ, తమ బలగం పరీక్షకు నిలబడగలదనీ వారిద్దరకూ మంచి విశ్వాసమేవుంది. అధికారుల పరిశీలన ముగిసింది. తర్వాత మైదానంలో బెటాలియన్ నేర్పు ప్రదర్శించబడి మెప్పొందింది. అంతా అయినాక కమేండర్లలో ఒకడు [illegible] కోర్చాగిన్‌ను చూసి గుసగుస లా:

"గుర్రమెక్కేవేం? బెటాలియన్ కమేండర్లూ, కమిస్సార్లూ గుర్రాలమీద వుండే అధికారం లేదు. కజేళ్లలో గుర్రాన్ని వప్పచెప్పేసి కాలినడకన మూకయుద్ధాలలో వచ్చి పాల్గో."

గుర్రం దిగితే తానా మూకయుద్ధాలలో పాల్గొనలేనని కోర్చాగిన్ ఎరుగును. ఆ కాళ్ళవాపుతో ఒక్క కిలోమీటరు దూరంకూడా నడవలేడు. పటకాలు వ్రేలవేసుకొన్న ఈ డబ్బాగాడికి ఆ విషయం చెప్పడం ఎల్లాగ?

"కాలినడకన మూకయుద్ధాలలో పాల్గోలేను."

"ఏం?"

సమాధానం ఇవ్వాలి. తప్పనిసరిఅయి కోర్చాగిన్ నెమ్మదిగా తనస్థితి చెప్పేడు.

"నా కాళ్ళు వాచేయి ఓ వారంరోజులుపాటు నడవడమూ, పరుగులెత్తడమూ నాకు సాధ్యంకాదు. కాని, మీరెవరో తెలుసుకోవచ్చునా, కా। మేడ్!

"మీ రెజిమెంటుకు సంబంధించిన సైన్యాధికారి వర్గానికి అధ్యక్షుణ్ణి నేను. తెలిసిందా? గుర్రందిగమని మళ్ళీ చెప్తున్నా. అవధ్యుడివైతే సైన్యాలలోకి రాకూడదు."

పావెల్ కొరడాతో మొగానకొట్టినంత బాధపడ్డాడు. కోపంతో వణికిపోయేడు. కాని, గుసేవ్ ఆతని చేయి గట్టిగా అదిమిపెట్టేడు. ఒక్క క్షణకాలం అభిమానమూ, ఆత్మ సంయమనం మధ్య ఆతనిమనస్సు కొట్టుమిట్టాడిపోయింది. కాని తనమాట సాగలేదని ఒక సైన్యదళంలోంచి మరో సైన్యదళంలోకి మారిన రెడార్మీసైనికుడు కాదిప్పుడు. తానో బెటాలియన్ కమిస్సారు. తనవెనకనే తాను శిక్షణ నిచ్చిన బెటాలియన్ నిలబడివుంది. పై అధికారి ఆదేశాన్ని తాను ధిక్కరించడం వాళ్ళకెంత అలుసుచిక్కుతుంది! మాట్లాడకుండా గుర్రాన్ని దిగేడు. బాధను అణచుకొనే టందుకు పళ్ళుబిగించి బెటాలియన్ కుడిపక్క నడిచేడు.

* * *

చాలరోజులపాటు వాతావరణం చాలబాగుంది. మూక యుద్ధాలు ముగిసిపోవచ్చేయి. అయిదోరోజున సైన్యాలు పెపెటోవ్కా సమీపానికి వచ్చేయి. అక్కడే మూకయుద్ధాలు ముగుస్తాయి. క్లిమెన్‌టోవిచీ గ్రామంనుంచి బయలుదేరి రైలుస్టేషన్ పట్టుకొనేబాధ్యతను బెరెజ్డోవ్ బెటాలియన్‌కు వప్పచెప్పేరు.

కోర్చాగిన్‌కు ఆ ప్రాంతమంతా కొట్టినపిండి. స్టేష నుకు ఏదారినివెడితే సులభంగా చేరుకోవచ్చునో ఆతడు

గుసేవ్‌కు చెప్పేడు. బెటాలియన్ రెండుభాగాలుగా చీలింది. రెండుభాగాలుగా చెరో దిశగా, ఎంతోదూరం చుట్టుతిరిగి వచ్చి వెనుకవైపునుంచి స్టేషన్‌లో జొరబడ్డారు. ఆ ఎత్తుగడ నంతా అభినందించేరు. బెరెజ్జోవ్ బెటాలియన్ స్టేషన్‌లో తిష్ఠవేసింది. అంతవరకూ స్టేషన్‌ను కాపాడుతున్న పటాలం సగం జనాన్ని కోల్పోయినట్లు నిర్ధారణచేసేరు. ఆ పటాలం స్టేషనుకు ఎదురుగావున్న అడవుల్లోకి తప్పుకొంది.

బెటాలియన్ రెండుభాగాలలోనూ ఒకటి కోర్చాగిన్ అధీనంలోవుంది. ఆతడు స్టేషన్ చేరగానే తన సైన్యదళం ఎక్కడెక్కడ నిలవబడాలో ఆదేశించేడు. మూడోకంపెనీ కమేండర్‌తోనూ, రాజకీయబోధకుడితోనూ మాట్లాడుతూ వీధిలో నిలబడివుండగా ఒక ఎర్రసైనికుడు పరుగెత్తివచ్చేడు.

"రైల్వే క్రాసింగులవద్ద మరతుపాకుల్ని కాపలా పెట్టేరో లేదో కమేండరు కనుక్కోమన్నారు. పరిశీలనసంఘం వస్తూంది."

పావెలూ, ఆతనితోవున్న కమేండర్లు ఒకక్రాసింగ్ వద్దకు వెళ్ళేరు. రెజిమెంటల్‌కమేండరూ, ఆయన అంగరక్షకులూ అప్పటికే అక్కడున్నారు. విజయవంతంగా దాడి జరిపినందుకు ఆయన గుసేవ్‌ను కొనియాడేరు. ఓడిపోయిన బెటాలియన్ ప్రతినిధులుకూడా అక్కడేవున్నారు. తమ స్థితిని సమర్థించుకొనేటందుకు వారొక్కమాటకూడా ఆడలేదు. తలలువంచుకుని నిలబడ్డారు.

గుసేవ్ వినయంగా సమాధానం ఇచ్చేడు.

"ఈగొప్ప నాదికాదు. కోర్చాగిన్ దారిచూపించేడు. ఆత డీ ప్రాంతాలవాడే."

సైన్యాధికారి వర్గాధ్యక్షుడు పావెల్ కేసి తిరిగి అప హాస్యమాడేడు.

"అయితే, నువ్వు బాగా పరుగెత్తగలవన్నమాట. గొప్పకోసం గుర్రమెక్కేవన్నమాట. అంతేనా?"

ఇంకా ఏదో అనబోయేడుగాని, కోర్చాగిన్ ముఖం చూసేక మరి నోరు పెగలలేదు.

ఉన్నతాధికారులు వెళ్ళిపోయేక పావెల్, గుసేవ్‌ను పిలిచేడు.

"అతడి పేరేమిటో చెప్పగలవా?"

గుసేవ్ అతని భుజం తట్టేడు.

"ఆ వడుమంత్రంగాడిని గురించి బాధపడకు. అతడి పేరు చుజానిన్. ఒకప్పుడు ఎన్‌సైన్‌గా వుండేవాడు అని జ్ఞాపకం."

ఆ పేరు ఎక్కడో విన్నట్లుంది గాని ఎక్కడవిన్నాడో ఎంతకొట్టుకొన్నా కోర్చాగిన్‌కు జ్ఞాపకంరాలేదు.

*　　　*　　　*

మూకయుద్ధాలు ముగిసేయి. బెటాలియన్‌ను అధికారులు చాల మెచ్చుకున్నారు. అది బెరెజ్డోవ్ తిరిగి వచ్చేసింది. కోర్చాగిన్ జబ్బుగావున్న తల్లిని చూడ్డానికి రెండు మూడురోజులు షెపెటోవ్కాలో ఆగేడు. ఆ రెండురోజు

ల్లోనూ రోజూ పన్నెండుగంటలపాటు ఏకబిగిని ఒళ్ళెరక్కుండా నిద్రపోయేడు. మూడోరోజున ఆర్టెమ్‌ను చూడటానికై రైల్వేయార్డులకు వెళ్ళేడు. పొగచూరి, నల్లగావున్న ఆ భవనంవద్దకు పోయేసరికి అతనిప్రాణం లేచివచ్చింది. బొగ్గు పొగ పీలుస్తూంటే ఎంతో సంతృప్తి అనిపించింది. ఆతని కిష్టమైనచోటు అది. తన కత్యంత ప్రియమైన దేదో కోల్పోయి నట్లు ఆతడు ఎంతో బాధపడ్డాడు. రైలుకూత విని ఎన్నో నెలలయిపోయినట్లు అనిపించింది. ఓడసరంగు చిరకాలం ఇంటివద్ద వుండిపోయినప్పుడు సముద్రంమీద ప్రయాణం కోసం సతమతమైపోయినట్లు ఆతడు తాను బొగ్గువేసిన రోజులూ, ఎలక్ట్రిషియనుగా పనిచేసినరోజులూ తలుచుకొని నిట్టూర్పులు విడిచేడు ఆ ఆలోచనలనుంచి ఎంతోసేపటికి గాని తేరుకోలేకపోయేడు. ఆర్టెమ్ ఇప్పుడు ఫోర్జివద్ద పనిచేస్తు న్నాడు. ఆతనితోకూడ పావెల్ లెక్కపెట్టినట్లు మాట్లాడేడు. ఆర్టెమ్ నుదుట ముడతలు కనిపిస్తున్నాయి. ఆతని కిప్పు డిద్దరు పిల్లలు. బాగా ఇబ్బందులు పడుతున్నట్లు ఆ మొగమే చెప్తూంది. కాని, ఆతడేమీ పైకి తేలలేదు.

ఒక గంటసేపు ఇద్దరూ ఒకరిప్రక్క నొకరు కూర్చుని ఏవేవో పనులు చేసేరు. తర్వాత విడిపోయేరు.

రైల్వేక్రాసింగ్‌వద్ద పావెల్ గుర్రాన్ని నిలబెట్టేడు. చాలసేపు స్టేషనువేపు చూస్తూ అక్కడే నిలబడ్డాడు. ఒక్క నిముషంపోయేక గుర్రాన్ని ఒక్క టేసేడు. అది రోడ్డువెంబడే అడవుల్లోంచి గాలప్‌తీసింది.

అడవిలో వెళ్ళడాని కిప్పుడేం భయపడనక్కర్లేదు. బోల్షివిక్కులు పెద్ద బందిపోటుదొంగల్నీ, చిన్నచిన్న కన్నగాళ్ళనీ అణచివేసేరు. చుట్టుప్రక్కల గ్రామాలప్రజ లిప్పుడు గుండెలమీద చెయ్యివేసుకొని సుఖంగా నిద్రపోగలుగుతున్నారు.

ఒకరోజు మధ్యాహ్నం పొద్దు వాటాలినవేళకు పావెల్ బెరెజ్దోవ్ చేరుకున్నాడు. లిడాపోలెవ్యూఖ్ పరుగెత్తివచ్చి జిల్లాకమిటీ ఆఫీసు ముందు ఆతనికి స్వాగతం ఇచ్చింది.

ఆమె ఆతని భుజంమీద చేయివేసి లోపలికి తీసుకెళ్ళింది.

"నీవు లేకపోతే తోచడంలేదు."

కోటు విప్పి చేతులోకి తీసుకొంటూ పావెల్ ప్రశ్నించేడు.

"రజ్వాలిఖిన్ ఏడీ?"

అయిష్టంగానే లిడా సమాధానం యిచ్చింది.

"నాకు తెలియదు... ...అన్నట్లు మరిచేను. జ్ఞాపకం వచ్చింది. నీబదులుగా సోషియాలజీమీద పాఠం తాను చెప్తానంటూ పొద్దుటే అన్నాడు. ఆ విషయం తనదేగాని నీది కాదు అన్నాడు."

పావెల్ కిది ఆశ్చర్యమూ, అయిష్టమూకూడా కలిగించింది. ఆతనికి మొదటినుంచీ రజ్వాలిఖిన్‌మీద ఏదో అసంతృప్తివుంది విసుక్కున్నాడు.

"స్కూలులో ఏంగొడవలు తెచ్చిపెడతాడో... ..."

"ఏమీా ఫర్వాలేదులే. సరేకాని, ఏమిటీ సంగతులు? గ్రుషేవ్కాకుగాని వెళ్ళేవా? అక్కడివాళ్ళు ఏమంటు న్నారు?"

కీళ్ళు సలుపుతూంటే సోఫామీాద పడుచుకుపడుకొని పావెల్ ఆమెచెప్పిన కబుర్లన్నీ విన్నాడు.

"మొన్న రకిటినాను పార్టీ సభ్యురాలుగా తీసుకొన్నారు. ఆమెకూడా రావడంతో మన పోదుబ్ స్కీ-సెల్లు మంచి బలంగా తయారయింది. రకిటినా చాల మంచిఅమ్మాయి. ఆమెఅంటే నాకెంతో ఇష్టం. ఉపాధ్యాయులుకూడా మన వేపు చేరుతున్నారు. కొందరప్పుడే చేరిపోయేరు."

* * *

పార్టీ జిల్లాకమిటీకి కొత్తగా కార్యదర్శిగావచ్చిన లుచి కోవ్నా, కోర్చాగినూ తరుచుగా సాయంకాలాలప్పుడు లిసి ట్సిన్ ఇంటివద్దకలుసుకొంటున్నారు. టేబిల్ దగ్గరగా కుర్చీలు లాక్కొని ఇంచుమించు తెల్లవారేవరకూ ముగ్గురూ కలిసి చదువుతున్నారు.

వారు చదువుకొనే గదికి ఆనుకొని పడకగది వుంది. లిసిట్సిన్ భార్యా, చెల్లెలూ ఆ గదిలో పడుకొంటారు. తమ చదువువలన వారికి నిద్రాభంగం కలుగకుండేటందుకని రెండు గదులమధ్యవున్న తలుపు బిగించేస్తారు. ఇంక ఎంత సేపు కూర్చున్నా ఫర్వాలేదు. ముగ్గురూ ఏదో పుస్తకంపుచ్చు కొని సన్నగా చదువుకొంటారు. లిసిట్సిన్ కు చదువుకోవా

లంటే రాత్రితప్ప మరోవ్యవధిలేదు. అయినా పావెల్ ఫ్రూల్లు తిరిగి వచ్చేసరికి మిగిలినవాళ్ళిద్దరూ చాలదూరం చదువుకు పోయేవారు. తాను వారిని కలుసుకోనేటందుకు ఆతడెంతో ఆతురతపడేవాడు.

*　　　　*　　　　*

ఒకరోజున రాత్రివేళ ఎవరో గ్రిష్కటాక్ ఖోరోషో డాక్‌ను చంపి పారవేసినట్లు పోదుబ్‌స్కీ కభురువచ్చింది. పావెల్ హడావిడిగా గుర్రాలసాలకు పరుగెత్తేడు. మోకాళ్ళ బాధనుకూడా లెక్కచేయలేదు. గుర్రంమీదపడి సరిహద్దుల దిశగా దాడుతీసేడు.

గ్రామసోవియట్ కార్యాలయంవున్న కుటీరంలో ఒక బల్లమీద స్ప్రూస్ చెట్టు రెమ్మలుపరిచి గ్రిష్కట్కా శరీరాన్ని వుంచేరు. శవంమీద ఎర్రజెండాకప్పేరు. సరిహద్దు కాపలా దారు ఒకడూ, కామ్‌సోమాల్ ఒకడూ గుమ్మంలో కాపలా వున్నారు. అధికారులు వచ్చేవరకూ వాళ్ళెవరినీ లోనకు అడుగుపెట్టనివ్వడంలేదు. కోర్చాగిన్ కుటీరంలో అడుగు పెట్టేడు. శవం ముఖంమీది గుడ్డతొలగించేడు.

శవం ముఖం తెల్లగా మైనంముద్దలావుంది. మరణ బాధతో కవళికలన్నీ వికృతంగావున్నాయి. తల ఒకవైపుగా ఒరిగివుంది. సన్నని ఆయుధంతో కొట్టేరుకాబోలు తలమీద లోతైన గాయం కనబడుతూంది.

ఆ యువకుడి ప్రాణాలు తీసినవాళ్ళెవరో? తల్లికాత డొక్కడే బిడ్డడు. తండ్రి మిల్లులో పనిచేసేవాడు. తర్వాత

బీదరైతుకమిటీకి సభ్యుడయ్యేడు. విప్లవకాలంలో యుద్ధంలో చచ్చిపోయేడు. ఆనాటినుంచీ తల్లి తన ఏకపుత్రుడిమీద ప్రాణంపెట్టుకుని జీవిస్తూంది.

కొడుకు చచ్చిపోయినవార్త విన్నాక ఆమె మరి లేవ లేదు. ఇరుగుపొరుగులు ఆమెను పరామర్శించడానికై సతమత మవుతున్నారు. అక్కడ కుటీరంలో కొడుకు నిర్జీవంగా పడి వున్నాడు. తనను కొట్టింది ఎవరోకూడా చెప్పలేదు.

గ్రిషుట్కాను చంపినవార్తతో గ్రామం అంతా అట్టుడికినట్లయిపోయింది. కామ్‌సోమాల్ నాయకుడుగా, బీద రైతుల ప్రయోజనాల రక్షకుడుగా అతడు గ్రామంలో చాల మందికి ప్రేమపాత్రుడయ్యేడు.

ఆ వార్త విని ఫెకిటినా ఏడుస్తూ కూర్చుంది. కోర్చాగిన్ గదిలోకి వచ్చినప్పుడుకూడా ఆమె తలఎత్తలేదు.

ఆతడామె ప్రక్కనేవున్న కుర్చీలో చదికిలబడ్డాడు.

"ఫెకిటినా! ఇతనిని చంపింది ఎవరంటావు?"

"మిల్లువాళ్ళే అయివుంటారు. దొంగవ్యాపారులకి పక్కబల్లెంలా వున్నాడేమో, వాళ్ళే చంపేసివుంటారు."

* * *

ఖోరోవోద్లో అంత్యక్రియలకి రెండు గ్రామాలవాళ్లు హాజరయ్యేరు. కోర్చాగిన్ తన బెటాలియన్‌ను తీసుకొచ్చేడు. తమ కామ్రేడ్‌కు ఆఖరివీడ్కోలు నిచ్చేటందుకై కామ్‌సోమాల్‌లు అందరూ వచ్చేరు. గావ్రిలోవ్ రెండువందల

యొభయిమంది సరిహద్దు రక్షకుల్ని తీసుకుని గ్రామంమధ్యనున్న చౌకలో హాజరయ్యేరు. మిలిటరీ బ్యాండు చరమగీతాల నాలాపిస్తూంటే, ఎర్రజెండాలు కప్పిన గ్రిషుట్కాశవపేటికను చౌకలోకి తీసుకొచ్చేరు. అంతర్యుద్ధకాలంలో వీరమరణం పొందిన యోధుల సమాధులప్రక్కనే సమాధి తీసేరు. శవపేటికను దానిలో సమాధిచేసేరు.

గ్రిషుట్కా మరణంతో గ్రామంలోని బీదప్రజ ఏకమయ్యేరు. వ్యవసాయ కూలీలూ, బీదరైతులూ కామ్సోమాల్ను బలపరుస్తామని ప్రతిజ్ఞలుచేసేరు. సమాధివద్ద జరిగిన సభలో చాలమంది వుపన్యసించేరు. అందరూకూడ హంతకుల్నిపట్టి శిక్షించాలనే వ్యగ్రతను ప్రదర్శించేరు. వారిని లాక్కునివచ్చి గ్రిషుట్కా సమాధివద్దనే విచారణ జరిపి శిక్షించాలన్నారు.

మూడుమార్లు తుపాకులు గర్జించేయి. అప్పుడే విరుచుకువచ్చిన స్ప్రూస్కొమ్మలు సమాధిమీద పరిచేరు. ఆ రోజునే సాయంకాలం కామ్సోమాల్ సెల్లుసమావేశంఅయి రకిటినాను కొత్తకార్యదర్శిగా ఎన్నుకొంది. గూఢచారిదళం సరిహద్దుశాఖనుంచి కోర్చాగిన్కు కబురందింది. హంతకుల జాడలు దొరికేయి !

ఒకవారం పోయేక జిల్లాసోవియట్ల రెండో మహాసభ పట్టణంలోని సినీమాహాలులో జరిగింది. దానిలో లిసిట్సిన్ వుపన్యసించేడు.

"కామ్రేడ్స్! గతసంవత్సరం ఈ జిల్లాలో మనం చాలాపనిచేయగలిగేం. జిల్లాలో సోవియట్పాలన దృఢ

పడింది. బందెపోట్లని నిర్మూలించేం. రహస్య వర్తకుల్ని తుడిచిపెట్టేసేం. పల్లెల్లో బీదరైతుల సంఘాలు ఏర్పడ్డాయి. ఏడాది క్రితంకంటే ఈవేళ కామ్‌సోమాల్ సంస్థ పదింతలు బలంగావుంది. పార్టీ నిర్మాణం వ్యాపించింది. ఈమధ్యనే పోదుబ్‌స్కీలో కులక్‌లు కామ్రేడ్ ఖోరోవోన్కోను చంపేసేరు. మిల్లుయజమానీ, ఆతని అల్లుడూ ఈ హత్యచేసేరని బయటపడింది. వాళ్ళని అరెస్టుచేసేరు. కొద్దిరోజుల్లో గుబెర్నియా కోర్టులో విచారిస్తారు. హంతకులకు మరణశిక్ష విధించాలని కోరుతూ అనేక గ్రామాలనుంచి వచ్చిన ప్రతినిధులు మహాసభకు తీర్మానాలు పంపేరు."

సభలో హర్షధ్వనులు చెలరేగేయి.

"సోవియట్ ప్రభుత్వ శత్రువులు... ...ముర్దాబాద్."

లిడా పోలెవూఖ్ ఒక గుమ్మంవద్దకువచ్చి వేదికపైనున్న పావెల్‌ను సంజ్ఞచేసి పిలిచింది.

బయటకు రాగానే ఆమె ఒక కవరు నాతని కందించింది. దానిపై 'అర్జంటు' అని వ్రాసివుంది. చింపేడు.

"కామ్‌సోమాల్ బెరెజ్డోవ్ జిల్లాకమిటీకి.

జిల్లాపార్టీకి ఒక ప్రతి పంపడంఅయింది... ...

కామ్రేడ్ కోర్చాగిన్‌ను జిల్లానుంచి రప్పించి గుబెర్నియాకమిటీలో కామ్‌సోమాల్ సంస్థల బాధ్యతలను వప్పచెప్పాలని గుబెర్నియాకమిటీ తీర్మానించింది."

గతసంవత్సరం అంతా తాను పనిచేసిన జిల్లానుంచి పావెల్ సెలవుతీసుకొన్నాడు. ఆతడు వెళ్ళిపోయేముందు

పార్టీ జిల్లాకమిటీ సమావేశం జరిగింది. ఆ సమావేశంలో చర్చనీయాంశాలు రెండే. (1) కామ్రేడ్ కోర్చాగిన్‌కు పార్టీసభ్యత్వం ఇవ్వడం, (2) కామ్‌సోమాల్ జిల్లాకమిటీ కార్యదర్శిపదవినుంచి ఆయనను విడుదలచేసినట్లు పత్రాన్ని ఆమోదించడం.

పావెల్‌ను లిసిట్సిన్, లిడాలు విడువలేక విడిచేరు. కరచాలనం చేసేరు. కౌగలించుకొన్నారు. ఆత డెక్కిన గుర్రం వాళ్ళ వాకిట్లోంచి రోడ్డుమీది కెక్కుతున్నప్పుడు వీడ్కోలునిస్తూ ఒక డజన్ రివాల్వర్లు నినదించేయి.

# ప్రకరణం 5

వెహౌటాన్లు లాగలేక గుర్రుగుర్రుమంటూంటే అతి కష్టంగా ట్రామ్‌కారు ఫుంమున్లయేవ్ గుట్ట ఎక్కింది. ఓపెరా భవనంవద్ద దాంట్లోంచి చాలమంది యువకులు దిగిపోయేరు. తర్వాత అది ముందుకుపోయింది.

"ఇప్పటికే ఆలస్యమైంది. నడవండి చూస్తారేం?"– అని పాంక్రాటోవ్ తోడివాళ్ళని తొందరచేసేడు.

నాటకశాల గుమ్మంలో ఓకునేవ్ వాళ్ళని కలుసుకున్నాడు.

"జెంకా! మూడేళ్ళక్రితం మనం యిక్కడికి వచ్చినప్పుడుకూడా ఇవే పరిస్థితులు. జ్ఞాపకంవుందా? ఆనాడు 'కార్మిక ప్రతిఘటన' సంఘంఅంటూ దుబావా వచ్చేడు. పెద్ద సభజరిగింది. మళ్ళీ ఈవేళరాత్రి వాడితో కుస్తీ పట్టవలసివస్తుంది."

గుమ్మంలో ప్యాసులు చూపించి అందరూ హాలులో అడుగుపెట్టేరు.

"అదేచోట, అదేచరిత్ర పునరావృత్తం అవుతూంది." అన్నాడు ఓకునేవ్‌కు సమాధానంగా పాంక్రాటోవ్.

నాలుగుమూలలనుంచి "ఉశ్ ! ఉశ్ !" మని విన బడడంతోనే ఆ మిత్రవర్గం మాటలు కట్టిపెట్టేరు. అప్పటి కప్పుడే మహాసభ సాయంకాల సమావేశం ప్రారంభమైంది. కనక వారంతా ఎవరికిదగ్గరగా ఏసీటువుంటే దాంట్లో చది కిలబడ్డారు. వాళ్ళు వెళ్ళేసరికి ఒకయువతి వేదికమీద ఉప న్యాసం ఇస్తూంది.

"వేళకొచ్చాం. ఆవిడ చెప్తూంది, విను"—అంటూ పాంక్రాటోవ్ చిన్నగా అంటూ పక్కనున్న ఓకునేవ్‌ను పొడిచేడు.

"... ... ఈవిషయాన్ని చర్చించడానికై మనం చాల కాలం వ్యయపరిచేం. ఎంతో ఓపికగా చర్చించేంకూడాను. ఈ చర్చలో మనకు చాలసంగతులు తెలిసివచ్చేయి. మన నిర్ణాణంలో ట్రాట్‌స్కీ అనుచరులకు ఓటమి సిద్ధించింది. అది చాల సంతోషకరం. మా మాట నెవ్వరూ విననైనా లేదని వారు చెప్పలేదు. వారికి తమ అభిప్రాయాలు చెప్ప డానికి పూర్తిఅవకాశం ఇచ్చేం. నిజంచెప్పాలంటే వారికి మనం కలిగించిన అవకాశాల్ని దుర్వినియోగం చేసేరు. అనేకవిధాల పార్టీశిక్షణను మీరి ప్రవర్తించేరు."

తాల్యా మంచి వుద్రేకంలో మాట్లాడుతూంది. కళ్ళ మీదికి పడుతున్న జుట్టును మాటిమాటికీ వెనక్కు తోయ డంలోనే ఆమె వుద్రేగం కనబడుతూంది.

"జిల్లాలనుంచి వచ్చిన కామ్రేడ్స్ చాలమంది ఇక్కడ మాట్లాడేరు. ట్రాట్‌స్కీవాదులు అనుసరిస్తున్న పద్ధతులు

ఏలావుంటున్నారో వాళ్ళందరూ చెప్పేరు. సిటీపార్టీ మహా సభలో వారు తమ అభిప్రాయాన్ని చెప్పుకోనేటందుకు అవకాశం కలిగించాలనే అభిప్రాయంతోనే జిల్లాసంఘాలు వారి నిక్కడికి బుద్ధిపూర్వకంగా పంపించేయి. ఆ అవకాశాన్ని వారు పూర్తిగా వుపయోగించుకోలేకపోతే ఆ లోపం మనది కాదు. జిల్లాల్లోనూ తిరిగి సమర్థించేరుగాని లేకపోవడంతో కొంత జ్ఞానోదయం అయిందేమోమరి. సభలో ఒక్కరూ లేవడంలేదు. నిన్నటి వాదనలు ఈవేళ రావడం లేదు."

కుడివేపు మూలలోంచి కఠోరస్వరం వినిపించింది.

"మే మింకా చెప్పవలసింది చాలావుంది."

తాల్యా ఆ ధ్వని వినవచ్చినవేపు చూసింది.

"అల్లాగే, దుబావా! రా, మాట్లాడు. వింటాం."

దుబావా ఆమెవంక కోరకొరా చూసేడు.

"సమయంవచ్చినప్పుడు మాట్లాడుతానులే."

తన స్వంతజిల్లాలోనే మొన్నటిరోజున తనకు కలిగిన పరాభవం గుర్తువచ్చి అతని మనస్సు మెరమెరలాడింది.

సభలో గుసగుసలు వినిపించేయి. ఉండబట్టలేక పాంక్రాటోవ్ ఒక్కకేక పెట్టేడు.

"పార్టీని ఇంకోవూపు వూపుదామనుకుంటున్నావేం?"

దుబావా ఆ కంఠస్వరాన్ని గుర్తుపట్టేడు. కాని, వెను తిరిగిచూడలేదు. పెదవులు కరుచుకొని, తలవంచుకున్నాడు.

తాల్యా మళ్ళీ ప్రారంభించింది.

"ట్రాట్‌స్కీ-వాదులు పార్టీ శిక్షణను ఎలా ధిక్కరిస్తున్నారో దుబావా వ్యవహరించూస్తే చాలు అర్థం అవుతుంది. కామ్‌సోమోల్ సంస్థలో ఆతడు చాలకాలంవున్నాడు. మనలో చాలామందికి ఆతను తెలుసు. ముఖ్యంగా ఆయుధాల ఫ్యాక్టరీలో పనిచేసేవాళ్ళకి బాగా తెలుసు. ఆతడు ఖార్కోవ్ కమ్యూనిస్టు విశ్వవిద్యాలయంలో చదువుతున్నాడు. అయినా మూడువారాలుగా ఆతనిక్కడే షుమ్‌స్కీతో కాలక్షేపం చేస్తున్నాడు. యూనివర్శిటీలో పాఠాలు జరుగుతున్న కాలంలో వాళ్ళేపనిమీాదవచ్చేరు? పట్టణంలోని ప్రతిపేటలోనూ వాళ్ళు సభలుపెట్టేరు. కొద్దిరోజులనుంచి షుమ్‌స్కీ తిక్కతిరిగినట్లు తోస్తూంది. వీళ్ళ నిక్కడికి పంపిందెవరు? వీళ్ళకితోడు ఇతర సంస్థలనుంచి అనేకమంది ట్రాట్‌స్కీ వాదులు వచ్చిచేరేరు. వాళ్ళంతా ఏదో ఒకప్పుడు ఇక్కడ పనిచేసినవాళ్ళే. వారంతా ఇక్కడ పార్టీలో గంద్రగోళం పుట్టించాలని వచ్చేరు. వీళ్ళంతా ఎక్కడున్నారో, ఏంచేస్తున్నారో వాళ్ళు సభ్యులుగావున్న పార్టీశాఖలకు తెలుసునా? తెలియదనే నా వుద్దేశం."

ట్రాట్‌స్కీ-వాదులు ముందుకువచ్చి తమ పొరపాట్ల నంగీకరిస్తారని సభవారు ఆశించేరు. వారువచ్చి తమ తప్పు పంథాను ఒప్పుకోవలసిందంటూ తాల్యా విజ్ఞప్తి చేసింది. వాళ్ళువస్తారనే ఆమె ఆశ. ముఖాముఖీ మాట్లాడుకుంటున్నట్లే ఆమె వారికి విజ్ఞప్తి చేసింది.

“మహేశ్వరిగారి ప్రత్యేక ప్రశ్నకు సమాధానంటూ మహాశయా ఈ నాటకశాలలో ఏనాడైనా చెప్పి వచ్చేను. జ్ఞాపకం వుందా? అనాటకతో చెప్పి ... “మాత్రిక త్రాక నెన్నడూ క్రిందకెళ్ళను.” కాని, మహేశ్వరిగారొచ్చిన ఆపను చేసిన దేమిటి? సూభామీ నేడు ప్రశ్నిస్తా మహాత్మా పార్టీపతాకను చేలజారేసేరు. ఇంకా ఏదో చెప్పాలిసిఉన్నదట. దాని అర్థం ఏమిటి? ఆతడూ, అనుచరులూ ఇంతవరకు చేసిన దాంతో తృప్తిపడలేకున్నారా, ఇంకా కరవాలు మిగిలిందన్నమాట.”

సభలో వెనకనున్నవారెవరో కేకవేసేరు :

“తన్మానుకన్నీ ఆ పెరామాటకు సంగతేమిటో చెప్పనీండి, వాళ్ళ వాదానికవకాశమునివ్వక ఆశిద్దు.”

నాలుగువేపులనుంచీ చిరాకుపడడం వినబడింది.

“ఇప్పుడా వేళాకోళాలు?”

“పార్టీమీద యుద్ధంమానుతారో లేదో స్పష్టంగా అడగండి.”

“పార్టీ వ్యతిరేక ప్రకటన వ్రాసిందెవరో చెప్పమనండి.”

అంతకంతకి ఆవేశాలు ఎక్కువౌతున్నాయి. జనాన్ని వూరుకోబెట్టడానికై అధ్యక్షుడు ఒకే మోయిని గంట కొడుతున్నాడు. ఆగోడవలో ఆల్యామాట ఎవరికీ వినబడ్డంలేదు. చాలసేపటివరకూ గందరగోళం తగ్గలేదు. తగ్గినాక ఆమె మరల ప్రారంభించింది.

పేటలలోని కామ్రేడ్స్ వ్రాస్తున్న వుత్తరాల్ని చూస్తే వారంతా మనతో నేవున్నట్లు కనబడుతూంది. అదో సంతోషకర విషయం మనకొచ్చిన ఒక వుత్తరంలో ముఖ్యభాగం చదువుతా వినండి. దీనిని వ్రాసింది ఓల్గా యురెనేవా. ఇక్కడున్న వారిలో చాలమందికి ఆమె తెలుసు. కామ్సోమాల్ ప్రాంతీయ కమిటీ అర్గనైజేషనల్ శాఖ బాధ్యురాలుగా ఆమె పనిచేస్తూంది.”

తనఎదట బల్లమీదవున్న ఫైల్‌లోంచి ఆమె ఒక కాగితంతీసి పైనుంచి క్రిందికంటా ఒక్కమారు చూసింది.

“మిగిలిన పనులన్నీ ఆగిపోయేయి. పేటలలో ట్రాట్స్కీవాదులు ఇదివరకెన్నడూ లేనంత అసహ్యాకరమైన విధంగా దుమారం లేపుతున్నారు. దానితో బ్యూరోసభ్యులంతా నాలుగురోజులుగా పేటలకే చేరవలసివచ్చింది. నిన్ననో ఘటనజరిగింది. దానితో పార్టీపార్టీఅంతా ఉడికిపోయింది. నగరంలోవున్న సెల్లులు వేటిలోనూ తమకు మెజార్టీ లేకపోవడంతో, ప్రతిఘటనవారు తమ జనాన్నందర్నీ చేర్చుకొని ప్రాంతీయ సైనికశాఖలోని పార్టీశాఖను ఆక్రమించాలని ప్రయత్నించేరు. ప్రాంతీయ విద్యాశాఖలోనూ, ప్రాంతీయ ప్రణాళికా సంఘంలోనూ పనిచేస్తున్న కమ్యూనిస్టులుకూడా ఆ పార్టీశాఖ క్రిందనేవున్నారు. దానిలోవున్నది నలభయి రెండుమంది. అక్కడికి ట్రాట్స్కీవాదులంతా పోగయ్యేరు. పార్టీవ్యతిరేక వుపన్యాసాలు గుప్పేసేరు. సైనికశాఖసభ్యుల్లో ఒకడు బయటపడి ‘పార్టీవాళ్ళు మేముచెప్పినట్లు వినకపోతే

తన్నేస్తా''అన్నాడు. ఆమాటకు ప్రతిఘటనజనం అంతా హర్ష ధ్వానులుచేసేరు. అప్పుడు కోర్చాగిన్ లేచేడు. "ఆ ఫాసిస్టు బెదిరింపులకి హర్షం తెలుపుతున్నారే. మీరూ పార్టీ సభ్యులేనా?''—అన్నాడు. కాని వాళ్ళు ఎంతగోడవచేసేరని! ఒకటే కేకలు. బల్లలుగుద్దడం. కుర్చీలు బరబరలాడించడం. ఆతనిమాటలు సాగనిస్తేనా? ఈ అల్లరి చూసేసరికి పార్టీ శాఖ సభ్యులందరికీ అసహ్యం వేసింది. కోర్చాగిన్ను మాట్లాడ నివ్వాలన్నారు. కాని, ఆతను మాట్లాడడానికి ప్రయత్నిస్తే గోల ప్రారంభమయింది. కోర్చాగిన్ గర్జించేడు. "ఇదన్న మాట మీరుచెప్పే ప్రజాతంత్రం అంటే. మీరు ఎన్ని అర చినాసరే నే మాట్లాడేతీరుతా." చాలమంది ఆతనిమీదపడి వేదికనుంచి లాగివేయబోయేరు. పెద్ద గందరగోళం జరిగింది. ఆతడు మానలేదు. వాళ్ళని తోసేసి వుపన్యాసం సాగించేడు. కాని వాళ్ళు చాలమంది పోగయి, ఆతనిని ఈడ్చుకుపోయేరు. మెట్లమీంచి తోసేసేరు. ఎవడో భటాచోర్ ఆతనిముఖం మీద కొట్టి గాయపరిచేడు. తర్వాత ఇంక ఒక్కడుకూడా మిగలకుండా పార్టీ శాఖ సభ్యులంతా వెళ్ళిపోయేరు. ఈ ఘట నతో వాళ్ళకళ్ళు విడివడ్డాయి.

తాల్యా వేదిక దిగింది.

* * *

గుబెర్నెయా పార్టీ కమిటీకి సంబంధించిన ప్రచారశాఖ పనిని సెగాల్ రెండు నెలలనుంచి చూస్తున్నాడు. ఆతడు కూడా సభలో అధ్యక్షవర్గంలోవున్నాడు. తోకరేవ్ ప్రక్కనే

కూర్చుని ప్రతినిధుల ఉపన్యాసాలన్నీ బహుశ్రద్ధగా వింటున్నాడు. ఆ నిమిషం వరకు కామ్‌సోమాల్‌లో పనిచేస్తున్న యువకులే సభలో మాట్లాడేరు.

" ఈ కొద్దియేళ్ళలో ఎంతటివాళ్ళయ్యారో..." అనుకొన్నాడు, ఆతడా వుపన్యాసాలు వింటూ.

"ప్రతిఘటనవాళ్ళకి ఉరితాళ్ళక్రింద మంటలు పెడుతున్నారు. అసలు వాళ్ళింకా రంగంమీదికి రాలేదు. ట్రాట్స్కీవాదులని ఈ కుర్రాళ్ళు పట్టేస్తున్నారు." – అన్నాడు నెమ్మదిగా తోకరేవ్‌తో.

తుఫ్తా హడావిడిగా వేదికనెక్కాడు. ఆతడు వస్తూంటేనే సభలో నవ్వులూ, వెక్కిరింతలూ బయలుదేరేయి. ఆ అవహేళనకు అసమ్మతి తెలిపేటందుకు ఆతడు అధ్యక్ష వర్గంవేపు చూసేడు. ఇంతలోనే గంద్రగోళం ఆగిపోయింది.

"ఇక్కడెవరో నన్ను కాలజ్ఞాని అన్నారు. మెజార్టీ కామ్రేడ్సు నా రాజకీయాభిప్రాయాల్ని గౌరవించే పద్ధతి అదన్నమాట..."

సభ అంతా పక్కున నవ్వింది. తుఫ్తా అధ్యక్షుడికి విన్నవించుకొన్నాడు.

"మీరు నవ్వొచ్చు. కాని నే చెప్తున్నా వినండి. యువకులు బరామీటరులాంటి వాళ్ళని లెనిన్ బోలెడన్నిసార్లు అన్నాడు."

ఉన్నట్లుండి సభ అంతా నిశ్శబ్దం అయింది.

సభలో ఒకమూలనుంచి ఎవరో ప్రశ్నించేరు.

"లెనిన్ ఏమన్నాడు?

తుఫ్తాకు హుషారు పుట్టింది.

"అక్టోబరు విప్లవానికి ప్రయత్నాలు జరుగుతున్నప్పుడు పట్టుదలగల కార్మికయువకుల్ని సమీకరించమనీ, వారికి ఆయుధాలనివ్వమనీ, నౌకాసైనికులతో చేర్చి మంచి కీలకస్థానాలకు పంపమని లెనిన్ చెప్పేడు. ఆయన చెప్పిన మాటలు చదవమంటారా? అట్లాంటివాటిని వ్రాసిపెట్టుకొంటూంటాను."

తుఫ్తా తన పోర్టుఫోలియో వెతకడం ప్రారంభించేడు.

"బాధపడకు. మాకు తెలుసులే."

"కాని, ఐక్యతగురించి ఆయనేం వ్రాసేడు?"

"వెనకటి కామ్రేడ్సుకీ, కొత్త కామ్రేడ్సుకీ లెనిన్ పోటీపెట్టేడా?"

తుఫ్తా ఈ ప్రశ్నలమధ్య తాను చెప్తున్నదేమిటో మరిచిపోయేడు.

"యురెనేవా వ్రాసిన ఉత్తరాన్ని ఒకదానిని తాల్యా లగూటినా ఇప్పుడు చదివింది. వాదప్రతివాదాలలో ఎక్కడన్నా కాస్త అతిగాపోతే దానికల్లా సమాధానం ఇవ్వవలసిందంటే సాధ్యమా?"

షుమ్‌స్కీ ప్రక్కనేకూర్చున్న త్స్వేతాయేవ్ చికాకుపడ్డాడు.

"చవటపీనుగ ..."

షుమ్‌స్కీ నెమ్మదిగానే సమాధానం ఇచ్చేడు.

"ఈ వెఱ్ఱిపీనుగ మనపనికాస్తా పాడుచేసి కూర్చునేలా వున్నాడు."

తుఫ్తా పెద్దగొంతుతో అరుస్తున్నాడు.

"అధికసంఖ్యలోవున్న మీరంతా ముఠా కట్టగాలేనిది మేం కడితే వచ్చిందా ?"

సభలో గగ్గోలు బయలుదేరింది. నలుమూలలనుంచి కుపిత కంఠాలు గర్జించేయి.

"అంటే మళ్ళీ బోల్షివిక్, మెన్షెవిక్ భేదాలా ?"

"రష్యన్ కమ్యూనిస్టుపార్టీ పార్లమెంటులాంటిదేం కాదు."

"మ్యాస్నికోవ్‌నుంచి మాగ్టోవ్‌దాకా అందరికీ వీళ్లు పూజచేస్తున్నారు."

తుఫ్తా నిరాశతో చేతులు పైకెత్తి ఝూడించేడు. మళ్ళీ గలగలా మాట్లాడేడు.

"గ్రూపులు కట్టేటందుకు మనకు అధికారంవుండాలి. లేకుంటే భిన్నాభిప్రాయాలు కలిగివుండడం ఏలాగ ? మంచి కట్టుబాటుగా పనిచేస్తున్న అధికసంఖ్యాక ముఠాతో పోరాడేటందుకు మరోవిధంగా అయితే అవకాశం ఏముంటుంది?"

మరల అల్లకల్లోలం ప్రారంభమయింది. పాంక్రాటోవ్ లేచి ఒక్క కేకపెట్టేడు.

"మాట్లాడనివ్వండి. ఏం చెప్తాడో విందాం. ఇతరులు దాచిపెట్టాలనుకొన్నవి చెప్తూ మన చెవినిపడేస్తాడు."

సభ అంతా నిశ్శబ్దమయింది. తాను చెప్పాలనిదేదో చెప్పేసేనని తుష్తాకు అర్థమయింది. మనస్సులో ఆలోచనలన్నీ కలగుండుపడ్డాయి. నాలుగుమాటల్లో తన ఉపన్యాసం ముగించేసేడు.

"మమ్మల్ని పార్టీలోంచి బహిష్కరించవచ్చు. గెంటెయ్యవచ్చు. అల్లాంటిపని అప్పుడే ప్రారంభమయింది కూడా. కామ్సోమాల్ గుబెర్నియా కమిటీనుంచి నన్ను పంపేసేరు కదా! కానీండి. ఎవరుచెప్పింది సరియైనదో త్వరలోనే తెలుస్తుంది."

తుష్తా వేదికదిగి వచ్చేసేడు.

త్స్వేతాయేవ్ ఒక చీటివ్రాసి దుబావాకు పంపేడు.

"మిత్యా! నువ్వుపోయిమాట్లాడు. అంతమాత్రంచేత పరిస్థితులు చక్కబడతాయనుకోను. కథ అడ్డంతిరుగుతూంది. తుష్తా పాడుచేసినవరకేనా సరిదిద్దుకోవాలి. వాడిదో మట్టిబుర్ర. గవ్వలడబ్బా!"

దుబావా మాట్లాడుతానన్నాడు. వెంటనే అంగీకరించేరు.

ఆతడు వేదికపైకి వస్తూంటే సభ నిశ్శబ్దంగా ఎదురుచూసింది. సాధారణంగా ఉపన్యాసకులు ప్రారంభించబోయే ముందు సభ ఆవిధంగా నిశ్శబ్దంగావుండడం మామూలే. కాని దుబావా విషయంలో అది అయిష్టప్రకటనేతప్ప వేరు

కాదు. సెల్లుమీటింగులలో అతను చూపిన ఆవేశం ఈరోజుకు చల్లారిపోయింది రోజురోజుకీ వుత్సాహం సన్నగిల్లింది. తన కటి మిత్రులందరూ గట్టిగా చీవాట్లుపెట్టేసరికి నెత్తిన నీళ్ళు పోసినట్లయింది. ఇంక మిగిలిందల్లా దురహంకారం. తన మాట చెల్లలేదేయనే పట్టుదల. దానితో కసిపుట్టింది. తనది తప్పని వొప్పుకోవడానికి సిద్ధం కావడంలేదు. సభలో ఎక్కువ మందిని ఇంకా దూరం చేసుకొంటానేమోనన్న భయం వొకటున్నా మాట్లాడెయ్యాలనే నిశ్చయించుకొన్నాడు. అతని కంఠంలో వుత్సాహం లేకపోయినా విస్పష్టంగా వినిపించింది.

"నామాటకు అడ్డురావద్దు. గోలచేసి గంద్రగోళపరచవద్దు. ఏంచెప్పినా లాభంలేదని నాకు తెలుసు. అయినా మా అభిప్రాయాలు చెప్తా. చాలమంది మీపక్షానేవున్నారు."

అతడు మాట్లాడి ముగించేడు. సభలో పెద్దబాంబు పగిలినట్లయింది. నాలుగుమూలలనుంచీ కోపావేశంతో కేకలు వినిపించేయి. ఒక్కొక్కమాట అతనికి కొరడాదెబ్బలా తగులుతూంది.

"సిగ్గులేదూ."

"పేచీకోరులు ముర్దాబాద్"

"ఈపాటికి చాలించు."

నాలుగువేపులనుంచీ నలుగురూ అపహాస్యం చేస్తూంటే దుబావా తనచోటికిపోయి కూర్చున్నాడు. అనవ్వాలతో అతడి వ్యవహారం కడ అంటింది. వాళ్ళు అతనిమీద కేకలు

పెట్టి, గంద్రగోళంచేస్తే అతడేమీ అనుకొనివుండేవాడు కాదు. అపస్వరంలో పాటపాడిన నటకునిని అవహేళనచేసినట్లు ఆతనిని అల్లరిపెట్టేరు.

అధ్యక్షుడు తరవాత మాట్లాడేవారిని పిలిచేడు.

"షుమ్‌స్కీ మాట్లాడుతారు."

షుమ్‌స్కీ లేచేడు.

"నేను మాట్లాడబోవడంలేదు."

పాంక్రాటోవ్ గర్జన వినిపించింది.

"నన్ను మాట్లాడనివ్వండి."

ఆతడు మహాకోపంతో వుడికిపోతున్నాడని ఆ కంఠస్వరాన్ని పట్టి దుబావా గ్రహించేడు. చాల నొప్పికలిగినప్పు డాతని గొంతు అలాగేవుంటుంది. ఆ పొడుగుపాటి బలిష్ఠ విగ్రహం గబగబా అడుగులు వేస్తూ వేదికవేపు నడిచివస్తూంటే దుబావా మొగం ముడుచుకొన్నాడు. పాంక్రాటోవ్ చెప్పబోయేది అతడికి తెలుసును. రెండురోజులక్రితం సోలోమెంకాలో వున్న తన పాత మిత్రులతో ఆతడు మాట్లాడేడు. వాళ్ళంతా 'ప్రతిఘటన' నుంచి లేదిరమ్మని తనకు ఎన్నో చెప్పేరు. త్స్వేతాయేవూ, షుమ్‌స్కీమాత్రం తనపక్షాన నిలబడ్డారు. అంతా తోకరేవ్ బసలో కలుసుకొన్నారు. పాంక్రాటోవ్, ఓకునేవ్, తాల్యా, వోలింత్సేవ్, జెలెనోవా, స్తారోవెరోవ్, ఆర్త్యూఖిన్‌లు అక్కడున్నారు. పార్టీలో పేచీలు తీసుకురావద్దని ఎవరు ఎన్ని చెప్పినా దుబావా వినిపించుకోలేదు. చర్చలు నడుస్తూండగా త్స్వేతాయేవ్‌ను తీసుకుని

లేచిపోయేడు. దాని అర్థం స్పష్టమే. తనతప్పును ఆతడు ఒప్పుకోదలచలేదన్నమాట. షుమేస్కీ వెళ్ళిపోలేదు. ఆగేడు. ఆతడిప్పుడు తానేమీ మాట్లాడదలచడంలేదన్నాడు. "కలేజా లేని పుస్తకాలపురుగు. ఏమీని దిగమింగేసేరన్నమాట—" అను కొన్నాడు దుబావా. అతని కెంతో కోపంగావుంది. ఈ పేచీలో మిత్రులందరూ దూరంఅవుతున్నారు. యూనివర్సిటీలో జార్యూతో చెడింది తమను సంభయ్యాక్షమందీ చేసిన ప్రకటనను ఆతడు పార్టీ బ్యూరో సమావేశంలో సునిశితంగా విమర్శించేడు తర్వాత పేచీ ముదిరింది. ఇంక మాటలుకూడా లేకుండాపోయేయి. అటుతర్వాత అతడు చాలమార్లు అన్నాను చూడ్డానికి వచ్చేడు. దుబావా అన్నాలకు ఏడాదిక్రితం పెళ్ళయింది. కాని, ఇప్పుడు ఇద్దరూ వేరు వేరుగానే వుంటున్నారు. ఆమెకీ తనకూ అభిప్రాయాలు కలవలేదు. అసలే అంతంతగావున్న తమ యిద్దరిమధ్యా సంబంధం జార్యూ రాకతో మరింత బెడిసింది. ఆమెమీద తనకేమీ అనుమానంలేదు. అతనిమీద ఈర్ష్యాలేదు. ఐనా తామున్న పరిస్థితుల్లో జార్యూవచ్చి అన్నాను చూసిపోతూండడం ఆతని కెంతో కోపంగావుంది, జార్యూతో స్నేహం మానమని ఆతడు చెప్పేడు. ఆమె కంయ్‌మంది. దానితో తమ యిద్దరిమధ్యా మరింత చెడింది. ఆమెతో చెప్పనేనా చెప్పకుండా అతడీ సభకోసం లేచివచ్చేడు.

పాంక్రాటోవ్ గొంతు అతని ఆలోచనలను చెదరగొట్టింది.

"కామ్రేడ్స్!"

పాంక్రాటోవ్ సభాపతి వేదిక చివరకంటూ వచ్చి నిలబడి తన ఉపన్యాసం ప్రారంభించేడు.

“ఇక్కడికి తొమ్మిదిరోజులనుంచి ‘ప్రతిఘటన’ వారి ఉపన్యాసాలు వింటున్నాం. ఒక్కవిషయం చెప్పడం అవసరం. వాళ్ళ విప్లవకారుల్లాగా, సహచరుల్లాగా నాకు ప్రసంగించలేదు. శత్రుత్వంతో, కసితో, తిట్టుపోతుతనంతో మాట్లాడేరు. కేవలం తిట్టుపోతుతనం ప్రదర్శించేరు. బోల్షివిక్కులు పార్టీతో ముష్టిబాహా పద్ధతి నవలంబిస్తున్నా రన్నారు. వర్గానికీ, విప్లవానికి ద్రోహం చేస్తున్నారన్నారు. పార్టీఅంటే ప్రేమ, విశ్వాసం కలిగి నిష్టగా పనిచేస్తున్న వాళ్ళని పెత్తందార్లని తిట్టేరు. కమ్యూనిస్టుపార్టీని నిర్మించుకువచ్చినవారికి, జారుల జైళ్ళలో నానాఅగచాట్లు పడిన వారికి, కామ్రేడ్ లెనిన్ నాయకత్వాన మెన్షివిక్కులతోనూ, ట్రాట్స్కీతోనూ ఎడతెగని పోరాటాలు సాగించినవారికి వాళ్ళిచ్చిన మర్యాద అది. శత్రువులుకూడా ఆమాట లనలేదు. పార్టీకీ, పార్టీ కార్యకర్తలకీ తేడా ఏమిటి? ఈ గంద్రగోళంఅంతా దేనికి? కొజార్మ్స యువకుల్ని సేనాధిపతుల మీదికీ, కమిసార్ల మీదికీ, సైన్యకార్యాలయాలమీదికీ ఎగతోలేవారిని ఏమనాలి? అందులోనూ శత్రువులు చుట్టుముట్టివుండగా? నేను మెకానిక్‌గా పనిచేస్తున్నంతవరకూ మంచిదేనంటాడు ట్రాట్‌స్కీ. కాని, రేపు ఏపార్టీ సెక్రటరీనో అయితే నిల్చున్నపళాన పెత్తందారునైపోతాను. ‘కుర్చీ కుంపటి’ గాణ్ణయిపోతాను. ఆశ్చర్యకరంగాదూ!

'ప్రతిఘటన'కు చెందినవారిలో పెత్తందారీతనాన్ని వ్యతిరేకించి, ప్రజాతంత్రపద్ధతులకోసం పోట్లాడుతున్నవా రెవరో చెప్తారా? తుఫ్తాయూ? ఉద్యోగివర్గ దౌరతనం చూపినందుకు అతని సామర్థ్యానే పదవి తగ్గించేరు. త్స్వేతాయేవ్ కాదుగదా? ఆతడి ప్రజాతంత్రాభిమానాన్ని సోలోమెంకా ప్రజలందరూ ఎరుగుదురు. పోదోల్స్క జిల్లాలో తన యిష్టంవచ్చినట్లల్లా వ్యవహరించి నానాగంద్రగోళాలూ తెచ్చినందుకు గుబెర్నియా కమిటీనుంచి మూడుమార్లు తీసేసిన అఫనాసియేవ్ వీళ్ళతోనే వున్నాడు. పార్టీ శిక్షణకు గురిఅయినవారంతా ఏకంఅయ్యేరన్నమాట. ట్రాట్‌స్కీ ఏపాటి బోల్షివిక్కో పాతవాళ్ళని చెప్పమనండి. బోల్షివిక్కులతో ఆత డేవిధంగా పోరాడేడో, తరుచుగా పార్టీలు మారేడో వాళ్ళు చెప్పగలరు. అదంతా వింటే కొత్తకుర్రవాళ్ళకి వుపయోగమేనా వుంటుంది 'ప్రతిఘటన' వారితో చేసిన పోరాటంలో మన పడుచుకారంతా గడితేరేరు. సిద్ధాంతసమస్యలు అర్థం అయ్యేయి. పెట్టీబూర్జువా ధోరణులకు వ్యతిరేకంగా సాగించిన పోరాటాలలో మన పార్టీసభ్యులూ, కామ్‌సోమాల్ సభ్యులూ దిట్టపడ్డారు. ఆర్థికంగానూ, రాజకీయంగానూ సర్వనాశనమైపోతామని 'ప్రతిఘటన'వాదు లంటున్నారు. జోస్యాలు చెపుతున్నారు. వారి జోస్యాల విలువేమిటో కాలం చెప్తుంది. మంచి అనుభవంవున్న తోకరేవ్‌లాంటి వాళ్ళని పనిలో వొంగేసి, దుబావాలాంటివాళ్ళని పార్టీ నాయకత్వానికి తీసుకురావాలంటున్నారు. పార్టీతో సాగిస్తున్న పోరాటం ఏదో మహా వీరకృత్యంలాగా భావిస్తు

న్నాడు దుబావా. అల్లాంటివాళ్ళ నాయకత్వానికి మేము వొప్పుకోము. పాత బోల్షివిక్కుల స్థానాలకు కొత్తవాళ్ళను తీసుకొస్తాం. కాని, దుబావాలాగా మనం చిక్కుల్లో వున్నప్పుడు పార్టీమీద విరుచుకుపడేవాళ్ళని మాత్రం తీసుకురాము. మనపార్టీలోని ఐక్యత చెడదీయడానికి వొప్పుకోము. పాత సభ్యులూ, కొత్తసభ్యులూ మధ్య పేచీలు రానివ్వం. లెనిన్ నాయకత్వాన, ఫెటీబూర్జువా ధోరణులతో నిరంతరాయంగా పోరాటం సాగించి, విజయం సాధిస్తాము.''

హర్షధ్వానులమధ్య పాంక్రాటోవ్ వేదిక దిగేడు.

* * *

ఆ మరునాడే పదిమంది తుఫ్తా బసలో చేరేరు.

దుబావా తన కార్యక్రమం వారిముందు పెట్టేడు.

“షుమ్‌స్కీ, నేనూ ఈవేళ ఖార్కోవ్ వెళుతున్నాం. ఇంక ఇక్కడ చేసేదేమీ లేదు. మీరు సాధ్యమైనంతవరకు ఒకకూటంగా వుండటానికి ప్రయత్నించండి. ఇంకిప్పుడు చేయగలిగిందల్లా కొన్నాళ్ళు కనిపెట్టి చూడడమే. అఖిల రష్యామహాసభ మనల్ని ఖండిస్తుంది. కాని, మనమీద అప్పుడే నిర్బంధా లుపయోగిస్తారనుకోను. మెజార్టీ వాళ్ళు మనకింకోమారు అవకాశంయిచ్చి చూద్దామనే ధోరణిలో వున్నారు. ఇంకిప్పుడు, ఈమహాసభ అయ్యేక, మనప్రచారం సాగించామూ పార్టీలోంచి నెట్టేస్తారు. అప్పుడేంచెయ్యాలనేది మనమింకా ఆలోచించుకోలేదు. ముందేమవుతుందో ఇప్పుడేమీ చెప్పలేము. అంతే. ఇంక చెప్పేదేముంది?''

అజానుబాహువయిన స్తారోవోరోవ్ నత్తుతూ ఆవంధ కానికి అభ్యంతరం చెప్పేడు.

"నీ ధోరణి ఏమీ అర్థం కావడంలేదు, మిత్రా! మహాసభ నిర్ణయానికి మనం బద్ధులం కానక్కరలేదా?"

త్స్వెతాయేవ్ మధ్యలో అందుకొన్నాడు.

"మాటవరుసకి మాత్రమే బద్ధులం. లేకపోతే నీపార్టీ కార్డు లాగేసుకుంటారు. కొన్నాళ్ళు ఆగిచూద్దాం, ఏమవుతుందో. ఇంక పోదామా?"

తుష్తో ఏదో చికాకుతో కుర్చీలో తెగకదిలేడు. షుమ్‌స్కీ తెల్లమొగంవేసి, గోళ్ళుకొరుక్కుంటూ కిటికీదగ్గర తల వేలవేసుకూర్చున్నాడు. త్స్వెతాయేవ్ మాటలతో గిరుక్కున తిరిగేడు.

"ఆ పద్ధతులు నా కిష్టంకాదు. మహాసభ నిర్ణయానికి కట్టుబడి వుండాలని నాఅభిప్రాయం. మనకు కొన్నినమ్మకాలున్నాయి వాటికోసం నిలబడి దెబ్బలాడేం ఇంకిప్పుడు మెజారిటీ నిర్ణయానికి కట్టుబడాలిసిందే...."

స్తారోవోరోవ్ అంగీకారం కనబరచేడు.

"నేనూ అదే చెప్పాలనుకొన్నా."

దుబావా షుమ్‌స్కీ వేపు వెక్కిరింతగా చూసేడు.

"నువ్వేదో చెయ్యాలని ఎవ్వరూ అనడంలేదు. గుబెర్నియా మహాసభలో 'లెంపలు' వేసుకొందువుగానిలే."

షుమ్‌స్కీ చర్రున లేచాడు.

"బాబూ జీ! సినిమాలంటే నాకేం నచ్చలేదు. నిజం చెప్తే విను సినిమాలు నా కన్యాత్వ మలినిస్తున్నాయి. ఆ రోజులు ఇల్లా చేశానేమిటా అని విచారించుకో బుద్ధిపుడుతోంది."

మహాత్మా 'సరే' అన్నట్లు చేయివూపేరు.

"నువ్వింకెక్కన్నా సినిమాలకి వెళ్తావని నేనేం అనుకోలేదు. వెళ్ళమరి ఆలస్యమెందుకు?"

మహాత్మా నవ్వుతూ మెచ్చుకుంటున్న వాళ్ళతో కరచాలనం చేసి, వెళ్ళిపోయేరు. నెలతాల సుభాసినీ— స్లాకోవ్ లు వెళ్ళిపోయేరు.

*　　　*　　　*

1924 వ సంవత్సరం జనవరి. విపరీతమైన చలి. మంచుతో నిండిపోయి దేశంఅంతా బిగిసిపోతూంది. నెలలో పదిహేనురోజులు గడిచేటప్పటికి తుపానులు, మంచువర్షాలు ప్రారంభమైనాయి.

దక్షిణపశ్చిమ రైల్వేలన్నీ మంచుతో కప్పబడిపోయాయి. చెలరేగుతున్న ప్రకృతి శక్తులతో మానవులు యుద్ధాలే చేస్తున్నారు. మంచునాగళ్ళతాలూకు ఉక్కుపారలు మంచు పొరల్ని తవ్వితీసేస్తున్నాయి. రైళ్ళు పోవడానికై బాటలు సరిచేస్తున్నాయి. టెలిగ్రాఫ్ తీగలు మంచు బరువుగా వ్రేలబడి, తుపానుగాలివిసురుకు తెగిపోతున్నాయి. వున్న పన్నెండు టెలిగ్రాఫ్ లైన్లలో ఇండియా - యూరపు

లైన్ ఒకటి, రెండు ప్రభుత్వం లైన్లూ మొత్తం మూడు మాత్రమే పనిచేస్తున్నాయి.

పెపెటోవ్కా స్టేషన్‌లోని టెలిగ్రాఫ్ ఆఫీసులో మూడుయంత్రాలు విధివిరామం లేకుండా కటకట – టక్ టక్ మంటున్నాయి. బాగా అలవాటున్నవానికి గాని ఆ మాటలు అర్థంకావు.

యంత్రాలవద్దవున్న ఆపరేటర్ పడుచుల కింకా అనుభవం తక్కువ. వాళ్ళు టైపుచేసిన టేపు పొడవు ఇంకా ఇరవై కిలోమీటర్లేనా అయివుండదు వారి ప్రక్కనే పని చేస్తున్న ముసలిఅతడు రెండువందల కిలోమీటర్ల కన్నా ఎక్కువే టైపు చేసేడు. ఆ టేపు చదివితేగాని వస్తున్న వార్త అర్థం కాదనేబాధ లేదు. కఠినమైన మాటలూ, నానుడులూ వచ్చినప్పుడు ఏమిటా దీనిఅర్థం అని ఆలోచనలోనూ పడనక్కర్లేదు. యంత్రం టిక్కు–టిక్కు మంటూంటే ఆతడా ధ్వనులు చెప్పే అక్షరాల్ని కాగితంమీదికి ఎక్కించేస్తున్నాడు.

"అందరూ, అందరూ, అందరూ"

ఆమాటలు వ్రాసుకున్నాడు ముసలిఅతడు.

"మంచు తీసెయ్యమంటూ మరో సర్క్యులరు కాబోలు."

బయట మంచుతుపాను హోరుపెడుతూంది. మంచు ముక్కలు వచ్చి కిటికీలకు కొట్టుకొంటున్నాయి. ఎవరో తలుపు తట్టుతున్నట్లనిపించి అతడు ద్వారంవేపు తిరిగి

చూసేడు. కిటికీఅద్దాలకు ముందు అతుక్కొని బొమ్మలు గీసినట్లు కనబడుతూంది. ఆ వింతవింత చిత్రాలు మానవ మాత్రుడెవ్వరూ గీయడం సాధ్యంకాదు.

ఏవేవో ఆలోచనలలో పడి ఒక్క నిమిషం అతడు టెలిగ్రాఫ్ ధ్వనులు వినలేదు. అంతలో జ్ఞాపకం వచ్చింది. చటుక్కున కీపు అందుకొని చదివేడు.

"జనవరి 21. సాయంకాలం ఆరుగంటల ఏభయి నిముషాలకు..."

ఆ మాటలు వ్రాసుకొని అతడు కీపు వదలిపెట్టేడు. తరువాయి మాటలు వినడానికై శ్రద్ధగా కూర్చున్నాడు.

"...నిన్న గోర్కీలో మరణించినాడు..."

అతడు నెమ్మదిగా ఆ మాటల్ని కాగితంమీద వ్రాసుకున్నాడు. తన దీర్ఘజీవితంలో శుభవార్తలూ, అశుభవార్తలూ ఇల్లాంటివి అతడు అనేకం వ్రాసుకొన్నాడు. సుఖమో దుఃఖమో ముందు అతని చెవినిపడుతుంది. అతని చేతిమీదుగా ఇతరులకు అందుతుంది. టెలిగ్రాములలో వచ్చే చిన్న మాటలూ, క్లుప్తమైన పదాలూగురించి ఆలోచించడం మానేసి అతడు చాలకాలమయింది. యంత్రంచేసే ధ్వనులు వింటాడు. మరోయంత్రలాగ వాటిని కాగితంమీదికి ఎక్కించుకొంటాడు.

ఇప్పుడూ ఎవరో చచ్చిపోయేరు. ఎవరికో తెలియబరుస్తున్నాడు. మొదటిమాటలు ఏమిటో ముసిలిఅతడు మరిచిపోయేడు. మళ్ళీ యంత్రం మొదటికి వచ్చింది.

"అందరూ, అందరూ, అందరూ" తర్వాత ఒక్కొక్క అక్షరాన్నే యంత్రం కటక్ కటలలో చెప్పుకుపోతూంది.

"వ్లా...డి...మి...ర్......ఇ...లి...చ్"

ముసలి టెలిగ్రాఫరు ఆ మాటలను ఎక్కడికక్కడ కాగితంమీద వ్రాసుకొన్నాడు. అతనికి విసుగుగానేవుండే గాని, విచారం అనిపించడంలేదు. ఎవరో వ్లాడిమిర్ ఇలిచ్ అనే అతడు ఎక్కడో చచ్చిపోయేడు. ఈ విచారవార్త ఎవరికో పంపబడుతూంది. వాళ్ళు దుఃఖ బాధతో కుమిలి పోతారు. కాని, తనకేమీ ఆ వార్తతో సంబంధంలేదు. ఏదో యాదృచ్ఛికంగా ఇది తనకు తెలిసిందేగాని, ఆయ నెవడో, ఏమో.

యంత్రం కటక్...కట...కొట్టింది. మళ్ళీ కొన్ని కటక్ కటక్‌లు. కొన్ని కటకటలు. పరిచితమైన ఆ ధ్వనులనుంచి ఆతడు అక్షరం కూర్చుకొని వ్రాసుకున్నాడు. మొదటక్షరం "లె". రెండోది "ని". తరువాత "న్." వ్రాసి పొల్లు నిశిం దాగా రెండు మెలికలు త్రిప్పి ఏటవాలుగా రానిచ్చి వ్రాసేడు.

యంత్రం ఒక్కక్షణం ఆగింది. ఆ వ్యవధిలో ముసలి వాడు తాను వ్రాసిన అక్షరాలకేసి చూసుకున్నాడు.

"లె...ని...న్"

యంత్రం తనపనిచేసుకుపోతూంది. కాగితంమీది అక్షరాలు పరిచితంగా కనబడగానే ముసలివాడు ఉలిక్కిపడ్డాడు. మళ్ళీ తాను వ్రాసిన వార్తకేసి చూసుకొన్నాడు.

"లెనిన్."

ఏ లెనిన్? టెలిగ్రాము నంతనూ మళ్ళీ చదివేడు. తన ముప్ఫయ్యేళ్ళ ఉద్యోగకాలంలో తాను వ్రాసినవార్తను తానే నమ్మలేనిస్థితి కలగడానికిదే ప్రథమం.

మళ్ళీ రెండుమూడుసార్లు టెలిగ్రాం చదువుకొన్నాడు. ఎన్నిమార్లు చదివినా అదేవార్త.

"వ్లాడిమిర్ ఇలిచ్ లెనిన్... మరణించేడు.

ముసలివాడు ఆవేశంతో లేచేడు. టేపు చేతిలోకి తీసుకొని మళ్ళీ చదివేడు. రెండు మీటర్ల పొడుగునవున్న టేపు, తాను నమ్మలేకుండావున్న వార్తను మళ్ళీ కనబరిచింది. వెల్లమొగం వేసేడు. వెర్రిగా కేకేసేడు.

"లెనిన్ చచ్చిపోయేడు."

*                *                *

ఆ మరణవార్త టెలిగ్రాఫ్ ఆఫీసునుంచి స్టేషన్‌లో పడింది. అక్కడినుంచి మంచుతుపానుకు అడ్డుపడి రోడ్లెక్కింది. పట్టాలు దాటింది. మూసినతలుపులు తోసుకొని రైల్వేషాపుల్లో జొరబడింది.

షాపులో మొదటిగాడిమీద ఒక ఇంజను నిలబడి వుంది. దానిచుట్టూచేరి కావలసిన చిన్నచిన్న మరమ్మతులు చేస్తూ పనివాళ్ళు కొందరు హడావిడిగావున్నారు. పోలెన్‌టోవ్‌స్కీ ఇంజను అడుగున కూర్చుని ఏయేభాగాలు ఇబ్బంది పెడుతున్నాయో మెకానిక్కులకు చూపుతున్నాడు.

నిప్పుపెట్టెలోని ఇనపకడ్డీలకు వంపులుతీస్తూ జఖార్ బ్రూజకూ, ఆర్టెమూ వంగుని వున్నారు. జఖార్ కడ్డీక్రింద దిమ్మెపట్టు కొనివుంటే ఆర్టెమ్ సమ్మెటతో కొడుతున్నాడు.

జఖార్ పెద్దవాడైపోయేడు. ఈ కొద్ది ఏళ్ళల్లో ముఖం ముడతలుపడింది. జుట్టు నెరిసింది. నడుం వంగింది. కళ్ళు గుంటలుపడ్డాయి.

ద్వారంలో ఎవరో మనిషివచ్చి నిలబడ్డట్లయింది. సందెచీకట్లలో ఆ మనిషెవరో తెలియలేదు. ఆతడేదో అన్న ట్లనిపించింది. కాని సమ్మెటదెబ్బలలో మాట వినబడలేదు. ఆతడు మరింతదగ్గరకువచ్చేడు. ఆర్టెమ్ సమ్మెట నిలిపేడు.

"కామ్రేడ్స్! లెనిన్ చచ్చిపోయాడు."

ఆర్టెమ్ చేతిలోనిసమ్మెట నెమ్మదిగా నేలకు జారింది. ఆ వార్త చెప్పినవాని చొక్కాచేయి గట్టిగా పట్టుకొన్నాడు.

"ఏమిటి ? ఏమిటన్నావు ?"

ఆవార్త తెచ్చిన ఆతడు ఆయాసంతో వగురుస్తున్నాడు.

"నిజమే, కామ్రేడ్స్! లెనిన్ చచ్చిపోయేడు."

ఆతడు నెమ్మదిగా చెప్పడంతో ఆర్టెమ్ ఆ వార్త నిజ మేననుకొన్నాడు. అప్పుడుకాని, ఆ వార్తను తెచ్చినది స్థానికపార్టీ కార్యదర్శి అని అర్థంచేసుకోలేదు.

ఆవార్త వినబడగానే ఇంజనుక్రింద గోతిలోనూ, పక్కన చక్రాలవద్దా పనిచేస్తున్నవారంతా బిలబిలలాడుతూ

వచ్చేసేరు. అనేక ప్రశ్నలువేసి తమనాయకుని మరణవార్త వివరాలు తెలుసుకొన్నారు.

బయట నెక్కడనో ఒక ఇంజను గీపెట్టింది. ఆధ్వని విన్నవాళ్ళందరి గుండెల్లో ఆసుర్దాఘట్టించింది. దానికూత ఆగేసరికి మరోమూలనుంచి మరొకటికూసింది. దానితోపాటు మూడోది అందుకొంది ఈ ధ్వనులతో ప్రతికలుపుతూ పవర్ స్టేషన్‌లోని సైరన్ అందుకుంది. ఈ కూతలన్నింటినీ వినబడకుండా చేస్తూ కీవ్ కు బయలుదేరుతున్న ప్యాసింజరు ట్రెయిన్ తాలూకు రాక్షసిఇంజన్ గంయ్ మంది.

పెపెటోవ్కానుంచి వార్సావెళ్ళే ఎక్స్‌ప్రెస్ స్టేషనులోవుంది. ఈకూతలు ఒక్కమారు ప్రమాదసూచకంగా వినబడ్డంతో కారణం అడిగేడు. లెనిన్ మరణవార్త వినగనే ఒక్కక్షణం ఆలోచించి నెమ్మదిగా చేయిఎత్తి విజిల్ కువున్న గొలుసులాగేడు. ఈపనిచేసేక మరి తనకు ఇంజనుమీదికి ఎక్కవలసిన పనివుండదని ఆతడెరుగును. మళ్ళీ ఆతనిని ఈ రైలు నెక్కనివ్వరు. అయినా ఆతడా గొలుసులాగేడు. ఇంజను కూత ప్రారంభం కావడంతో రైలులోవున్న పోలిష్ అధికార్లూ, రాజకీయనాయకులూ ఉలికిపడి పరుగెత్తివచ్చేరు.

ప్రజలు వందలసంఖ్యలలో రైల్వేయార్డులలో గుమికూడేరు. తలుపులుతోసుకొని ఆ పెద్దభవనంలో జొరబడ్డారు. హాలులు, వరండాలు, గదులు జనంతో నిండిపోయేయి.

అందరూ నిశ్శబ్దంగావున్నారు. స్మారకసభ ప్రారంభమయింది. పెపెటోవ్కా ప్రాంతీయకమిటీ కార్యదర్శి షరాబిన్ వుపన్యాసం ప్రారంభించేడు.

"కామ్రేడ్స్! ప్రపంచ శ్రామికవర్గనాయకుడు లెనిన్ ఇకలేను. బోల్షివిక్ పార్టీని నిర్మించి, శత్రువుకు దుర్భేద్యం చేసిన ఆమహావ్యక్తి మరణించడంతో పార్టీకితీరనిలోటుకలిగింది... మనపార్టీనాయకుడూ, మనవర్గనాయకుడూ మరణించడంతో కార్మికవర్గంలో సుసమర్థులయిన యోధులంతా పార్టీలోకి వచ్చిచేరాలి..."

బ్యాండుమీద చరమగీతం ఆలాపించబడింది. సభలో వారంతా టోపీలుతీసేసేరు. పదిహేనేళ్ళ ఈ మధ్యకాలంలో ఏడ్చిఎరగని ఆర్టెమ్ వెక్కి వెక్కి ఏడ్చేడు.

* * *

రైల్వేపనివారి క్లబ్బులో సభ ప్రారంభమయింది. ఇసకవేస్తే రాలకుండావున్నారు జనం. చోటుచాలక క్లబ్బ బయట, చలిలో వొణికిపోతూ ఎందరో నిలబడివున్నారు. క్లబ్బ గుమ్మంలోవున్న ఫర్ చెట్లకొమ్మలనుంచి మంచు ముక్కలు లస్తరులా వ్రేలాడుతున్నాయి గదిలో ఉక్కకి ఊపిరాడడంలేదు.

అంతసభలో ఒక్కరుకూడా మాట్లాడటంలేదు. దుఃఖంతో అందరి గొంతులూ నిండివచ్చేయి. ఏదన్నా మాట్లాడినా గుసగుసలతోనే సంభాషణ సాగిపోతూంది. తుపానులో సరంగునుపోగొట్టుకొన్న ఓడలోనిజనంలాగ వారంతా విచారవదనాలతో వున్నారు.

బ్యూరోసభ్యులు నిశ్శబ్దంగావచ్చి తమస్థానాలలో కూర్చున్నారు. సిరోటెంకో నెమ్మదిగా గంటనెత్తి అందు

జాబులో పెట్టుకొన్నాను. నెమ్మదిగా చాయించి మళ్ళీ బల్ల మీద పెట్టేసేను. అంతా నిశ్శబ్దం.

*　　　*　　　*

ప్రధానోపన్యాసం అయిపోయాక పార్టీ కార్యదర్శి సిరోటెంకో మాట్లాడటానికి లేచేడు. పార్టీ సభల్లో సాధారణంగా అటువంటి ప్రకటనలు వినబడవు. అయినా ఆనాడు అతడు చేసిన ప్రకటన ఎవరికీ ఆశ్చర్యం కలిగించలేదు.

"తమని పార్టీలో చేర్చుకోవలసిందిగా కోరుతూ చాల మంది పనివారు దరఖాస్తు పంపించేరు. ఈ దరఖాస్తుమీద ముప్ఫయ్యేడుమంది సంతకాలు పెట్టేరు. వారి దరఖాస్తు ఇది.

'దక్షిణా-పశ్చిము రైల్వేలోని షెపెటోవ్కా స్టేషన్ బోల్షివిక్ పార్టీకి—

మన పార్టీనాయకుని మరణం బోల్షివిక్ పార్టీలోకి నూతనసభ్యులను ఆహ్వానిస్తూంది. లెనిన్ పార్టీలో చేరేఅర్హత మాకున్నదేమో విచారించవలసిందిగా ఈసభ వారిని కోరుతున్నాము."

దానిక్రింద రెండువరసలలో సంతకాలున్నాయి.

సిరోటెంకో ఒక్కొక్క పేరుచే ఆచిఆచి చదివేడు.

"స్టానిస్లావ్ జిగ్మొండోవిచ్ పోలెంటోవ్‌స్కీ—ఇంజన్ డ్రైవరు—ముప్ఫయ్యారేళ్ళ పని అనుభవం—"

సభలో అంగీకార సూచకమైన కలకలం వినబడింది.

"ఆర్టెమ్ ఆంద్రేయేవిచ్ కోర్చాగిన్-మెకానిక్-పది హేడేళ్ళ పని అనుభవం—"

"జఖార్ ఫిలిప్పోవిచ్ బ్రూజక్—ఇంజను డ్రైవరు—ఇరవయ్యొక్క ఏళ్ళ పని అనుభవం—"

రైల్వే పనివారిలోకల్లా జెట్టీలనదగిన వారి పేర్లు ఒక్కొక్కటే చదువుతున్నకొలదీ సభలో సమ్మతిసూచకమైన ధ్వనులు అంతకంత కెక్కువయ్యేయి.

పేర్లన్నీ చదవడం పూర్తిఅయ్యేక మొట్టమొదటి పేసువాడు—పోతెన్‌టోవ్‌స్కీ—మాట్లాడడానికి లేచేడు. మరల సభ నిశ్శబ్దం అయింది.

"...... నే చెప్పేటందు కేముంది? వెనకటిరోజుల్లో పనివాడి బ్రతుకు ఎల్లావుండేదో మీరందరూ ఎరుగుదురు. జీవితకాలంఅంతా బానిసలా నానాచాకిరీచేసేను. ముసలితనం వచ్చేసరికి ముష్టివారిస్థితిలో వున్నాను. విప్లవం వచ్చేసరికి సంసారభారం, పెద్దతనంతో పార్టీలోకి రాలేకపోయేను. శత్రుపక్షాన ఎన్నడూ చేరకపోయినా పోరాటాలలో ఎన్నడూ పాల్గొలేదనే చెప్పాలి. 1905లో వార్సా కార్‌షాపుల్లో సమ్మె వచ్చినప్పుడు సమ్మెకమిటీ సభ్యుడుగా వుండేవాడిని, బోల్షివిక్కుల్నే బలపరుస్తూవచ్చేను. ఆరోజుల్లో నేను మంచి పడుచుతనంలో వుండేవాడిని. మాటవస్తే దూసుకోమనే రోజులు. అయితేనేం, గతాన్ని చెప్పుకొని ప్రయోజనం ఏంవుందిలెండి. ఇలిచ్ మరణంతో నా కడుపు తరుక్కుపోయింది. మన మిత్రుడు, మన బంధువు, మన రక్షకుడు

పోయేను. ఇంక ఉపన్యాసాలు. ముసలివాణ్ణైపోయేను. నే మాట ఇంక నాతోటి కానివ్వండి. నా మనస్సులో వున్నది ఎల్లాగ చెప్పాలో అర్థం కావటం లేదు. నేను పెద్ద మాటకారిని కాదు. ఈ ఒక్కమాటే చెప్తా — నాదీ బోల్షివిక్కులదీ ఒకటే దారి. అంతే... ...”

ఆయన నెరిసిన జుట్టుగుండా చేతివేళ్ళు పోనిస్తూ ఏం చెప్తారన్నట్లు సభకేసి చూసేడు.

ఆయన నిజాయితీకి సభలో ఒక్కరుకూడా వ్యతిరేకత తెలుపలేదు. పార్టీ సభ్యులు కానివారుకూడా తమ అభిప్రాయం తెలపాలని ఆహ్వానించేరు. కాని ఎవ్వరూ పోలెన్టోవ్‌కు వ్యతిరేకం చెప్పలేదు.

ఆతనిని కమ్యూనిస్టుపార్టీలోకి తీసుకొన్నారు.

ఏదో గొప్పవిషయం తమకళ్ళముందు జరిగిపోతున్నట్లు ప్రతివారికీ అనిపించింది. పోలెన్టోవ్‌స్కీ వేదిక దిగివచ్చేడు. ఆర్టెమ్ ఆ స్థానంలో నిలబడ్డాడు. ఆతనికి తన చేతుల్ని ఎక్కడపెట్టుకోవాలో తెలియలేదు. నెత్తిమున్న టోపీ తీసి రెండుచేతులతో నలిపేస్తున్నాడు. బాగా నలిగి పాతబడి పోయిన గొర్రెచర్మపు కోటుకు బొత్తాలు తగిలించకుండా వదిలివేసేడు. లోపలవేసిన సైనికచొక్కా మెడపట్టీకున్న ఇత్తడిబొత్తాలు రెండూ తగిలించివున్నాయి. మొత్తం వేషం అంతాచూస్తే మనిషి విలాసంగా, ఖాళీగా తిరుగుతున్నవా డల్లే కనిపిస్తున్నాడు.

ఆర్టెమ్ సభనంతనూ ఒక్కమారు కలయచూసేడు. ఒక్కప్రక్కన పరిచితమైన స్త్రీముఖం కనబడింది. తమ యింటిపొరుగున వుండిన తాపీమేస్త్రీకూతురు గాలినా. తనతోపాటు కుట్టుదుకాణంలో పనిచేస్తున్న పడుచులతో కలిసి ఆమె సభకు వచ్చింది. ఆమె చిరునవ్వు తనను క్షమిస్తున్నట్లూ, తానుచేస్తున్న పనికి అంగీకారం తెలుపుతున్నట్లూ అనిపించింది.

"ఆర్టెమ్! నీవిషయం చెప్పు"-అన్నాడు సిరోటెంకో.

కాని తనవిషయం చెప్పుకోవడంఅంటే ఆర్టెమ్‌కు అంత సులభంకాదు. అంతమందిముందు నిలబడి మాట్లాడడం అలవాటొకటిలేదు. తన మనస్సులో పేరుకునివున్న భావాల నన్నింటినీ ఏలా బయటపెట్టాలో ఆతనికి అర్థం కాలేదు; సాధ్యమూ అనిపించలేదు. మాటలకోసం తడబడ్డాడు. కంగారుపుట్టింది. మరి నోట మాటరావడమే కష్టమయింది. అలాంటి చిక్కుపరిస్థితి అతని కెన్నడూ కలగలేదు. తన జీవితంలోకల్లా అతిప్రధానమైన చర్య తీసుకోబోతున్నాననీ, ఆ చర్య తన కష్టమయజీవితంలో నూతనానందాన్ని కలిగించగలదనీ అత డెరుగును.

ఎట్టకేలకు అతడు ప్రారంభించేడు.

"మేము నలుగురం వుండేవారం."

హాలు అంతా నిశ్శబ్దంగా వింటూంది. ఆరువందల మంది అతడేంచెప్తాడో యని అత్యాతురతగా వింటున్నారు.

"డబ్బున్న వాళ్ళ యిళ్ళల్లో మాయమ్మ వంటపుట్టిగా పనిచేసేది. మానాన్న ఎలావుండేవాడో నాకు ఇంచుమించు జ్ఞాపకం లేదనే చెప్పాలి. ఆయనకూ మాయమ్మకూ ఎప్పుడూ సరిపడేదికాదు. మహా తాగేవాడు. అందుచేత మమ్మల్నిం దర్నీ మాఅమ్మే సాకేది. అంతమందిని పోషించడం అంటే మాటలుకాదు. మహాకష్టపడేది. నెలరోజులూ తెల్లవారింది మొదలు రాత్రి పొద్దుపోయేవరకూ నానాచాకిరీ చేస్తే తిండి పెట్టి నాలుగు రూపాయిళ్ళు ఇచ్చేవారు. రెండేళ్ళపాటు స్కూల్లో చదివే అదృష్టం నాకు దొరికింది. అక్కడికి అదే గొప్ప. అక్కడ చదవడం, వ్రాయడం మాత్రం నేర్పేరు. నాకు తొమ్మిదేళ్ళప్పుడు అమ్మ నన్ను మెషీన్ షాపులో పనినేర్చుకోనేటందుకు వప్పజెప్పింది. ఆమె చేయగలదిమాత్రం ఏం వుంది? మూడేళ్ళపాటు అక్కడున్నా. ఆ మూడేళ్ళూ నాకింత గంజిపోయడమే నాకిచ్చిన జీతం......ఆ షాపు యజమాని ఒకజర్మనీవాడు. పేరు ఫామెక్స్టర్. మరీకుర్రవాడినని మొదట నన్ను పెట్టుకోనన్నాడు. కాని, మంచికండపుష్టివున్న వాడిని. మా అమ్మకూడా మరో రెండేళ్ళు వేసింది. ఆజర్మను వాడిదగ్గర మూడేళ్ళు వున్నానన్నాకదూ. అక్కడ నాకేమీ నేర్పలేదు. ఇంటిపనులు చేయించేడు ఆ యజమాని శుద్ధ తాగుబోతు. వానికి వోడ్కా అందించలేక నాచేతులు నొప్పులుపుట్టేవి ... వోడ్కా ఒక్కటేనా? బొగ్గులు తెమ్మనీ, ఇనుము తెమ్మనీ పంపేవాడు ... ఇంక ఆయన భార్యవుండేది నాచేత నానాచాకిరీ చేయించేది. కూరలు తరగాలి. అంట్లు తోమాలి. చెయ్యి దురదగా వుండేవో

యేమో, ఓ కారణం అని లేకుండా అస్తమానం మొడుతూం డేది. గూబలు సాగతీసేది... మొగుడు తాగుతున్నాడని ఆయనతో పోట్లాడేది. పోట్లాడి నన్ను బాదేది. ఆ దెబ్బలు తప్పించుకోనేటందుకు వీధిలోకి పరుగెత్తేవాడిని. అంతకంటె వెళ్ళడం ఎక్కడికి? మాఅమ్మ వుంటున్నచోటు అక్కడికి నలభై మైళ్ళుంది. తీరా వెడితేమాత్రం నన్ను పోషించ గలదా?...పోనీ షాపులో మాత్రం అంతకన్న బాగుందా అంటే అదీ లేదు. అక్కడి పెత్తనంఅంతా యజమాని తమ్ము డిది. వాడో పాడుపీనుగ. నన్ను ఏడిపించడంఅంటే వాడికో సరదా. పిలిచి 'ఒరేయి, ఆ పాపరుపట్రా' – అనేవాడు. తీరా పరుగెత్తివెళ్ళి తీసుకురావడానికి పట్టుకోనేసరికి చేతులు అంటుకుపోయేవి. అప్పుడే దాన్ని కొలిమిలోంచి తీసివుం టారు. మామూలుగా, నల్లగానేవున్నా ముట్టుకోనేసరికి చేతులు చుర్రుమనిపోయేవి. నేను గొల్లున మంటకు ఏడు స్తూంటె, వాడు నవ్వలేక దొర్లిపోయేవాడు. ఈ బాధలు పడ లేకపోయేను. చెప్పకుండా ఇంటికి పారిపోయేను. నన్నేం చెయ్యమనాలో అమ్మకేమీ తెలియలేదు. మళ్ళీ ఆ జర్మనీ వాడిదగ్గిరికే తీసుకెళ్ళింది. దారిపొడుగునా ఆమె యేడ్చిన యేడుపు నాకిప్పటికీ గుర్తు. మూడో ఏడాదిలో వాళ్ళు నాకు పనినేర్పడం ప్రారంభించేరు. కొట్టడం, తిట్టడం మామూలే. నేను మళ్ళీ పారిపోయేను. ఈమారు స్తారోకాన్స్టాంటినోవ్‌కు పారిపోయేను. అక్కడ వొక రొట్టెలదుకాణంలో పనికి కుది రేను. ఏణ్ణర్థంపాటు గిన్నెలూ, కప్పులూ కడగడంలో వ్యర్థం చేసుకున్నా. ఇంతలో యజమాని జూదమాడి ఫ్యాక్టరీ

అమ్మేసుకున్నాడు. నాలుగు నెలలపాటు మాకొక్క కోపెక్కు కూడా జీతం ఇవ్వలేదు. చివరకు కనబడకుండా పారిపోయేడు. అక్కడినుంచి జెర్మ్సాంకొకెళ్ళి పనిచూసుకొందామని రైలు ఎక్కేను. అక్కడ ఒక రైల్వే పనివాడు నన్నుచూసి, నా కథంతా విని జాలిపడ్డాడు. నాకేదో కొద్దిగా పనిచేతనవునని చెప్పేను. అతడు నన్ను తనపై అధికారివద్దకు తీసుకెళ్ళేడు. నేను తన మేనల్లుణ్ణని చెప్పి, ఏదన్నా పని ఇప్పించమన్నాడు. నా ఆకారంచూసి వాళ్ళంతా నాకు పదిహేడు ఏళ్ళన్నా వుంటాయనుకొన్నారు. అక్కడే మెకానికుకు సహాయం కోసం తీసుకున్నారు. ఇంక ఈనాడు నేను చేస్తున్న పనిలో నంటారా! ఇందులో ఎనిమిదేళ్ళనుంచివున్నాను. ఇంతకన్న నా గత చరిత్రనుగురించి చెప్పడానికి ఏముంది? ప్రస్తుత చరిత్ర మీ అందరికీ తెలిసిందే."

చేతిలోని టోపీతో నుదుటనున్న చెమట వొత్తుకొని ఆర్టెమ్ ఒక్క నిట్టూర్పువిడిచేడు. ఆతడు అసలు చెప్పవలసిందేదో చెప్పనేలేదు. చెప్పడం కష్టంకూడా. అయినా తప్పదు. ఎవరో ఒకరు అడిగితీరుతారు. ఆతడు ముఖం చిట్లించేడు. మరల ప్రారంభించేడు.

"విప్లవకాలంలోనే నేను పార్టీలో ఎందుకు చేరలేదు? మీలో ఎవ్వరయినా ఆ ప్రశ్న అడగవలసిందే. కాని ఏం చెప్పేది? ఇప్పటికేనా మించిపోయిందేమీ లేదు. వయస్సు మీరిపోలేదు. కాని, పార్టీలో చేరాలనే ధోరణి ఈనాటి వరకు ఎందుకు కలగలేదు? చెప్తాను. దాచవలసిందేమీ లేదు. ఆనాడు గుర్తించలేకపోయేం. జర్మనీవాళ్ళమీద

తిరగబడిననాడే 1918 లో పార్టీలో చేరివుండవలసింది. సరంగు జకరయ్ ఎన్నోమాట్లు చెప్పేడు. 1920 దాకా నేను రైఫిల్ పట్టుకోనేలేదు. గొడవలన్నీ అణిగిపోయేయి. తెల్ల సేనల్ని నల్లసముద్రం ఆవలకంటా తరిమేసి ఇంటికొచ్చేం... తర్వాత సంసార జంజాటంలో పడిపోయేను. పెళ్ళామూ, పిల్లలూ... ఇప్పుడు తెలిసివచ్చింది. లెనిన్ చచ్చిపోయేడు. పార్టీ పిలుపునిచ్చింది. అది వినబడగానే ఒక్కమారు జీవితం వేపు తిరిగి చూసుకున్నా. అంతవరకూ లోటుగా బాధ కలిగిస్తున్నదేమిటో తెలిసింది. మన ప్రభుత్వాన్ని కాపాడుకొన్నమాత్రంతో చాలదు. లెనిన్ చనిపోయినాక మనమందరం ఒక కుటుంబంలాగ కలిసివుండాలి. వుంటేనే సోవియటు రాజ్యం పర్వతంలాగ నిలబడగలుగుతుంది."

ఆ విధంగా ఎంతో అభిమానం ప్రదర్శిస్తూ మెకానిక్ తన వుపన్యాసం ముగించేడు. ఉపన్యాసం అలవాటులేకపోయినా, అనర్గళంగా ఆతనినోట మాటలు దొర్లివచ్చేయి. ఆ నాలుగు మాటలూ చెప్పేసేక ఆతని మనస్సు ఎంతో తేలికపడింది. నిటారుగా, ప్రశ్నలకోసం ఎదురుచూస్తూ నిలబడ్డాడు.

సభ అంతా నిశ్శబ్దంగావుంది. సిరోటెంకో ప్రశ్నలకోసం పిలిచేడు.

"ప్రశ్నలు వేస్తారా?"

సభవారంతా ముఖముఖాలు చూసుకున్నారు. మొదట ఎవ్వరూ ఏమీ అడగలేదు. ఇంతలో రైలులో బొగ్గు వేసే

వాడొకడు లేచేడు. ఆతడప్పుడే. సరాసరి పనిలోంచి వచ్చేడేమో నల్లగా బొగ్గులాగ వున్నాడు.

"అడిగేందుకు ఏముంది? ఆతడి నెరగనివారెవరు? అతనిని చేర్చుకోండి. పనిచెప్పండి. అంతే."

కమ్మరం పనిచేసే గిల్యాశా లేచేడు. లోనున్న ఆవేశమూ, బయటనున్న వుత్సాహంతో ఆతనిముఖం కందివుంది.

"ఈ కామ్రేడ్ మంచివాడే. బురఖాలు మార్చేరకం కాదు. నమ్మవచ్చు. సిరోటెంకో! వోటుకి పెట్టవయ్యా!"

సభలో వెనకభాగంలో కామ్సోమోల్స్ కూచ్చున్న చోటినుంచి ఒక కంఠం వినవచ్చింది.

"కామ్రేడ్ కోర్చాగిన్ వ్యవసాయంపెట్టేడు. రైతు జీవితానికీ, కార్మికభావాలకీ సమన్వయం ఏలాచేస్తాడో చెప్తే బాగుంటుంది."

సభలో ఆ ప్రశ్నకు అయిష్టం తెలుపుతూ గుసగుసలు వినబడ్డాయి. ఎవరో అసమ్మతి తెలిపేరు.

"మాబోటి పామరులకి అర్థంఅయ్యేలా చెప్పు, అదేమిటో. కబుర్లు చేతనవునుగదాయని..."

కాని, ఆర్టెమ్ సమాధానం చెప్పుకోడానికి పూనుకొన్నాడు.

"అడగవలసిందే. నేను వ్యవసాయం పెట్టినమాట నిజమే. అయినా నాకున్న శ్రామికవర్గ చైతన్యాన్ని వదులుకో లేదు. సరే. గతంలో ఏమయిందో. ఈరోజునుంచీ ఇంక

అటుపోను. నా కుటుంబాన్ని రైల్వేయార్డులకి దగ్గర్లోకి తెచ్చేసుకుంటాను. ఇక్కడే సుఖం. ఆ దిక్కుమాలినభూమి నా ప్రాణానికివచ్చినట్లు తయారయింది."

సభ్యులంతా ఆతనిని పార్టీలో చేర్చుకోనేటందుకు సమ్మతిగా చేతులు ఎత్తేరు. ఆనందంతో ఆర్టెమ్ వేదికదిగి తన స్థానంవేపు నడిచేడు. వెనుక వేపునుంచి సిరోటెంకో కంఠం వినిపించింది.

"ఏకగ్రీవంగా... ..."

తర్వాత జఖార్ బ్రూజక్ వేదికమీదికి వచ్చేడు. ఇదివరలో ఈతడు పోలెన్‌టోవ్‌స్కీకి సహాయంగా వుండేవాడు. కాని, ఈమధ్య ఆతడు స్వయంగానే ఇంజన్లు నడుపుతున్నాడు. శ్రామికుడుగా తాను గడిపిన జీవితాన్ని ఆతడు వివరించి ప్రస్తుతకాలానికి వచ్చేడు.

"నా బిడ్డలు ప్రారంభించిన పనిని కొనసాగించడం నా కర్తవ్యం. దుఃఖంతో మూలబడి వుండడం వాళ్ళకి ఇష్టంగావుండదు. నేను మూలబడి వుండడానికికాదు వాళ్ళు మరణించినది. వారి మరణంవలన ఏర్పడిన ఖాళీని భర్తీ చెయ్యాలనే ఆలోచనేనా ఇంతకాలం నాకు కలగలేదు. కాని, నాయకుడే మరణించడంతో నా కళ్ళు పిడ్డాయి. గతం గురించి నన్నేమీ అడక్కండి. ఇకముందు నూతన జీవితాన్ని ప్రారంభిద్దాం."

ఆతని కంఠం మందగించినా స్పష్టంగా, అందరికీ వినిపించింది. బాధాకరమైన ఘటనలు జ్ఞాపకంవచ్చి ఆతని

ముఖం మ్లానమయింది. సభికులంతా అతనిని పార్టీలో చేర్చుకొనేటందుకు ఆమోదం తెలుపుతూ చేతులెత్తేరు. దానిని చూసేసరికి ముఖం వికసించింది. తలవంచి అభివాదనం చేసేడు.

కొత్తగా పార్టీలోకి సభ్యుల్ని చేర్చుకొనేటందుకై ప్రారంభమైన ఈ సభ చాలా రాత్రి గడిచేవరకూ సాగింది. అందరూ ఎరిగినవ్యక్తుల్ని, ఉత్తములన్నవారినీ, జీవితంలో మచ్చ అనేది లేనివారినీ మాత్రమే చేర్చుకొన్నారు.

లెనిన్ మరణంతో లక్షలమంది కార్మికులు బోల్షివిక్-పార్టీలో చేరేరు. నాయకుడు మరణించేడు. కాని, పార్టీసభ్యులు నిరుత్సాహపడలేదు. నేలలో బాగా వేళ్ళు పాతుకున్న చెట్టు చివరకొమ్మలు నరికేసినంతమాత్రాన చచ్చిపోదు.

## ప్రకరణం 6

హోటలులోని నాట్యమందిరం గుమ్మంలో ఇద్దరు మనుష్యులు నిలబడి వున్నారు. వారిలో పొడుగాటివ్యక్తి 'పిన్స్‌నెజ్' పెట్టేడు. జబ్బకు 'కమాండెంట్' అనే అక్షరాలతో ఎర్రనిపట్టీ వుంది.

రీటా ప్రశ్నించింది.

'యుక్రేనియన్ ప్రతినిధులసభ జరుగుతున్న దిక్కు డేనా?'

పొడుగుపాటి ఆ వ్యక్తి గుమ్మానికి అడ్డుగా నిలబడ్డాడు.

"ఔను. మీ కేంకావాలి. డెలిగేట్ టికెట్టుందా?"

రీటా జేబులోంచి ఒక కార్డు తీసింది. దానిమీద "కేంద్రకమిటీ సభ్యుడు"—అనే అక్షరాలు ఉబ్బెత్తుగా గిల్టుచేయబడినవి వున్నాయి. అది చూడగానే వెంటనే ఆతడు ఆమెకు మర్యాద చూపేడు.

"వెళ్ళు కామ్రేడ్! అలా ఎడమచేతిమీదుగా కొన్ని సీట్లు ఖాళీగా వున్నాయి."

రీటా లోనికివెళ్ళి ఖాళీగావున్న ఒకసీటులోకూర్చుంది.

సభ అప్పుడే మొదలయింది. అధ్యక్షుడు ముగింపు మాటలు చెప్తున్నాడు. అతని కంఠం ఎక్కడో బాగా విన్నట్లనిపించింది.

"అఖిల రష్యా కార్మిక కౌన్సిల్ ను ఎన్నుకోవడం పూర్తి అయింది. కాంగ్రెసు మరో రెండుగంటలలో ప్రారంభం కాబోతోంది. ఒక్కమారు ప్రతినిధులపేర్లు చదువుతా వినండి."

ఆ కంఠం అకిమోవ్. ఆతడు పేర్లు చదువుకుపోతూంటే రీటా శ్రద్ధగా వింటూంది. తమపేరు రాగానే ఒక్కొక్క ప్రతినిధీ చేయి ఎత్తుతున్నాడు. వారిచేతులలో ఎర్రవీ, తెల్లవీ కార్డులు కనబడుతున్నాయి.

మధ్యలో బాగా పరిచితమైన పేరు వినబడింది—పాంక్రాటోవ్. రీటా తిరిగి చూసింది. దూరాన ప్రతినిధుల వరుసల మధ్య ఎత్తినచేయి కనబడింది. మనిషి ముఖం కనబడలేదు. పేర్లు మరల ముందుకు సాగిపోయేయి. తెలిసినపేరే మరొకటి వినబడింది.

"ఓకునేవ్ ... ..."

వెనువెంటనే మరొకటి—

"జార్ఘా ... ..."

సభ్యుల ముఖాలకేసి పరీక్షగా చూసి జార్ఘాను గుర్తుపట్టింది. ఎంతో దూరంలోలేడు. పక్కవాటుగా కూర్చుని వున్నాడు. ఆతడే. వాన్యాయే. సందేహంలేదు. ఆ ముఖం

కూడా ఏలావుంటుందో పూర్తిగా మరచిపోయింది. ఎన్ని ఏళ్ళయిందో చూసిమరి.

పేర్లు చదువుతున్నారు. హఠాత్తుగా ఒక పేరు వినబడి రీటా ఉలికిపడింది.

"కోర్చాగిన్ ... ..."

దూరాన ముందువరుసలో ఒకచేయి లేచింది. దిగిపోయింది. రీటా మనస్సు ఆవ్యక్తిని చూడాలని గుబగుబలాడిపోయింది. ఆ పేరుగల తన ప్రియమిత్రుడు ఎన్నాళ్ళక్రితమో చచ్చిపోయేడు. ఆచేయి కనబడినచోటునే కళ్ళార్పకుండా చూస్తూంది. కాని తనముందున్న ముఖాలన్నీ ఒక్కలాగే కనిపిస్తున్నాయి. రీటాలేచి గోడప్రక్కగా ముందువరసలకేసి నడిచింది.

అకిమ్ పేర్లుచదవడం పూర్తిఅయింది. జనం ఒక్కమారు లేచేరు. కుర్చీలుజరిగి బరబరలాడేయి. నవ్వులూ, కబుర్లూ వినిపించేయి. ఆ రణగొణధ్వనిని మించిపోయేలా అకిమ్ అరుస్తున్నాడు.

"బోల్షోయ్ థియేటర్లో ... ఏడుగంటలకి ... మరవకండి ..."

ఆ హాలుకువున్నది ఒకటేద్వారం. ఆ ద్వారంవేపుగా జనం తోసుకుంటూవస్తున్నారు. ఆ జనసమ్మర్దంలో తన పాతమిత్రుల్ని పట్టుకోవడం చాలకష్టం. అకిమ్ వెళ్ళిపోయేలోపున అతనిని పట్టుకోవాలి. మిగిలినవాళ్ళని అతడే చూపిస్తాడు.

కొంతమంది గుంపుగా రీటాపక్కనుంచే ద్వారంవేపు వెళుతున్నారు. వారిలో ఒకరు కోర్చాగిన్ పేరు ఎత్తడం విని పించింది.

"ఏమయ్యోవ్, కోర్చాగిన్ ! తోసుకుపోదాం నడు."

తనకు బాగా పరిచితమైన కంఠస్వరం వినబడింది. ఆ స్వరాన్ని ఆమె ఎన్నటికీ మరవలేదు.

"సరే. కానియ్యి. నడు."

రీటా చటుక్కున వెనకతిరిగింది. ఎదురుగా నల్లని, పొడుగుపాటి యువకుడొకడు ఖాకీ యూనిఫారంలో కనిపించేడు.

రీటా ఆశ్చర్యంతో కళ్ళింతచేసి అతనివంకచూసింది. మరుక్షణంలో అతడామెను కౌగలించుకొన్నాడు.

"రీటా."

ఆస్వరం పావెల్ కోర్చాగిన్ దే.

"బ్రతికివున్నావన్నమాట."

ఆ మాటలతో అతనికి కథ అర్థంఅయింది. తనమరణ వార్త నిజంకాదని ఆమె ఎరగనే ఎరగదు.

హాలులోంచి జనంఅంతా వెళ్ళిపోయారు. నగరంలోని ముఖ్యమైనబజారు, త్స్వెర్స్కాయా వీధిలోవుంది ఈ హోటలు. హోటలు హాలులోపల నిశ్శబ్దంగావున్నా కిటికీలోంచి వీధిలోబళ్ళు, మనుష్యులు వస్తూ పోతూన్నధ్వని వినిపిస్తూంది. హాలులో గడియారం ఆరుకొట్టింది. కాని, వారిద్దరికీ కాలం త్వరగా గడిచిపోతున్నట్లనిపించింది. క్షణంక్రితమే

కదా కనబడిం దనిపించింది. కాని వేళ అయిపోతూంది. ఏడు గంటలకి బోల్షోయ్ థియేటరు లోవుండాలి ఇద్దరూ కదిలేరు. మెట్లుదిగుతూ రీటా పావెల్ కేసి ఒక్కమారు పరీక్షగా చూసింది మనిషి బాగా ఎదిగేడు. తానిప్పు డాతని భుజాల దగ్గర కేవచ్చింది. ముఖం గంభీరంగావుంది. అంతకుతప్ప మనిషిలో మార్పులేదు.

"ఇప్పుడేంచేస్తున్నావు? ఎక్కడుంటున్నావు?— అడగనేలేదు."

పావెల్ చిరునవ్వు నవ్వేడు.

"కామ్‌సోమాల్ ప్రాంతీయకమిటీ కార్యదర్శిగా పని చేస్తున్నాను. దుబావా చెప్పినట్లు "గుమాస్తాగిరీ."

"దుబావాను చూసేవా?"

"ఆ. తలుచుకుంటే విచారం కలుగుతుంది.

ఇద్దరూ వీధిలోకివచ్చేరు. కార్లు గుంయ్‌మంటూ దూసుకుపోతున్నాయి. పేవ్‌మెంట్లన్నీ వస్తూ పోతూన్న జనంతో 'ఝుం' అంటున్నాయి. ఇద్దరూ ఏవేవో ఆలోచనలలో పడి బోల్షోయ్ థియేటరువరకూ మాటామంతీ లేకుండా నడిచేసేరు. వెళ్ళేసరికి థియేటరువద్ద జనంగుమికూడివున్నారు. ద్వారాలవద్ద రెడార్మీసైనికులు కాపలావున్నారు. వారిని ఏమరించి నెట్టుకొనిపోవడానికి జనం ప్రయత్నిస్తున్నారు. కాని కాపలాదార్లు ప్రతినిధులేన్నగాని లోనికి పోనివ్వడంలేదు. తమ అధికారపత్రాలను చేతిలోపట్టుకొని ప్రతినిధులు లోపలికి పోతున్నారు.

థియేటరుసమీపాన కానిస్టేబుల్ జనసముద్రం. మహా సభ ప్రారంభానికి హాజరయేటందుకూ వారికెవ్వారికీ టిక్కెట్లు దొరకలేదు. అయినా ఏదోవిధంగా లోపలదూరాలని వారి ఆలోచన. కొంతమంది తెలివిగలవాళ్ళు ప్రతినిధుల మధ్య చేరి, ఏదో ఒక రకాగితంముక్క చూపిస్తూ ద్వారంవరకూ నెట్టుకు పోగలిగేరు.

కొంతమంది ఏదో మోసంచేసి ద్వారంకూడా దాటి లోపల అడుగుపెట్టేరు. అక్కడకూర్చున్న సెంట్రల్ కమిటీ సభ్యులతో, వస్తున్న వారికి స్థానాలు చూపుతూ, పంపుతున్న కమాండెంటు పట్టుకొంటున్నారు. నిర్మొగమాటంగా బయటకు పంపేస్తున్నారు. వారి అవస్థచూసి టిక్కెట్టులేని సోదర ప్రేక్షకులు మహానందపడుతున్నారు.

సభలోకి రావాలని అక్కడచేరిన వారిలో పదోవంతు మందికికూడా థియేటరులో చోటుదొరకదు.

రీటా, పావెల్‌లు చాలశ్రమపడి ద్వారంవరకు నెట్టుకు వెళ్ళేరు. కార్లమీద, బస్సులమీద, ట్రాములమీద ప్రతినిధులు వచ్చిపడుతున్నారు. అలావచ్చినవారు ద్వారంవద్ద పెద్దగుంపు అయ్యేరు. రెడార్మీమనుష్యులూ, ఇతర ప్రేక్షకులూ వారికి దారిఇచ్చి గోడలప్రక్కగా నిలబడ్డారు. ఆసమయంలో ద్వారంవద్ద ఒక కేక వినిపించింది.

"బౌమన్ ఇన్‌స్టిట్యూట్ వాళ్ళురాండి."

"రాండి కామ్రేడ్సు! మనపక్షం నెగ్గింది."

"హుర్రా."

పావెల్, రీటాలతో కామ్‌సోమాల్ బాడ్జిధరించిన ఒక యువకుడుకూడా ద్వారంలోంచి దూరేడు. కమాండెంటు కన్నుగప్పి సరాసరి ప్రతినిధుల సీట్లవేపు నడిచేడు. మరు క్షణంలో జనం మధ్య కలిసిపోయేడు.

వెనకగా వున్న రెండుసీట్లూ చూపి రీటా వానిలో కూర్చుందామంది.

ఇద్దరూ కూర్చున్నారు.

"నిన్ను ఒకటి అడగాలనుకొన్నా. వెనకటి సంగతే ననుకో. అయినా సమాధానం చెప్పాలి సుమా. అప్పుడు మన తరగతులకు రావడం మానేసి, స్నేహం తెగ తెంపులు చేసేవు. ఏమిటి కారణం ?"

రీటా కనిపించినప్పటినుంచి ఈప్రశ్న వస్తుందనుకొం టూనే వున్నాడు. కాని, ప్రశ్నవచ్చాక పావెల్‌కు ఏం చెప్పాలో తోచలేదు. ఆమెముఖంవంక చూసేడు. ఇద్దరి చూపులూకలిసేయి. తనరహస్యం ఆమెకూ తెలుసునని అర్థం చేసుకొన్నాడు.

"ఎందుకో నువ్వూ ఎరుగుదు వనుకుంటా, రీటా. అదంతా మూడేళ్ళనాటిమాట అనుకో. కాని ఆనాడు చేసిన పని చాలతప్పు అని అనిపిస్తూంది. కోర్చాగిన్ తనజీవితంలో పెద్దవీ, చిన్నవీ అనేకతప్పులు చేసేడు. అది వాటిల్లోఒకటి."

రీటా ఒక చిరునవ్వు నవ్వింది.

"ఉపోద్ఘాతం బాగానేవుంది. ఇంక అసలు సంగతికి రా."

పానెల్ నెమ్మదిగా చెప్పుకుపోయేడు.

"అది నా సొంతానికి తప్పు అనడానికి వీలు లేదు. గాడ్‌ఫ్లై, అతని విప్లవ శృంగారమూ అంతపని చేసేయి. తను ఆదర్శాలకోసం జీవితం అంకితం చేసిన వీరపురుషుల జీవితాలు ఆరోజుల్లో తెగచదివేవాణ్ణి. వాళ్ళలా వుండాలనేది నా ఆశయం. నీమీద నాకెంతో మనస్సు వుండేది. కాని గాడ్‌ఫ్లై దానిని అణచివేసేడు. అదంతా తెలివితక్కువ వ్యవహారం అని ఈనాడు అనుకొంటున్నా. ఎంతో విచారమూ కలుగుతూంది."

"అయితే గాడ్‌ఫ్లై విషయమై నీఅభిప్రాయంమార్చుకొన్నావా?"

"లేదు. రీటా. అదేంకాదు. మన మనోబలాన్ని పరీక్షించుకొనేటందుకు అనవసరపు బాధలు పడకూడదనేది నా కిప్పుడు అర్థమయింది. గాడ్‌ఫ్లై సాహసం, కష్టసహన శక్తి, ముఖం చిట్లించకుండా, మూలగకుండా ఓర్చుకోగల ప్రతిభా, వీటిని నేను చాల మెచ్చుకుంటాను. సమాజంలోని ఏ ఒకవ్యక్తిజీవితంతోనూ పోల్చడానికి వీలులేని ఉత్తమ జీవితం గడపాలనేది నా ఆశయం."

రీటా ముఖాన చిరునగవు కనపడింది. ఆమె ఆలోచనలు భూతకాలంలో విహరిస్తున్నాయని ఆమె ముఖమే చెప్పింది.

"మూడేళ్ళక్రితం ఈమాట చెప్పివుంటే ఎంతబాగుండేది."

"బాగుండేది. నేను నీకు ఒక మామూలు స్నేహి తుణ్ణి మాత్రమే..."

"అంతకన్న ఎక్కువే అయివుండే వాడివి"

"ఆ పొరపాటు దిద్దుకోలేవూ?"

"లేదు. సాధ్యంకాదు కామ్రేడ్ గాడ్ప్లే! మించి పోయింది."

రీటా చిరునవ్వుతో తనభావాన్ని విశదీకరించింది.

"నాకో చిన్న కూతురుంది, ఎరుగుదువా? వాళ్ళ నాన్న అంటే నాకు అమిత యిష్టం. మేము ముగ్గురం విడి పోలేము."

ఆమె పావెల్ చేతిని నెమ్మదిగా తట్టింది. ఆత డెంత వ్యధ పడతాడోనని ఆమె ఎంతో భయపడింది. కాని ఆమె భయం అకారణమని గ్రహించగలిగింది. ఈ మూడేళ్ళలో అత డెంతో గట్టిపడ్డాడు. శారీరకంగానే కాదు. మానసి కంగాకూడా దృఢపడ్డాడు. తనమాట కాతని మనస్సు చాల నొచ్చుకుంది. కాని అదేమీ మాటల్లో తేలలేదు.

నేను పోగొట్టుకున్నదానికన్న పొందవలసిందే చాలా వుంది"

ఏదో మాటవరుసకు చెప్పింది కాదనీ, హృదయ పూర్వకంగా అంటున్నదే ననీ, రీటా గ్రహించింది.

వేదిక సమీపంలో వున్న స్థానాలకు పోవలసిన సమ యముఅయింది. లేచి, యూక్రేనియన్ ప్రతినిధులు కూర్చున్న ముందు వరుసల్లోకి వెళ్ళేరు. బ్యాండు ప్రారంభ

మైంది. 'భవిష్యత్తు మనదే.' – అనే మాటలు వ్రాసిన బేనర్లు హాలంతా రెపరెప లాడుతున్నాయి. వేలకొద్దిమంది హాలులో, 'బాక్సు'లలో, గేలరీలలో కూర్చుని వున్నారు. అంతు పొంతు లేని శక్తి, స్తోమతులు గల ఒక మహత్తర సంస్థలో వారంతా సభ్యులు. వేదిక వెనుక వున్న తెరమీాద "భవిష్యత్తు మనదే" అన్న మాట పెద్ద పెద్ద అక్షరాలతో చిత్రించబడింది. వేలకొలదిమంది కళ్ళు దానిమీాదనే వున్నాయి.

ఇంకా జనం వస్తూనే ఉన్నారు. మరో కొద్ది నిము షాలు గడిచేయి. తెర తొలగించబడింది. రష్యను కమ్యూని స్టు యువజనసంఘ కేంద్రకమిటీ కార్యదర్శి తడబడుతూ వచ్చి ప్రకటనచేసేడు.

"రష్యన్ కమ్యూనిస్టు యువజన సంఘం ఆరవమహా సభ ప్రారంభమయింది. విప్లవంయొక్క ఉదాత్తత, శక్తి ఆక్షణంలో కనిపించినంతగా పావెల్ కోర్చాగిన్‌కు అంతకు పూర్వం ఎన్నడూ అనుభవం కాలేదు. ఏదో చెప్పలేని ఆనందం, అభిమానం అతనిలో వుప్పొంగాయి. బోల్షివిక్ యువవీరుల మధ్య నిలబడగలిగిన అదృష్టాని కాతడు ఎంతో గర్వపడ్డాడు.

మహాసభ జరిగినన్నాళ్ళూ అతనికి వూపిరితిరక్కుండా పని తగిలింది. తెల్లవారింది మొదలు రాత్రి ప్రొద్దుపోయే వరకూ ఏదో పని. అందుచేత రీటాను మరల ఆఖరురోజునే గాని కలుసుకోవడం పడలేదు. ఆరోజున యూక్రేనియన్ ప్రతినిధులు కొందరితో ఆమె వచ్చింది.

"మహాసభ పూర్తి కాగానే రేపే వెళ్ళిపోతున్నా. మళ్ళీ మాట్లాడుకొనేటందుకు వీలుచిక్కుతుందో, చిక్కదో. అందుచేత నాడైరీ రెండు నోట్‌బుక్కులో వ్రాసిందిఇస్తాను. ఒక చీటీకూడా వుంది. పుస్తకాలు చదివి పోస్టులో నాకు పంపించు. నీతో చెప్పాలనుకొన్నా, చెప్పివుండని సంగతు లన్నీ వాటిలో చూచుకో, కనబడతాయి."

పావెల్ ఆమెతో కరచాలనం చేశాడు. ఆమె ముఖ కవళికలను మనస్సులో ముద్రించుకొనేటందుకు ప్రయత్నిస్తు న్నట్లు చాలసేపు ఆమెవంకనే చూస్తూ నిలబడ్డాడు.

అనుకొన్న ప్రకారం మరునాడు థియేటరు మెయిన్ గేటులో వారిద్దరూ ఒకరినొకరు కలుసుకొన్నారు. ఒకచిన్న పుస్తకాల కట్టనూ, సీలుచేసిన కవరునూ, రీటా అతనిచేతిలో పెట్టింది. చుట్టుప్రక్కల అంతా జనమే. కనక వారిలో ఒక్కరూ సెలవు తీసుకొంటున్నప్పు డెట్టివుద్రేకాలను ప్రద ర్శించ లేదు. రీటా కళ్ళు చెమ్మగిల్లాయి. ఆమెకు తనయెడ గల అభిమానం గల లోతులను అత డా కళ్ళలో చూచు కొన్నాడు.

మరునాడిద్దరూ చెరో రైలులోనూ చెరో దిశగానూ వెళ్ళిపోయేరు. పావెల్ ఎక్కిన బండిలోనే యూక్రేనియన్ ప్రతినిధులు చాలామంది ప్రయాణంచేస్తున్నారు. కీవ్‌నుంచి వచ్చిన కొంతమంది ప్రతినిధులు అతని బండిలో ఎక్కారు. సాయంకాలం ప్రయాణీకులంతా పక్కలు పరుచుకొన్నారు.

ఓకునేవ్ ప్రక్కనున్న బల్లమీద గుర్రుపెడుతున్నాడు. పావెల్ నెమ్మదిగా దీపం దగ్గరకు జరుపుకొని జాబువిప్పేడు.

"పావెల్ ! ఈ మాటలు నీతో చెప్పేవుండును. కాని అంతకన్న జాబులో వ్రాయడమే మేలు లే - ఒక్కటిమాత్రం గుర్తుంచుకో - మహాసభకుముందు మనం మాట్లాడుకొన్న విషయం, నీ జీవితాన్ని మోడుచేయనీయకు. నీవు మంచి మనోధైర్యం గలవాడివనీ, నువ్వా ఆమాటను మాటవరుసకు అనివుండలేదని నాకు తెలుసును. జీవితంవిషయంలో ఏదో లే అన్నట్లు నేను వ్యవహరించ లేను. హృదయపూర్వకమైన ప్రేమ వున్నప్పుడు, వ్యక్తిగత సంబంధాలు మార్పుపొందితే పొందవచ్చు. నీ విషయంలో నేను ఆ విధంగా వ్యవహరించేను. కాని యావనోద్రేకాలకు నేను లోనుకాదలచ లేదు. అందులో మన కిద్దరకుకూడా సుఖం వుండదు. కాని, నువ్వా నీ స్వవిషయంలో అంత కఠోరంగా వ్యవహరించి వుండకూడదు. పావెల్ ! మన జీవితం మొదటినుంచీ, చివరకంటా పోరాటంగానే వుండనక్కర్లేదు. నిజమైన ప్రేమకు, అందువల్ల కలిగే సుఖాలకూ జీవితంలో నిషేధాలుండ నక్కర్లేదు.

"ఇంక నీ జీవితగమ్యంగురించి, నా కేమీ ఆదుర్దా లేదు. అభివందనలు...

''రీటా''

పావెల్ ఏమేమో ఆలోచించుకుంటూ జాబును చింపేసి, కిటికీలోంచి బయటకు పారేసేడు.

రీటా యిచ్చిన నోటుబుక్కులు రెండూ తెల్లవారే సరికి చదివేసేడు. కాగితంలో చుట్టి పోస్టు చెయ్యడానికి సిద్ధం చేసేడు. ఓకునేవ్, పాంక్రాటోవ్ వగైరాలతో కలిసి అతడు ఖార్కోవ్‌లో దిగేడు. కీవ్‌లో అన్నాతో వున్న తాల్యాను తీసుకురావడానికై ఓకునేవ్ కీవుకు వెడుతున్నాడు. యూక్రేనియన్ కామ్‌సోమాల్ కేంద్రకమిటీ సభ్యులుగా పాంక్రాటోవ్‌ను ఎన్నుకొన్నారు. అతనికి కీవ్‌లో పనుంది. వాళ్ళతో వెళ్ళి, కీవ్‌లో అన్నానూ, దుబావానూ చూడాలనుకొన్నాడు పావెల్.

కీవ్‌లో పోస్టాఫీసుకు వెళ్ళి, రీటాకు పుస్తకాలపార్సెల్ పంపేడు. తిరిగి వీధిలోకి వచ్చేసరికి మిగతా అందరూ వెళ్ళిపోయేరు. ఇంక ఒంటరిగానే బయలుదేరేడు. అన్నా, దుబావాలు కాపురంవుంటున్న ఇంటిముందరే ట్రాము ఆగింది. అతడు దిగి మెట్లెక్కి రెండో అంతస్థుకి వెళ్ళేడు. మెట్లకు ఎడమచేతి ప్రక్కన అన్నా గది వుంది. తలుపు తట్టేడు. ఎవరూ పలుకలేదు. అంత ప్రొద్దున్నే పనిలోకి ఎందుకు వెడుతుంది? ప్రక్కగది తలుపు తెరుచుకొంది. నిద్రమొఖంతో దుబావా బయటకు వచ్చేడు. ముఖం బొగ్గులామాడిపోయింది. కళ్ళు గుంటలుపట్టేయి. మనిషి మాట్లాడితే ఉల్లిపాయల వాసన. సగం తెరచివున్న తలుపులోంచి లోపలమంచంమీద ఎవరో ఆడదిపడుకొన్నట్లు కనిపించింది.

అతడు తలుపులోనికి చూస్తున్నాడని కనిపెట్టి దుబావా బయటకు వచ్చి తలుపులు నొక్కేసేడు. అతని మొగంకేసికూడా చూడకుండానే మాట్లాడుతున్నాడు.

"కామ్రేడ్ బోగ్దానొవ్ కోసం వచ్చేననుకుంటూ. ఆమె ఇక్కడ వ్యాపారం లేదని నీకా సంగతి తెలియదా?

కోర్చాగిన్ అతని ముఖంలోకి పరీక్షగా చూసేడు.

"తెలియదు, ఎక్కడుంటూంది?"

దుబావా వ్యంగ్యంగా నవ్వేస్తాడు.

"చచ్చింది."

"...దుబావా లేస్తూ వెక్కిరింతగా మొదలు పెట్టేడు.

"ఊరుకో పెళదామని వచ్చేవు కాబోలు పాపం. ఖాళీభర్తీ చేయొచ్చు. మంచి సమయానికివచ్చేవు. ఫర్వా లేదు. వద్దంటుందని భయపడకు. నీమీద ఎంతో యిష్టమని అదే ఎన్నోమార్లు చెప్పిందిలే. ఈ ఛాన్సు పోగొట్టుకోకు... ఆ వేడిమీదే వెళ్ళు విరాయిద్దరి మనస్సులూ, శరీరాలూ కలుస్తాయిలే..."

పావెల్కు ఎంతో కోపంవచ్చింది. కాని మనస్సు నతి కష్టంమీద నిగ్రహించుకొన్నాడు.

"ఏమిటిల్లాఅయ్యేవు, దుబావా! ఇల్లా తయారవు తావని ఎప్పుడూ అనుకోలేదు. వెనక ఇల్లా వుండేవాడివి కాదు. ఎందుకు పాడయిపోతావు?"

దుబావా సిమెంటుగోడకు జేరబడ్డాడు. గోడ, నేల చల్లగావుంది కాబోలు. వణికేడు.

తలుపు తెరుచుకుంది. బుంగమొహం ఆడదొకర్తె కనిపించి దుబావాను పిలిచింది.

"లోపలికిరా. ఎందుకక్కడ నిల్చున్నావు?"

ఆమెకు మరోమాట అనడానికి అవకాశం ఇవ్వకుండా తలుపులు మూసేసి దుబావా అడ్డంగా నిలబడ్డాడు.

"వ్యవహారంమాత్రం బాగుంది. ఎల్లాంటి స్నేహాలు చేస్తున్నావో తెలుస్తూందా! నీగతి ఏమవుతుంది?"

ఇంక దుబావా ఒక్కమాటకూడావినిపించుకోదలచలేదు.

"నే నెవర్తి పక్కలో పడుకోవాలోకూడ నువ్వే చెప్పాలా? నీ ఉపదేశా లింక చాలించు. వచ్చినచోటికె కెళ్లు. దుబావా తాగి, బజారుముండలతో దొర్లుతున్నాడని చెప్పుకో."

పావెల్ ఆతని దగ్గరకువెళ్ళి ఆవేశాన్నీ, అసహ్యాన్నీ అణచుకొంటూ హితవు చెప్పబోయేడు.

"మిత్యా! ఆ ఆడదాన్ని వొదుల్చుకో. చెప్తున్నా విను..."

దుబావాముఖం నల్లబడింది. మరు మాట్లాడకుండా తనగదిలోకి వెళ్ళిపోయేడు.

"చవట" - అనుకుంటూ పావెల్ నెమ్మదిగా మెట్లు దిగిపోయేడు.

* * *

రెండేళ్ళు గడిచిపోయేయి. నిత్య నూతనఘటనలతో రోజులూ, వారాలూ, నెలలూ దొర్లిపోయేయి. ప్రపంచంలో మొట్టమొదటిమారు తమదేశ సంపదలను, దేశ

భవిష్యత్తును తమచేతుల్లోకి తీసుకొని పదహారు కోట్లమంది ఒక మహత్తరమైన ప్లానికతో పని ప్రారంభించేరు. యుద్ధాలలో విధ్వస్తమైన ఆర్థికవ్యవస్థని పునర్నిర్మించుకొన్నారు. దేశం బలపడింది. కొత్త ఉత్సాహం పుట్టుకొచ్చింది. పని మాని మూలబడిన ఫ్యాక్టరీలు మళ్ళీ తిరిగేయి.

ఈ రెండేళ్ళూ పావెల్ వంచినతల ఎత్తకుండా పని చేసేడు. పట్టిచే కూర్చుంటే ఆ మనిషికి తోచదు. బద్ధకంగా నిద్రలేచి పదికొట్టేసరికి నీరసంగా పక్కమీదికిచేరే స్వభావం గలవాడుకాడు. ఒక్కక్షణం వ్యర్థంచేయడం జరిగితే ప్రాణం కొట్టుమిట్టాడిపోతుంది.

ఆ రెండేళ్ళూ నిద్రకూడా సరిగాపోలేదు. రాత్రి పొద్దు పోయేవరకూ ఆతనిగదిలో దీపం వెలుగుతూనేవుంటుంది. కిటికీలవద్ద నలుగురో, అయిదుగురోచేరి ఏదోపుస్తకం చదువుకుంటూ కనిపిస్తారు. ఈ రెండేళ్ళలోనూ మార్క్సు వ్రాసిన 'కాపిటల్' మూడో భాగాన్ని క్షుణ్ణంగా చదివేడు. పెట్టుబడిదారీ విధానంలో నొప్పికలగకుండా జలగలా పీల్చి పిప్పి చేయడం ఎల్లా జరుగుతూందో వాళ్ళకి అర్థంఅయింది.

కోర్చాగిన్ పనిచేస్తున్న ప్రాంతంలోనే పనిచేయడానికి రజ్వాలిఖిన్ వచ్చేడు. జిల్లా కామ్‌సోమాల్ సంస్థకు కార్యదర్శిగా నియమించవలసిందని గుబెర్నియాకమిటీ సిఫార్సు పుత్తరం ఇచ్చి ఆతనిని పంపింది. ఆతడు వచ్చినవేళకి కోర్చాగిన్ ఏదో పనిమీదవెళ్ళేడు. ఆతడు మరల వచ్చేసరికి బ్యూరో రజ్వాలిఖిన్‌ను జిల్లాలోకి పంపించింది.

ఒక నెలరోజులుపోయేక పావెల్ రజ్వాలిఖిన్ జిల్లాకు చూడడానికివెళ్ళేడు. పెద్దగా సాక్ష్యంలేకపోయినా కొత్త కార్యదర్శినిగురించి అనేక కథలు వినిపించేయి. ఆతడు త్రాగుడు ప్రారంభించేడు. జోహుకుమ్‌గాళ్ళని చుట్టూ చేర్చుకొన్నాడు. పార్టీపనిమీద శ్రద్ధాభక్తులున్నవాళ్ళని గదిమేస్తున్నాడు. ఆ వివరాలన్నింటినీ ఆతడు బ్యూరోముందుంచేడు. అంతా విన్నాకకూడా బ్యూరోలో కొందరు రజ్వాలిఖిన్‌ను గట్టిగా మందలించి వదులుదామనేసరికి పావెల్‌కు ఎంతో తామసం కలిగింది. లేచేడు.

"ఆతనిని మళ్ళీ పార్టీలోకి తీసుకోకూడదనీ, బహిష్కరించాలనీ నా అభిప్రాయం."

ఆ ప్రతిపాదనకు అందరూ నిస్తబ్ధులయ్యేరు. అది చాల కఠోరశిక్ష అని అభిప్రాయపడ్డారు. కాని పావెల్ తన పట్టుదల విడవలేదు.

"ఆ చవటని పార్టీనుంచి త్రోసెయ్యడం అవసరం. మానవుడుగా అభివృద్ధిపొందేటందుకు ఆతనికి అన్ని అవకాశాలూ వున్నాయి. కాని కామ్‌సోమాల్స్‌లో కలియలేకపోయేడు."

పావెల్ బెరెజ్దోవ్‌లో జరిగిన ఘటనను వివరించేడు.

రజ్వాలిఖిన్ ఉగ్రుడయ్యేడు.

"వ్యక్తిగత కక్ష తీర్చుకొనేటందుకు పావెల్ పూనుకొన్నాడు. వట్టి నీలాపనింద విని ఇదంతా ప్రారంభించేడు. తన కేమన్నా సాక్ష్యంవుంటే ఎదుటపెట్టమనండి. కొర్చా

గిన్ ఏదో దొంగవ్యాపారం చేస్తున్నాడని చేనంటే, ఆమాట పట్టుకొని ఆతనిని పార్టీనుంచి బహిష్కరిస్తారా? ఏమన్నా వుంటే వ్రాతమూలకమైన సాక్ష్యం తెమ్మనండి.

"ఏంఫర్వాలేదు. కావలసిన సాక్ష్యంఅంతాతీసుకొస్తా."

రజ్వాలిఖిన్ గది విడిచిపోయేడు. ఓ అరగంటసేపు పావెల్ తన సాక్ష్యాధారంచూపి, బ్యూరోను ఒప్పించేడు. కామ్సోమాల్‌లో వుండదగనివాడుగా నిర్ణయించి రజ్వాలిఖిన్‌ను బ్యూరో బహిష్కరించింది.

*  *  *

వేసవి సెలవు లిచ్చేరు. ఒకరితర్వాత ఒకరు పావెల్ తోడి కార్యకర్తలందరూ సెలవులమీద వెళ్ళేరు. ఆరోగ్యం బాగుండనివాళ్ళు సముద్రతీర ప్రాంతాలకువెళ్ళేరు. శానిటోరియములలో వుంచేటందుకు కావలసిన ఆర్థిక సదుపాయాలు సమకూర్చుకోవడంలో వారికి పావెల్ సహాయపడ్డాడు. పనికి నలిగి, నీరసపడి వారు సెలవుదొరికేసరికి పరుగెత్తిపోయేరు. వారు చేయవలసిన పనికూడా పావెల్‌మీదనే పడింది. ఆతడు గొణగనైనా గొణగకుండా ఆ భారాన్ని తీసుకున్నాడు. వెళ్ళినవాళ్ళు ఆరోగ్యం కూర్చుకొని తిరిగి వస్తే కొత్తవాళ్ళు సెలవుతీసుకొంటున్నారు. వేసవికాలం పొడుగునా ఆఫీసులో మనుష్యులు తక్కువగానే వున్నారు. కాని, ఏపని మానుతుంది? పావెల్‌కు ఒక్కరోజుకూడా విశ్రాంతిలేదు.

వేసవి గడిచిపోయింది. ఆకురాలుకాలం, శీతకాలమూ వస్తూందంటేనే ఆతడికి భయంఅవుతూంది. గాలిమారడంతో శరీరంలో బాధలు మళ్ళీ హెచ్చుతాయి.

ఆ ఏడాది వేసవి ఎప్పుడువస్తుందాయని ఆతడు రోజులు లెక్కపెట్టుకున్నాడు. పైకి చెప్పడానికి ఒప్పుకోకపోయినా ఏటేటా తనశక్తి దిగజారిపోతూందనేది ఆతనికి అర్థం అయింది. తానున్న స్థానంలో పని చాలావుంది. ఇంక చెయ్యలేనని కాడి క్రిందపడేసి పనిచెయ్యలేని స్థితిలోవున్నట్లు సర్టిఫికెట్ తీసుకొనిపోవడమో లేక కదలగలిగినంతవరకూ అక్కడేవుండి పనిచెయ్యడమోతప్ప మూడుదారి లేదు. ఆతడు కదలగలిగినంతవరకు తనపని మానరాదనే అనుకున్నాడు.

ఒకరోజున ఏరియాకమిటీ (పార్టీ) మీటింగు జరుగుతూంది. డాక్టర్ బార్టెలిక్ సభలో పావెల్ పక్కనే కూర్చున్నాడు. ఆయన ఏనాడో బోల్షివిక్ పార్టీలోచేరి రహస్య కార్యకర్తగా పనిచేసినవాడు. ప్రస్తుతం ఆ ప్రాంతంలో ప్రజారోగ్యశాఖ డైరెక్టరుగా వుంటున్నాడు.

"కోర్చాగిన్! నువ్వు ఆరోగ్యంగా కనబడ్డంలేదు. ఎలావుంటున్నావు? మెడికల్ కమిషన్ నిన్ను పరీక్షించిందా? పరీక్షచేయించుకోలేదు అనుకున్నాఅబ్బాయి! నీవొళ్ళంతా మరమ్మతు చేయవలసివున్నట్లు కనిపిస్తూంది. గురువారం నాడు ఓమారు రా. పరీక్షచేస్తాం."

పావెల్ వెళ్ళనేలేదు. ఆతనికి తీరికలేదు. కొన్నాళ్ళు చూసి ఆయనేవచ్చి పావెల్‌ను మెడికల్ కమిషన్ ముందుకు

లాక్కుపోయేడు. ఆ కమిషన్‌లో ఆయనొక సభ్యుడు. నరము లకు సంబంధించిన వ్యాధులలో ఆయనకు ప్రత్యేక నైపుణ్యం వుంది. మెడికల్ కమిషన్ ఆయనను పరీక్షించింది" – దీర్ఘ కాలం సెలవుఇచ్చి క్రిమియాలో వుంచాలి. వైద్యం చేయిం చాలి; లేకపోతే చాల ప్రమాదకరం."

ఈ సిఫార్సుకుముందు ఆతని శారీరకరోగాల లాటిన్ పేర్ల పట్టిక ఒకటిచ్చేరు. దానివలన పావెల్‌కు అర్థం అయి నది వొక్కటే—అసలుజబ్బు ఆతని కాళ్ళల్లోలేదు. అసలు నరాలకూడలి దెబ్బతింది. ఆ దెబ్బకూడా చాలాతీవ్రమైనది.

కమిషన్ నిర్ణయాన్ని బార్టెలిక్ పార్టీ బ్యూరోముందు వుంచేరు. కోర్చాగిన్‌ను వెంటనే విడుదలచేసి, సెలవు ఇవ్వా లనే ప్రతిపాదన ఏకగ్రీవంగా ఆమోదించబడింది. ఆర్గనై జేషనల్ డిపార్టుమెంటు అధ్యక్షుడు స్విత్నేవ్ వచ్చేవరకు తనకు సెలవు ఇవ్వవద్దని కోర్చాగినే కోరేడు. మనిషి అనే వాడు లేకుండా కమిటీని వదిలిపోవడం ఆతనికి ఇష్టంకాలేదు. బ్యూరో అంగీకరించింది. బార్టెలిక్ కాదన్నా అతనిమాట సాగలేదు.

మరో మూడువారాల్లో పావెల్ సెలవుమీద వెడ తాడు. అదే అతనిజీవితంలో తీసుకొనే మొదటి సెలవు. యూపటోరియా శానిటోరియంలో ఆతనికి మంచం కేటా యింపు జరిగింది. ఆ వార్తను తెలుపుతూ ఆయనకో జాబు కూడా వచ్చింది.

ఈ మూడువారాలూ ఆతడు మరింత కష్టపడి పని సాగించేడు. ఏరియా కామ్సోమాల్ విస్తృతసమావేశం జరిగించేరు. సగంసగంగావున్న పనులు పూర్తిచేసెయ్యడానికి పూనుకొన్నాడు. పని మధ్యలో వదలిపోతే, కొత్తవాళ్ళకు అర్థంకాదని ఆతని ఆలోచన.

సముద్రతీర ప్రయాణసమయం దగ్గరపడింది. సరిగ్గా ఆ రోజుల్లోనే చాల అసహ్యకరమైన ఘటన ఒకటి జరిగింది.

నమ్మశక్యంకాని ఘటన అది.

ఆ రోజున పార్టీ ప్రచారశాఖ కార్యాలయంలో మీటింగువుంది. తనపని పూర్తిఅయ్యేక పావెల్ అక్కడికి వెళ్ళేడు. వెళ్ళేసరికి ఆఫీసులో ఎవరూలేరు. ఇతరులు వచ్చేదాకా ఏదో పుస్తకం తీసుకుని, బీరువా వెనకాల కిటికీవద్ద కూర్చున్నాడు. మరి కాస్తసేపటికి నలుగురూ వచ్చేరు. బీరువా అడ్డంవుండడంచేత ఆతడికి వాళ్ళూ, వాళ్ళకి అతడూ కనపడ్డంలేదు. కాని ఫయిలోకంఠం గుర్తుపట్టగలిగేడు. ఆతడా ప్రాంతీయ ఆర్థికశాఖలో పనిచేస్తాడు. పొడుగయినవాడు. మనిషి చూడముచ్చటగా చురుగ్గా వుంటాడు. తాగుతాడనీ, ఆడవాళ్ళవెంట పడతాడనీ చెప్పుకుంటూరు.

ఫయిలో ఒకప్పుడు పార్టిజాన్ దళాలలో పనిచేసేడు. ఆ రోజుల్లో మాఖోన్నమనుష్యుల్లోన్న, మరొకళ్ళనో తరిగేసేనని తెగ గొప్పలు చెప్పుకొంటూంటాడు. ఆతనినిచూస్తేనేచాలు పావెల్‌కు సరిపడదు. ఒకనాడు ఒక కామ్సోమాల్ పడుచు ఏడుస్తూవచ్చి పావెల్‌వద్ద అతనిమీద ఫిర్యాదు చేసింది.

ఫయిలో ఆమెను పెళ్ళిచేసుకొంటానంటూ దగ్గిరికి చేరేడట. ఇద్దరూ ఓవారం రోజులు కాపురంకూడా చేసేరట. తర్వాత అతడు వెళ్ళిపోయేడు. ఇప్పుడు కనిపించినా మాట్లాడడు. ఆ సమస్య కంట్రోల్ కమిషన్ ఎదుట విచారణకు వచ్చింది. కాని, ఆ అమ్మాయి తన ఆరోపణను సాక్ష్యంచూపలేకపోయింది. ఫయిలో బయటపడ్డాడు. కాని, పావెల్‌కు ఆ అమ్మాయి చెప్తున్నది నిజమేనని తోచింది. ఇప్పుడాతడున్నట్లు ఎరగక వాళ్ళు స్వేచ్ఛగా మాట్లాడుకుంటూంటే పావెల్ ఆశ్చర్యంతో వింటున్నాడు.

"ఫయిలో! ఎల్లావున్నదేం వ్యవహారం?"

ఆ ప్రశ్న వేసినవాడు గ్రిబోవ్. అతడు ఫయిలో ప్రియమిత్రులలో ఒకడు. ఏమీ తెలియదు. మూర్ఖుడు. సంకుచిత స్వభావుడూ. అయినా ఆతడేలాగయ్యాడో ప్రచారకుడయ్యేడు. అలా పిలిపించుకోవడం ఆతనికి మహాసరదా. ఏమీ సందర్భం లేకపోయినా తానొక ప్రచారక కార్యకర్తనని ఏదోవిధంగా చెప్తూనేవుంటాడు.

"ఒరేయి, విన్ననో పిట్టనిపట్టుకొన్నా. కొరోతయేవాని ఎరుగుదువుగా. అది లొంగేఘటంకాదన్నావు జ్ఞాపకంవుందా చూడు. మనం రమ్మంటేరాని ఆడది వుంటుందేం?"

మరో బూతు అభినయంతో ఫయిలో తన విజయవార్తను మిత్రులకు అందించేడు.

ఆమాట వినేసరికి పావెల్ మండిపోయేడు. కోపంతో వణికిపోయేడు. కొరోతయేవా మహిళాశాఖ అధ్యక్షురాలు.

తనతోపాటే ప్రాంతీయకమిటీలోకి వచ్చింది. ఉత్సాహవంతు రాలనీ, పనికి విసుక్కోదనీ, మంచిస్వభావంగలదనీ పావెల్ ఎరుగును. స్త్రీలెవరువచ్చి ఏసహాయం, ఏసలహాకోరినా జాగ్రత్తగా ఆలోచించి సమాధానం ఇస్తుంది. కమిటీలోవున్న ఇతర కార్యకర్తలకు ఆమెమీద ఎంతో అభిమానం. ఆమెకు పెళ్ళికాలేదని పావెల్ ఎరుగును. ఫయిలో మాట్లాడినది ఆమెను గురించేనని ఆతడు అర్థం చేసుకొన్నాడు.

ఇంతలో మరొకరెవరో ఫయిలో నిజాయితీని శంకి స్తూన్నట్లు నటిస్తూ రెచ్చగొట్టేరు.

"కోతలుకొయ్యకు. ఆవిడంటే మేము నమ్మం."

"కోస్తున్నానూ! మనమంటే ఏమనుకుంటున్నా వేమిటి? మహామహావాళ్ళని లొంగదీసేను. ఇది లెక్కేమిటి? ఉన్నదల్లా ఏంచెయ్యాలో,ఎల్లామాట్లాడాలో తెలిసివుండాలి. వాళ్ళధోరణి తెలిసివుండాలి. ఒకొక్కర్ని పలకరిస్తేచాలు పక్కలోకివస్తూంది. అల్లాంటిరకం. ఛస్ ! ఏం లాభంలేదు. ఇంక కొందరున్నారు. వాళ్ళు నెలరోజులైనా కదలిక చూపించరు. ప్రధానమైనది వాళ్ళ మనస్తత్వాన్ని అర్థం చేసుకోవాలి. సరిగ్గా అతికేటట్లు మాట్లాడాలి. ఒరేయ్. అదో పెద్దశాస్త్రంఅనుకో. మనకి ఇల్లాంటి వ్యవహారాలన్నీ కొట్టినపిండి."

ఫయిలో ఆత్మసంతృప్తి కనబరుస్తూ పకపకనవ్వేడు. శ్రోతలంతా రెచ్చగొట్టి, ఆతడు చెప్తూంటే నోళ్ళు తెర్ర బెట్టి వింటున్నారు.

కోర్యాగిక్ లేచేను. పిడికిళ్ళు బిగించేను. గుండెలు గుబగుబలాడిపోతున్నాయి.

"మామూలు అల్లాటప్పాకబుర్లకి కొరాతయేనా లొంగదని నాకు తెలుసు, కాని వదిలిపెట్టడం నాకు ఇష్టంగా లేదు. పైగా గిబ్సోవ్‌తో పందెంకూడా వేసేను. పన్నెండు సీసాల పోర్ట్‌వైన్ పందెం. అందుచేత కొంచెం దొంగఎత్తులు ఎత్తేను. చెప్పొద్దూ. ఒకటిరెండు మాట్లు ఇంటికెళ్ళి పరిచయం చేసుకున్నా. కాని దానివలన ప్రయోజనం వున్నట్లు కనిపించలేదు. పైగా నన్నుగురించి నానా అవాకులూ ప్రచారంలో వున్నాయి. బహుశా అవి ఆమెకూడా వినేవుండొచ్చు... పెద్దగా చెప్పడానికేముంది. ముఖాముఖీ ప్రయత్నాలు లాభంలేకపోయేసరికి ఇంక పక్కదారులు తొక్కక తప్పిందికాదు. హా. హ్హా. బలే తమాషాచేసేను. నా దుఃఖగాథ అంతా వినిపించేను. యుద్ధంలో ఎల్లా కష్టాలుపడ్డానో చెప్పేను. దేశం అంతా తిరిగేననీ, అన్నిరకాల కష్టాలు చవిచూసేననీ చెప్పేను. ఎక్కడా నామనస్సుకు నచ్చిన ఆడది దొరక్కపోవడంచేత ఇల్లా మంచంకోడులా వుండిపోయేనన్నాను. నాఅనిపలకరించే దిక్కుకూడా లేదన్నాను. అల్లాగే ఏవేవో చెప్పేను... ఆమె బలహీనత కనిపెట్టి కబుర్లుచెప్పేను. అయినా ఎంతఇబ్బంది పెట్టిందని? ఓదశలో తిట్టి లేచిపోదామనిపించిందికూడా. కాని మరి ప్రతిజ్ఞమాటేమిటి? అదొకటి వచ్చిందామె. అందుచేత వదలడానికి వీలులేదు. ఎల్లాగతేనేం ఆ పెంకితనం వదలించేను. ఏమిటనుకొన్నారేం. దానికి

మగాడి మొహంకూడా తెలియదర్రా" అక్షతయోని! అక్షత యోని !"

ఫయిలో చెప్పుకుపోతున్నాడు.

పావెల్ మహాకోపంతో అదిరిపోతూ వచ్చేడు.

"వెధవా !"

"నేను వెధవనా ? చాటునకూర్చుని ఇతరులాడు కొనే మాటలువింటున్న నువ్వెవరివి ?"

పావెల్ ఇంకా ఏదోఅన్నాడు. ఫయిలో త్రాగిన నిషాలోవున్నాడు. వెంటనే చొక్కా కాలరుపట్టుకొని గుంజ డం మొదలుపెట్టేడు.

"తిడతావటరా ?"—అంటూ ఒక్కగుద్దు గుద్దేడు.

పావెల్ పక్కనున్న ఓకు కుర్చీఎత్తికొట్టేడు. ఆదెబ్బతో ఫయిలో నేలకరిచేడు. అదృష్టవశాత్తూ ఆసమయంలో పావెల్ దగ్గర రివాల్వరు లేకపోయిందిగాని, ఫయిలో ఖతం అయి పోయేవాడే.

ఏమైతేనేం, తెలివితక్కువ పని జరిగిపోయింది. క్రిమి యాడు బయలుదేరవలసిన రోజున అతడు పార్టీకోర్టుముందు విచారణకు నిలబడవలసివచ్చింది.

నగరంలోని సినిమాహాలులో పార్టీనాయకు లంతా సమావేశం అయ్యేరు. ఈ ఘటనమీద పెద్దపెద్ద చర్చలు ప్రారంభమైనాయి. పార్టీ నీతినియమాలు, వ్యక్తిగత సంబం ధాలు గురించి తీవ్రమైన వాదోపవాదాలు జరిగేయి. అసలు

సమస్య మూలపడింది. దానికి సంబంధించిన సాధారణ సమస్యలన్నీ బయటకు వచ్చేయి. ఫయిలో మహాదుసుసుతనంగా వ్యవహరించేడు. అపహాస్యంగా నవ్వుతూ తన తల పగల కొట్టినందుకు ప్రజాకోర్టులో కోర్చాగిన్‌కు జైలుశిక్ష వేయ్యాలని బీరాలు ప్రారంభించేడు. ఎవరు ఏ ప్రశ్న అడిగినా సమాధానం చెప్పడానికి నిరాకరించేడు.

"నన్ను అడ్డం పెట్టుకొని నోటి దురద తీర్చుకుందా మనుకుంటున్నారేం? ఊహు, మీకు తోచిన నేరాలు ఆరోపించండి. నామీద ఇక్కడున్న ఆడవాళ్ళందరికి కోపమే. వాళ్ళముఖాలుకూడా చూడనని అక్కసు. మీ రేమిటో అడుగుతున్నారు. ఈ కేసే అబద్ధం ఇదే 1918 రోజులయితే ఆవెర్రిపీనుగ కోర్చాగిన్‌గాడి పని చెప్పివుండేవాడిని. ఇప్పుడు మీది రోజు. చావండి."

ఫయిలో ఇంకేమీ చెప్పడాని కిష్టపడ లేదు. ఇంకొక్క క్షణంకూడా అక్కడ నిలబడ లేదు.

పార్టీకోర్టుఅధ్యక్షుడు పావెల్‌ను పిలిచేడు. ఏం జరిగిందో చెప్పమన్నాడు.

పావెల్ అతికష్టంమీద ఆత్మనిగ్రహం చేసుకొని, తొందరపడకుండా చెప్పడం ప్రారంభించేడు.

"ఇదంతా నేను ఆత్మనిగ్రహం చూపించ లేకపోవడం చేత వచ్చింది. ఆలోచనకు పని చెప్పకుండా చేతులు మాత్రమే వుపయోగించేరోజులు గడిచిపోయేయి. ఏదో పొరపాటున జరిగిపోయింది. ఆకోపంలో ఫయిలోను కొట్టేశాను. గడిచిన కొద్దియేళ్ళ యీమధ్య ఇల్లాగ దుందుడుకుతనంగా

నాకు నేనై చర్య తీసుకోవడం ఇదే మొదలు. వాడిని కొట్టడం తప్పుకాదు గాని, కొట్టడం నాపొరపాటే. ఫయిలో లాంటివాళ్ళని చూస్తే మంట పుడుతుంది. కమ్యూనిస్టు విప్ల వకారుడు అతడిలా పశువులాగా వ్యవహరించ గలుగుతా డంటే నమ్మలేకుండా వున్నాను. నేనుచేసినది తప్పేఅయినా దాని మూలంగా మన కమ్యూనిస్టులు వ్యక్తిగత జీవితంలో ఎలావుండా లనేది నలుగురి చర్చలోకి వచ్చింది. అంతవర కది మంచిది.''

అత్యధిక సంఖ్యాకులు ఫయిలోను పార్టీనుంచి బహి ష్కరించాలని చెప్పేరు. అబద్ధపుసాక్ష్యం చెప్పినందుకు గ్రిబోవ్‌ను గట్టిగా చివాట్లు పెట్టేరు. ఈమాటు మళ్ళీ అల్లాంటి పనిచేస్తే పార్టీలోంచి బహిష్కరించాలని తీర్మా నించేరు. ఆరోజున ఆసంభాషణలో పాల్గొన్నవారంతా తమ అపరాధాన్ని స్వీకరించేరు. అందుచేత హెచ్చరికలు చేసి వదిలేసేరు.

పావెల్ నరముల బలహీనతను, అతని అనారోగ్య స్థితిని గురించి డాక్టరు బార్టెలిక్ సభముందు చెప్పేడు. అటు తర్వాత పావెల్ పనిని ఖండించాలని ఎవరన్నా చెప్పినా సభవారు స్వీకరించే స్థితిలోలేరు. అతనిమీాది కేసును తీసే సుకొన్నారు. పావెల్‌ను విడుదల చేసేరు.

*　　　　*　　　　*

కొద్దిరోజులకు పావెల్ ఖార్కోవ్ బయలుదేరేడు. తనను పనినుంచి విడుదల చేయవలసిందని అతడు పదేపదే

కోరగా ప్రాంతీయకమిటీ చిట్టచివరకు అంగీకరించింది. అతనిని యూక్రేనియన్ కామ్‌సోమాల్ సంస్థకు వప్పచెప్పింది. మంచి కితాబు ఇచ్చేరు. అకిమ్ కేంద్రకమిటీ కార్యదర్శులలో ఒకడు. ఖార్కోవ్ చేరగానే పావెల్ అతనిని కలుసుకొని జరిగిన కథ అంతా చెప్పేడు.

అకిమ్ పావెల్ తెచ్చిన పత్రం తీసుకొన్నాడు. "పార్టీయెడ అంతులేని విశ్వాసం" వున్నదని దాంట్లో వ్రాసి వుంది. ప్రక్క నింకో వాక్యం.

"మంచి ఆలోచనాపరుడే, కాని ఒక్కొక్కప్పుడు ఆత్మనిగ్రహాన్ని కోల్పోతుంటాడు. ఆయనలో ఏర్పడిన నరాల బలహీనతే దీనికి కారణం."

అకిమ్ దానిని చదివేడు.

మంచి కితాబే ఇచ్చేరు. కాని, ఆ ఘటనతో దాని గొప్పతనం కాస్తా పోయింది. సరిలే. ఏం చేస్తాం? ఎంతో జాగ్రత్త అయినవాడికికూడా అల్లాంటివి తటస్థపడతాయి. దిగువకు వెళ్ళు. ఆరోగ్యం కుదటపడ్డాకరా. అప్పుడు నీకిచ్చే పనేమిటో ఆలోచిద్దాం."

అకిమ్ అతనికెంతో ఆప్యాయంగా వీడ్కోలిచ్చాడు.

*　　　*　　　*

కేంద్రకమిటీ అధీనంలో వున్న కమ్యూనార్డ్ శానిటోరియానికి పావెల్ చేరేడు. గులాబీవనం మధ్య, జలయంత్రాలు చిమ్మే నీటిధారల మిలమిలలో తెల్లని శానిటోరియం

భవనాలున్నాయి. వానిచుట్టూ ద్రాక్షపందిళ్ళు. ఆ ప్రదేశం అంతా వేసవి సెలవల్లో ఆరోగ్యం చేకూర్చునేటందుకు వచ్చినవారితో నిండివుంది ... ఒక లేడీడాక్టరు పావెల్ పేరును రిజిష్టరులో వ్రాసుకొంది. ఆ పెద్దభవనంలో ఒక చివరగా వున్న విశాలమైన గది నొకదానిని ఆయనకు కేటాయించేరు. గది అంతా అతినీటుగావుంది. పక్క బట్టలు తెల్లగా మెరిసిపోతున్నాయి. వాతావరణం అతి ప్రశాంతంగా వుంది.

పావెల్ వస్తూనే స్నానంచేసి బట్టలు మార్చుకొన్నాడు. బీచ్‌కి బయలుదేరేడు.

అతడు కూర్చున్నచోటికి ఎదురుగా కనుచూపుమేర వరకూ చలవరాయి పరిచినట్లుగా సముద్రం ప్రశాంతంగా కనబడుతూంది. దూరాన దిగంతాలు కలిసినచోట ఎర్రని సూర్యకాంతి నీటిమీద జాలువారుతూంది. అరుణోదయ కాలపు మసకవెలుతురులో దూరాన పర్వతాల నల్లని ఆకారాలు ఆకాశపు టంచుల్లో మలిచినట్లుగా కనబడుతున్నాయి. ఆ స్వచ్ఛమైన సముద్రపుగాలిని ఊపిరితిత్తులలో నింపుకొంటూ, ఆ ప్రశాంత నీలసముద్రదృశ్యాన్ని చూసి, అతడు ఆనందించేడు.

ఒక తరంగం నెమ్మదిగా దొర్లుకుంటూవచ్చి అతని పాదాలను తాకి తిరిగిపోయింది.

# ప్రకరణం 7

కేంద్రకమిటీ శానిటోరియానికి వెనకనే సెంట్రల్ పోలీక్లినిక్ వుంది. శానిటోరియంలో వుంటున్నవాళ్ళు బీచి నుంచి తిరిగి వచ్చేటప్పుడు పోలీక్లినిక్ ఆవరణకు అడ్డుపడి రావడం మామూలు. పోలీక్లినిక్ ఆవరణ గోడపక్కన ఒక ఖర్జూరపుచెట్టుంది. దాని క్రిందనున్న రాతిసోఫామీద పావెల్ ఒక్కడూ ఆ ప్రశాంత వాతావరణంలో విశ్రాంతిగా కూర్చుంటూ వుంటాడు. తోటల్లో వస్తూ, పోతూండే జనం అక్కడినుంచి కనిపిస్తూంటారు. శానిటోరియంలో సాయం కాలంపూట వాయించే బ్యాండుసంగీతాన్ని వింటూ ఆనం దించవచ్చును.

ఆరోజునకూడా ఆతడు అక్కడికే వచ్చేడు. సముద్ర స్నానం, ఆతపస్నానం అయ్యేక బద్ధకంగా ఆ రాతిసోఫా మీద పడుకొని కునుకుతున్నాడు.

తువ్వాలు పక్కనే ఆరవేసేడు. దానిప్రక్కనే కుర్చీ మీద ఫర్మానోవ్ వ్రాసిన 'తిరుగుబాటు' నవల వుంది.

శానిటోరియంలోకి వచ్చేకకూడా ఆతని తలపోటు తగ్గలేదు. ఆతనిజబ్బు ఏమిటో డాక్టర్లకు అంతుచిక్కలేదు.

ఈ బాధలకు మూలం ఎక్కడుందో పట్టుకోవాలని వాళ్ళింకా తంటాలుపడుతూనేవున్నారు. అస్తమానం ఎవరోఒకరు పరీక్షిస్తూనేవున్నారు. ఆ పరీక్షలకు విసుగు పుడుతూందికూడా. ఎంత బాధగావుందంటే—తనవార్డు డాక్టరుక్కూడా దొరక్కుండా తప్పించుకోవడం ప్రారంభించేడు. వార్డు డాక్టరమ్మ చాల మంచిది. పార్టీ సభ్యురాలు. తమాషాయైన పేరు—యెరుసాలిమ్‌చిక్. పావెల్ ఎక్కడున్నాడో పట్టుకొని, ఏ స్పెషలిస్టునో కలుసుకొనేటట్లు వొప్పించడానికి ఆమె తల ప్రాణం తోకకువస్తూంది.

"అబ్బ! విసువుపుట్టి పోతూందమ్మా! రోజుకు ఓ అరడజనుమాట్లు చెప్పిందేచెప్పడం! పైగా నానాఅభంద్రా ప్రశ్నలూను. మీ అమ్మమ్మకిగాని కొసవెర్రి వుండేదా? ముత్తాత తండ్రికి కీళ్ళనెప్పు లుండేవా? ఏమిటీ ప్రశ్నలు. వాళ్ళకేం రోగాలుండేవో నేను చూసేనా? నే పుట్టి బుద్ధి ఎరిగినాక వాళ్ళ మొగంకూడా చూడలేదు. నాకు సెగ రోగమో, సవాయిరోగమో వున్నదని చెప్పించాలనే ప్రతి డాక్టరు తాపత్రయమూ. తలకెంకె ఎగరకొడతానవేవరకూ వదలరే. నన్ను కాస్త విశ్రాంతిగా వుండనీయండి. అంతే చాలు. ఇక్కడవుండే ఆరువారాలు పరీక్షల్లోనే గడపవలసివస్తే నిజంగా పిచ్చెత్తిపోతూంది. ఎవరి తలో పగలకొట్టినా ఆశ్చర్యపడొద్దు."

యెరుసాలిమ్‌చిక్ ఆతని మాటలకు నవ్వుతుంది. హాస్యమాడుతుంది. ఓ పదినిముషాలు ఆ కబుర్లూ, ఈ కబుర్లూ

చెప్పి రెక్కపట్టుకొని లేవదీస్తుంది. బాతాఖానీ వేస్తూ ఇద్దరూ నర్సుదగ్గరకు వెళతారు.

ఈవేళ అటువంటి పరీక్షలేమీ లేవు. భోజనానికి ఇంకో గంట వ్యవధివుంది. అందుచేతనే విశ్రాంతిగా కళ్ళు మూసుకొని పడుకోగలిగేడు. ఇంతలో ఎవరో వస్తున్నట్లు అడుగులచప్పుడయింది. అతడు కళ్ళు తెరవలేదు. "నిద్ర పోతున్నాననుకొని వాళ్ళే లేచిపోతారులే"—అనుకొన్నాడు. కాని ఆ ఆశ ఫలించలేదు. పక్కనేవున్న కుర్చీ కిర్రుమంది. వచ్చినవాడు ఎవరో దాంట్లో కూర్చున్నాడు. సన్నని పరిమళం గాలిలో తేలివచ్చింది. కూర్చున్నవా రెవరో ఆడుదన్నమాట. కళ్లు తెరిచేడు. తెరవగానే కనిపించినది తెల్లగా మిలమిలలాడిపోతున్న గౌను. మెత్తని స్లిప్పర్లు తొడిగిన కాళ్ళు. ఇంకాస్త తెరిచేసరికి మగవాడల్లే కత్తిరించిన బాబ్డ్ జుట్టు. రెండు పెద్దకళ్ళు. ఎలకపళ్ళలా చిన్నగా, సన్నగావున్న పలువరస. పావెల్ కళ్ళు తెరవగనే ఆమె చిరునవ్వు వెలయించింది.

"నిద్రాభంగం చెయ్యలేదుగదా ?"

పావెల్ సమాధానం ఇవ్వలేదు. అది మర్యాదకాదని ఎరుగును. కాని, ఆమె అక్కడుండడం అతనికి ఇష్టంలేదు.

ఆమె కుర్చీలోవున్న పుస్తకంతీసి పుటలుతిప్పింది.

"మీదా ?"

"ఊఁ."

ఒక్కక్షణం నిశ్శబ్దం.

“మీరు కమ్యూనార్డ్ శానిటోరియానికి వచ్చేరు కదూ?”

పావెల్ అయిష్టంగా అటుఇటు కదిలేడు. తన్ను వదిలి పోకుండా వుండేం ఖర్మం? మంచివిశ్రాంతే. ఇంక నారోగం ఏమిటని ప్రశ్నలు ప్రారంభిస్తుందికాబోలు. ప్రశ్నలు ప్రారంభిస్తే లేచిపోవలసిందే.

“కాదు.”

“మిమ్మల్ని అక్కడచూసిన జ్ఞాపకం ?”

పావెల్ లేచి పోవాలనుకొంటుండగా వెనకనుంచి మరొక కంఠం వినిపించింది.

“ఏమిటి దోరా! ఏంచేస్తున్నావు?”

పావెల్ కళ్లు పూర్తిగా విప్పేడు. బీచి దుస్తులలో ఒక పడుచు దోరా ప్రక్కన కుర్చీచేతిమీద ఆనుకొని కూర్చుంది.

ఆమె కోర్చాగిన్ ముఖంవంక పరీక్షగా చూసింది.

“కామ్రేడ్! మిమ్మల్ని ఎక్కడో చూసిన గుర్తు. మీది ఖార్కోవ్ కాదూ?”

“ఔను.”

“మీరెక్కడ పనిచేస్తున్నారు?”

ఈ సంభాషణను తెంచెయ్యాలనుకొన్నాడు, పావెల్.

“వెంటా, తుక్కూ ఊడ్చే శాఖలో”

ఆమె పక్కున నవ్వేసరికి కోర్చాగిన్ వులికిపడ్డాడు.

“మీరు కోపంగా వున్నట్లున్నారు?”

ఆవిధంగా వారిద్దరిమధ్యా స్నేహం కలిసింది. ఖార్కోవ్ పట్టణకమిటీ బ్యూరోలో దోరాకోడ్కినా సభ్యురాలు. ఆ తర్వాత ఇద్దరిపరిచయం పెరిగాక ఆమె ఆనాటి ఘటన జ్ఞాపకంచేసి పకపకా నవ్వుతూనేవుండేది.

*　*　*

ఒకరోజు మధ్యాహ్నం తలాసా శానిటోరియంలో ఆరుబయలు డాన్సు జరుగుతున్న సమయంలో పావెల్ జార్కీను చూసేడు. అందులోనూ చిత్రంఏమిటంటే 'ఫాక్సు ట్రాట్' నాట్యంలో ఇద్దరూ ఒకరికొకరు సందర్భపడడం.

చాలా వుద్రేకకరమైన పాట—"యౌవనావేశాల ప్రజ్వలరాత్రులు"—పూర్తికాగానే ఒక జంట నాట్య రంగంలోకి వురికింది. వారిలో మగవానినెత్తిన ఎర్రనిటోపీ వుంది. మొల నేవో మెరుస్తున్న జాలువంటిదుంది. చొక్కా కాలరు కొట్టవచ్చినట్లు కనబడుతూంది. మెడలో విల్లుమాదిరి 'టై' బిగించేడు. అంతే. ఆటవికుడి వేషాన్ని అనుకరించాలనే తాపత్రయంకాబోలు. ఆయన సహచరురాలు బుట్ట బొమ్మలా, గుడ్డలమూటలా వుంది. శానిటోరియంలోని రోగుల మంచాలకూ, కుర్చీలకూ వెనక నిలబడివున్న జనం వినోదంగా వ్యాఖ్యానాలు చేస్తూవుంటే ఆ జంట 'ఫాక్సు ట్రాట్' ప్రారంభించేరు. మహా అసహ్యంగా వుంది. ఆ వేషమూ, ఆ నాట్యమూ, దుబ్బగావున్న ఆ మగాడూ, ఆతని నంటిపెట్టుకొని పట్టుకొన్న ఆ భూతకీ రంగంమీద అసభ్యకరమైన అభినయం చేస్తున్నారు. పావెల్ వెనకవేపున

ఎవరో లావుపాటిఆయన ఆవేశంతో వాగరుస్తున్నాడు. లేచిపోదామని బయలుదేరుతూంటే ముందుపంక్తిలోంచి కేకవినిపించింది.

"ఈ రంకుగోల ఈపాటికి చాలు."

ఆ కేక జార్కీది.

పియానో వాయించేవాడూ, ఫిడేలువాడు వాయించడం నిలిపేరు. వేదికమీదవున్న జంట మెలికలు తిరగడం మాని నిలబడ్డారు. కుర్చీలూ, మంచాలూ వెనకనున్న జనం ఈలలూ, కేకలూ మొదలుపెట్టారు.

"నాట్యం చేస్తూంటే ఆ వద్దనడం ఏమిటి?"

"యూరపులో డ్యాన్సు చేయడంలేదా?"

"మహా అన్యాయం."

కమ్యూనార్డ్ శానిటోరియంలో విశ్రాంతి తీసుకొంటున్న చెరెపోనెట్సు, కామ్‌సోమాల్ కార్యదర్శి సెరోవ్జా జుబానోవ్ వేళ్ళు నోట్లోపెట్టుకొని చెవులు గింగుర్లు ఎత్తేలాగ ఈల వేసేరు. ఆయనవెనక మరికొందరు. ఆ గొడవతో నాట్యానికిదిగిన జంట వేదికనుంచి జారుకుంది. ఆ వినోదప్రదర్శనాల అధిపతి వచ్చి తమబ్రూపు వెళ్ళిపోతూందని ప్రకటించేడు.

"పెంట వొదులుతుంది."

నలుగురూ పకపక నవ్వేరు.

పావెల్ ముందుకువెళ్ళి జార్కీను కలుసుకున్నాడు. ఇద్దరూ పావెల్‌గది కెళ్ళేరు. కూర్చుని చాలసేపు బాతా

ఖాసి వేసేరు. పార్టీ ప్రాంతీయకమిటీ ఒకదాంట్లో ఆందోళన, ప్రచారశాఖలో తాను పనిచేస్తున్నట్లు జార్కా చెప్పేడు.

"నేను పెళ్ళిచేసుకున్నాను, తెలుసా? త్వరలోనే బిడ్డతండ్రినికూడా కాబోతున్నాను."

పావెల్ ఆశ్చర్యం ప్రకటించేడు.

"పెళ్ళిచేసుకొన్నావా? ఎవరిని?"

జేబులోంచి ఒకఫొటో తీసి జార్కా అతనిచేతి కిచ్చేడు.

"గుర్తుపట్టగలవా?"

జార్కాపక్కన అన్నాబోర్హార్ట్.

పావెల్‌కు మరింత ఆశ్చర్యం కలిగింది.

"దుబావా ఏమయ్యేడు?"

"మాస్కోలో వుంటున్నాడు. పార్టీలోంచి బహిష్కరించేక యూనివర్సిటీనుంచి వెళ్ళిపోయేడు. ఇప్పుడు బౌమన్ టెక్నికల్ ఇన్‌స్టిట్యూట్‌లో వుంటున్నాడు. అతడిని మళ్ళీ తీసుకొన్నారన్నారు. అదే నిజంఅయితే చాల చెడుగే నంటాను పూర్తిగా చెడిపోయేడు మనిషి. ఇప్పుడు పాంక్రాటోవ్ ఏంచేస్తున్నాడో తెలుసా? షిప్‌యార్డులో అసిస్టెంట్ డైరెక్టరు మిగిలినవాళ్ళసంగతి నాకు అట్టే తెలియదు. ఒకళ్ళకొకళ్ళం దూరం అయిపోయేం. దేశం తలోమూలకీ చెదిరిపోయేం. అప్పుడప్పుడోమాటు కలుసుకొని వెనకటిరోజులు జ్ఞాపకం చేసుకొంటూంటే బాగావుంటుంది."

డోరా, ఆమె వెనక ఇంకా కొందరు గదిలోకి వచ్చేరు. ఆమె జార్కీ కోటునవున్న పతకం చూసి పావెల్‌ను ప్రశ్నించింది.

"మీా మిత్రుడు పార్టీసభ్యుడేనా? ఎక్కడ పని చేస్తున్నారు?"

ఏంచెప్పాలో తోచక పావెల్ తికమకపడి ఏవో నాలుగు మాటలు చెప్పేడు.

"అయితే ఆయన వుండడానికేమీా అభ్యంతరంలేదు. ఈ కామ్రేడ్సు ఇప్పుడే మాస్కోనుంచి వచ్చేరు. అక్కడి పార్టీసంగతులు చెప్తారు. నీ గదికివచ్చి ఒకమాదిరిగా పార్టీ సభ్యుల సమావేశం జరుపుకొందా మనుకొన్నాం."

పావెల్ జార్కీలుతప్ప మిగతా అందరూ ఎంతో కాలంనుంచి పార్టీసభ్యులుగా వున్నవారే. బార్తాషేవ్ మాస్కో కంట్రోల్ కమిషన్ సభ్యుడు. ట్రాట్‌స్కీ జినో వీవ్, కామనేవ్‌లు ప్రారంభించిన నూతన ప్రతిఘటన పార్టీని గురించిన సంగతులు ఆయన చాలాచెప్పేడు.

"ఈ క్లిష్టసమయంలో ఎవరిస్థానాలలో వారుండాలి. నేను రేపు బయలుదేరిపోతున్నా."-అని ఆయన ముగించేడు.

ఇది జరిగిన మూడోరోజుకల్లా శానిటోరియం ఇంచుమించు ఖాళీ అయిపోయింది. పావెల్ కూడా నియమితకాలం ముగియకుండానే బయలుదేరేసేడు.

కామ్‌సోమాల్ కేంద్రకమిటీకూడ ఆయనను ఆపడానికి ప్రయత్నించలేదు. పారిశ్రామిక కేంద్రాలలో ఒకచోట

ఆతనిని కొమ్సోమోల్ కార్యదర్శిగా నియమించేరు. వారం తిరగకుండా అక్కడ పట్టణశాఖ సమావేశంలో ఆతడు వుపన్యాసం ఇచ్చేడు.

ఆ సంవత్సరం ఆకురాలుకాలంలో పావెలూ, మరి ద్దరు పార్టీకార్యకర్తలు ప్రయాణంచేస్తున్న కారు మంచులో జారి ఒక గోతిలోపడింది.

కారులో వాళ్ళంతా గాయపడ్డారు. పావెల్ కుడి మోకాలు చితికిపోయింది. కొద్దిరోజులతర్వాత ఆయనను ఖార్కొవ్‌లోవున్న సర్జికల్ ఇన్‌స్టిట్యూట్‌కు చేర్చేరు. డాక్టర్లు ఎక్స్‌రే పరీక్ష చేసేరు. చివరకా కాలుకు వెంటనే ఆపరేషన్ జరగాలని నిర్ణయించేరు.

పావెల్ సరేనన్నాడు.

మెడికల్ కమిషన్ అధ్యక్షుడు లేచేడు. ఆయన వెనకనే మిగిలినవాళ్ళూ లేచేరు.

"అయితే రేపుపొద్దున్న."

ఒక చిన్నవార్డు. అందులో వొకేమంచం వుంది. వార్డు చాలపరిశుభ్రంగా, అందంగా, హాస్పిటల్ మందుల వాసన వేస్తూవుంది. పావెల్ అటూ ఇటూ చూసేడు. మంచంపక్కన తెల్లని గుడ్డపరచిన కుర్చీబల్ల ఒకటుంది. అంతే.

నర్సు భోజనం తీసుకువచ్చింది. పావెల్ తిప్పేసేడు. మంచంమీదే కూర్చుని ఉత్తరాలు వ్రాసుకొన్నాడు.

మోకాలు బాధకి ఆలోచనలు తోచడంలేదు. ఆ బాధమూలంగానే తిండి తినాలనిపించలేదు.

నాలుగు వుత్తరాలు వ్రాసి పక్కనపెట్టేడు. నాలుగోది ముగిస్తూండగా తెల్లటిగౌనూ, టోపీపెట్టిన ఒక పడుచు నెమ్మదిగా తలుపుతోసుకొని లోన ప్రవేశించింది.

గదిలో మసకచీకటిగావుంది. ఆ గుడ్డివెలుతురులో ఆమె సన్నని కనుబొమ్మలూ, పెద్దపెద్ద కళ్ళూ అస్పష్టంగా కనిపించేయి. ఆమెచేతిలో పోర్టుఫోలియోవుంది. రెండో చేతిలో ఒక కాగితమూ, పెన్సిలూ వున్నాయి.

"నేను ఈ వార్డులో డాక్టర్ని. నిన్ను బోలెడు ప్రశ్నలు వేయవలసివుంది. నీకిష్టంవుండనీ, లేకపోనీ సమాధానాలివ్వక తప్పదు."

ఆమె మధురమందహాసం ప్రశ్నల విసుగును పోగొట్టింది. తన్నుగురించేకాదు, తాతముత్తాతల్ని గురించికూడా ఏకరువుపెడ్తూ పావెల్ గంటకుపైగా ఆమెతో గడిపేడు.

*　　　*　　　*

...ఆపరేషన్‌గది. మూతులమీదా, ముక్కులమీదా గాజ్‌గంతలతోవున్న జనం. నికెల్ పనిముట్లు మెరిసిపోతున్నాయి. ఒక పొడుగాటిబల్ల. దానిక్రింద పింగాణీబేసిన్.

పావెల్ బల్లమీద పడుకొంటున్నప్పటికింకా డాక్టరు చేతులు రుద్దుకుంటున్నాడు. మిగిలినవాళ్ళు ఆపరేషన్‌కు కావలసిన ప్రయత్నాలు హడావిడిగా చేసుకుపోతున్నారు.

పావెల్ వెనుతిరిగిచూసేడు. నర్సు పిన్సెట్‌లనూ, లాన్సెట్‌లనూ నీటుగా అమరుస్తూంది.

హౌస్‌డాక్టరు బాజనోవా ఆతని కాలు కట్టు విప్పుతూంది–"వెనక్కి చూడకు, కోర్చాగిన్! బెదురుపుడుతుంది."

పావెల్ వెక్కిరింతగా నవ్వేడు – "ఎవరికి, డాక్టరు!"

కొద్దినిముషాలతర్వాత తల కొక బుట్టలాంటిది తగిలించేరు. అది చాల బరువుగా వుంది. వెలుపలనుంచి డాక్టరు గొంతు వినిపిస్తూంది.

"క్లోరోఫారమ్ ఇస్తున్నాం. ముక్కుతో గాలి గట్టిగా పీల్చు. అంకెలు లెక్కపెట్టు."

బుట్టమూతలోంచే పావెల్ సమాధానం ఇచ్చేడు.

"అల్లాగే. కాని ఒళ్ళెరగనిదశలో ఏమన్నా అన్నా క్షమించండేం."

డాక్టరు చిరునవ్వు నవ్వుకున్నాడు.

క్లోరోఫారం చుక్కలు ఉక్కిరిబిక్కిరిచేసే తియ్యని వాసన.

పావెల్ గట్టిగా పీల్చుకున్నాడు. స్పష్టంగా వుచ్చరించడానికి ప్రయత్నిస్తూ లెక్కబెట్టడం ప్రారంభించేడు. విషాదాంత నాటకం ప్రథమాంకం ముగిసింది.

* * *

ఆర్టెమ్ కవరుచించేడు. మనస్సులో ఏదో బెదురుగా వుంది. చేతులు వణుకుతుండగా కాగితం పైకితీసేడు. అదు

ర్దాతో మొదటిపంక్తులు గబగబ చదివేసు. తర్వాత కాగి
తం అంతా ఒక్కమారు తిరగేసేసు.

“ఆర్టెమ్! మనం ఒకరికొకరం తరుచు జాబులు వ్రాసుకోవడమే లేదు. ఏడాదికోమాటో, రెండుమాట్లో, అంతే. కాని, ఎన్నాళ్ళకోమారు వ్రాసుకుంటామన్నది ముఖ్యం కాదు. బంధనాలు తెంచేసుకొనేటందుకు నువ్వు కుటుంబంతోసహా షెపెటోవ్కానుంచి కజాటిన్ రైల్వేయార్డులకి కాపురం మార్చినట్లు వ్రాసేవు. స్త్యోషాదీ, ఆమె బంధువులదీ చిన్నరైతుల మనస్తత్వం. అదే నీకు బంధనంగావుంది. స్త్యోషాలాంటివాళ్ళని మరమ్మతుచేయడం కష్టం. మకాం మార్చినా నీ ఆశయం సఫలమవుతుందనే నమ్మకం నాకు లేదు. వయస్సు వచ్చింతర్వాత చదవడం కష్టంగావుందంటావు కాని, బాగానే చదువుతున్నట్లు కనిపిస్తూందే. ఫ్యాక్టరీని విడిచిపెట్టననీ, సిటీసోవియట్ ఛైర్మన్ అధికారం తీసుకోననీ నిరాకరించడం సరియైనపనికాదు. సోవియట్ అధికారం ఏర్పడ్డానికై నువ్వుకూడా తుపాకీ పట్టలేదా? అల్లాంటప్పుడు అధికారపదవి తీసుకోడానికేం? రేపే పట్టణ సోవియట్ అధ్యక్షపదవి తీసుకో. పనిచెయ్యి.

“ఇంక నా విషయం. నాజబ్బుఏమిటో అర్థంకావడం లేదు. తరుచుతరుచుగా హాస్పిటళ్ళకి చేరుతున్నా. ఇక్కడికి రెండుమాట్లు తరిగి చెక్కలుతీసేసేరు. రక్తం, బలం క్షీణించింది. కాని, ఇదంతా ఎప్పుడుముగుస్తుందో ఎవ్వరూ చెప్పడంలేదు.

"నేను చేసేపని వదిలేసేను 'కోగిస్ట్'ప్రయోగం తీసుకున్నాను. ఎంతో బాధ ఓర్చుకుంటున్నాను. ఇంతకీ ఫలితం ఏమంటే నా కుడిమోకాలు కదలకుండా చేసింది. ఒళ్ళంతా గాయాలమచ్చలు. ఇంక ఇప్పటికి వాళ్ళు కనిపెట్టిందేమిటో చెప్పనా? పదేళ్ళక్రితం నా వెన్నెముకకు ఏదో దెబ్బతగిలింది. దానివలన ఏదో చాలా వ్యవహారం బెడిసీలా వున్నదంటారు. మళ్ళీ పనిలోకి వెళ్ళే అవకాశంవుంటే ఎంత బాధకైనా సిద్ధమే.

"పనికిరాకుండా పోవడంకన్న జీవితంలో దురదృష్టకరమైనది లేదని నాభావం. అటువంటి అవసరం ఏర్పడుతుందన్నా నామనస్సు వొప్పుకోడంలేదు, అందుకే వాళ్ళు ఏంచేస్తామన్నా నేనేమీ మాట్లాడ్డంలేదు. అయినా పెద్దగా ప్రయోజనం లేకుండావుంది. మబ్బులు మూసుకుపోతున్నాయి, అంతకంతకి. మొదటి ఆపరేషన్ అయ్యాక నడవగల ఓపిక రావడంతోనే పనిలోచేరేను. కాని, ఎంతోకాలం గడవకుండానే మళ్ళీ లాక్కొచ్చేరు. ఇప్పుడింక యుపటోరియా శానిటోరియానికి పంపుతారట. రేపే బయలుదేరుతున్నా. కాని, ఆర్టెమ్, నాగురించి ఆదుర్దాపడకు. అంత సులభంగా ప్రాణంవొదిలే ఘటం కాదిది. ఇంకా ముగ్గురికి సరిపడా ప్రాణశక్తివుంది. మనిద్దరం మళ్ళీకలుస్తాం. పని చేస్తాం. నీ ఆరోగ్యం సంగతి మరచిపోకు. తలకుమించినపని ఎత్తుకోకు. ఏమంటే మనశరీరాలు మరమ్మతులకొచ్చేయంటే పార్టీకి విపరీతంగా ఖర్చుఅవుతూంది. మనం సంపాదించిన

అనుభవాలూ, చదువుకుని సంపాదించిన జ్ఞానమూ హాస్పిటళ్ళకు బలిపెట్టవలసిందేనా ? అభివాదనలు—

"పావెల్"

ఆర్టెమ్ ఈజాబు చదువుతున్నప్పుడే అక్కడ పావెల్ డాక్టరు బాజనోవా వద్ద సెలవుతీసుకొంటున్నాడు.

బాజనోవా ఆతనితో కరచాలనం చేసింది.

"అయితే రేపే క్రిమియా ప్రయాణం అన్నమాట. మరి ఈరోజంతా ఏంచేస్తావు ?"

"కామ్రేడ్ రోద్గినా ఇప్పుడిక్కడికి వస్తూంది. తన యింటికితీసుకెళ్ళి తనవాళ్ళతో పరిచయం చేస్తానంది. రాత్రి అక్కడేవుంటాను. రేపు ఆవిడే స్టేషన్‌లో దిగబెడుతుంది.

బాజనోవా దోరాను ఎరుగును. పావెల్‌కోసం ఆమె చాలమార్లు హాస్పిటలుకు వచ్చింది.

"కాని, కామ్రేడ్ కోర్చాగిన్, మా నాన్నగారికి చూపిస్తానంటే వొప్పుకున్నావు. ఆమాటే మరిచిపోయేవన్నమాట. నీ జబ్బుసంగతి ఆయనకు చెప్పేను. ఆయనకూడా చూస్తానన్నారు. ఈవేళ సాయంకాలం వీలుపడదూ ?"

పావెల్ వెంటనే వొప్పుకొన్నాడు.

ఆ సాయంకాలం బాజనోవా తన తండ్రిగదిలోకి పావెల్‌ను తీసుకెళ్ళింది.

ఆయన చాల ప్రసిద్ధికెక్కిన శస్త్రచికిత్సకుడు. కూతురు హాస్పిటలునుంచి ఎక్స్-రేచిత్రాలూ, రోగవివరణలూ అన్నీ

తీసుకువచ్చింది. అన్నీ చూసినాక ఆయన లాటిన్ భాషలో ఏదో వ్యాఖ్యానించేడు. ఆమాట చెవినిబడగానే బాజనోవా నిర్ఘాంతపోవడం పావెల్ కంటబడింది. తనమీద వొంగి పరీక్షిస్తున్న ముసిలిడాక్టరు బట్టతలవంకా, పక్కనే నిలబడి చూస్తున్న ఆయన కూతురువంకా మార్చిమార్చి చూసేడు.

పరీక్ష ముగిసేక పావెల్ లేచి బట్టలు వేసుకొన్నాడు. డాక్టరు సెలవుతీసుకొన్నాడు. తన కేదో సమావేశంలో పాల్గొవలసివున్నదనీ, తన పరీక్షాఫలితాన్ని తనకూతురు చెప్తుందనీ చెప్పి వెళ్ళిపోయేడు.

బాజనోవా అతనిని తన ఆఫీసుగదిలోకి తీసుకెళ్ళింది. అక్కడున్న సోఫాలో పావెల్ అర్ధశాయి అయికూర్చుని, ఆమె ఏంచెప్తుందో అని కనిపెట్టుకొనివున్నాడు.

ఆమె తండ్రిచెప్పిన విషయాన్ని చెప్పడానికి సాహసించ లేకుండావుంది. ఎల్లాచెప్పాలా అని తటపటాయిస్తూంది. పావెల్ శరీరాంగాలలో వ్యాపిస్తున్న వాపు చాల భయంకరం. దాని నింతవరకు ఏమందూ ఆపలేకుండావుంది. ఆమె తండ్రి పావెల్‌కు ఆపరేషన్ చేయడం తప్పుఅంటాడు. "ఈ పడుచువాడి శరీరాంగాలన్నీ బిగిసిపోతాయి. కదల్చలేడు. ఆ ప్రమాదాన్ని నివారించగలశక్తి మనకులేదు—"

అదీ ఆయనతీర్పు.

డాక్టరుహోదాలోగాని. స్నేహందృష్ట్యాగాని అసలు సంగతి అంతా అతనికిచెప్పడం మంచిది కాదని ఆమె స్థిర

పరచుకుంది. అందుచేత అతిజాగ్రత్తగా తూచితూచి మాట్లాడింది.

"కామ్రేడ్ కోర్చాగిన్ ! యుపటోరియాలో మట్టిపట్టీలు వేయడంవలన మంచిఫలితాలే వుంటాయని నా అభిప్రాయం. మళ్ళీ ఆకురాలుకాలం వచ్చేసరికి నువ్వు పనిలో వచ్చి చేరగలుగుతావనే నానమ్మకం."

అంతసేపూ ఆతడు తనవంక చాల పరిశీలనగాచూస్తూనే వున్నాడన్న విషయాన్ని ఆమె గమనించలేదు.

"నువ్వు చెప్పిందాన్నిబట్టి—నిజంచేత నువ్వుచెప్పకుండా దాచినదాన్నిపట్టిచూస్తే పరిస్థితి అంత బాగలేదని తోస్తూంది. నాదగ్గరేమీ దాపరికంవద్దని చెప్పేను. మరిచిపోయేవు. నాకు తెలియకుండా ఏమీ దాచనక్కర్లేదు. భయపడి మూర్ఛపోతాననో, నిరాశపడి పీక వుత్తరించుకుంటాననో అనుకోకు. కాని నా భవిష్యత్తు ఏమిటో నేను తెలుసుకొని ఉండడం మంచిది."

ఏదో వేళాకోళంమాటలలోపెట్టి సమాధానం ఇవ్వకుండా తప్పుకోవాలని బాజనోవా చూసింది. పావెల్ ఆమె నుంచి ఆరోజున ఏమాటా లాగనేలేకపోయేడు.

వెళ్ళిపోయేటప్పుడు డాక్టరు ఆతనితో కరచాలనం చేసింది.

"మన స్నేహాన్ని మరచిపోకు కోర్చాగిన్ ! మన భవిష్యత్తులు ఏలావుంటాయో ఏంచెప్పగలం ? ఎప్పుడేనా

నా సహాయంగాని, సలహాగాని కావలసివస్తే తప్పకరావాయి. నే చేయగల సహాయం అంతా చేస్తాను."

ఆతను కర్రమీద బరువుగా ఆనుకొంటూ, ఎంతో కష్టంమీద వాకిట్లోవున్న బండీలోకి ఎక్కుతూంటే బాజ నోవాచూస్తూ ఒక్కనిట్టూర్పు విడిచింది.

*　　*　　*

పావెల్ యుపటోరియా చేరేడు. ఎండలు తీక్ష్ణంగా వున్నాయి. డిప్పటోపీలతో జనం హడావిడిగా అటూఇటూ తిరుగుతున్నారు. పదినిముషాలలో కారు ఆగంతుకులను ఒక రెండంతస్థుల భవనంముందు దింపింది. అదే మైనాక్ శానిటోరియం.

డ్యూటీలోవున్న డాక్టరు వెంటనే పావెల్‌ను 11 వ నెంబరు గదికి తీసుకెళ్ళేడు. యూక్రేనియన్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ ఆతనికోసం ఒకగదిని రిజర్వుచేయించింది.

"మిమ్మల్ని కామ్రేడ్ ఎబ్నర్ గదిలోవుంచుతా. ఆయన జర్మనీదేశస్థుడు. తనగదిలో తోడుగా రష్యను నెవరి నైనా వుంచమనికోరేడు."

పావెల్ గదిలో ఒకపక్కగా తనచేతిసంచిపెట్టి తిరిగి చూసేడు. ఒక మంచంమీద అందమైన జుట్టూ, నీలిరంగు కళ్ళూ గల ఆసామీ ఆతనికి చిరునవ్వుతో స్వాగతమిస్తూ కనబడ్డాడు.

"గుటెన్ మోర్గెన్. జెనోస్సే. క్షమించండి. సుదినం."

జర్మను వాడు తనపొరపాటును సవరించుకుంటూ, రక్తం లేక పాలిపోయివున్న సన్నని చేతిని పావెల్ వంక చాచేడు.

మరుక్షణంలో ఇద్దరూ చిరపరిచితుల్లాగ కబుర్లు చెప్పుకొంటున్నారు. పావెల్ ఆతనిమంచం పక్కకు తనకుర్చీ లాక్కొని కూర్చున్నాడు. వారి సంభాషణలో మాటలు తక్కువా, అభినయం ఎక్కువా. ఈ 'అంతర్జాతీయభాష'లో మాట్లాడుకుంటూ వారు చాలసేపు అలాగే కూర్చుండిపోయేరు.

ఎబ్నర్ జర్మన్ శ్రామికుడు. 1923 లో హాంబర్గ్‌లో వచ్చిన తిరుగుబాటులో పాల్గొన్నాడు. అప్పుడు జరిగిన కాల్పుల్లో ఒకగుండు తుంటిమీద తగిలింది. అప్పటికి గాయం మానినా ఈమధ్య మళ్ళీ పచ్చిచేసింది. మంచంపట్టేడు. ఆతడు ఎంతబాధపడుతున్నా పైకి ఎప్పుడూ చిరునవ్వుతోనే వుంటాడు. దానినిచూసే పావెల్‌కు ఆయనయెడ ఎంతో అభిమానం, ఆసక్తి కలిగింది.

ఆయనా, తానూ ఒకేగదిలో వుండడం పావెల్‌కు నచ్చింది. ఉదయంనుంచి పడుకొనేదాకా రోగాలు ఏకరువు పెడుతూ, మూలిగిచంపే మనిషికాదు, ఈయన. పైగా ఆయనతోవుంటే కష్టాలు మరిచిపోతారు.

తనకు జర్మనుభాష రానందుకు పావెల్ ఎంతో చింత పడ్డాడు.

'జర్మన్‌భాష రాకపోవడం ఏం బాగులేదు.''

శానిటోరియమ్ ఆవరణలోనే ఒకమూల తూగుడు కుర్చీలున్నాయి వాటిపక్కన పెనుపొర కలపతో చేసిన టేబులూ కొన్ని పడకకుర్చీలూ వున్నాయి. ప్రతిరోజూ సాయంకాలం వైద్యంఅయ్యాక శానిటోరియంలోవున్న రోగులయిదుగురు ఇక్కడ చేరేవారు. చర్చలమధ్య కాలం గడిపేవారు. హాస్పిటలు పరివారం వీరయిదుగురికీ 'కమింటర్న కార్యవర్గం' - అని పేరుపెట్టారు.

ఎబ్నర్ ఒక పడకకుర్చీలో పడుకొనివుంటాడు. పావెల్‌కు నడవడానికి నిషేధంవుంది. అతడు మరొకదాంట్లో వాలిపోయేడు. ఇస్తోనియాజాతికి చెందిన వీమన్ మూడోవాడు. భేతాళుడంతమనిషి. వ్యాపార, వాణిజ్యశాఖలో పనిచేస్తూండేవాడు ఆయన. మార్తాలారిన్ అనే లెట్టిష్‌వనిత. చూడ్డానికి పద్దెనిమిదేళ్ళ పడుచులా కనబడుతుందామె. అయిదోవాడు లెదెనేవ్. మంచి ఎముకపుష్టివున్న సైబీరియావాడు. ఆతనిజుట్టు అప్పుడే నెరిసింది. అక్కడున్న అయిదుగురూ అయిదుజాతులవాళ్ళు–జర్మన్, ఎస్తోనియన్, లెట్టిష్, రష్యను, యూక్రేనియను. మార్తా, వీమన్‌లు జర్మన్‌భాషను బాగా మాట్లాడగలరు. వారిని ఎబ్నర్ దుబాసీలుగా వుపయోగించేడు. ఒకేగదిలో వుండడంచేత ఎబ్నర్‌కూ, పావెల్‌కూ దోస్తీ బాగాఏర్పడింది. మార్తా, వీమన్, ఎబ్నర్లు ఒకేభాష మాట్లాడగలరు. కనుక వారిమధ్య దోస్తీ పెంపొందింది. లెదెనేవ్‌కూ, పావెల్‌కూ చదరంగందోస్తీ.

లెదెనేవ్ రాకపూర్వం శానిటోరియంలో చదరంగం పండితుడు పావెల్ ఒక్కడే. అంతకుపూర్వం వీమన్ చద

రంగంలో నిపుణుడు. ఆతనిని పావెల్ ఓడించి పండితు డని పించుకొన్నాడు. ఆ వోటమితో ఆ ఇస్తోనియన్ తల్లక్రిందు లయిపోయేడు చాలరోజులవరకూ పావెల్‌తో మనసిచ్చి మాట్లాడనుకూడా లేదు. కాని, హఠాత్తుగా ఓరోజున ఒక పొడుగాటివ్యక్తి శానిటోరియంలో చేరేడు. కోర్చాగిన్‌తో చదరంగానికి కూర్చున్నాడు. తనఆట వోడించేవాడు వచ్చి వుంటాడని పావెల్ అనుకోనేలేదు. మామూలుగా రాజు ముందర కోటకట్టడం ప్రారంభించేడు. మధ్యనున్న బంట్లను గెంటి లెదెనేవ్ ఎదురెత్తువేసేడు చదరంగంలో నిపుణుడనే పేరు వుందిగనుక వచ్చిన ప్రతివారితోనూ రెండాటలు వెయ్యడం పావెల్ విధి ప్రతిఆటకు బోలెడుమంది చుట్టూ చేరి మహా గంద్రగోళం చేస్తూంటారు. ఆరోజున తొమ్మిది ఎత్తులు వేసేసరికే పావెల్ ఆట చిక్కులోపడింది. లెదెనేవ్ నెమ్మదిగా బంట్లను తోస్తూ తనకు దారి లేకుండా చేస్తు న్నాడు. తన ప్రతికక్షి ఆటలో గట్టివాడేనని అప్పుడు అర్థం అయింది. ప్రారంభంలో అజాగ్రత్తగా ఆడినందుకు విచార పడ్డాడు.

తన తెలివీ, నేర్పూ అంతా ఉపయోగించి పావెల్ మూడుగంటలపాటు పెనుగులాడేడు. కాని లాభంలేక పోయింది. చూసేవాళ్ళ కింకా అర్థంకాకపోయినా ఆతనికి వోటమి తప్పదనిపించింది. ప్రతికక్షివంక చూసేడు. లెదెనేవ్ కూడా ఆతనివేపే చూస్తూ చిరునవ్వు నవ్వుతున్నాడు. ఆయ నకూ అర్థం అయిందన్నమాట. తనను ఓడించిన కోర్చా

గిన్‌కు ఎప్పుడు పరాభవం కలుగుతుందా యని కనిపెట్టుకొని వున్న ఇస్తోనియుడికింకా అర్థంకానేలేదు.

"ఒక్క బంటుకూడా లేకుండా పోయేవరకూ ఆట సాగించడమే నా అలవాటు."

పావెల్ మాటలకు లెదెనేవ్ అంగీకారసూచకంగా తల ఊపేడు.

వారిద్దరూ అయిదురోజుల్లో పదిఆటలు ఆడేరు. వాటిలో ఏడింటిలో పావెల్ ఓడేడు. రెండింటిని గెలుచుకొన్నాడు. ఒకటి సరిసమానమయింది.

వీమన్ బ్రహ్మానందపడ్డాడు!

"మంచి ఆటఆడేవు, కామ్రేడ్ లెదెనేవ్! మంచి ఆట. చితక్కొట్టేసేవు కామూ. మమ్మల్నందరిన్నీ ఆత ఓడిస్తే ఆతడిని నువ్వోడించేవు. హా. హ్హా!"

"ఓడిపోయినప్పు డెల్లావుండేది?"— అని ఆతడు పావెల్‌ను హేళన చేసేడు.

పావెల్‌కు "పండిత" కితాబు పోయింది. అయినా లెదెనేవ్‌తో మంచి నేస్తం కలిసింది. తనకు చదరంగం ఆటలో మెలకువలు అంతంతగా మాత్రమే తెలుసుననీ, లెదెనేవ్‌కు ఆటలో సులువులు బాగా తెలుసుననీ ఆతడు గ్రహించేడు.

వారిద్దరిలో ఒక సమానత్వం వుంది. కోర్చాగిన్ పుట్టినపడాదే లెదెనేవ్ బోల్షివిక్ పార్టీలో చేరేడు. పాత తరం బోల్షివిక్కుల కొకడూ, కొత్తతరాని కొకరూ ప్రతినిధులుగా వారిని పేర్కొనవచ్చును. లెదెనేవ్ తన జీవితం అంతా

రాజకీయపోరాటాలలోనే గడిపేడు. ఎన్నోఏళ్ళు రహస్య జీవితం గడిపేడు. చాలఏళ్ళు జైళ్ళల్లో వున్నాడు. విప్లవానంతరం అతిప్రధానమైన ప్రభుత్వోద్యోగంలో చేరేడు. రెండోవాడు మంచి పసుచుదనంలో వున్నాడు. ఆతడు పని చేసింది ఎనిమిదేళ్ళే అయినా ఒక జీవితకాలంలో చేయగల పనిని ఆ ఎనిమిదేళ్ళ అల్పవ్యవధిలో పూర్తిచేసేడు. ఈవేళ ఆ వృద్ధుడూ, ఈ యువకుడూకూడా జీవితంలో మహాఅనుభవాలను గడించి, ఆరోగ్యం చెడి శానిటోరియం చేరేరు.

ఎబ్నెర్, కోర్చాగిన్‌లు వుండే గది సాయంకాలం వేళల్లో ఒక మాదిరిగా క్లబ్బులా వుండేది. రాజకీయవార్తలన్నీ అక్కడికి వచ్చేవి. నవ్వులూ, కబుర్లతో గది ప్రతిధ్వనించిపోయేది. వీమన్ సంభాషణల మధ్యన ఏదో మోటు సరసం ఆడేవాడు. వెంటనే మార్తా ఓవేపునా, కోర్చాగిన్ ఒకవేపునా పట్టుకొనేవారు. ఏదోసూటిపోటిమాటతో మార్తా ఆతని నోరు నొక్కేది. కాని, అటువంటిది ప్రయోజనం లేకుండా పోయినప్పుడు కోర్చాగిన్ అందుకునేవాడు.

"నీ హాస్యం అకుక్తుతిన్నట్లేవుంది"—అనేది మార్తా.

"ఇల్లాంటి ధోరణి నీకెల్లా పట్టుబడిందా యనిపిస్తూంది" అనేవాడు కోర్చాగిన్ కోపాన్ని అణుచుకొంటూ.

తుట్టపెదవి తడుపుకుంటూ వీమన్ నలుగుర్నీ హేళనగా చూసేవాడు.

"రాజకీయ విజ్ఞానశాఖ అంటూ తెరచి, కామ్రేడ్ కోర్చాగిన్ ఆధ్వర్యంలో వుంచి, బూతు, మంచిమాటలను

కేటాయింపచెయ్యడం అవసరంలా కనిపిస్తూంది. మార్తా అభ్యంతరాన్ని అర్థంచేసుకోవచ్చు. ఆమె ఆడది. అందరి ఆడవాళ్ళలాగే ఎడ్డెం అంటే తెడ్డెం అంటుంది. కాని, కోర్చాగిన్ ఏమీ అభంశుభం తెలియని అమాయకుడిలాగ నటిస్తున్నాడు. గుడ్డొచ్చి పిల్లను వెక్కిరించినట్లుంది, ఈతడి పద్ధతి... ..."

ఇంక కమ్యూనిస్టు నీతినియమాలమీద చాల తీవ్రంగా చర్చలు జరిగేయి. బూతువేళాకోళాల ఔచిత్యానౌచిత్యాలను గురించి చర్చలు జరిపేరు. ఒక్కొక్కళ్ళ వాదనలను మార్తా ఎబ్నర్‌కు అనువదించింది.

"డై ఎరోటికే అన్‌స్టోశ్—ఏం లాభంలేదు. పావెల్ అభిప్రాయం నాకు నచ్చింది."

పీటున్ వెనక్కితగ్గక తప్పలేదు. సాధ్యమైనంతవరకు వేళాకోళాలలో పెట్టి బయటపడడానికి ప్రయత్నించేడు. ఇంకెప్పుడూ బూతుకథలు చెప్పడం మానేసేడు.

మార్తాకు పంధొమ్మిదేళ్ళకంటె వుండవనీ, ఆమె కామ్‌సోమాల్ సభ్యురాలయివుంటుందనీ పావెల్ ఆలోచన. కాని ఆమెవయస్సు ముప్ఫయ్యొకఏళ్ళనీ, 1917లోనే పార్టీలో చేరిందనీ, లట్వియన్ కమ్యూనిస్టుపార్టీలో ప్రముఖ సభ్యురాలనీ విన్నప్పుడు ఆతని ఆశ్చర్యానికి మేరలేదు. 1918 లో వైట్స్ ఆమెకు వురిశిక్ష వేసేరు. కాని తర్వాత ఖైదీలమార్పకంలో సోవియట్‌యూనియన్ ఆమెనూ, మరికొంతమంది కామ్రేడ్స్‌నూ తీసుకు తెచ్చుకుంది. ఇప్పుడామె ప్రావ్దా సంపా

దళవర్గంలో పనిచేస్తూంది. రెండో వేపున యూనివర్శిటీలో చేరి చదువుతూంది. పావెల్‌కూ, ఆమెకూమధ్య స్నేహం ఏర్పడింది. అదివరలో ఎబ్నర్‌ను చూడ్డానికి తరుచుగా వస్తూపోతూవుండిన ఆమె ఇప్పుడాజట్టులో ఒక _ర్తె అయింది.

ఈ కారణం చూపించి లట్వియన్ రహస్య కార్యకర్త ఎగ్లిట్ ఆమెను హాస్యం పట్టించేవాడు. "మాస్కో-లో ఇంటి వద్ద పాపం ఓజోల్ నీకోసం ఎంతో బెంగపడివున్నాడే, మార్తా! ఇంత అన్యాయం వుంటుందా?"

ఒకరోజు పొద్దుటే, గంట మోగకపూర్వమే శాని టోరియం ఆవరణలో ఒక కాకి అరుపు వినబడింది. దానిని తరిమివెయ్యడానికై హాస్పిటలు అట్టెండెంట్లు అటూయిటూ పరుగులుపెట్టేరు. ఎబ్నర్ కాకికూతను చాల అద్భుతంగా అనుకరించగలడు. ఇప్పుడు కూసింది ఆతడే. ప్రతిరోజూ అలాగ కూసి అట్టెండెంట్లు కంగారుగా కాకికోసం వెతుకు తూంటే ఆనందిస్తుంటాడు.

పావెల్ శానిటోరియంలో ఒక నెలరోజులున్నాడు. వెళ్ళిపోయేరోజులు సమీపించేయి. హఠాత్తుగా వున్నట్లుండి ఆతనిస్థితి చెడింది. డాక్టర్లు ఆతనిని మంచం దిగవద్దన్నారు. ఆతని స్థితిచూసి ఎబ్నర్ చాల బాధపడ్డాడు. అంత వుత్సాహం, పట్టుదలావున్న ఆ యువకుడు అంత చిన్నతనంలోనే ఆరోగ్యం కోల్పోవడంచూసి ఆతడు చాల విచారపడ్డాడు. కోర్చాగిన్‌ను గురించి డాక్టర్లు చెప్పినమాటలు మార్తా ద్వారా విన్నాక ఆతడు మహా విచారపడ్డాడు.

ఆటుతర్వాత శానిటోరియంలో వున్నన్నిరోజులూ పావెల్ మంచంమీదనే వుండిపోయేడు. తాను పడుతున్న బాధ పక్కవాళ్ళకికూడా తెలియనీకుండా దాచేడు. కాని మార్తా ఆతని ముఖంలోని వెల్లదనంచూసి గ్రహించేసింది. మరోవారానికి పావెల్ శానిటోరియమ్‌నుంచి వెళ్ళిపోతాడనగా యూక్రేనియన్ కేంద్రకమిటీనుంచి ఆతనికో లేఖ వచ్చింది. శానిటోరియం డాక్టర్లు పావెల్ పనిచేయగల స్థితిలోలేడని వ్రాసినమీదట కేంద్రకమిటీ ఆతనికి మరో రెండునెలలు సెలవిచ్చింది. ఆ జాబుతోటే ఖర్చులకు డబ్బు కూడా పంపించేరు.

జుఖరయ్‌వద్ద బాక్సింగ్ నేర్చుకొన్నప్పుడు తగిలిన దెబ్బల్ని ఎంత సంయతంగా స్వీకరించేడో అంత వోర్పునూ అతడు ఇప్పుడుకూడా కనబరిచేడు. అప్పుడు దెబ్బతగిలి పడిపోయినా వెంటనే మళ్ళీ లేచేడు.

ఇంతలో ఆతనికి తల్లి దగ్గరనుంచి ఓవుత్తరం వచ్చింది. యుపటోరీయాకి దగ్గర్లోనే ఒక చిన్న సముద్రపువొడ్డు వూళ్లో ఆమె స్నేహితురాలు అల్బినాకుత్స్గం వుంటూంది. ఓమాటు వెళ్ళి చూసిరమ్మని వ్రాసింది. వాళ్ళిద్దరూ కలుసుకొని పదిహేనేళ్ళు దాటిపోయింది. క్రిమియాలో వుండగానే ఓమారు పోయి చూసిరమ్మంది. ఆజాబు పావెల్ జీవితంలో పెద్ద మార్పును తీసుకురావడానికి కారణభూతమయింది.

ఇంకో వారంరోజులకు తన శానిటోరియమ్ మిత్రుల సెలవుతీసుకొని పావెల్ పడవఎక్కేడు. ఎబ్నర్ ఆతనిని

కౌగలించుకొని, సోదరుడిలా ముద్దుపెట్టుకొన్నాడు. ఆవేళకి మార్తా లేకపోయింది. ఆమెతో చెప్పకుండానే ఆతడు బయలుదేరేసేడు.

మర్నాడుపొద్దుటే పడవదిగి రేవులో బండిచేసుకొని పావెల్ తనతల్లి స్నేహితురాలియింటికి వెళ్ళేడు. వాళ్ళదో చిన్నయిల్లు. ఇంటిచుట్టూ చిన్నతోటవుంది.

కుత్సుమ్ కుటుంబంలో అయిదుగురు జనంవున్నారు. ఆల్బినా గృహయజమానురాలు. వయస్సుమళ్ళిన మనిషి. కొంచెం లావుగా, నల్లగా వుంటుంది. ముసలిముఖంపడినా మనిషినిచూస్తే పడుచుదనంలో అందమైనదే ననిపించే లక్షణాలు కనిపిస్తాయి. ఆమె కిద్దరు కూతుళ్ళు. లోలా, తాయా వాళ్ళపేర్లు. లోలాకు ఒకకొడుకు చిన్నపిల్లడు. అయిదో వాడు ముసలి కుత్సుమ్. కోపిష్ఠి మోటుమనిషీను.

కుత్సుమ్ కోఆపరేటివ్ స్టోర్సులో పనిచేస్తున్నాడు. చిన్నపిల్ల తాయా ఆనాటికి ఏపనిదొరికితే ఆపని చేస్తూంటుంది. పెద్దామె లోలా టైపిస్టు. ఈమధ్యనే మగడినుంచి వేరుబడిపోయింది. ఆతడో శుద్ధ తాగుబోతు. అస్తమానం కొడుతూండేవాడు. ఇప్పుడామె ఏపనీ చెయ్యడంలేదు. ఇంటి వద్దనే వుంటూ తల్లికి ఇంటిపనుల్లో సాయంచేస్తూంది.

ఈ ఇద్దరుకూతుళ్ళూ కాక అల్బినాకు జార్జి అనే కొడుకు ఉన్నాడు. పావెల్ వచ్చిననాటి కాతడు లెనిన్‌గ్రాడ్ వెళ్ళేడు. కుత్సుమ్ కుటుంబం అంతా పావెల్‌కు

మహాదరంతో స్వాగతం ఇచ్చింది. ముసలివాడు మాత్రం అనుమానదృష్టులతో అయిష్టం కనబరిచేడు.

ఆల్బినా ప్రశ్న లన్నింటికీ పావెల్ ఓర్పుగా సమాధానా లిచ్చేడు. వాళ్ళని అడిగి కుటుంబ సంగతులు అన్నీ తెలుసుకున్నాడు.

లోలాకు ఇరవై రెండేళ్ళుంటాయి. పెద్దపోకడలు ఎరిగింది కాదు. కత్తిరింపుజుట్టు. తీర్చిదిద్దిన అవయవాలు. స్నేహపాత్రమైన ముఖం. మొదటిరోజుననే పావెల్‌కు బాగా పరిచయం అయింది. కుటుంబ రహస్యాలన్నీ చెప్పేసింది.

తండ్రి మహా కర్కోటకుడు. ఎదురుమాట వినబడనివ్వడు. సంకుచిత స్వభావుడు. దుర్గర్వి. పొగరుబోతు. ఆతని పేరుచెప్తే ఇంటిల్లిపాదీ వొణికిపోతూంటారు. ఆతని పిల్లలకే ఆతనియెడ అభిమానం లేదు. పాతికేళ్ళనుంచీ కాపురం చేస్తున్న భార్యకు ఆతనంటే వ్యతిరేకం. ఆడపిల్లలెప్పుడూ తల్లిపక్షాన నిలబడేవారు. ఇంట్లో ఎప్పుడూ జగడాలే. ఆ జగడాలతో వాళ్ళజీవితాలు కుంగిపోతున్నాయి.

ఇంట్లో మరోపీడవున్నదని లోలా చెప్పింది. వాళ్ళ తమ్ముడు జార్జి వట్టి పనికిమాలిన మనిషి. కోతలరాయుడు. శుద్ధపెంకె. బట్టలు అందంగావుండాలి. విస్తట్లో ఏదీ లోటు కాకూడదు. కొంచెం తాగడంకూడా పట్టుబడింది. తల్లికి వానిమీద మహాప్రేమ. స్కూలుచదువు పూర్తికాగానే పట్నంవెళ్ళాలి, డబ్బుతెమ్మని కూర్చున్నాడు.

"యూనివర్సిటీలో చేస్తా. లోలావుంగరం అమ్మెయ్యి. ఇంకేమన్నా వుండకపోదు. చూడు; నాకు డబ్బుకావాలి. ఎక్కడో చూడు. ఎల్లా తెచ్చినా సరే." - అన్నాడు.

తానడిగినదానికి తల్లి కాదనదని జార్జికి తెలుసు. తన మీదవున్న ఆ ప్రేమను ఆతడు దుర్వినియోగపరుస్తున్నాడు. అక్కలంటే వానికి ఏమాత్రం అభిమానం, గౌరవంలేదు. అల్బినా మగడినుంచి తీసుకోగలిగినంత తీసుకుంది. తాయా తెచ్చేది పుచ్చుకొంది. అదీ, ఇదీకలిపి కొడుక్కు పంపింది. అక్కడ జార్జి ప్రవేశపరీక్షలో డింకీకొట్టేడు. లెనిన్‌గ్రాడ్‌లో పినతండ్రివద్దవుంటూ హాయిగా తిరుగుతున్నాడు. మధ్య మధ్య డబ్బుకోసం టెలిగ్రాములుకొట్టి తల్లినివేడిపిస్తూంటాడు.

పావెల్ వచ్చిననాడు సాయంకాలంగాని తాయా కనబడలేదు. తల్లి ఆమెకు హడావిడిగా ఎదురెళ్ళింది. ఎవరో బంధువులు వచ్చేరని తల్లి కూతురుతో చెప్పడం పావెల్ విన్నాడు. తాయా సిగ్గుపడుతూ గదిలో అడుగుపెట్టింది. సంకోచపడుతూ కరచాలనం చేసింది. ఆ కొత్తయువకుని చేయి తగిలేసరికి ఆమెముఖం కందగడ్డలా అయిపోయింది. ఆమె చేతులు బలంగా, కాయలుకాచివున్నాయని పావెల్ కరస్పర్శలో అర్థంచేసుకొన్నాడు.

తాయాకు పంధొమ్మిదేళ్ళుంటాయి. అంత అందమైనదికాదు. పెద్దపెద్ద కళ్ళు. మంగోలియన్ వాళ్ళకిలాగ ఏటవాలుగావున్నాయి కనుబొమ్మలు. ముక్కు తీర్చిదిద్దినట్లుంది. అమాయకత్వాన్ని తెలిపే నిండు పెదవులు; ఆకర్ష

ణీయమైన రూపం. చాకలగానులో రొమ్ములు పిటపిటలాడు తున్నాయి.

ఆయింట్లో అక్క-చెల్లెళ్ళిద్దరికీ చెరో గదీవుంది. తాయా గదిలో సన్నని ఇనుపమంచం ఒకటి, ఒక టేబిలూ వున్నాయి. టేబిల్ మీద ఏవో చిల్లరసామాన్లు, ఒక అద్దంవున్నాయి. గోడలనిండా ఫొటోలూ, బొమ్మలూ వ్రేలాడుతున్నాయి. కిటికీలో రెండు పువ్వులకుండీలున్నాయి. ఒకదాంట్లో ఎర్రగా జిరానియమ్ పువ్వులూ, గులాబిరంగు అస్టర్ పువ్వులు మరో దాంట్లోనూ ఆకర్షకంగా కనిపిస్తున్నాయి. కిటికీకివున్న లేస్ తెర లేతనీలిరంగు రిబ్బన్‌తో ఒకపక్కకులాగి ముడేసేరు.

"తాయా మగాళ్ళనెవ్వరినీ తనగదిలో అడుగుపెట్ట నివ్వదు. మరి నిన్నెలా రానిచ్చిందోగాని" - అని లోలా చెల్లెల్ని ఆటపట్టించింది

ముసలివాళ్ళుండే ఇంటిభాగంలో ఆతడు వచ్చిన మర్నాడు అంతా టీ టేబుల్ వద్ద చేరేరు. తన ఎదుట కూర్చున్న అతిథికేసి మధ్యమధ్యచూస్తూ కుతుస్తమ్ కప్పు లోని టీ చెంచాతో కలుపుతున్నాడు.

"ఇప్పటి పెళ్ళిళ్ళకి ఓ నియమం అనీ కట్టుబాటు అనీ వున్నట్లు కనబడదు. ఈవేళ పెళ్ళిచేసుకున్నామంటారు. రేపు విడిపోయేమంటారు. వాళ్ళ చిత్తం. అడిగేవాడూ, చెప్పే వాడూ అంటూ వున్నాడా?"

ముసలాడు దగ్గుతెరవచ్చి ఉమిసేడు. కాస్త సర్దుకు న్నాక వేలుపెట్టి పెద్దకూతుర్ని చూపిస్తూ సాయించేడు.

"దాన్నిచూడు. ఎవరితోటీ చెప్పనేనా చెప్పకుండా పోయి వాణ్ణి పెళ్ళిచేసుకులేచివచ్చింది. విడిపోవడంకూడా అంతసులువుగానే చేసింది. దానినీ, దానిపిల్లవాడినీ మేపడం మాత్రం నా నెత్తినపడింది."

లోలా బాధపడింది. సిగ్గుపడింది. కళ్ళనీళ్ళు తిరిగేయి. పావెల్‌కు కనబడకుండా వుండాలని తలతిప్పుకుంది.

పావెల్‌కు వుండబట్టలేదు.

"అయితే ఆచవట పెద్దమ్మతోటే పడివుండాలంటారా?"

"పెళ్ళిచేసుకోవా లనుకొన్నప్పుడు ఆమాత్రం తెలివి వుండొద్దూ?"

అల్బినాకు కోపం, విసుగూకూడ కలిగేయి.

"ఇంటికొచ్చిన పెద్దమనిషిఎదట ఆ మాటలేమిటి? మరోమాటలేమీ దొరకలేదా?"

ముసలాడు భార్యమీద విరుచుకుపడ్డాడు.

"ఏం మాట్లాడాలో నాకు తెలుసు. నాకు చెప్పేపాటిదాని వయ్యేవే!"

ఆ రాత్రి చాల పొద్దుపోయేవరకూ కుత్సుమ్ కుటుంబాన్నిగురించి ఆలోచిస్తూ పావెల్ నిద్రపోలేదు. యాదృచ్ఛికంగా వచ్చి, ఆ కుటుంబపు గొడవల్లో చిక్కుకున్నాడు. ఈ గంద్రగోళంలోంచి బయటపడేటందుకు తల్లికీ, కూతుళ్ళకూ తానేవిధంగా సాయం చెయ్యగలనా అని ఆలోచించేడు. తన బ్రతుకే ఓదారిన పడలేదు. తాను సర్దుకోవలసిన సమ

స్యలు బోలె డున్నాయి. ఏదన్నా పని గట్టిగా చేయాలను కుంటే వెనకటంత సులువుగా తెముల్చుకోలేకుండా వున్నాడు.

ఆ కుటుంబంలో వాళ్ళు సుఖపడాలంటే ఒక్కటే దారి. ఎవరికివారు విడిపోవాలి. తల్లీ, కూతుళ్ళూ ముసలాడిదగ్గర నుంచి పోవాలి. కాని, అదంత సులభంగా అయ్యేపని కాదు. ఆ కుటుంబంలో విప్లవాన్ని తీసుకొచ్చి నిభాయించగల శక్తి అవకాశం పావెల్‌కు లేవు. నాలుగురోజు లుండి తనదారిన తాను పోతాడు. మళ్ళీ వాళ్ళు కనబడనుకూడా కనబడక పోవచ్చు. గంద్రగోళం తెచ్చేకన్న ఎల్లావున్న దల్లాగే వొదిలేస్తే వాళ్ళతిప్పలు వాళ్ళుపడతారు—అనిపించింది. కాని, ముసలాడి చాలకం, మాటలూ గుర్తువచ్చి అలాపనికి రాదనుకున్నాడు. ఎన్నో ఆలోచనలు కలిగేయి. కాని తర్వాత అవేవీ లాభంలే దనిపించింది.

మర్నాడు ఆదివారం. వీధిలో తిరిగి ఇంటికివచ్చేసరికి తాయా ఒక్కర్తే వుంది. మిగిలినవాళ్ళంతా ఎవరో బంధు వుల్ని చూడబోయారు.

పావెల్ ఆమె గదిలోకి వెళ్ళి, నీరసంగా కుర్చీలో కూలబడ్డాడు.

"సరదాగా ఎక్కడికీ పోయిరావేం ?"

తాయా సన్నగా సమాధానం ఇచ్చింది.

"ఎక్కడికీ వెళ్ళాలనిపించదు."

రాత్రి తాను వేసుకున్న పథకం గుర్తువచ్చింది. దాని నామెకు చెప్పాలనుకొన్నాడు.

మిగిలినవా శ్ళెవ్వరూ రాకపూర్వమే తాను చెప్ప వలసిందంతా చెప్పాలని ఆతడు సరాసరి అసలువిషయానికి వచ్చేసేడు.

"ఇల్లావిను తాయా! మనిద్దరం నేస్తాలం. ఎందుకీ మొగమాటాలు? కొద్దిరోజుల్లో నేను వెళ్ళిపోతాను. నేను చిక్కుల్లో వున్నప్పుడే మీ కుటుంబం బాధలుచూడ్డం తటస్థ పడింది. కాకపోతే పరిస్థితులు మరొకవిధంగా వుండేవి. ఒక్క ఏడాదిక్రితం మనకు పరిచయం కలిసివుంటే అందరం కలిసి ఇక్కడినుంచి వెళ్ళిపోయేవాళ్ళం. ఎక్కడికెళ్ళినా నీకూ లోలాకూ బోలెడన్నిపనులు దొరికేవి. ముసలాడి దంతా అదోపద్ధతి. ఆయనగారికి నచ్చజెప్పడం ఎవరితరమూకాదు. ఏదెల్లావున్నా ఇప్పుడు చేయగలది ఏంలేదు. నా భవిష్యత్తు ఏమిటో నాకే తెలియడంలేదు. ఇప్పటిమట్టుకి నేను కేవలం అవధ్యుణ్ణి. ఆ విషయమై అనుకుని లాభంలేదు. నన్ను మళ్ళీ పనిలోకి తీసుకోమని దెబ్బలాడదలచుకున్నా. డాక్టర్లు నన్ను గురించి ఏమేమిటో నానాచెత్తా వ్రాసిపెట్టేరు. ఎంతకాల మైనాసరే మందుపుచ్చుకు బాగుపడి రమ్మంటారు కామ్రేడ్సు. సరే ఆ సంగతి చూసుకొందాం... ...ని విషయం అమ్మకి వ్రాసిచూస్తా ఆవిడ ఏమంటుందో విందాం. వ్యవహారాలు ఇల్లాగే వుండిపోవడం మంచిదికాదు. కాని, ఒక్కటి గుర్తు పెట్టుకో. నువ్వు నీ ప్రస్తుత జీవితపద్ధతులకు స్వస్తి చెప్ప వలసివుంటుంది. ఏమంటావు?"

తాయా ఆతనివేపు చూసింది.

"మాస్కోవా ఉందిది. కాని. మాస్కోనే శక్తి వున్నదాయని?"

పావెల్ ఆమె సందిగ్ధస్థితిని అర్థంచేసుకున్నాడు.

"ఫర్వాలేదు తాయా! ఆ అభిప్రాయంవుంటే క్రమంగా అన్నీ చక్కబడతాయి. మీ అమ్మని వాళ్ళని విడిచి వుండ గలవా?"

ఆ ప్రశ్న కామె ఆశ్చర్యపడింది. ఒక్కక్షణం సందేహించింది.

"అమ్మని చూస్తే జాలివేస్తుంది. నాన్న ఓమూాల ప్రాణాలు తీస్తున్నాడు. ఇప్పుడు జార్జిఒకడు తయారయ్యేడు. వాడంటే ఆమెకు ప్రాణం. వాడు ఆమెనుపెడుతున్న ఇబ్బందులు చూస్తూంటే నాకే బాధ అనిపిస్తూంది... ..."

ఇద్దరూ చాలసేపు మనసిచ్చి మాట్లాడుకున్నారు. కాస్సేపటికి వాళ్ళంతా తిరిగివస్తారనగా పావెల్ ఆమెను వేళాకోళం చేసేడు.

"మీనాన్న ఎవరికో ఒకడికిచ్చి ఈపాటికి పెళ్లిచేసి వుండవలసిందే, ఎందు కూరుకున్నాడో గాని."

ఆ ఆలోచన తోచేసరికి తాయా హడలిపోయింది.

"వద్దు. నాకుపెళ్ళీవద్దు, ఏమీవద్దు. లోలాపడ్డ సుఖం చూసేను. పెళ్ళీవద్దు, పెటాకులూ వద్దు."

పావెల్ నవ్వేడు.

"అంతా నిర్ణయం చేసేసుకున్నానంటావు. కాని, అందమైన పడుచువాడెవడన్నా కనబడితే, అప్పుడుచెప్పాలి."

"వద్దు. పెళ్ళి అయ్యేదాకా అంతా పెద్దమనుష్యులే."

ఆమెను సమాధానపరుస్తూ పావెల్ ఆమె భుజంమీద చెయ్యివేసేడు.

"అదిసరే. తాయా! మగడంటూ లేకపోతే బ్రతక లేకపోవు. కాని, పడుచువాళ్ళందరిమీదా అంతకోపం ఐతే ఎలాగా? నేనుకూడా నీమీద కన్నేసేననుకో లేదుగద. అంత వరకు నయం"—అంటూ ఆతడామె భుజం తట్టేడు.

"నీబోటిగాళ్ళు నాలాంటివాళ్ళని పెళ్ళిచేసుకోరు.

* * *

కొద్దిరోజులు పోయేక పావెల్ ఖార్కోవ్ వెళ్ళి పోయేడు. తాయా, లోలా, అల్బినాలూ, ఆమెచెల్లెలు రోజా స్టేషన్‌వరకూ వచ్చి ఆతనికి వీడ్కోలిచ్చేరు. తన కూతుళ్ళని మరచిపోవద్దనీ, వాళ్ళ కేదన్నా దారి చూపవలసిందనీ అల్బినా ఆతనితో పదేపదే చెప్పింది. ఆత్మీయుడు విడిచి పోతున్నట్లు ఆతడు వెడుతూంటే ఎంతో విచారపడ్డారు. తాయా కళ్ళనీళ్ళుపెట్టుకొంది. లోలా ఆడిస్తున్న తెల్లని రుమాలూ, తాయా కట్టుకొన్న చారల గౌనూ కనబడేంత వరకు పావెల్ కిటికీలోంచి తలతియ్యలేదు.

ఖార్కోవ్‌కు చేరగానే ఆతడు పెట్యానావికోవ్ గదికి వెళ్ళేడు. ఆ సమయంలో దోరాని ఇబ్బందిపెట్టడానికి మన స్కరించలేదు. కొంచెంసేపు విశ్రాంతి తీసుకున్నాక కేంద్ర కమిటీ ఆఫీసుకు వెళ్ళేడు. అక్కడ అకిమ్‌వచ్చేవరకూ కూర్చు

న్నాడు. ఆతడు వచ్చేడు. ఇద్దరూ మాట్లాడుకున్నారు. తనకు వెంటనే పనియివ్వాలని పావెల్ [illegible]. అకిమ్ తల అడ్డంగా తిప్పేడు.

"పావెల్! అదేం కుదరదు. మెడికల్ కమిషన్ నిర్ణయం చూసేం. దానినిపట్టి నీకు పనిచెప్పవద్దనీ, వైద్యంకోసం న్యూరో పాథలాజికల్ ఇన్‌స్టిట్యూట్‌కి పంపాలనీ కేంద్ర కమిటీ నిర్ణయం తీసుకుంది."

"కమిషన్‌వాళ్ళేదో అంటేమాత్రం నాకేమిటి? నిన్ను బతిమాలుకుంటున్నా. అకిమ్! నాకేదో ఒకపనిచ్చిచూడు. ఒక హాస్పిటలునుంచి మరోహాస్పిటలుకు తిరగలేక నాప్రాణం చాలొస్తూంది."

అకిమ్ లొంగకూడదనే ప్రయత్నించేడు. "డాక్టర్లు చేసిన నిర్ణయమూ, మరోకటా? పావ్లూషా! చూడు. నీబాగు కోసమే చెప్పేరంటావా?"

పావెల్ వదలలేదు. చివరకు అకిమ్ లొంగకతప్పలేదు.

మరునాడే పావెల్ కేంద్రకమిటీ స్పెషల్ డిపార్టుమెంటులో పనిప్రారంభించేడు. పనిఅంటూ ప్రారంభిస్తే క్రమంగా బలంకలుగుతుందని ఆతనివూహ. కాని, అదంతా వట్టి పొరపాటు అభిప్రాయమని త్వరలోనే గ్రహించేడు. టేబిల్‌దగ్గర ఏకబిగిని ఎనిమిదిగంటలూ పనిచేస్తున్నాడు. మధ్యలో భోజనానికికూడా లేవడంలేదు. మూడో అంతస్థునుంచి అన్నిమెట్లూదిగి వీధిలో ఆచివరవున్న ప్రభుత్వ భోజనగృహానికి పోలేకనే ఆతడు 'లంచి' కట్టిపెట్టేడు. ఉన్నట్లుండి

ఓకాల్లో, చెయ్యో మెద్దుబారిపోతూంది. కొద్ది నిముషాల వరకూ కదలలేడు. ఇంచుమించు రోజంతా జ్వరంగానే వుంటున్నాడు. ఒక్కొక్క రోజున పక్కమీద లేచి కూర్చోను కూడా సాధ్యంకాదు. ఆబాధతగ్గి లేవగలిగేసరికి ఆఫీసు వేళలుకూడా మించిపోతున్నాయి. చివరకు ఓరోజున ఆఫీసుకు వేళకురాలేదని హెచ్చరించేరు. దానితో తానింక పనిలోవుండడం సాధ్యంకాదని పావెల్ గ్రహించేడు.

అకిమ్ ఆతనికి సాయపడ్డంకోసం రెండుమాట్లు ఒకపని నుంచి వేరోపనికి మార్చేడు. కాని తప్పలేదు. మళ్ళీ పనిలోకి వచ్చిన నెలరోజులకే ఆతడు మంచంపట్టేడు. బాజానోవ్ వీడ్కోలునిస్తూ చెప్పినమాటలు గుర్తువచ్చేయి. వెంటనే జాబువ్రాసేడు. అది అందగానే ఆమెవచ్చింది. ఆతనికి తెలియకుండా దాచినసంగతులు చెప్పింది. హాస్పిటలులో వుంచడంవలన ప్రయోజనం ఏమీవుండదంది.

"అయితే హాస్పిటలుకు పంపవలసిన అగత్యం ఏమీ లేనంతగా బాగుపడిందన్నమాట నా ఆరోగ్యం!"

పావెల్ హాస్యమాడి త్రోసివేయబోయేడు. కాని, విఫలుడే అయ్యేడు.

కాస్త వోపిక చేరగానే ఆతడు కేంద్రకమిటీముందు హాజరయ్యేడు. ఈమారు అకిమ్ 'ససేమిరా' అన్నాడు. వేదన్నా హాస్పిటలుకు పోవలసిందే నన్నాడు.

పావెల్‌కు విసువు పుట్టింది.

"నేనెక్కడికీ పోవడంలేదు. వెళ్ళి లాభమూ లేదు. అన్నీ తెలిసినాయనే చెప్పేడామాట. నావెనుట మిగిలిం దొక్కటేదారి–పెన్షను తీసుకోవడం, రిటైరు కావడమూను. ఆ పనిచేయడానికి నేనేమాత్రం వొప్పుకోను. నేను పనిచేయ కుండా నువ్వాపలేవు. ఇంకా ఇరవై నాలుగేళ్ళుకూడా నిండ లేదు. అప్పుడే పనికి వుపయోగించనంటూ రేం? హాస్పిటళ్ళకి తిరగడం నాకేంనచ్చడంలేదు. లాభంలేదని తెలిసి తిరగడం! అబ్బే. ఏదో ఒకపని, నేనుచేయగలిగేది ఇవ్వు. ఇంటిదగ్గరే వుండి పనిచేస్తాను. కాదంటే ఆఫీసుకే మకాం మార్చేస్తా. గుమాస్తాపనిమాత్రం వద్దు. వచ్చేకాగితాలకీ, పంపేకాగి తాలకీ ముద్దర్లుతగిలిస్తూ కూర్చోమంటేమాత్రం నాకు చేత కాదు. ఏదో కొద్దిగొప్ప వుపయోగపడుతున్నాననే సంతృప్తి కలిగించేపని ఇవ్వు."

పావెల్ ఆవేశంతో బిగ్గరగా అరవడం ప్రారంభించేడు.

ఆతనిదశకు అకిమ్ చాల విచారపడ్డాడు. తన జీవితా న్నంతనూ పార్టీకే అంకితంచేసిన ఈ యువకుడు పార్టీ కార్య క్రమాలకు దూరంగా వుండాలంటే ఎంతబాధపడుతున్నాడో అనిపించింది. ఆతనికి చేయగల సాయం చెయ్యాలనిపించింది. మూల కూర్చుండమంటే కూర్చోగలడా!

"అల్లాగే, పావెల్! గంద్రగోళపడకు. రేపు సెక్ర టేరియట్ సమావేశంవుంది. నీసంగతి కామ్రేడ్స్‌కి చెప్తా. నేను చెయ్యగలది ఏమాత్రంవున్నా చేసితీరుతాను. సరా?"

పావెల్ అతికష్టంమీద లేచి, అకిమ్ చేయిపట్టుకొన్నాడు.

ఇంక మూలబడి, అణగారిపోవలసినవాడినేనంటావా, అకిమ్ !''

అకిమ్ చేయి తన గుండెలమీద పెట్టుకొని మళ్ళీ ప్రారంభించేడు.

''ఊపిరున్నంతవరకు నన్ను పార్టీకి దూరంగావుంచడం ఎవరితరమూకాదు. చచ్చిపోతే అది వేరుమాట. ఈ విషయం గుర్తుపెట్టుకో.''

అకిమ్ ఏమీ అనలేదు. పావెల్‌వి ఉత్తరకుమార ప్రజ్ఞలు కావని అత డెరుగును. యుద్ధంలో అపాయకరంగా గాయపడ్డ వీరుడి కేక అది. కోర్చాగిన్ లాంటివాళ్ళు మరొకలావుండలేరని అత డెరుగును.

రచనా కార్యక్రమానికి పనికివచ్చేటట్లుంటే అతనినొక పెద్ద పత్రికా కార్యాలయంలో నియమించ దలచినట్లు అకిమ్ రెండురోజులు పోయేక పావెల్‌తో చెప్పేడు. పత్రికా కార్యాలయంలో పావెల్‌కు ఎంతో మర్యాద చేసేరు. పత్రిక అసిస్టెంటు ఎడిటర్ వెనకటితరం పార్టీ కార్యకర్త, యూక్రేనియన్ పార్టీ సెంట్రల్ కంట్రోల్ కమీషన్ అధ్యక్షుడూను. ఆయన పావెల్‌తో మాట్లాడేడు :

''కామ్రేడ్ ! నువ్వేం చదువుకున్నావు ?''

''ఎలిమెంటరీస్కూలులో మూడేళ్ళు చదివేను.''

పార్టీ నడిపిన రాజకీయ పాఠశాలలు వేనికన్నా వెళ్ళావా ?''

''లేదు.''

"కొంతమంది ఇవేమీ అక్కర్లేకుండానే మంచి జర్న లిస్టులు కాగలుగుతారు. కామ్రేడ్ అకిమ్ నిన్నుగురించి చెప్పేడు. ఇంటిదగ్గరే కూర్చుంటే చేయగలపనినే ఇస్తాము. చేయడానికి కావలసిన సౌకర్యాలు కలిగిస్తాము. కాని, ఈ పనికి కొంత పరిజ్ఞానం కావాలి. ముఖ్యంగా సాహిత్యం, భాష తెలిసివుండాలి.

ఇక్కడకూడా పరాజయాన్నే ఎదుర్కోవలసివచ్చిం దని అతడు గ్రహించేడు. ఒక్క అరగంటసేపు సంభాష ణతో తనకున్న చదువు చాలదని తేలిపోయింది. ఆతనిచేత ఒక నమూనావ్యాసం వ్రాయించేరు. దాంట్లో స్పెల్లింగు తప్పులూ, రచనాదోషాలూ ఎర్రపెన్సిలుతో గుర్తుపెట్టి తన చేతికిచ్చేరు తప్పులు మూడు నాలుగు డజన్లున్నాయి.

ఎడిటరు ఆతని నోదార్చేడు.

"కామ్రేడ్ కోర్చాగిన్ ! నీకు సమర్థత వుంది. కాని, కష్టపడి బాగా వ్రాయడం అలవాటు చేసుకో. నీకు వ్యాక రణం రాదు. నీ వ్యాసం చూస్తే రష్యనుభాషకూడా బాగా రాదనిపిస్తోంది. అదో ఆశ్చర్యం కాదు. పాపం, నీకు చదువు కొనేటందుకు వ్యవధే దొరకలేదాయె. కాని ఏంచెయ్యం. నిన్ను వుపయోగించుకోగల అవకాశం మాకులేదు. నీకు సామర్థ్యం వుందన్నా. ఎందుచేతనో తెలుసా? నీ వ్యాసంలో విషయాలు బాగున్నాయి. వ్రాతను సంస్కరిస్తే మంచి బాగుంటుంది. కాని, మాకా వ్యవధానంలేదు ఇతరుల

వ్యాసాలనూ, వ్రాతలనూ సంస్కరించగల వ్యక్తులు మాకు కావాలి.''

కోర్చాగిన్ కర్రమీద ఆనుకొని అతిభారంగా లేచేడు. కుడికనుబొమ్మ అదిరింది.

"అర్థమయింది. నాకు జర్నలిజమ్ ఏమీ తెలియదు. బొగ్గువెయ్యడం పని బాగా తెలుసు. కొంతవరకు ఎలక్ట్రీషియన్‌గా పనిచెయ్యగలను. గుర్రపుస్వారి బాగా తెలుసు. కామ్‌సోమాల్ యువకులచేత పని చేయించగలను. కాని, మీపని నావల్ల నవుతుందనుకోను.''

ఆతడు అభివాదనం చేసి వెళ్ళిపోయేడు.

వసారా మూలలో తూలిపోయేడు. క్రిందపడేవాడే. కాని ఎదురుగా వస్తున్న ఒక మహిళ ఆతనిని పట్టుకొంది.

"ఏం కామ్రేడ్ ! అనారోగ్యంగా వున్నట్లున్నావే."

మరల మామూలుస్థితికి వచ్చేసరికి చాలసేపు పట్టింది. అంతవరకూ ఆమె అతనిని అలాగే పట్టుకొంది. నెమ్మదిగా ఆమెచేయి విదిలించుకొని, కర్రమీద జేరబడి నెమ్మదిగా వెళ్ళిపోయేడు.

ఆదినం మొదలుకొని తన జీవితం క్రమంగా జీర్ణమై పోతున్నట్లనిపించింది. ఇంక పని లాభంలేదు. అంతకంతకి ఎక్కువగా మంచంమీదనే వుండిపోతున్నాడు. కేంద్రకమిటీ ఆతనిని పనినుంచి తప్పించి, పెన్షన్ ఏర్పాటుచేసింది. సకాలంలో ఆతడు అవధ్యుడయిపోయిన కార్మికుడనే సర్టిఫికెట్టూ

పెన్షనూ కలిసి వచ్చేయి. కేంద్రకమిటీ ఆతనికి డబ్బు ఇచ్చింది. తోచినచోట వుంటానికి అనుమతిస్తూ పత్రాలనూ పంపింది.

మాస్కోకి వచ్చి విశ్రాంతి తీసుకోవలసిందని కోరుతూ మార్తా జాబు వ్రాసింది. ఆతడు మాస్కోకి వెళ్ళాలనుకొంటున్నాడు. అఖిలయూనియన్ పార్టీ కేంద్రకమిటీ అయినా తనకు ఏదో చిన్నపని—కూర్చుని కదలనక్కర్లేకుండా చెయ్యగలది—ఇస్తుందేమో ప్రయత్నించాలని ఆశ పీడిస్తూంది. మాస్కో వెళ్ళేడు. వైద్యసహాయం తీసుకోమనీ, మంచి హాస్పిటలులో ఏర్పాట్లు చేస్తామనీ—అక్కడా అదేమాట. పావెల్ నిరాకరించేడు.

మార్తా, ఆమె స్నేహితురాలు నాద్యా పెటర్సన్‌లు కలిసివుంటున్న ఇంటివాటాలోనే పావెల్ మకాం చేసేడు.

ఆత డక్కడ పంథొమ్మిదిరోజు లున్నాడు. ఆ ఆడవాళ్ళిద్దరూ పనిలోకి పొద్దున్నేపోయి రాత్రి తిరిగివచ్చేవారు. మార్తాదగ్గర మంచిపుస్తకాలు బోలెడున్నాయి. పావెల్ పగలంతా చదువులో కాలక్షేపం చేసేడు. సాయంకాలం ఆ పడుచు లుండేవారు. వాళ్ళ స్నేహితురాళ్ళు వచ్చేవారు. అందరూ కబుర్లు చెప్పుకుంటూ కాలక్షేపం చేసేవారు.

కుత్సుమ్ కుటుంబం ఆతనిని తమవూరకు రమ్మంటూ జాబువ్రాసేరు. వాళ్ళ ఇంటివద్ద పరిస్థితులు మరింత పాడుగా వున్నాయనీ, ఆతని సలహా సహాయాలు కావాలనీ వాళ్ళు కోరేరు.

ఒకరోజు ఉదయమే గుస్యాత్నికోవ్ వీధిలోవున్న మార్తాయిల్లు వదలి పావెల్ రైలు ఎక్కాడు. శిశిర ర్తువర్షాల బురదలోంచి రైలు ఆతనిని అతివేగంగాదక్షిణదిశగా వెచ్చని సముద్రతీరప్రాంతాలకు తీసుకుపోయింది. పావెల్ కిటికీవద్ద కూర్చుని తన ప్రక్కనుంచి వెనకవేపుగా దూసుకుంటూ పరిగెత్తిపోతున్న టెలిగ్రాఫ్ స్తంభాలకేసి చూస్తున్నాడు.

# ప్రకరణం 8

సముద్రతరంగాల తాకిడికి వొడ్డునున్న గట్టు నీలి రంపపు పళ్ళలాగ కోసుకుపోయేయి. దూరాన వున్న టర్కీ వేపునుంచి వాడిగాలి వీస్తూ కొడుతూంది. సముద్రంలో కట్టిన సిమెంటుగోడ వెనకాల హార్బరు ప్రశాంతంగా కనిపిస్తూంది. సముద్రం వొడ్డునా కొండచెట్ల పొదల్లో తెల్లని కుటీరాలు వ్యాపించివున్నాయి.

పట్టణం వెలుపల దూరంగావున్న ఈ పాతపార్కులో నిశ్శబ్దంగా వుంటుంది. పండి రాలిపోయిన మాపుల్ ఆకులు గడ్డి మొలిచిపోయిన పార్కు బాటలమీద నిశ్శబ్దంగా దొర్లింతలు వేస్తున్నాయి.

పావెల్ పట్టణంలోంచి ఒక పర్షియన్ వాని గుర్రంబ్బండీలో వచ్చి ఇక్కడ దిగేడు. బాడుగ డబ్బులు ఇచ్చేస్తూంటే వాడింక వుండబట్టలేకపోయేడు.

ఇక్కడి కెందుకొచ్చేవు బాబూ! ఒక్క ఆడపిల్ల కనబడదు. ఓ వినోదం వుండదు... నక్కలుతప్ప కనబడవు... ఇక్కడేంచేస్తావు? మిస్టర్ తోవారిష్! రా. పట్టణంలోకి పోదాం.”

పావెల్ ఆతనికి డబ్బులిచ్చి పంపేసేడు.

పార్కు నిర్జనంగావుంది. సముద్రంవొడ్డున ఒకరాతి బండమీద బెంచీ వుందని ఆతడు గమనించేడు. నెమ్మదిగా అక్కడికి పోయి కూర్చున్నాడు. శిశిర ఋతు సూర్యుడివేడి నులివెచ్చగా తగులుతూంది.

తన జీవితంలో వస్తున్న నూతన ఘట్టాల్ని గురించి ఆలోచించి పథకం నిర్ణయించుకోవడంకోసం ఆత డిక్కడికి వచ్చేడు. పరిస్థితులను సమాలోచనచేసి నిర్ణయాలకు రావల సిన సమయం వచ్చింది.

ఆతని రాకతో కుత్సువ్ కుటుంబంలో గొడవలు పెచ్చు పెరిగేయి. అతడు వచ్చేడని వినగానే ముసిలాడు ఉగ్రుడై పోయేడు. పెద్దరభస లేపేడు. ప్రతిఘటనను ప్రారం భించవలసిన బాధ్యత కోర్చాగిన్ మీద పడింది. ఆతని వెనక తనభార్యా కూతుళ్ళూ తనను ఎదురొడ్డవడంతో ముసలాడికి మతే పోయింది పావెల్ ఇంట్లో అడుగు పెట్టిన రోజునే ఆ కుటుంబం రెండు శత్రుశిబిరాలుగా మారిపోయింది. ముసలివాళ్ళుండే ఇంటి భాగానికి తాళం పడింది. రెండో భాగంలో ఒక చిన్న గదిలో పావెల్ అద్దెకు దిగేడు. ఆతడు ముందుగానే అద్దెచెల్లించేసేడు. ఈ యేర్పాట్లుచూసి, ముసి లాడు స్తంభించిపోయేడు. కోపం వచ్చింది. తన కూతుళ్ళు తను చెప్పినమాట వినడం లేదు గనక వాళ్ళని పోషించవల సిన బాధ్యత తనకు లేదు పొమ్మన్నాడు.

అన్ఫీసా యుక్తిముక్తంగా మగడితోనే వుంటూంది. ముసలాడు తనవాటా వదలి ఈవల అడుగు పెట్టడు. పావెల్ ఎక్కడ ఎదురు పడతాడో యని ఆవైపు తలఎత్తికూడా చూడడు అంత ద్వేషం. కాని వీధిలో మాత్రం మహా గొడవ చేస్తున్నాడు. ఇంట్లో పెత్తనం తనదేనని నిరూపిం చడానికి అదో మార్గం.

కో-ఆపరేటివ్ షాపులో పనికి వెళ్ళడానికి ముందు కుత్సం జోళ్ళుకుట్టే మరమ్మత్తు పని చేస్తుండేవాడు. తనయింటి వెన కనే చిన్నవర్క్-షాపు కట్టుకున్నాడు. ఇప్పుడు తమ ఇంట్లో అద్దెకువచ్చినవానిని ఏడిపించడంకోసం ఆ దుకాణం తెచ్చి వీధిలో పెట్టాడు పావెల్ కిటికీ కెదురుగా. గంటలతరబడి ఏదో చప్పుడు చేస్తున్నాడు. కోర్చాగిన్ను చదువుకోకుండా అల్లరిపెడుతున్నా గదా యని సంతోషిస్తున్నాడు.

"ఉండు... నీ కుద్యాసన చెప్పకపోతే..." అంటూ గొణుక్కునేవాడు.

దూరాన సముద్రంమీద ఏదో ఓడ తాలూకు పొగ గొట్టం ఆకాశంలో నల్లని చారికను గీస్తోంది. నీటికాకులు గుంపులు గుంపులుగా పెద్దగొడవ చేస్తూ సముద్రంవేపుగా ఎగిరి వస్తున్నాయి.

అరచేతిలో గడ్డం ఆనించుకూర్చుని పావెల్ ఏమేమో ఆలోచిస్తున్నాడు. చిన్ననాటి నుంచి నేటివరకూ ఆతని జీవి తం అంతా కళ్ళముందు కనిపించినట్లయింది. తా నీ ఇరవై నాలుగేళ్ళ జీవితాన్ని ఎలా గడిపేడు? గర్వపడదగిన విధ

ముగా తన జీవితం నడిచిందా? ఒక్కొక్క ఏడాదే జ్ఞప్తికి తెచ్చుకున్నాడు. ఆ యా ఘటనలమీద నిష్పక్షపాతంగా తీర్మానం చేసేడు. మొత్తంమీద చూస్తే తాను సిగ్గిలవల సిన విధంగా జీవించి వుండలే దనిపించి అమ్మయ్య అనుకు న్నాడు. తప్పులయితే చాలా చేసేడు. పడుచుదనపు అను భవశూన్యతవలన చేసిన తప్పులే అవి. ముఖ్యంగా అజ్ఞాన వశాన జరిగేయి. కాని, అన్నింటికన్నా గర్వపడదగిన పని ఆతడు చేసేడు. సోవియట్ విప్లవపోరాటాలలో అతడు పాల్గొ న్నాడు. ఎర్రజెండా ఆరక్తిమకు ఆతని నెత్తురుబొట్టుకూడా తోడ్పడ్డాయి.

కదలమెదలలేని స్థితి వచ్చేవరకూ పార్టీ కార్యకర్తల మధ్యనే ఉన్నాడు. ఇప్పుడైతే రోగపడిపోయేడు. అగ్రశ్రే ణిలో నిలబడలేడు. హాస్పిటళ్ళకు చేరడం తప్ప, ఆతడు చేయగలదేమీ లేదు. వార్సాను ముట్టడించిన రోజులు ఆతని మనస్సులో మెదిలేయి. మంచిపట్టులో ఆతడు దెబ్బ తిన్నాడు. గుర్రంమీదనుంచి పడిపోయేడు. అతని మిత్రులు లేవదీసేరు. గాయాలకు కట్లు కట్టేరు. స్నేహితులవాళ్ళకి వప్ప చెప్పారు. అటుతరువాతనే వారు శత్రువు వెంటబడ్డారు. ఆ సైనికుడికోసం స్క్వాడ్రన్ నిలిచిపోలేదు. ఒక మహదా శయసాధనకోసం పోరాటం జరుగుతున్నప్పు డంతే. ఎవరి కోసమూ, ఎవ్వరూ ఆగడానికి వీలులేదు... కాళ్ళు పోయిన 'గన్నర్'లు ఫిరంగిబళ్ళమీద ప్రయాణించడం అతడు అనేకమార్లు చూసేడు. వాళ్ళ పేరు చెప్తే శత్రువులు వణికి

పోతారు. మహాధైర్యం, మంచి గురిను. శత్రువుల పంక్తుల మీద వాళ్ళు మృత్యువుకు నాట్యం చేయిస్తారు. వాళ్ళని పటాలాలు ఎంత అభిమానిస్తాయి! కాని అటువంటి వాళ్ళ సంఖ్య బహుస్వల్పం. తా నా సంఖ్యలోవాడు కాడు.

ఇప్పుడు తాను పరాజయం పొందినట్లు తేలిపోయింది. ఇంక పార్టీ కార్యకర్తలలో ఒకడ ననుకొనేటందుకు అవకాశం లేకుండా పోయింది ఇప్పుడేం చేయడం? తన భవిష్యత్తు ఇంకా దారుణంగా వుంటుందని బాజనోవా చెప్పేసింది. తన కింక మిగిలినవి బాధలే. ఏమిటి చెయ్యడం? ఆ ప్రశ్న, సమస్య ఆతనికి కళ్ళముందు పెద్ద అగాధంలా కనపడుతూంది.

తన జీవితంలో తాను కోరిం దొక్కటే. యుద్ధరంగం నుంచి పోయి మూలపడవలసిన స్థితి రాకూడదనే దొక్కటే ఆతని కోరిక. కాని, అది విఫలమయింది. ఇంక బ్రతికి ప్రయోజనం ఏమిటి? ఏమి ఆనందం వుంది? రోజులు గడపడం ఎలాగ? తినడం, తాగడం కోసమేనా మన బ్రతుకు? కామ్రేడ్సు అంతా ముందుకుపోతుంటే దారితొలగి చూస్తూ నిలబడ వలసిందేనా? పోరాడుతున్నవాళ్ళకి తన బరువొకటా? తన ఆశలను విఫలం చేసిన ఈ శరీరాన్ని నేలగలపడం ఉత్తమోత్తమం కాదా? ఒక్క గుండు దెబ్బతో — వొదిలిపోతుంది. సమయం ఆసన్నమైనప్పుడు చావడం కన్న మంచిగా బ్రతికిన దానికి వేరేగుర్తు ఏముంటుంది? తన బాధలను విముక్తం చేసుకొన్న సైనికుడి నెవరు తప్పు పడతారు?

ఆతడు జేబు తడుముకున్నాడు. బ్రౌనింగ్ పిస్తోలు మడమ చదునుగా చేతికి తగిలింది. నెమ్మదిగా దానిని వెలికి తీసేడు.

"చివరకీగతి పట్టటం దశకున్నానా?"

నల్లని రివాల్వరుగొట్టం ఆతనివేపు చూసింది. ఆతడు పిస్తోలు ఒడిలో పెట్టుకొని, తన పరిస్థితిని పర్యాలోచించేడు.

"తెలివితక్కువపని కాక మరేమిటి? చావడానికేం, ఎవడేనా చావగలడు. పెద్ద కష్టంకాదు. అది వీరత్వమూ కాదు. జీవితంలో కష్టమనిపించినప్పు డెప్పుడేనా కాల్చుకు చావవచ్చు. కాని కష్టాల నధిగమించి సుఖమయ జీవితాన్ని అమర్చుకోవడంలోనే వుంది గొప్పతనం. కష్టాల, నష్టాల ఉక్కుచట్రంలోంచి బయటపడాలి. దానికోసం నువ్వేమన్నా కృషీ, ప్రయత్నంచేసేవా? నోవోగ్రాడ్—వోలిన్స్కీ వద్ద ఆరోజున పది హేనుమార్లు ఎదురుదాడిచేసేం. ఎన్నో వ్యతిరేక పరిస్థితుల్లో చివరకు నెగ్గేం. అంతకంటె ఎక్కువ కష్టమా యిది. రివాల్వరు ఆవలపెట్టెయ్యి. రెండోమనిషి కిది తెలియనివ్వకు. కష్టంగావున్నప్పుడే జీవించడం నేర్చుకోవాలి. ఇతరుల కుపయోగం అయ్యేవిధంగా జీవించు."

ఆతడు లేచి, రోడ్డువెంబడే క్రిందికిదిగేడు. ఒక బండి వాడు ఆతనిని ఎక్కించుకొని పట్టణందాకా తీసుకొచ్చేడు. పావెల్ అక్కడ బండిదిగి నడకప్రారంభించేడు. దారిలో వార్తాపత్రిక కొన్నాడు. ఆరోజున దెమ్యాన్ బెద్నా క్లబ్ లో

"ప్రాణం వున్నంతవరకూ నాకేం భయంలేదు తాయా! లోలా నిద్రపోతూందా? ఈవేళ ఎందుచేతనో నిద్రరావడం లేదు. నీతోటి మాట్లాడాలి. లోలా లేస్తుందేమో. నీగదికి వెడదామా?"

తాయా సందేహించింది. అప్పటికి బాగా రాత్రి అయిపోయింది. ఆవేళప్పుడు ఆతడిని గదిలోకి రానివ్వడం బాగుంటుందా? అమ్మ ఏమంటుందో? కాని, ఈతడేమను కొంటాడో. ఏం చెప్పాడబ్బా! - అనుకుంటూనే ఆమె తన గదిలోకి దారితీసింది.

గదిలోని మసకవెలుతురులో ఆతడామెకు ఎదురుగా, చాల దగ్గిరిగా కూర్చున్నాడు.

"తాయా! నే చెప్పవలసిందిది: మనజీవితం ఒక్కొక్కప్పుడు తమాషాపల్టీలు కొడుతూంటుంది. వాటినిగురించి ఆలోచించడంకూడా ఆశ్చర్యమనిపిస్తూంది. గడచిన కొద్ది రోజులుగా నా మనస్సు బాగుండలేదు. ఇల్లా ఎంతకాలం బ్రతకడమో అర్థంకావడంలేదు. నా జీవితంలో ఇంతనిరాశ ఎప్పుడూ ఎరగను. ఈవేళ నాలో నేనే 'రాజకీయకమిటీ' సమావేశం జరిపించేను. ఎంతో ప్రధానమైన తీర్మానం చేసుకొన్నా. అదేమిటో చెప్తాను విను. ఆశ్చర్యపడొద్దు."

గడచిన కొద్దినెలలుగా తానుపడుతున్న బాధనీ, ఆరోజున పార్కులో తన మనస్సులోపడ్డ మధననూ ఆతడామెకు చెప్పేడు.

"ఇదీ నాస్థితి. ఇంక ఆ ప్రధానవిషయం ఏమిటో చెప్తా విను. మీకుటుంబంలో తుపాను ఇప్పుడే ప్రారంభమవుతోంది. ఇక్కడినుంచి వెళ్ళిపోదాం. వీలయినంతదూరం వెళ్ళిపోదాం. మనజీవితాన్ని సరికొత్తగా ప్రారంభిద్దాం. ఒకమారు ఒక నిర్ణయం చేసుకొన్నాక దానిని తుదముట్ట సాగించే స్వభావం నాది. నీదీ నాదీ జీవితాలు ఇప్పటిమట్టుకు సుఖంగా లేక పోవచ్చు. కాని వాటికి జీవం పోస్తానులే. నే చెప్పింది అర్థం అయిందా? నాజీవిత సహచరివిగా, నాభార్యగా వుండటానికి అంగీకరిస్తావా?"

ఆతని మాటలను శ్రద్ధగా వింటూవున్న తాయా ఆ చివరిమాటలు విని వులికిపడింది.

"నువ్వు ఇప్పటికిప్పుడే సమాధానం ఇవ్వాలనడంలేదు. ఆలోచించు బాగా. ఇల్లాంటి విషయాలలో ఇంత మోటుగా వ్యవహరిస్తున్నానని నీకు ఆశ్చర్యం అనిపించవచ్చు. కాని, నీకూ నాకూ 'కోర్టింగూ' వగైరా అభినయా లనవసరం. నా చేయి అందిస్తున్నా. దానిని అందుకొనడంవల్ల విచారించ వలసిన పరిస్థితి కలగనివ్వను. మనిద్దరం ఒకరికొకరం బాగా వుపయోగపడగలం. నేననుకుంటున్నదీ, నిర్ణయించుకొన్నదీ యిది: నువ్వు నిజమైన బోల్షివిక్కువయ్యేవరకూ మన యీ సంబంధం అమలులో వుంటుంది. నిన్ను బోల్షివిక్కును చెయ్య లేకపోతే నేను ఒక్కపైసాకుకూడా కొరగానవచ్చు. ఆ రోజువరకూ మనం కలిసివుందాం. పెద్దదానివయ్యేక నిన్ని బంధనాలనుంచి విముక్తి చేస్తా. అప్పటి కెలావుంటుందో,

ఏమో. నేను పూర్తిగా పనికిరాకుండానే పోవచ్చు. అటు వంటి పరిస్థితే ఏర్పడితే నాకు కట్టుబడి వుండనక్కర్లేదు."

ఆతడు కొద్దినిముషాలకాలం నిశ్శబ్దంగా కూర్చుని మళ్ళీ ప్రారంభించేడు :

"సరే. ప్రస్తుతానికి లేద్దాం."

ఆత డామెచేతినిపట్టుకొని కొద్దిసేపు మాట్లాడకుండా నిలబడిపోయేడు. ఆమె అంగీకరించినట్లే భావించేడు.

"నన్నెప్పుడూ వదలిపోనని ప్రతిజ్ఞ చేస్తావా ?"

"మాటతప్ప నేనివ్వగలది ఏముంది, తాయా ? నా వంటివాళ్ళు తమమిత్రులకి ద్రోహం తలపెట్టరని నమ్మి... వాళ్ళుకూడా నన్ను ద్రోహంచెయ్యరనే అనుకుంటాను."

"ఇంత హఠాత్తుగా ఇప్పుడే నీకు సమాధానం ఇవ్వ లేను."

పావెల్ లేచేడు.

"తెల్లవారిపోవచ్చింది. వెళ్ళి పడుకో."

ఆతడు తనగదిలోకివెళ్ళేడు. బట్టలుకూడా మార్చుకో కుండా అల్లాగే మంచంమీద వాలిగేడు. పడుకున్న మరు క్షణంలో నిద్రపట్టింది.

*　　　*　　　*

పావెల్‌గదిలో కిటికీప్రక్కగావేసిన టేబిల్‌నిండా పుస్తకాలు పేరుకుపోయేయి నగరపార్టీ లైబ్రరీనుంచి తెచ్చు కొన్న పుస్తకాలు పత్రికలు, నోట్‌బుక్కులు బొత్తులు

బొత్తులుగా పేరుకున్నాయి. ఒకమంచం, రెండుకుర్చీలు, తాయీగదికి అతనిగదికి మధ్యవున్నద్వారాన్ని కప్పుతున్న పెద్ద చైనాపటం. అంతే ఆ గదిలోవున్న సామాన్లు. స్థానిక పార్టీ కమిటీవారు పావెల్‌కు పుస్తకాలు, పత్రికలు కావల సినవన్నీ పంపుతామన్నారు. పట్టణంలో పెద్ద పబ్లిక్ లైబ్రరీ వుంది. దాని మేనేజరుతో చెప్పి పావెల్‌కు ఏపుస్తకం కావల సినా పంపమన్నారు. ఇంక ఏకపార్శ్వాళ్ళే. తెల్లవారింది మొదలు రాత్రి ఎంతో వేళయ్యేవరకూ ఆతడు చదువుతూ, వ్రాస్తూ కూర్చోడం చూస్తూంటే లోలాకు ఎంతో ఆశ్చ ర్యంగావుంది. భోజనానికి ఏంలేచేవాడో, మిగిలిన కాలం అంతా చదువుతూ నేవుండేవాడు. సాయంకాలంపూట అక్క చెల్లెళ్ళనిద్దర్నీ కూర్చోబెట్టుకొని తాను చదివినదంతా వాళ్ళకి చెప్పేవాడు.

అర్ధరాత్రిదాటేక ముసలికుత్సుమ్ ఎప్పుడన్నా వాకి ట్లోకివస్తే పావెల్ కిటికీతలుపుల్లోంచి వెలుతురు రేకలు కన బడేవి. మునివేళ్ళమీద అటువెళ్ళేవాడు. తలుపు చెక్కల సందుల్లోంచిచూస్తే డ్రాయరువద్ద, దీపంప్రక్క పుస్తకం మీద వొరిగివున్న తల కనబడేది.

ముసలివాడు గొణుగుడు ప్రారంభించేవాడు.

“పెద్దమనిషైనవాడు ఈవేళప్పుడు నిద్రపోతాడేగాని ఇల్లా చముకుఖర్చుచేయడు. తానే యింటిపెద్ద నన్నట్లుందే వీడి వ్యవహారం. వీడొచ్చినప్పటినుంచి ఆడపిల్ల లిద్దరూ చెప్పినమాట వినకుండా అయ్యేరు.”

ఆతడు గొణుక్కుంటూ తన గదిలోకి పోయేవాడు.

ఎనిమిదేళ్ళకి ఈనాడు పావెల్‌కు కావలసినంత తీరుబడి దొరికింది. ఏబాధ్యతా నెత్తిమీదలేదు. తనకు దొరికిన వ్యవధానాన్ని ఆతడు చదువుకు వినియోగించేడు. రోజుకి పద్ధెనిమిదిగంటలు చదివేడు. ఆతని ఆరోగ్యం అంత పరిశ్రమను భరించగలదా అంటే చెప్పడం కష్టం.

ఒకరోజున తాయా మామూలుగా అన్నట్లే చెప్పిన మాట పరిస్థితులను పూర్తిగా మార్చేసింది.

"మన గదులమధ్యనున్న తలుపుకి అడ్డంగా డ్రాయరుంటే తీసేసేను. ఎప్పుడేనా ఏదన్నా మాట్లాడవలసివుంటే సరాసరి వచ్చేసెయ్యి. లోలాగదిగుండా రానక్కర్లేదు."

పావెల్‌కు ఎంతో వుత్సాహం కలిగింది. తాయా సంతోషంతో చిరునవ్వు నవ్వింది. ఉభయులమధ్యా బంధుత్వము స్థిరపడింది.

* * *

కిటికీ తలుపుచెక్కల సందుల్లోంచి వెలుతు రింక కనబడ్డంలేదు. కూతురు కళ్ళల్లో దాచినా దాగని ఆనందరేఖల్ని తల్లి గమనించింది. రాత్రులు నిద్రపోవడంలేదని కళ్ళక్రింద ఏర్పడిన నల్లనినీడలు చెప్తున్నాయి. ఆమె పాటలూ, గైటర్ వాద్యధ్వనులూఆచిన్నయింట్లో తరుచుగావినబడుతున్నాయి. కాని, తాయా పరిపూర్ణంగా ఆనందిస్తూందనడానికి వీలు లేదు. దొంగచాటుకాపురానికి ఆమెలోని స్త్రీత్వం తిరుగు

బాటుచేస్తూంది. చిన్న చప్పుడైతే తల్లి వస్తూం దేమోనని భయపడుతూంటుంది. తలుపు గడియపెట్టుకొంటున్నా వేంఅని అడిగితే ఏం చెప్పడం? ఆమె కదే పెద్ద బాధగావుంది. పావెల్ ఆమె భయాలు పోగొట్టడానికి చాల ప్రయత్నించేడు.

"ఎందుకమ్మా! భయం? ఎవ ళ్ళేమనుకోవడానికి ఏముంది? మనిద్దరం దంపతులం మనగదిలోకి ఎవ్వడికీ రావ డానికి వీలులేదు."

ఆ మాటలతో సంతృప్తిపడి తాయా ఆతని రొమ్ముపై తలపెట్టుకొని కౌగలించుకొని పడుకొనేది. ఆమె ఉచ్ఛ్వాస నిశ్వాసక్రమాన్ని వింటూ, తాను కదిలితే ఆమె కెక్కడ నిద్రాభంగం అవుతుందోనన్నట్లు ఆతడు కదలమెదలకుండా అలాగే వుండేవాడు.

తాయా కళ్ళల్లోని ఆనందరేఖల వెనకనున్న కార ణాన్ని మొదట గమనించినది లోలా. ఆ రోజునుంచి అక్క- చెల్లెళ్ళమధ్య దూరం ఏర్పడింది. త్వరలోనే తల్లీ గ్రహిం చింది. ఆమెకు చాల కష్టంకలిగింది. కోర్చాగిన్ ఇల్లాంటిపని చేస్తాడా అనిపించింది.

"ఆతని కిది తగిన పెళ్ళాంకాదు. చివరికీ సంబంధం ఎల్లా పరిణమిస్తుందో"—అని ఆమె లోలావద్ద భయం ప్రకటించింది.

మనస్సులో ఎంత బెరుకుగావున్నా, ధైర్యంచేసి కోర్చాగిన్‌వద్ద ఆమాట తీసుకురాలేకుండావుంది.

క్రమంగా నగరంలోని యువకులు కొందరు పావెల్ గదికి రావడం ప్రారంభించేరు. వారు వచ్చినప్పుడు గది కూడా చాలడంలేదు. వాళ్ళ పాటలతో ఆ చిన్నయిల్లు ప్రతిధ్వనించిపోతూంది.

పావెల్‌కు అతి ఇష్టమయిన పాట ఒకటుంది.

ఈ ప్రపంచమంతా
దుఃఖమయం... ...

అదే తరుచు వినబడుతూంది.

ప్రచారకార్యక్రమం వప్పచెప్పవలసిందని వేధించగా పార్టీకమిటీ పావెల్‌కు అధ్యయనతరగతులు నడపమని వప్పజెప్పింది. ఈ యువకులకు విద్యావిజ్ఞానాలు కలిగించడంలో ఆతని రోజులు గడిచిపోతున్నాయి.

మళ్ళీ చుక్కానిపట్టు దొరికింది. ఆతని జీవితనౌక దారినపడింది. మధ్యలో మునిగిపోతుందేమో ననిపించేటంతగా వరిగింది. కాని ఇప్పుడా దశ దాటింది. చదువుకోవడం, తద్వారా కార్యరంగంలో కురకడం అనే ఆశ సఫలంఅయ్యే లక్షణాలు కనబడ్డాయి.

కాని బ్రతుకు ఆతనిబాటలో ముళ్ళకంచె లేస్నె నాటుతూంది. ఒక్కొక్క ఆటంకం ఆతని గమ్యాన్ని దూరం దూరంచేస్తూంది.

తాయాతమ్ముడు జార్జి ఒకరోజున ఉన్నట్లుండి లెనిన్‌గ్రాడ్ నుంచి భార్యను వెంటబెట్టుకొని వూడిపడ్డాడు. ఆతని

భార్యతండ్రి ఆ వూళ్లోనే ఒక బారిష్టరు. అత్తవారింటనే మకాంపెట్టి ఆతను డబ్బుకోసం తల్లిని వేధించడం మొదలు పెట్టేడు.

కత్సుమ్ కుటుంబంలో అదివరకేవున్న పేచీలు జార్జి రాకతో మరీ వక్రించేయి. ఆతనువస్తూనే తండ్రిపక్షం వహించేడు. ఆతని మామగారి కుటుంబంవాళ్ళకి సోవియట్ ప్రభుత్వంయెడ అయిష్టం. వాళ్ళతోకలిసి కోర్చాగిన్‌ను ఇంటినుంచి తరిమెయ్యడానికీ, ఆతనినుంచి తాయాను వేరుచెయ్యడానికీ కుట్రలు ప్రారంభించేరు.

జార్జి వచ్చిన మరో రెండువారాలకి లోలాకు మరో వూళ్ళో ఏదో ఉద్యోగం దొరికింది. పిల్లవాడినీ, తల్లినీ తీసుకుని ఆమె వెళ్ళిపోయింది. తర్వాత పావెల్, భార్యతోకలిసి దూరంగావున్న మరో సముద్రతీరనగరానికి వెళ్ళిపోయేడు.

* * *

ఆర్టెమ్‌కు తమ్ముడిదగ్గరనుంచి ఉత్తరాలు తరుచుగా వస్తూండవు. ఏదో ఎన్నో నెలలకో వుత్తరం సిటీ సోవియట్ టేబిల్‌మీద ఆతనిపేరుతో ప్రత్యక్షం అయినప్పుడు పరిచితమైన ఆ వ్రాత చూడగానే గుర్తుపట్టేస్తాడు. అమితమైన ఆనందం పొందుతాడు.

ఈవేళ అటువంటి ఉత్తరం ఆతనిచేతులకు వచ్చింది.

"పావెల్‌ది. వాడిక్కడుంటే ఎంతబాగుండేది ? ఎంత సాయంగావుండేవాడు !"—అనుకొన్నాడు.

"ఆర్టెమ్, ఈమధ్య నాకు సందర్భపడినవన్నీ వ్రాయా లని కూర్చున్నాను. అల్లాంటివి నీకుతప్ప మరెవరికీ చెప్ప కోను. నాసంగతి నువ్వెరుగుదువు. నన్ను అర్థంచేసుకుం టావు. అందుకే నీకు వ్రాస్తున్నా.

"నా ఆరోగ్యం అంతకంతకి చెడుతూంది. ఒకదెబ్బ నుంచి తేరుకుని నిలబడేసరికి మరోదెబ్బ. అది మొదటిదాని కన్న భయంకరంగా తగులుతూంది. నేను దాని ముందర నిలబడలేకున్నా. మొదట నా ఎడమచెయ్యి పడిపోయింది. అది చాలదన్నట్లు ఇప్పుడు కాళ్ళకి వచ్చింది. నా గదిలో అతికష్టంమీద అటూయిటూ నడుస్తున్నా తప్ప మరో చోటికి పోవడంలేదు. ఇప్పుడు అదీ కష్టంఅయింది. మంచం మీదినుంచి కంచంముందుకు పోలేకున్నాను. ఇంకా బాధ లున్నాయనిపిస్తూంది. రే పెల్లావుంటుందో నాకే తెలియదు.

"ఇప్పుడు ఇల్లువదలి బయట పాదచలనం చేయడం లేదు. నా కిటికీలోంచిచూస్తే సముద్రం ఎదురుగా కనిపిస్తూం టుంది. నేను చూస్తున్న ప్రపంచంఅంతా అంతే. శరీరం చెప్పినమాట విననిస్థితి ఏర్పడితే అంతకన్న దౌర్భాగ్యం వేరుండదు. అందులోనూ మహోత్సాహులో తోసుకుని ముందుకుపోతున్న నీవంటి యోధులమధ్య జీవించాలని కలలు గనే బోల్షివిక్కుకి అది మరీ దుర్భరం.

"ఇప్పటికీ అగ్రశ్రేణిలో నిలబడగలననీ, అందరితో పాటు ఈ పోరాటంలో పాల్గొనగలననీ ఆశ చావలేదు. ఆ ఆశ పోగొట్టుకోవడం న్యాయంకూడా కాదు. పదేళ్ళుగా

కాన్సోమోల్, పార్టీ నాకు పోరాటపద్ధతులు నేర్పేయి. "బోల్షివిక్కులు సాధించలేనిదంటూ లేదు"— అన్నాగస నాయకులు. ఆమాట నాకెందుకు నచ్చించదు?

"ఇప్పుడైతే నా కాలంఅంతా చదువుకోవడంలోనే గడచిపోతూంది. పుస్తకాలు తెగచదువుతున్నా ఆర్టెమ్! చదివినంతవరకు బాగానే చదివేను. ప్రాచీన గ్రంథాలన్నీ చదివేను. కమ్యూనిస్టు యూనివర్శిటీనడుపుతున్న పోస్టల్ పాఠాలతో మొదటిసంవత్సరం పరీక్షలలో ప్యాసయ్యేను. సాయంకాలాలప్పుడు కమ్యూనిస్టుయువకులకు అధ్యయన తరగతి ఒకటి నడుపుతున్నాను. పార్టీ కార్యక్రమాలతో ఈ యువకులద్వారానే సంబంధం పెట్టుకుంటున్నా. సరే. తాయా ఒకామెవుంది. ఆమెకు రాజకీయాలూ, ప్రాపంచిక విషయాలు నేర్పడానికి నా శక్తియావత్తూ వుపయోగిస్తూన్నా. ఆమె నన్ను ఎంతోప్రేమగా కాపాడుకొస్తుంది. మేమిద్దరం మంచి స్నేహంగావుంటున్నాం. మాయింట్లో పెద్దఖర్చులేం లేవు. నాకు ముప్ఫయిరెండు రూబుళ్ళు పెన్షన్ వస్తుంది. తాయా కొంతసంపాదిస్తూంది. రెండూకలిపితే మాజీవితం బాగానే వెళ్ళిపోతూంది. పార్టీలోకి నేనెల్లావచ్చేనో, తాయా కూడా అలాగేవస్తూంది. కొంతకాలం ఎవరింట్లోనో పని మనిషిగా చేరింది. ఇప్పుడు ఒక ప్రభుత్వహోటల్లో పళ్ళేలు కడిగేపనికి కుదిరింది. ఈవూళ్ళో పరిశ్రమలు పెద్దవేంలేవు.

"మొన్ననే మహిళాశాఖవారు ఆమెను ప్రతినిధిగా ఎన్నుకున్నారు. అధికారపత్రంచూసుకొని ఎంతసంబరపడిం

దని ! ఆవిడవిషయంలో అది వట్టి అట్టముక్క కాదు. ఆమె ఒక కొత్తమనిషి అయిపోయింది. ఆమె అభివృద్ధికి నేను చెయ్యగలదంతా చేస్తున్నాను. ఏదన్నా పెద్ద ఫ్యాక్టరీలో ఆమెకు పనిఇప్పించాలి. అంతమంది కార్మికులలో ఒకర్తెగా ఆమె రాజకీయాలలో పరిపక్వం కాగలుగుతుంది కాని, ఇక్కడవున్నంతలో మంచిపుంతే తొక్కింది.

తాయాతల్లి ఇక్కడికి రెండుపర్యాయాలు వచ్చింది. ఆమె తనకు తెలియకుండానే కూతుర్ని వెనుకటి జీవితపద్ధతులవేపు లాగాలని ప్రయత్నించింది. తను బ్రతికిన పాడు బ్రతుకే కూతురూ బ్రతకాలనడం మంచిదికాదని అల్బినాకు నచ్చచెప్పడానికి ప్రయత్నించేను. కాని, దానివలన ఫలితం లేదు. చివరకు ఆమెతో పేచీతప్పదని అనిపిస్తోంది. నమస్తే.

—"పావెల్."

* * *

పాత మాత్సెస్తాలో అయిదోనెంబరు శానిటోరియం. ఒక పెద్దకొండమీద కట్టేరు ఈ శానిటోరియం. మూడంతస్థుల భవనం. దానిచుట్టూ దట్టమైన అడివి. దానిగుండా సముద్రంకేంటూ ఏటవాలుగా వున్నరోడ్డు. శానిటోరియం చుట్టూ వేడినీటి వూటలు, కిటికీతలుపులుతీస్తే నీటివూటల మీదినుంచి గంధకపువాసన గుప్పున కొడుతుంది. గదిలో పావెల్ కోర్చాగిన్ ఒక్కడేవున్నాడు. రేపు మరో ఇద్దరు రోగులు వస్తారన్నారు. అప్పుడు ఆయనకు గదిలో మరో కరు తోడుగావుంటారు. గదిబయట అడుగులు చప్పుడు విని

పించింది. ఏదో పరిచితమైన కంఠంకూడా. చాలమంది మాట్లాడుతున్నారు. ఆ గొంతులమధ్య ఆగొంతు బాగా పరిచితమైనదిగా వినిపిస్తోంది ఎవరిదోగాని, క్రమంగా గుర్తు తెలిసింది. "లెదెనెవ్ ఇనోన్కెంటీ పావ్లోవిచ్ ... అతడే."

పావెల్ తనమిత్రుణ్ణి పేరుపెట్టిపిలిచేడు. మరుక్షణంలో ఎవరో పిలుస్తున్నారంటూ లెదెనేవ్ గదిలో అడుగుపెట్టేడు. మంచంపట్టెమీద కూర్చున్నని మహాసంతోషం ప్రకటించేడు.

"కోర్చాగిన్ ఇంకా దిట్టంగానే వున్నాడన్నమాట. బాగుంది. ఏమిటయ్యా కబుర్లు. ఇదిగో ఇంతే. ఇక మంచం దిగబోననిమాత్రం చెప్పకు. అదేం లాభంలేదు. నా సంగతేమయిందో చూడు. నన్నుకూడా గూట్లోకెక్కించెయ్యాలని డాక్టర్లు ఎంతో ప్రయత్నించేరు. కాని వాళ్ళతరమా?"

లెదెనేవ్ పకపకనవ్వేడు.

కాని ఆ నవ్వువెనక విచారం, దుఃఖం ఇమిడివున్నాయని గ్రహించడం పావెల్ కు కష్టంకాలేదు.

రెండుగంటలసేపు ఇద్దరూ కబుర్లు చెప్పుకున్నారు. మాస్కో వార్తలన్నీ లెదెనేవ్ ఏకరువుపెట్టేడు. సమిష్టిక్షేత్రాల్ని నిర్మించాలనీ, గ్రామజీవితాన్ని నూతన పద్ధతులలో తీర్చిదిద్దాలనీ పార్టీ నిర్ణయించినట్లు ఆయనే చెప్పేడు. ఆ వార్తలు పావెల్ ను ఎంతో ఉత్సాహపరిచేయి.

"ఎక్కడో మూల యూక్రెయిన్ లో హడావిడిగా వున్నావనుకుంటున్నాను. కాని, నువ్విక్కడనే వున్నావు.

బాగా లేదేమీ. అది సరే. నేను నీ కన్న అధ్వాన్నంగా వున్నాను. మంచం దిగుతాననుకోలేదు. కాని, ఫర్వాలేదు. దిగేను. ఈ రోజుల్లో సుఖంగా కాలం గడిపేద్దా మనుకుంటే లాభం లేదు ఏమీ ప్రయోజనం వుండదు. పని జరగదు. కాస్త విశ్రాంతిగా కూర్చుని ఊపిరి కూర్చుకుంటే బాగుండు ననిపిస్తూంటుంది. వచ్చే కాలమూ. పోయే కాలమూ ? రోజుకో పదో, పన్నెండో గంటలు పనిచేయడమంటే తలప్రాణం తోకకి వస్తుంది అలా అనుకోవడమే కాదు. కాస్త బరువు తగ్గించుకుంటాను కూడా. కాని, ఎంతో సేపా ? మళ్ళీ రాత్రయ్యేసరికి అంతకి రెట్టింపు పని మీదపడిపోతుంది. ఎప్పుడూ అంతే. యంత్రం బలపడి, చక్రాలు వేగంగా తిరిగిన కొద్దీ మనం ఆ వేగాన్ని అందుకోనేటందుకు పడుచువాళ్ళంగానే వుండిపోవాలి."

లెదెనేవ్ ఒక్కమారు నుదురు తుడుచుకొని సన్నగా అన్నాడు :

"అదంతా అల్లా వుంచు. నీ సంగ తేమిటి ?"

తమరు విడిపోయిన తర్వాత జరిగిన ఘటన లన్నింటినీ పావెల్ క్లుప్తంగా మిత్రుడికి చెప్పేడు.

*　　*　　*

డాబామీద చెట్ల నీడలో ఒక జల్లచుట్టూ శానిటోరియంలోని రోగులంతా చేరి కూర్చున్నారు. వాళ్ళల్లో ఒకడు ప్రావ్దా చదువుతున్నాడు. అతని నల్లనికోటూ, మాసి నలిగిన టోపీ, మాసిన గడ్డమూ, గుంటలు పట్టివున్న నీలి

కళ్లూ, ఆ ఆకారం అంతా అతను చెయ్యితిరిగిన గని పని వాడని తోపింపజేస్తూంటుంది. క్రిషన్ చెర్నోకోజోవ్ గనుల్లో పని మాని పన్నెండేళ్ళయింది. అతి ప్రధానమైన ప్రభుత్వోద్యోగంలో ప్రవేశించడానికే ఆతను గనులు వదిలి పెట్టేశు. అయినా ఆనాటి అలవాట్లుపోలేదు. అప్పుడే గని లోంచి బయటికి వచ్చినట్లు కనిపిస్తాడు. అతని ఆకారం నడక మాటతీరు అన్నీ ఆతను వదిలిపెట్టినవృత్తిని జ్ఞాపకం చేస్తూంటాయి.

ప్రాంతీయ పార్టీ బ్యూరోలో చెర్నోకోజోవ్ సభ్యుడు. ప్రధానమైన ప్రభుత్వోద్యోగంలో వున్నాడు. ఏదో జబ్బు అతనిని తినేస్తూంది. కాలు కుళ్ళింది. ఇక్కడికి ఆరు నెలల నుంచి ఒకటే బాధ. మంచం దిగడం లేదు.

ఆయన కెదురుగా ఏదో ఆలోచనలోపడి సిగరెట్టును వూదేస్తూకూచుంది జిగారేవా. ఆమె పూర్తి పేరు అలెగ్జాండ్రా అలెగ్జయేవ్నా జిగారేవా. ఆవిడ వయస్సు ముప్ఫయ్యేడేళ్ళు. తన పద్ధెనిమిదో యేటనే పార్టీలో చేరింది. సెంట్ పీటర్స్‌బర్గ్‌లో రహస్యంగా పనిచేసిన రోజుల్లో ఆమెకు 'షురోచ్కా' అని పార్టీసభ్యుల్లో పేరు. సైబీరియాకు ప్రవాసము పంపబడేనాటి కామె వయస్సు ఎంతోనా! ఇంకా బాల్యంకూడా వదల్లేదనాలి.

అక్కడున్నవారిలో మరొకతని పేరు పాన్‌కోవ్. అతను తలవంచుకొని ఒక జర్మన్ పత్రిక చూచుకుంటున్నాడు. మధ్య మధ్య తలఎత్తి కళ్ళజోడు సవరించుకుంటున్నాడు.

ముప్ఫయ్యేళ్ళవాడు, వస్తాదులా వుంటాడు. అటువంటివాడికి కాలు ఈడుచుకుపోయింది. మంచి వ్రాయసకాడు, పత్రికా సంపాదకుడు. అతడు ప్రభుత్వ విద్యాశాఖలో పనిచేసేడు. యూరోపు వ్యవహారాలన్నీ ఆయనకు కరతలామలకం. చాలా భాషలు వచ్చును. పెద్దగా కలుపుగోలుతనంగా వుండడు. చెర్నోకోజోవ్‌కు ఆయనమీద అమిత విశ్వాసం.

పావెల్ కూర్చున్న కుర్చీవేపు తల ఎగరవేస్తూ జిగా రేవా చెర్నోకోజోవ్‌ను ప్రశ్నించింది.

"నీ గదిలో వుంటున్నది ఆయన అన్నమాట!"

పేపరు చదువుకుంటున్నవాడల్లా చెర్నోకోజోవ్ తల ఎత్తి చూసేడు. అతని ముఖం ప్రఫుల్లమయింది.

"అవును. కోర్చాగిన్ అతడే. షూరా, నువ్వు తప్పకుండా అతనితో పరిచయం పెట్టుకోవాలి. పాపం, రోగపడి పోయాడు కాని, ఎంతో సాయపడేవాడు. కామ్‌సోమాల్ జనంలో మొదటి తరానికి చెందిన ఘటికుడు. అతనికి సాయ పడాలనే నిర్ణయానికి వచ్చేను. మనం కొంచెం చెయ్యి ఇచ్చామా! ఆతడింకా పనిచేస్తాడు."

చెర్నోకోజోవ్ మాటలు పావెల్ చెవిని పడ్డాయి.

"జబ్బేమిటి?"

"అంతర్యుద్ధఫలితం. వెన్నెముకకు సంబంధించిన జబ్బట. ఇక్కడి డాక్టరుతో మాట్లాడేను. పక్షవాతం శరీరానికంతకూ వ్యాపించే ప్రమాదం వుందన్నాడు."

"నీపోలు తీసుకోస్తావుంటు —అని జిగారేవా బయలు దేరింది.

అని మొదలుకొని వారిద్దరికీకూడ స్నేహం కలిసింది. జిగారేవా, చెర్నోకోజోవ్‌లు తన జీవితాంతం ఎంతో సన్నిహితులుగా వుంటారని, జబ్బుపడి కదలలేనిదశలో ప్రాపుగా వుంటారని కొర్చాగిన్ ఆక్షణంలో ఎరుగునా!

జీవితప్రవంతి యథాప్రకారం దొర్లిపోతూంది. తాయా పనిచేస్తూంది. పావెల్ చదువుకొంటున్నాడు. మళ్ళీ అధ్యయన తరగతులు ప్రారంభిద్దామనుకొన్నాడు. కాని ఇంతలో మరో నష్టం వచ్చింది. రెండుకాళ్ళూ పడిపోయేయి. ఒక్క కుడిచెయ్యిమాత్రమే ఆతని స్వాధీనంలోవుంది. పళ్ళుబిగించి లేవడానికి మహాప్రయత్నంచేసేడు. కాని సాధ్యంకాలేదు. ఇంక కదలలేనని గ్రహించేడు. ఆతనికి సహాయం చేయలేక పోతున్నానేయన్న బాధను పైకి కనబడకుండా తాయా దాచుకొంటూంది. పావెల్ క్షమార్పణ కోరుతున్నట్లు చిరునవ్వుతో పలకరించేడు.

"తాయా! మనిద్దరం ఇంక విడిపోదాం. మన ఏర్పాట్లలో ఈవిధంగా జరిగిపోతానేమోననే ఆలోచనరాలేదు. ఆ విషయంలో ఏంచెయ్యాలో ఈవేళకూర్చుని ఆలోచిస్తా."

ఆమె అతని నింక మాట్లాడనివ్వలేదు. ఆతని గుండెల మీద తలపెట్టుకొని వెక్కి వెక్కి ఏడ్చింది.

తనతమ్ముని నూతనపరిస్థితి వార్త తెలియగానే ఆర్టెమ్ తల్లికి వ్రాసేడు. మేరియా యాకోవ్‌లేవ్నా ఎక్కడికని అక్కడ

వదిలేసి వెంటనే కొడుకుదగ్గిరకెళ్ళింది. ముగ్గురూ కలిసి వుంటు న్నారు. మొట్టమొదటినుంచీ ముసలితల్లీ, కోడలూ అరమరి కలులేకుండా సఖ్యంగానే వున్నారు.

తాయా సిటీసోవియట్‌లోకి ఎన్నికయింది. ఆవార్త నెంతో వుత్సాహంతో వచ్చిచెప్పింది. ఆరోజు మొదలుకొని పావెల్‌కు ఆమె కనబడడమే తగ్గిపోయింది. పగలంతా శాని టోరియంలోని వంటశాలలో పనిచేసేది. పళ్ళేలుకడిగే పనికి అక్కడ కుదురుకుంది. అక్కడి పనికాగానే తిన్నగా సోవి యట్‌కు వెళ్ళేది. తిరిగి వచ్చేసరికి ఎంతో రాత్రిఅయ్యేది. బాగా అలసిపోయివుండేది. కాని, అక్కడ పనిలోకలిగిన అనుభవాలు ఆమెనెంతో వుత్సాహపరిచేవి. త్వరలోనే ఆమె పార్టీ సభ్యత్వంకోసం దరఖాస్తుచేస్తుంది. చేయాలని ఆమె ఎన్నాళ్ళనుంచో వుబలాటపడుతూంది. ఆరోజు రావాలని ఎంతో ఆసక్తితో ఎదురుచూస్తూంది. ఇంతలో పావెల్ మీద మరో ఆపద వచ్చిపడింది. దురదృష్టం అతనిమీద మరో దెబ్బతీసింది. మొదట కుడికన్నులో మంట పోటు ప్రారంభ మయింది. త్వరలోనే అది ఎడమకన్నుకు కూడా పాకింది. కళ్ళు పొరలు వేసినట్లయేయి. ఏమీ కనబడ్డంలేదు. గుడ్డితనం ఎంత భయంకరమో పావెల్‌కు మొట్టమొదటిమారుగా అర్థమయింది.

ఆతని మార్గంలో ఇదోకొత్త ఆటంకం. చాల భయం కరమూ, అతిక్రమించలేనిదీ. దీనితో తాయాకూ, అతని తల్లికీ ఎంతో నిరాశకలిగింది. కాని, ఆతడు అతిశాంతంగా గంభీరంగా వారిని వూరడించేడు.

"చూద్దాం. ఏమవుతుందో. ఇంకేమీ ప్రయోజనం లేకపోయినా, పనిచేయడం అనేది ఇంక అసంభవమనిపిస్తే ఈ నాటకం కట్టిపెట్టెయ్యడమే మంచిది."

పావెల్ తన మిత్రులకు జాబులు వ్రాసేడు. వా రతనిని వూరడిస్తూ, ధైర్యంచెప్తూ తిరిగి వ్రాసేరు.

ఈ కష్టదినాలలోనే ఒకరోజున తాయా మహోత్సాహంతో ఇంటికివచ్చింది.

"పావ్లూషా! నన్ను పార్టీలో కేండిడేటుసభ్యురాలినిగా తీసుకున్నారు."

సెల్ సమావేశం ఏలాజరిగిందో, తన దరఖాస్తును ఏలా అంగీకరించేరో ఆమె మహోత్సాహంతో చెప్తూంటే తాను పార్టీలో చేరిననాటి దినాలు గుర్తువచ్చేయి.

"కామ్రేడ్ కోర్చాగినా! బాగానేవుంది. ఈ ఇంట్లో మనం ఇద్దరం ఒక ఫేక్షను"—అంటూ అత డామె చేయి పట్టుకున్నాడు.

ఒకమారు వచ్చి తనను చూడవలసిందని కోరుతూ ఆ మరునాడే పావెల్ జిల్లాపార్టీకమిటీ కార్యదర్శికి జాబు వ్రాసేడు.

ఆ సాయంకాలమే బురదకొట్టుకొనివున్న కారొకటి గుమ్మంలో ఆగింది. మరుక్షణంలో వాల్మార్ గదిలో అడుగు పెట్టేడు. ఆతడు లెట్టిష్ జాతివాడు. నడివయసువాడు. పెద్ద దుబ్బుగడ్డం. వస్తూనే పావెల్‌తో కరచాలనం చేసేడు.

"ఎల్లావుంది? నీపద్ధతేం బాగులేదుసుమీ. ఈపాటికి మంచంవొదులు. ఏదో వూరుకి పంపుతాం. ఏమంటావు?" —అంటూ నవ్వేడు.

తాను వెళ్ళవలసిన మీటింగుమాటకూడా మరచి ఆతడు రెండుగంటలకాలం అక్కడే కూర్చుండి కభుర్లు చెప్పేడు. తాను చెయ్యగలదే ఏదోపని ఇవ్వమంటూ పావెల్ ప్రార్థిస్తూంటే ఏంచెయ్యడానికీ తోచక గదిలో అటూఇటూ పచారు ప్రారంభించేడు.

"అధ్యయన తరగతులమాట ఎత్తకు. కొంతకాలం విశ్రాంతితీసుకో. నీకళ్ళసంగతి చూస్తాం. ఏమన్నా కుదిరే అవకాశంవుందేమో, ప్రయత్నిద్దాం. మాస్కో వెళ్ళి ఎవరినన్నా స్పెషలిస్టును చూస్తే? ఆలోచించు..."

మాటమధ్యలోనే పావెల్ అడ్డంవచ్చేడు.

"కామ్రేడ్ వాల్మర్! జనంమధ్య వుండాలని నా కోరిక. ప్రస్తుతస్థితిలో అది మరీ అవసరం. ఒంటరిగా వుండ లేను. ఏమాత్రం అనుభవంలేని చిన్నవాళ్ళని నాదగ్గిరికి పంపించు. పల్లెటూళ్ళలో కుర్రాళ్ళు మరీ అతివాదపోకడలు పోతున్నారు. అప్పుడే కమ్యూన్లు నిర్మించాలని వూను కొంటున్నారు. కామ్సోమాల్స్ సంగతి నీకు తెలుసుగా? పట్టివుంచేవాళ్ళు లేకపోతే వెనక ఎవరన్నా వున్నదీ, లేనిదీ చూసుకోకుండా తోసుకుపోతారు. ఒకప్పుడు నేనూ అల్లాగే వుండేవాడిని."

పచారుచేస్తున్నవాడల్లా వాల్మర్ గదిమధ్యలో నిల బడిపోయేడు.

"నీకీసంగతి ఎల్లా తెలిసింది? నాదగ్గిరికీవేళే వచ్చిం దీ వార్త."

పావెల్ చిరునవ్వు నవ్వేడు.

"నాభార్య చెప్పింది. బహుశా ఆమెను ఎరిగేవుంటావు. నిన్ననే ఆమెను పార్టీలోకి తీసుకొన్నారు."

"కోర్చాగినా, నీభార్యయా? ఏమిటీ, చెప్పేవుకావు."

వాల్మరు కొద్దినిముషాలు నిశ్శబ్దంగా నిలబడ్డాడు. ఏదో ఆలోచన తట్టింది.

"జ్ఞాపకంవచ్చింది. లెవ్ బెర్సెనేవ్‌ని పంపిస్తాం. అంత కంటె మంచికామ్రేడ్‌ని చూడవు. నీకు సరిపడేమనిషి. మీ రిద్దరూ ఖేషుగ్గా కలిసిపోతారు. హైఫ్రీక్వెన్సీ ట్రాన్స్మిటర్లు మీరిద్దరూ... నేనొకప్పుడు ఎలక్ట్రిషియనుగా పనిచేసేనులే. దానికి సంబంధించిన మాటలు దొర్లిపోతుంటాయి. లెవ్ ఓ రేడియో అమర్చిపెడతాడులే. అల్లాంటివాటికి ఆతడు పులి. వాళ్ళింట్లో ఇయర్‌ఫోన్లు తగిలించుకొని తెల్లవార్లూ కూర్చుంటూవుంటాను. మా ఆవిడ చివరకు అనుమానపడే టంతవరకు వచ్చింది. వేళకానివేళల్లో ఇంటికి రావడంలో వుద్దేశమేమిటని నిలేసింది."

కోర్చాగిన్ చిరునవ్వు నవ్వేడు.

"బెర్సెనేవ్ ఎవరు?"

"మన వకీలు. నిజంచెప్పాలంటే నాకు బ్యాలట్ నాట్యం ఎంతపాటి చేతనవునో, ఆతడికి వకాలతూ అంతేచేతనవును. ఈమధ్యదాకా ఒక ముఖ్యమైన వుద్యోగంలో వుండేవాడు. 1912 నాటినుంచీ మన వుద్యమంలోవున్నాడు. విప్లవంనాటి నుంచీ పార్టీసభ్యుడు. అంతర్యుద్ధం రోజుల్లో రెండో ఆశ్విక సైన్యంతాలూకు రివల్యూషనరీ ట్రిబ్యునల్ లో సభ్యుడుగా వుండేవాడు. ఆరోజుల్లో ఆసైన్యం వైట్ గార్డుల్ని ఏరి పలిపే స్తూంది. కొన్నాళ్ళు జారిట్సిన్ లోనూ, దక్షిణరంగంలోనూ పనిచేసేడు. తర్వాత దూరప్రాచ్య రిపబ్లిక్ కు సంబంధించిన సుప్రీం మిలిటరీకోర్టు సభ్యుడుగా పనిచేసేడు. అక్కడ చాల ఇబ్బందులుపడ్డాడు. చివరకు క్షయపట్టుకొంది. దూరప్రాచ్యం వదిలేసి కాకేషసుకి తిరిగివచ్చేడు. వచ్చినకొత్తలో గుబె ర్నియాకోర్టులో అధ్యక్షుడుగా పనిచేసేడు. తర్వాత టెరిటోరి యల్ కోర్టు ఉపాధ్యక్షుడయ్యేడు. ఇంతలో ఊపిరితిత్తులు బాగా చెడిపోయేయి. ఇక్కడికివచ్చి విశ్రాంతి తీసుకోవడమూ చచ్చిపోవడమూ. అంతే. వచ్చేడు. మావకీలు అతడు. పెద్ద పనేంవుండదు. ఆతనికి తగినపని. క్రమంగా మనవాళ్ళు అత నికో సెల్లు వప్పచెప్పేరు. అక్కడినుంచి జిల్లాకమిటీలోకి ఎన్నుకున్నారు. కొద్దిరోజుల్లో ఒక రాజకీయపాఠశాల పని వప్పచెప్పేరు. ఇప్పుడు కంట్రోలు కమిషనులో సభ్యు డయ్యేడు. చిక్కుసమస్యల్ని విప్పడంకోసం వేసే ప్రతి కమి షనులోనూ ఆతడు తప్పకుండావుంటాడు. ఆతడికి వేటఅంటే మహాసరదా. రేడియోఅంటే చెవికోసుకుంటాడు. ఉన్న దొకే వూపిరితిత్తి. కాని అల్లా కనిపించడు. మహా హుషా

రైనవాడు. ఆతడెప్పుడేనా మరణించినా జిల్లాకమిటీ ఆఫీసుకీ కోర్టుకీ మధ్య ఏరోడ్డుమీదనో మరణించవలసినవాడే.''

పావెల్ ఆతని వాక్ప్రవాహాన్ని ఆపేడు.

''ఆతనికంత పని ఎందుకిచ్చేరు. ఇదివరకటికన్న ఆత నికి పని ఎక్కువయిందికదా.''

వాల్మర్ ఆతనివంక చిత్రంగా చూసేడు.

''నీకు ఏ అధ్యయన తరగతినో ఇస్తాననుకో. అప్పుడు లెవ్ ఏమంటాడో ఎరుగుదువా? ''అంతపని ఎందుకిచ్చేరు?''- అంటాడు. అయిదేళ్ళు హాస్పిటళ్ళలో ఇనపమంచాలమీద పాకురులాడేకన్న ఒక్క ఏడాది గట్టిగాపనిచేస్తే చాలదా అంటాడు. మనవాళ్ళ ఆరోగ్యంగురించి శ్రద్ధ తీసుకోనైనా తీసుకోకుండానే సోషలిజాన్ని నిర్మించవలసివస్తూంది.''

''ఆయన అభిప్రాయం సరైనదే. అయిదేళ్ళు మూల బడి బ్రతికేకంటె ఒక్కఏడాది పనిచేయడం మేలంటాను. మనం ఒకొక్కప్పుడు మనశక్తియుక్తుల్ని దుర్వినియోగం చేసేస్తుంటాం. అది వీరత్వం అనను. చేతగానితనమూ, అబాధ్యత్వమూ అంటాను. నా ఆరోగ్యంగురించి అశ్రద్ధ చేసినందుకు ఇప్పుడు విచారిస్తున్నా. అదిఅంతా అశ్రద్ధే గాని, వీరత్వంకాదు. ఆ తెలివితక్కువ దుస్సాహసానికి పూని కొని వుండకపోతే ఇంకా కొన్నేళ్ళు పనిచేయగలిగేవాణ్ణే. నిజంచెప్పాలంటే అతివాదధోరణి బాలారిష్టాలలో ఒకటం టాను.'''

"ఇప్పుడేమన్నా అంటాడు. కాని కాస్తవ్యాపించి చేరితే మళ్ళీ ఈ మాటవొక్కటీ గుర్తుండదు" – అనుకొన్నాడు, వాల్కర్.

మర్నాడు సాయంకాలం లెవ్ బెర్సెనేవ్ వచ్చేడు. పావెలూ అతడూ అర్ధరాత్రివరకూ కూర్చుని కబుర్లు చెప్పుకొన్నారు. ఎన్నేళ్ళక్రితమో తప్పిపోయిన సోదరుడు మళ్ళీ కనబడినప్పుడు కలిగినంత ఆనందం ఇద్దరికీ కలిగింది.

పొద్దుటే కొందరువచ్చి కోర్చాగిన్ ఇంటికప్పుమీద రేడియోకోసం ఒకతీగలాగుతున్నారు. ఇంటో లెవ్ రేడియో సెట్ అమరుస్తూ పావెల్‌తో తన అనుభవాలన్నీ చెప్తున్నాడు. పావెల్‌కు కళ్ళులేకపోవడంచేత లెవ్ ఎల్లావుంటాడో ఎరగడు. తాయా అతని ఆకారాన్ని వర్ణించింది. మంచి పొడుగైనవాడనీ, రాగిజుట్టూ, నీలికళ్ళూను. ఆవేశపరుడు——అనీ చెప్పింది. మొదట మాట్లాడినప్పుడు అతని ఆకారాన్ని పావెల్ అల్లాగే వూహించుకున్నాడు.

చీకటి పడేవేళకి గదిలోని మసకచీకట్లో రేడియో తాలూకు మూడు వాల్వులూ మిలమిలలాడడం ప్రారంభించేయి. లెవ్ 'ఇయర్‌ఫోను'లను పావెల్ చేతికిచ్చేడు. మొదట ఏవేవో కూతలూ, అరుపులూ ఒకటేగొడవగా వినిపించింది. ఓడరేవులోని ట్రాన్స్మిటర్లు 'బీప్, బీప్' అంటూ చెవిలో ఒకటేహోరు. ఎక్కడో సముద్రంమీదవున్న ఓడవొకటి 'కట్‌కట్, కట్‌కట్' అంటూ వైర్లెస్ సంకేతాల్ని పంపు

తూంది. నెమ్మదిగా 'బటన్' తిరిగింది. ఆ గంద్రగోళం మధ్యన స్టేషన్ను పట్టుకొంది.

సన్నగా, స్పష్టంగా మాట వినిపించింది.

"మాస్కో రేడియో స్టేషను... మాస్కో... మాస్కో..."

రేడియో స్టేషన్లు విన్నదే. అయినా రసూరమి అరవై స్టేషన్లు దానిమీద వినిపిస్తున్నాయి. ప్రపంచంలోని అన్ని ప్రాంతాలూ పావెల్‌కు అందుబాట్లోకి వచ్చేయి. ఆతడికి దూరమైపోయిన ప్రపంచమూ, జీవితమూ 'ఇయర్ ఫోన్ల' గుండా ఆతనికి సన్నిహితం అయేయి. మరోమాటు జీవితపు నాడి దొరికింది.

పావెల్ ముఖంలో కనబడిన దీప్తినిచూసేక, బెర్సెనేవ్ అంత నీరసంలోనూ సంతృప్తిపొందేడు.

ఇల్లంతా నిశ్శబ్దంగావుంది. తాయా నిద్రలో ఏదో పలవరిస్తూంది. ఈమధ్య ఆమె అతనికి కనబడడమే అరుదయింది. నీరసంగా, చలికి వణికిపోతూ ఎప్పుడో ఓరాత్రి వేళ ఇంటికివస్తుంది. అంతకంతకి ఆమెకు పని ఎక్కువవుతూంది. ఖాళీరోజంటూ వుండడమేలేదు. ఆ విషయంమీదనో ఓరోజున బెర్సెనేవ్ అన్నమాట లాతనికి జ్ఞాపకం వచ్చేయి.

"భార్యాభర్తలిద్దరూ పార్టీసభ్యులే అయితే వాళ్ళు ఒకరికొకరు కనబడ్డంకూడా వుండదు. కాని దానివలన రెండు ఉపయోగాలున్నాయి. ఒకరిమీద ఒకరికి మోజుతగ్గదు. దెబ్బలాడుకునేందుకు వ్యవధివుండదు."

ఆతడేం అభ్యంతరంచెప్తాడు? అంతే జరిగేది. తాయా సాయంకాలం ఇంటికొచ్చి తనతోనే కూర్చున్న రోజులు న్నాయి. ఆ రోజుల్లో వారిద్దరిమధ్యా ఈనాడున్నంత ఆదరమూ, అభిమానమూ లేవు. ఆనాడామె ఆతనిభార్య. సహధర్మిణి. కాని, ఈ వేళ ఆమె ఆతనిశిష్యురాలూ, పార్టీ కామ్రేడూను..."

తాయా రాజకీయంగా అభివృద్ధి పొందినకొలదీ ఆమె తనతో గడిపే ఘడియలు తగ్గిపోతాయి. తప్పదు. అనుకొన్నాడు.

మళ్ళీ అతనికి అధ్యయన తరగతి నొకదానిని వప్పచెప్పేరు. మళ్ళీ యువకులు రాకపోకలు, మాటలు, పాటలు, చర్చలతో ఆయిల్లు ముఖరితమైపోతూంది. వాళ్ళతో కాలం గడుపుతూంటే పావెల్‌లో నూతనోత్సాహం పుట్టుకువస్తూంది.

వాళ్ళు లేని సమయంలో ఆతడు రేడియో వింటూ వుంటాడు. భోజనంవేళ 'ఇయర్ ఫోన్'లు తీయించడం ఆతని తల్లికి ఇంచుమించు అసాధ్యంగా వుంటూంది.

కళ్ళు లేని లోపాన్ని రేడియో తీర్చింది. ఏదో తెలుసుకోవాలనీ, వినాలనీ, నేర్చుకోవాలనీ ఆతని కొకటే ఆశ. ఆ ఆశతోనే ఆతడు తన శరీరకష్టాలను మరవకలుగుతున్నాడు. కళ్ళబాధ, కాళ్ళబాధ ఏదీ కనబడ్డం లేదు.

పావెల్ తర్వాతితరం కామ్‌సోమాల్స్ మాగ్నిటోస్త్రోయ్‌లో సాధించిన విజయాల వార్తలు రేడియో వినిపించినప్పుడు అత డెంతో ఆనందించేడు.

మంచుతుపానులు, శరీరాన్ని బిగతీసేసే ఉరల్ పర్వతాల చలి ఎలా ఉంటాయో మనస్సులోనే ఊహించుకొన్నాడు. హోరున గాలి వీస్తూంటే, మంచుతుంపులు సుడులు తిరుగుతూంటే ఆరుబయట పెద్ద పెద్ద ఫ్యాక్టరీ బిల్డింగుల కప్పులమీద, ఆర్కులైట్ల వెలుతురులో పనిచేస్తున్న యువకమ్యూనిస్టులు అతని కళ్ళముందు మెదిలేరు. ఆ కర్మాగారం, యంత్రాలూ మంచుతుపానులో పాడైపోకుండేందుకు వాళ్ళు అంత కష్టానికీ సిద్ధపడ్డారు. వాళ్ళంతా రెండో తరానికి చెందిన కామ్సోమాల్స్. వారితో పోల్చి చూస్తే తామంతా ఆఅడవిలో రైలుమార్గం వేయడానికై పడ్డకష్టం ఒకకష్టమా అనిపించింది. దేశం, దేశంతోపాటు ప్రజ ఎంత అభివృద్ధి పొందేరు?

ద్నీపర్ నదిలో! ఉక్కుచట్రాన్ని విరగతోసుకొని నీరు మనుష్యుల్ని, యంత్రాల్ని విసిరిపారేసింది. ఆ గండి పూడ్చడానికి కామ్సోమాల్ యువకుల్ని పిలిపించేరు. ఉరికించేరు. రెండురోజులు మహాపోరాటం జరిపి ఆ యువకులు ప్రవాహాన్ని అదుపులోకి తెచ్చేరు. ఈ పోరాటంలో కామ్సోమాల్ సంస్థకు చెందిన కొత్తతరం యువకులు ముందుండి పనిచేసేరు. ఆ వీరులలో తన మిత్రుడు ఇగ్నాత్ పాంక్రాటోవ్ పేరుకూడా వినపడ్డప్పుడు పావెల్ ఉత్సాహానికి మేర లేకపోయింది.

# ప్రకరణం 9

మాస్కో వచ్చిన కొద్దిరోజులవరకూ పావెల్ ఒక ఇన్‌స్టిట్యూటులో మకాంచేసేడు. దాని అధ్యక్షుడు ఆతనిని ఒక ప్రత్యేకఆస్పత్రిలో చేర్పించేటందుకు యేర్పాటుచేసేడు.

పడుచుదనమూ, ఆరోగ్యమూ వున్నప్పుడు మనిషి ఎంత ధైర్యంగా ఉండగలడో అతని కిప్పుడు అర్థమయింది. ఇప్పుడన్నీ చిక్కులే తటస్థపడడంతో ధైర్యం అనేది ప్రతిష్ఠకు సంబంధించిన సమస్యగా అయింది.

*　　　*　　　*

పావెల్ కోర్చాగిన్ మాస్కోకు వచ్చి అప్పుడే ఏణ్ణర్థమయింది. ఈ పద్ధెనిమిదిమాసాలు ఆతడు అంతులేని బాధ పడ్డాడు.

కళ్ళ ఆస్పత్రిలోని ప్రొఫెసర్ అవెర్బాచ్ నిజపరిస్థితిని పావెల్‌కు స్పష్టంగా చెప్పేసేడు. చూపు వస్తుందనే ఆశ లేమీ లేవన్నాడు. భవిష్యత్తులో వాపు తీస్తే కనుగుడ్లు ఆపరేట్ చేయవచ్చును. ఈ లోపున వాపు వ్యాపించకుండా చూడడానికి ఒక ఆపరేషన్ జరగాలి అన్నాడు.

ఆపరేషన్‌కు పావెల్ అంగీకారం కోరేరు. అవసర మనుకుంటే ఏం చేసినా సరేనని ఆతడన్నాడు.

థైరాయిడ్ తిత్తిని ఆపరేట్ చేయడానికి అతనిని బల్ల ఎక్కించేరు. గంటలతరబడి ఆపరేషన్ సాగింది. ఈలో పున మూడుమార్లు మృత్యుచ్ఛాయలు అలుముకొన్నాయి. కాని, పావెల్‌ది గట్టిప్రాణం. ఏమవుతుందో ఎల్లావున్నాడో నని ప్రాణం కొట్టుకుపోతూ తాయా వచ్చింది. ఎదురుగా పావెల్ ప్రశాంతంగా, చిరునవ్వుతో కనిపించేరు. ఆతను పడిన బాధ ముఖంలో కనిపిస్తున్న వెల్లబాటునుబట్టి అర్థం చేసుకోవలసిందే.

ఆమెను చూడగనే అతను ధైర్యం చెప్పేడు.

"ఏం ఫర్వాలేదమ్మా! నన్ను చంపడం అంత తేలికేం కాదులే. ఈ ధన్వంతరులమాటలు బోటు అయ్యేటట్లు చేయ డానికేనా నేను బ్రతికివుంటాను. నా రోగం, ఆరోగ్యం గురించి వాళ్ళు చెప్తున్న వన్నీ నిజమే. కాని, ఏ పనీ చేయ లేనంటున్నారే అది మాత్రం పొరపాటు. చూస్తూవుండు."

నూతన జీవితాన్ని నిర్మించుతున్న పార్టీసభ్యులతో పాటుగా పనిచెయ్యాలని ఆతని దృఢసంకల్పం. తాను చెయ్య వలసిందేమిటో కూడా ఆతడు నిర్ధారణ చేసుకున్నాడు.

* * *

శీతాకాలం వెళ్ళిపోయింది. వసంతరుతువు వచ్చింది. అప్పుడే పావెల్‌కు మరో ఆపరేషన్ జరిగింది. మనిషి బహు నీరసంగావున్నాడు. ఆపరేషన్లు ఇంకవద్దనుకొన్నాడు. రోగం

బాధకన్న రోగుల మూలుగులు, ఏడ్పులు వినడం చాల కష్టంగావుంది. హాస్పిటలులో ఇంక వుండకూడదనుకొన్నాడు.

డాక్టర్లు మరో ఆపరేషన్ చేస్తామన్నారు. కాని పావెల్ నిరాకరించేడు.

"వద్దు. ఇంక చాలును లెండి. వైద్య విజ్ఞానంకోసం నా రక్తం ధారపోసిందిచాలు. మిగిలింది నాకుండనివ్వండి. దానిపని వుంది."

ఆరోజుననే అతడు పార్టీ కేంద్ర కమిటీకి జాబు వ్రాసేడు. వైద్యంకోసం తిరగడంలో ప్రయోజనం ఏమీ లేదనీ, తన భార్య ఇక్కడే పనిచేస్తోంది కనక తానుకూడా మాస్కోలోనే వుండిపోతాననీ వ్రాసేడు. పార్టీని సహాయం కోరడం ఇదే ప్రథమం. పార్టీ అతని కోరికను అంగీకరించింది. మాస్కో సోవియట్ ఆయనకు యిల్లు చూపించింది. ఇంకెప్పుడూ అడుగు పెట్టకూడదనుకొంటూ పావెల్ హాస్పిటలు నుంచి లేచివచ్చేడు.

క్రోపాట్కిన్‌స్కాయాలోని ఒక పక్క వీధిలో పావెల్ బస. ఆ వీధి ప్రశాంతంగా వుంటుంది. ఇల్లుకూడా నిరాడంబరంగా వుంది. ఆ చిన్న యిల్లే అతనికి భవ్య ప్రాసాదం లా అనిపించింది. మధ్యలో అర్ధరాత్రి తెలివివచ్చి నప్పుడు పావెల్ ఎంతో ఆశ్చర్యపడుతూంటాడు. హాస్పిట లుకు పోవలసిన అవసరం వుండదని నమ్మడం కష్టంగా వుంది అతనికి.

తాయా ఇప్పుడు పార్టీ సభ్యురా లయింది. మంచి పని మంతురాలు. ఆమె జీవితం అంత సంతోషకరంగా లేకపో

యినా ఆమె ఫ్యాక్టరీలో పేరుమోసిన పనివాళ్ళల్లో ఒక త్తెగా లెక్క. పెద్ద వేషభాషలు ఎరగని ఆ పడుచుమీద తోడిపనివారి కెంతో ప్రేమా, అభిమానమూను. వా రా మెను ఫ్యాక్టరీలోని ట్రేడ్‌యూనియన్ కమిటీకి ఎన్నుకున్నారు. మంచి బోల్షివిక్‌గా పరిణతిపొందుతున్న భార్యను చూచుకొన్న సంతోషంలో పావెల్ తన కష్టాలను మరిచి పోతున్నాడు.

*　　　*　　　*

ఒకనాడు బాజనోవా ఏదో పనిమీద మాస్కోవచ్చి కోర్చాగిన్‌ను చూడడానికి వచ్చింది. ఇద్దరూ చాలసేవు మాట్లాడుకొన్నారు. త్వరలోనే పార్టీసభ్యుల మధ్య పని చేయడానికి వస్తున్నానంటూ అతడెంతో ఉత్సాహపడ్డాడు.

పావెల్ తలలో నెరసినవెంట్రుకలు బాజనోవా కంట బడ్డాయి.

"నువ్వు చాలాబాధపడ్డావు. తెలుస్తూనేవుంది. కాని, నీ వుత్సాహం ఏమాత్రం తగ్గలేదు. అంతకన్న కావలసింది ఏముంది? గడచిన అయిదేళ్ళూ నువ్వొక లక్ష్యంతో సాధిక చేసేవు. ఆ సాధన గమ్యాన్ని చేరుకొనడానికై వుత్సాహ పడుతున్నావు. బాగుంది. ఏమిటి నీ పథకం?"

పావెల్ చిరునవ్వు నవ్వేడు.

"రేపు నా మిత్రులు ఒక స్టెన్సిల్, అట్ట తీసుకొస్తు న్నాడు. దాని సహాయంతో పంక్తిమీద పంక్తి పడకుండా వ్రాయొచ్చు. అటువంటిసాధనంఒకటి లేకపోతే నేనువ్రాయ

లేను. ఎంతో ఆలోచించగా, ఆలోచించగా ఆ వుపాయం తట్టింది. అట్ట చివరిభాగం గట్టిగా వుంటుంది. కనుక నా చేతిలోని పెన్సిలు తిన్నగా నడిచిపోతుంది గాని, దారి తప్పడం జరగదు. ఏం వ్రాస్తున్నదీ చూడకుండా వ్రాయడం చాల కష్టమే. కాని, అసంభవం మాత్రం కాదు. ఒకమారు ప్రయత్నించి చూసేను. నాకు తెలుసు. దానికి అలవాటు పడాలంటే కొంతకాలం పడుతుంది. కాని, నెమ్మదిగా వ్రాయడానికి అలవాటు పడ్డాను. ప్రతిఅక్షరం ఎంతో ఆలోచించివ్రాయాలి. వ్రాసేను. ఆకష్ట ఫలితం సంతృప్తికరంగానే కనిపించింది.''

పావెల్ వ్రాత ప్రారంభించేడు.

కోటోవ్‌స్కీ డివిజన్ వీరకృత్యాలను గురించి నవల వ్రాయాలని సంకల్పించేడు. ముందే దానికిపెట్టేపేరు మనస్సులో మెదిలింది : యోధసంతానం.

ఆతడు తనకాలాన్నంతనీ ఆ పుస్తకం వ్రాతకే విని యోగిస్తున్నాడు. నెమ్మదిగా ఒక్కొక్క పంక్తిచొప్పున పుటలు బయటపడ్డాయి. చుట్టూ ఏంజరుగుతున్నా గమనించని నిష్ఠలో ఆతడు దానిని వ్రాస్తున్నాడు. కల్పితపాత్రలలో లీనమయిపోయి, వారి కష్టసుఖాలను పంచుకుంటూ ఆతడు వ్రాసుకుపోతున్నాడు. ఒక కళాఖండాన్ని సృష్టించేటందుకు రచయితలు పొందే బాధ, చికాకు ఆతడి కనుభవమయ్యేయి. తాను ఎంతో రసాత్మకంగా వున్నాయనీ, మరచిపోలేమనీ అనుకున్న ఘట్టాలు కాగితంమీదికి ఎక్కేసరికి పేలవంగా కనిపించేయి.

తాను వ్రాసిన ప్రతిమాటా అతడు గుర్తుపెట్టుకోవాలి. చిన్న చప్పుడైతే అతని ఆలోచనాసూత్రం చటుక్కున తెగిపోతుంది. పని నిలిచిపోతుంది. కొడుకు తపనచూసేసరికి తల్లికి ఎంతో భయం, ఆందోళనా కలుగుతున్నాయి.

ఒక్కొక్కప్పుడు పేజీలకు పేజీలు, ప్రకరణాలకు ప్రకరణాలు గట్టిగా వప్పచెప్పుకున్నట్లు చదివేవాడు. అటువంటి సమయంలో కొడుక్కు మతిపోవడంలేదుగదాయని తల్లి ఎంతో ఆందోళనపడేది. అతడు పనిచేసుకొంటున్నప్పుడు ఏమీ అనేదికాదు. కాని పనిపూర్తిచేసేక క్రిందపడివున్న కాగితాలను ఏరి బొత్తుపెట్టేటప్పుడు చిన్నగా అనేది:

"మరోపని చేయకూడదట్రా పాప్లూషా! ఇల్లా రోజంతా వ్రాస్తూకూర్చుంటే. "

ఆమె భయాలు చూసి అతడు పకాలున నవ్వేడు. తనకు మతిపోలేదనీ భయపడవద్దనీ ఆశ్వాసించేవాడు.

*　　*　　*

పుస్తకంలో మూడు ప్రకరణాలు పూర్తిచేసేడు. వాటిని ఒడెస్సాలోవున్న తన సహయోద్ధలకి పంపించి, వారి అభిప్రాయం తెలుపమన్నాడు. కొద్దిరోజులకే వారు అతని పనిని మెచ్చుకుంటూ జాబువ్రాసేరు. మెచ్చుకోలు వచ్చింది. కాని వ్రాతప్రతి రాలేదు. అది పోస్టులో ఎక్కడో గల్లంతు అయింది. ఆరునెలలు కష్టపడిచేసిన పని కొరగాకుండా పోయింది. అది ఎంతబాధ! తనదగ్గరవున్న ఒక్కప్రతీ ఎందుకుపంపేనా అని తర్వాత ఆతడెంతో విచారపడ్డాడు. ఆ వార్త విన్నప్పుడు లెదెనేవ్ ఆతనిని కోప్పడ్డాడు.

"అంత అజాగ్రత్తగా ఎందుకున్నావంట'... సరేలే. ఏదో జరిగిపోయింది. అయిపోయినదానికి అనుకుని లాభం ఏమిటి? మళ్ళీ ప్రారంభించు."

"కాని, ఆరునెలల కష్టం నష్టపోయేను. రోజూ ఎనిమిదేసి గంటలు కొట్టుకున్నా. అబ్బ."

మిత్రుణ్ణి సముదాయించడానికి లెదెనేవ్ ఎంతో కష్టపడ్డాడు.

మళ్ళీ ప్రారంభించడంతప్ప ఏంచేస్తాడు? లెదెనేవ్ ఆతనికి కాగితాలు తెచ్చియిచ్చేడు. వ్రాతప్రతిని టైపు చేయించేటందుకు ఏర్పాట్లుచేసేడు. ఆరువారాలలో మొదటి ప్రకరణం పూర్తిఅయింది.

కోర్చాగిన్ వుంటున్న యింట్లోనే పురోవాటాలో అలెగ్జియేవ్‌ల కుటుంబం నివసిస్తూంది. ఆ యింటివాళ్ళ పెద్ద కొడుకు పేరు అలెగ్జాండరు. కామ్‌సోమాల్ జిల్లాకమిటీలలో ఒకదాని కాతడు కార్యదర్శి. ఆతనికో చెల్లెలుంది. ఆమె పేరు గాల్యా. బహు చురుకైనది. పద్ధెనిమిదేళ్ళ పడుచు. ఫ్యాక్టరీట్రైనింగ్ స్కూలులో చదువుకుంది. తనకు 'కార్యదర్శి' వ్రాతపని చూసిపెడుతుందేమో అడగమని పావెల్ తన తల్లిని గాల్యావద్దకు పంపేడు. ఆమె ఒకరోజున వచ్చింది. పావెల్ ఒక నవల వ్రాస్తున్నాడని విని చాల ఆనందపడింది.

"కామ్రేడ్ కోర్చాగిన్! నీకు సాయపడతా. వాటాకొంపల్లో ఆరోగ్యవిధు లనుసరించాలంటూ నాన్నగారికోసం సర్క్యులర్లు తయారుచేయడంకన్న యీ పని సరదాగా వుంటుంది."

ఆరోజునుంచి పావెల్ వ్రాత రెట్టింపువేగంతో నడిచింది. ఒకనెల పోయేక జరిగిన పని చూసుకుంటే ఆతనికే ఆశ్చర్యం వేసింది. గాల్యా ఉత్సాహంతో పనిచెయ్యడమూ, ఆమెకు ఆ పనియెడ గల సానుభూతీ అతని కెంతో తోడ్పడ్డాయి. ఆమె చేతిలో కలం కాకితంమీద గరగరలాడుతూ పరుగెత్తి పోతూంది. వ్రాసిన భాగంలో ఏదన్నా నచ్చిన ఘట్టంవస్తే దానిని ఒకటికిపదిసార్లు చదివేది. ఎంతో ఆనందపడేది. పావెల్‌ను అభినందించేది. ఆ యింట్లో ఇతరులెవ్వరికీ ఆతనికృషి సఫలం అవుతుందనే ఆశలేదు. అదో కాలక్షేపంగా మాత్రమే భావిస్తున్నారు. ఆతనిమీద విశ్వాసం గలది ఒక్క గాల్యా మాత్రమే.

ఏదో పనిమీద పట్టణంవిడిచి పోయిన లెదెనేవ్ కొన్నాళ్ళకు తిరిగివచ్చేడు. పావెల్ వ్రాసినంత వరకు చూసేడు.

"పూర్తిచెయ్యి. నీ కృషి గట్టెక్కుతుంది. ఆనందపడ గలుగుతావు. పార్టీసభ్యులమధ్య నిలిచి పనిచెయ్యాలని నువ్వు కన్న కలలు త్వరలోనే సఫలం అవుతాయి. నిరాశపడకు."

పావెల్ ఉత్సాహంచూసి ముసిలివాడు సంతృప్తితో వెళ్ళేడు.

గాల్యా ఒక్కరోజుకూడా మానకుండా వస్తూంది. మరపురాని గత జీవితపుఘట్టాలను పునరుస్మీలితంచేస్తూ ఆమె చేతికలం కాగితాలమీద పరుగులు తీస్తూంది. ఏవేవో జ్ఞాపకాలతో ఉక్కిరిబిక్కిరయిపోతూ ఆతడు కూర్చుండిపోయి

నప్పుడు ఆతని కళ్ళకేసి చూస్తూ గాల్యా ఆతని మొహంలో పరుగెత్తుతున్న ఆలోచనలను పసిగట్టడానికి ప్రయత్నిస్తూంటుంది. అంత నిర్మలంగావున్న కనుగుడ్లు ఏమీ చూడలేక పోవడం ఏమిటో అనుకొనేది

ప్రతిరోజూ పనంతా అయ్యాక ఆరోజున వ్రాసిన దానిని ఆమె అతనికి చదివి వినిపించేది. ఆతడెంతో శ్రద్ధగా విని కనుబొమ్మలు చిట్లించేవాడు.

"ఏం కామ్రేడ్! బాగానేవుందే? బాగు లేదా?"

"లేదు. గాల్యా! నచ్చలేదు."

తనకి నచ్చని భాగాలు మళ్ళీ తానే వ్రాసుకొనే వాడు. ఒక్కొక్కప్పుడు విసువుపుట్టేది. సైన్సిలు పారేసే వాడు. జీవితంమీద విసుగుపుట్టి కలం విరిచేసి గిరాటు పెట్టేవాడు.

పుస్తకం ముగియనస్తున్నకొద్దీ, ఏవేవో ఉద్రేకాలు ఉవ్వెత్తున తోసుకువచ్చేవి. ఎంతో విచారం కలిగేది. ప్రపంచంలో ఆనందం, ఆత్మీయత అనుభవించే అవకాశం తన కెందుకు లేకపోవాలని బాధకలిగేది. కాని, ఆ ఆవేశా లకు లోనవుతే ఫలితాలు మరీ పాడుగావుంటాయి.

ఫ్యాక్టరీనుంచి తాయా ఇంటికివచ్చేసరికి చాల పొద్దు పోతూంది. అప్పటికి ఆత డింకా పనిచేస్తూనే వుంటాడు. వచ్చి అత్తగారితో నాలుగుమాటలాడుతుంది. తమ సంభా షణ కొనసాగితే పావెల్ పని చెడుతుందని ఆమె భయం. అందుచేత నెమ్మదిగా పోయి పడుకుంటుంది.

* * *

ఎట్టకేలకు ఆఖరు ప్రకరణం వ్రాసేడు. కొన్నిరోజులు వరసగా వ్రాసినదంతా గాల్యా చదివి వినిపించింది.

చేతివ్రాతప్రతిని లెనిన్‌గ్రాడ్ ప్రాంతీయపార్టీ కమిటీ సాంస్కృతిక శాఖకు పంపుతారు. వాళ్ళకి నచ్చితే ప్రచురణ కర్తలకిస్తారు... అప్పుడు...

ఆ ఆలోచనకే ఆతని హృదయం ఉద్విగ్నంఅయింది. అదే సక్రమంగావుంటే మళ్ళీ కొత్తజీవితం ప్రారంభిస్తాడు. కొన్ని ఏళ్ళపాటు అవిశ్రాంతంగా కృషిచేసి సాధించిన జీవితం అది...

పుస్తకం భవిష్యత్తుతో పావెల్ భవిష్యత్తూ తేలిపోతుంది. వ్రాతప్రతిని వాళ్ళు తిరగ్గొట్టేస్తే దానితో ఆతని పని ఆఖరు. కొన్నిభాగాలు బాగులేవంటే వాటిని మళ్ళీ తిరగ వ్రాయొచ్చు.

అతనితల్లి వ్రాతప్రతిని పార్శిలుగాకట్టి పోస్టుఆఫీసుకు పట్టుకెళ్ళింది. ఆనాటినుంచీ ఎంతో ఆతురతగా ఎదురుచూడడం ప్రారంభమయింది. పావెల్ తన జీవితంలో ఎన్నడూ, ఏవుత్తరంకోసమూ ఇంత ఆతురత చూపివుండలేదు. ప్రొద్దుటి టపా, సాయంకాలం టపా. మళ్ళా ప్రొద్దుటి టపా. కాని, లెనిన్‌గ్రాడ్‌నుంచి సమాధానం రాలేదు.

ప్రచురణకర్తలు మౌనాకీభావం వహించడంతో ఇంక లాభంలేదనే అనిపిస్తూంది. రోజురోజుకీ నిరాశ హెచ్చుతూంది. పుస్తకం ఎందుకూ పనికిరాదనంటే తనబ్రతుకు వ్యర్థమేనని పావెల్‌కుకూడా అనిపించింది. ఆ ఆశాభంగాన్ని

ఆతడు భరించలేడు. అంతపని వ్యర్థమైతే బ్రతికి లాభం ఏమిటి ?

అటువంటి సమయాలలో పార్కులో మిట్టగుర్తు వచ్చేది. ఆతని మనస్సులో ఒకే ఒకప్రశ్న మెదులుతూంది.

ఈ ఉక్కు-బోనును విరగకొట్టి పార్టీసభ్యులమధ్య నిల బడగలిగేటందుకై నా యావచ్ఛక్తీ వినియోగించేనా ?"

"చేసేను. చేయగలదంతా చేసేను."—అనుకొనే వాడు.

ఆ అనిశ్చితస్థితి దుర్భరమైపోయింది. మేరియా కొడుకు కంటె ఎక్కువగా లెనిన్‌గ్రాడ్ వుత్తరంకోసం ఎదురు చూస్తూంది. ఆమె ఒకరోజున పరుగెత్తుకువచ్చి శుభవార్త వినిపించింది.

"లెనిన్‌గ్రాడ్ నుంచి టెలిగ్రామ్."

అది ప్రాంతీయకమిటీ పంపిన టెలిగ్రాం.

"నవల చాల బాగుంది. ప్రచురణ కిచ్చేం. అభివంద నలు."

ఆతని హృదయం ఎగిరి గంతేసింది. ఆతని కోరిక సఫల మయింది. ఉక్కు-బోనును విరిచేసేడు. నూతనాయుధం చేత బట్టి పార్టీసభ్యులమధ్యవచ్చి నిలిచేడు.



# ఇందులో వచ్చే కొన్నిమాటలు

**అకార్డియన్ :**

హార్మోనియంవంటి ఒక సంగీత సాధనం.

**అటామన్ :**

'పెద్ద' అని అర్థం. హెట్మన్, అని జర్మన్ ప్రాంతాల్లో పిలుస్తారు. కులపెద్దలు, జాతిపెద్దలు అటామన్లుగా పిలువబడతారు. తర్వాత రాష్ట్రాధికారులుకూడ ఈ పేరు ఉపయోగించారు.

**ఈస్టర్ :**

క్రీస్తు పునర్జన్మపొందిన రోజున జరుపుకొనే క్రైస్తవ పండుగ. ఏప్రియల్ మొదటివారంలో వచ్చే శుక్రవారం (Good Friday – గుడ్ ఫ్రైడే) తర్వాత వెంటనే వచ్చే ఆదివారం యీ పండుగ జరుపుకుంటారు.

**కిలోమీటర్ :**

రమారమి 5 ఫర్లాంగులు. వేయిమీటర్లు. మీటరు అంటే 39 అంగుళాల చిల్లర.

**పార్టిజాన్ :**

మామూలు జీవితం జరుపుకుంటూ కొన్ని సిద్ధాంతాల కోసమై ఆయుధాలు తీసుకొని అవసరం అయినప్పుడు యుద్ధాలలో పాల్గొనేటటువంటివారిని యీ పేరుతో పిలుస్తారు.

**పెట్లూరా :**

సోవియట్ విప్లవదినాల్లో యూక్రైన్ రాష్ట్రంలో చీఫ్ అటామన్‌గా తన్నుతాను ప్రకటించుకొన్న బూర్జువా జాతీయవాది.

**పోగ్రోమ్ :**

పుస్తకంలో పోగ్రామ్ అని ముద్రారాక్షసం జరిగింది. యూదులను హింసించేటందుకై జరిపించిన దారుణ చర్యలను పోగ్రోమ్ అనే పేరుతో వ్యవహరిస్తారు. యూరప్‌లో ఫ్యూడల్, బూర్జువా, ఫాసిస్ట్ ప్రభుత్వాలు ప్రజలదృష్టిని మళ్ళించేటందుకై ఒక క్రమపద్ధతిప్రకారం నడిపించేవారు.

**బండిస్ట్ :**

యూదుజాతి సోషలిస్టులు యీ పేరుతో పిలవబడే వారు. వీరు క్రమంగా బూర్జువా జాతీయవాద దృక్పథాన్ని అవలంబించి కమ్యూనిజాన్ని వ్యతిరేకించే స్థితికొచ్చేరు.

**బోల్షివిక్ :**

రష్యన్ సోషల్ డెమోక్రటిక్ లేబరుపార్టీ (మొట్ట మొదటిరోజుల్లో రష్యన్ కమ్యూనిస్ట్‌పార్టీ రూపంయిది.) కార్యవర్గం కొన్ని సిద్ధాంతాలమీద అధికసంఖ్యాకులు అల్ప సంఖ్యాకులుగా ఓటుచేసింది. అందులో అధికసంఖ్యాకులని బోల్షివిక్ అన్నారు. అల్పసంఖ్యాకుల్ని మెన్షివిక్ అన్నారు. ఇవి పార్టీలో రెండు ధోరణులుగ స్థిరపడిపోయి చివరకు రెండుగా విడిపోయినాయి.

**మెన్షివిక్:**

'బోల్షివిక్' అనేది చూడు.

**రూబుల్ :**

ఇదొక రష్యా నాణెము. నూరు కోపెక్కులు ఒకరూబుల్.

**రెడ్‌గార్డ్ :**

రష్యాలో బోల్షివిక్ విప్లవంవచ్చిన మొట్టమొదటి రోజుల్లో ఫ్యాక్టరీలలోనూ, గ్రామాలలోనూ, పేటలలోనూ, ఆత్మరక్షణ దళాలు ఏర్పాటుచబడ్డాయి. ఈ దళాలను 'రెడ్ గార్డ్ దళాలు' అనేవారు. బోల్షివిక్‌లు ఏర్పాటుచిన యీ రెడ్ గార్డ్ దళాలకు పోటీగా స్వార్థప్రయోజనపరుల వర్గాలు కొన్ని దళాలను ఏర్పాటు చేసేరు. వారిని వైట్‌గార్డ్ దళాలు అంటారు. రెడ్‌గార్డ్ దళాలే క్రమంగా ఎర్రసైన్యంగా మారాయి.

**వెర్ష్ట్ :**

రష్యన్ దీర్ఘమానం. 3500 అడుగుల పొడుగు, లేక ఇంగ్లీషు మైలులో రమారమి 2 వంతులు.

**వైట్‌గార్డ్ :**

రెడ్‌గార్డ్ చూడు.

**సామోగా :**

వంటసారా.

**సామోవర్:**

మన యిళ్ళలో నీళ్ళు కాచుకునేటందుకై ఉపయోగించే బాయిలర్ మాదిరిగా ఉంటుంది. దీనిని రష్యనులు టీ కాచుకొనేటందు కుపయోగిస్తారు.

**సెర్యోఝికా :**

"క" అనే అక్షరంతో చేర్చి సెర్యోఝికా, మిషా్క, పాషా్క, అని ముద్దుగా పిలవడంలో ఉపయోగిస్తారు. సంస్కృతంలో "స్వార్థేకప్" అనేదానికి యిది సరిగా సరిపడుతుంది.

**సోషలిష్ట్ రివల్యూషనరీ :**

ఇదొక బూర్జువా జాతీయవాద పార్టీ. హెచ్చుగా యూక్రైన్‌కు పరిమితం. స్వతంత్రకోసక్ రాష్ట్రం అనే నినాదం యిచ్చి వీరు బోల్షివిక్ విప్లవాన్ని ప్రతిఘటించారు.

